జనరంజక గ్రంథావళి

# భారతీయ తత్త్వశాస్త్రం—సమగ్ర పరిశీలన

జనరంజక గ్రంథావళి—25

తత్వశాస్త్రం

# భారతీయ తత్వశాస్త్రం—సమగ్ర పరిశీలన

గ్రంథ కర్త

ఆచార్య గూడ సుందరరామయ్య

తత్వశాస్త్ర శాఖ

ఆంధ్ర విశ్వవిద్యాలయం

వాల్తేరు.



తెలుగు అకాడమి

హైదరాబాదు.

1988

# భూమిక

ఇంటర్మీడియట్, డిగ్రీ తరగతులకు అవసరమైన పాఠ్య, పఠనీయ గ్రంథాలను, అనువాద వాఙ్మయాన్ని, మోనోగ్రాఫ్‌లను ఇంతవరకు తెలుగు అకాడమి ప్రచురించి విద్యార్థుల, అధ్యాపకుల, విద్యావేత్తల ఆదరాభిమానాలను విశేషంగా చూరగొన్నదని వేరే చెప్పనక్కర్లేదు. అయితే అంతటితో తన బాధ్యత తీరినట్లుగా అకాడమి భావించడంలేదు. కొత్తగా చదువు నేర్చుకొన్నవారికి, పాఠ్య ప్రణాళికలతో నియత విద్యారంగంలో(**formal education field**) సంబంధం లేకుండ జ్ఞానోపార్జన చేయదలచిన వారికి విద్యార్థులకు అధ్యాపకులకు ఈ జనరంజక గ్రంథావళివల్ల ప్రయోజనముంటుందని భావిస్తున్నాం. నిత్యజీవితంలో సన్నిహిత సంబంధమున్న వివిధ శాస్త్రాంశాల విజ్ఞానాన్ని, సమకాలీన సమస్యల, పరిష్కారాల పరిజ్ఞానాన్ని అందరికి అందించే సదుద్దేశంతో. సరసమైన ధరలకు ఈ గ్రంథాల ప్రచురణలను చేపట్టినాం. వివిధ రంగాలలో ప్రాయోగికానుభవం గల నిపుణులను రచయితలుగా ఎన్నుకొన్నాం. భాష సరళంగాను, అందరికి అర్థమయ్యే రీతిలోను, సాధ్యమయినంత తక్కువ సాంకేతిక పదజాలంతో ఉండే అట్లు రచించే ప్రయత్నం జరిగింది. అంతే కాకుండా ఇచ్చిన సమాచారం అధికారికంగా ఉండే అట్లు తగిన శ్రద్ధ తీసుకొన్నాం. ఈ గ్రంథాలు అందరి ఆదరాభిమానాలకు పాత్రమవుతాయని ఆశిస్తున్నాం.

విమర్శకుల సహృదయంతో ఇచ్చే సూచనలను పునర్ముద్రణలో తప్పక పరిశీలించగలం.

# విషయ సూచిక

పుట

# 1

# దర్శన శాస్త్రం అంటే ఏమిటి?

నేడు 'ఫిలాసఫీ' అని ఆంగ్ల భాషలో పిలిచే పదాన్ని సంస్కృత భాషలో రకరకాలుగా పిలిచారు. దర్శన శాస్త్రమని కొందరు, తత్త్వశాస్త్రమని కొందరు, తర్కశాస్త్రమని మరికొందరు, ఆన్వీక్షికి అని కౌటిల్యుడు, మనన శాస్త్రమని మరికొందరు, వేదాంతమని కొందరు, విచారణ శాస్త్రమని కొందరు మననశీల ఆలోచనా శాస్త్రమని కొందరు, నిర్వాణ సోపానాలకు దారితీసే శాస్త్ర మని బౌద్ధులు, 'సంసార హేతునివృత్తి విద్య' అని శంకరుడు, 'బ్రహ్మసాయుజ్య విద్య' అని రామానుజుడు, 'సర్వ విద్యాప్రతిష్ఠ' అని రాధాకృష్ణ పండితుడు, ఆత్మదర్శనమని 'పద్మభూషణ' బిరుదాంకితులు, 'బి. సి రాయ్ నేషనల్ అవార్డు గ్రహీత మద్దురు సుబ్బారెడ్డి డా॥ సచ్చిదానందమూర్తి తదితరులు బహుధా భావించారు.

## దర్శనం అంటే ఏమిటి?

సాధారణంగా దర్శనం అంటే చూడటం అని అర్థం. ఇక్కడ చూడటం అంటే మామూలుగా నేత్రాలతో చూడ్డం అని అర్థం చేసుకోరాదు. "వేద విషయ నిర్ణయమైన ఉత్పన్నం దర్శనశాస్త్రం" అని నిరుక్తం(అంటే వేదాలకు నిఘంటువు) చెపుతుంది. వేదంలో చెప్పబడిన విషయాలు అనుభవ పూర్వకంగా ,నిర్ధారణ చేసుకొని, వాటిని మనోదర్పణంలో చూడటమే దర్శనం అవుతుంది. దర్శన శాస్త్రం దేన్ని చూడడానికి ఉపయోగపడుతుంది. ఆత్మదర్శనానికి మాత్రమే దర్శనశాస్త్రం ఉపయోగపడుతుంది అని యాజ్ఞవల్క్యుడు బృహ దారణ్యక ఉపనిషత్తులో చెప్పాడు. ఆత్మను చూడాలని, ఆత్మను గురించి వినా లని ఆత్మను ఎల్లప్పుడూ ధ్యానంతో ఉంచుకోవాలని ఈ ఉపనిషత్తు చెపుతుంది. దానివలన ప్రయోజనం ఏమిటి? ఆత్మదర్శనంవలన అమృతత్వం లభ్యమవు తుందని యాజ్ఞవల్క్యుడు చెప్పాడు. ఆత్మసాక్షాత్కారం వలన అవిద్యా

బంధాలు నశించి, బ్రహ్మదర్శనం అవుతుందని శంకరాచార్యులు చెప్పారు. సమస్తమైన తత్త్వముల స్వరూపం అవగత మవుతుందని సాంఖ్య దర్శనం చెపుతుంది. ప్రకృతి పురుషుల స్వరూప జ్ఞానం కల్గుతుంది: దర్శనశాస్త్రంవల్ల చిత్తవృత్తి నిరోధం కలిగి ఈశ్వర సాక్షాత్కార మవుతుంది అని యోగశాస్త్రం చెపుతుంది. దర్శనశాస్త్రంవల్ల కర్మ మీమాంస ప్రయోజనాలు లభ్యమవుతాయని జైమిని, శబరస్వామి, కుమారిలుడు, ప్రభాకరుడు ఇత్యాది మీమాంసకులు చెప్తారు. నిర్వాణం లభ్యమవుతుందని బౌద్ధులు చెప్తారు. కేవలం జ్ఞానం కలుగుతుందని జైనులు చెప్తారు. దర్శన శాస్త్రంవలన దేహేంద్రియ సుఖం కలుగుతుందని చార్వాకులు చెప్తారు.

ఈ విధంగా దర్శనశాస్త్రంలోని వైవిధ్యాన్ని చూడవచ్చు. ప్రతివారూ దర్శనశాస్త్రంవలన ఏదో ఒకపరమ ప్రయోజనం ఉన్నదన్నవారేకాని లేదన్నవారు ఎవరూ లేరు. ఐతే ఈ ప్రయోజనాన్ని పొందే మార్గంలో, ఈ ప్రయోజనాన్ని సాధించే తీరులో, ఈ ప్రయోజనాన్ని నిర్దేశించి నిర్వచించే పద్ధతిలో దర్శనాల్లో ఏకాభిప్రాయం లేదు. అంత మాత్రాన ఈ దర్శనాల్లో ఏకీకృత మైన సూత్రాలు, ఆదర్శాలు లేవని మనం భావించరాదు. ఇంద్రియ గోచర మైన ప్రత్యక్ష ప్రమాణంకన్నా జ్ఞానాన్ని కలిగించే అంతర్దృష్టి చాలా గొప్పదని అన్ని దర్శనాలు భావిస్తాయి. మనోగతమైన భావ ప్రపంచ జ్ఞానం భౌతిక ప్రపంచ జ్ఞానంకన్న గొప్పదని అన్ని దర్శనాలు నమ్ముతాయి. భౌతిక ప్రపంచాన్ని గురించి మనం తెలుసుకొనేదంతా మానసిక ప్రపంచంలోనే ఉంటుంది. కనుక మనస్సుకు ప్రాముఖ్యం ఇవ్వడం జరిగింది. ఈ ప్రపంచంలో ఒక విధమైన క్రమం ఉన్నదని, అది భౌతిక సూత్రాలతోనే గాక, నైతిక, ఆధ్యాత్మిక సూత్రాలకుకూడా లోబడి ఉంటుంది అన్నారు. దాన్నే ఋగ్వేదంలో 'స్వధ' లేక 'ఋతము' గా వర్ణించారు. ఆధ్యాత్మిక సత్యాలను మానవుడు తెలుసుకోగలడు. అట్లా తెలుసుకొన్నవారు పూర్వకాలంలో చాలామంది ఉన్నారు. వారు ఏ ఏ సత్యాలను గురించి ఏ విధంగా ఐతే తెలుసుకొన్నారో ఆ మార్గాన్ని అనుసరించినట్లయితే ఆ సత్యాలు మనకుకూడా గోచరిస్తాయి.

ఐతే ఆ మార్గాన్ని వదలివేసి అన్వేషిస్తే మనకు గోచరించే సత్యాలు మరొకటి కావచ్చు. అందుకే వారిని ద్రష్టలు అన్నారు. అంటే చూచినవారు అని అర్థం. ఏమిటి వీరు చూచింది ? అతి ప్రాచీనమైన ధర్మ మీమాంస లేదా కర్మ మీమాంస లేదా పూర్వమీమాంస, దర్శనశాస్త్ర కర్తయగు జైమిని మహర్షి మానవుడుచేసే ప్రతి పనిలో, అది లౌకిక కర్మ కానివ్వండి, లేదా అలౌకిక లేదా వైదికకర్మ కానివ్వండి, అది కొన్ని ఫలితాలను ఇస్తుందని ప్రప్రథమంగా చెప్పాడు. అట్లాగే సమస్తమైన పదార్థాలు అణువుల సముదాయంచేత నిర్మింపబడుతాయని వైశేషిక దర్శనశాస్త్రకర్త అయిన కణాదుడు చెప్పాడు. ప్రకృతిలో ఉన్న సమస్తమైన పదార్థాలను 16 తత్త్వాలుగ వర్గీకరించవచ్చని న్యాయదర్శన శాస్త్రకర్తయగు గౌతముడు చెప్పాడు. ఈ ప్రకృతిలో ఉండే సమస్తమైన పదార్థాలు త్రిగుణాత్మకంగా ఉంటాయని సాంఖ్యదర్శన కర్తయగు కపిలమహర్షి చెప్పాడు. ప్రపంచంలో ఉన్న తత్త్వాలు 24, అవన్నీ సత్త్వ, రజస్సు, తమోగుణాలతో కలసి ఉంటాయి. వీటికి అతీతంగా, అంటే గుణాలకు అతీతంగా ఒక విశిష్టమైన పురుషుడు ఉంటాడు. ఆయనే ఈశ్వరుడు. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులద్వారా పరమపురుషుడైన ఈశ్వరుని తెలుసుకోవడమే యోగంయొక్క పరమప్రయోజనమని యోగదర్శన కర్తయైన పతంజలి మహర్షి చెప్పాడు. సంసారబంధ హేతునివృత్తికి మోక్ష ప్రాప్తికి దర్శనశాస్త్రం దారితీస్తుందని వేదాంత సూత్రకారుడైన బాదరాయణుడు చెప్పాడు. ఈ వాదాన్నే శంకరాచార్యులు సమర్థించారు. ఈ ప్రపంచం అంతా దుఃఖమయమనీ, ఈ దుఃఖ సాగరంనుంచి విముక్తి జెందటమే దర్శనశాస్త్రం పరమ ప్రయోజనమని సిద్ధార్థ గౌతమ బుద్ధుడు చెప్పాడు.

## ఆస్తిక నాస్తిక శబ్దార్థ వివరణం

ఐతే ఈ పరమార్థాన్ని తెలుసుకోవటం ఎట్లా ? ఈ ప్రశ్నకు సమాధానం అంత తేలిక కాదు. ఈ ప్రశ్నకున్న సమాధానాన్నిబట్టి భారతీయ దర్శనశాస్త్రం దాని ఆవిర్భావంలోనే రెండు మహా శాఖలుగా చీలిపోయింది. ఆ రెండుశాఖలు

1) వైదికం (2) అవైదికం లేదా 1) ఆస్తిక దర్శనాలు 2] నాస్తిక దర్శనాలు. ఆస్తిక, నాస్తిక అనే శబ్దాలకు ఆ రోజుల్లో అర్థంవేరు. సాకారమైన భగవంతుని యందు విశ్వాసముంచి, ఆయన్ను జపం తపం, ఉపాసన, భక్తి పూజ, అర్చన, సేవ ఇత్యాదులద్వారా సంతృప్తి పరచి, ఆయనను మెప్పించి, సన్మార్గంద్వారా తన నడవడిని దిద్దుకొని, ధర్మకాముడై, తనకష్టాలను భగవంతునితో చెప్పుకొంటే ఆయన వాటిని తీరుస్తాడనే ఆశ, ఆశయం, నమ్మకం ఉన్నవారిని ఆస్తికులంటారు. ఈ రోజుల్లో. అట్లాకాకుండా, మానవుని బుద్ధి చాలా సునిశితమైనదని, ప్రపంచంలో ఉన్న సమస్తమైన విషయాలను గురించి మానవుడు తెలుసుకోగలడని, ఆయనకు అటువంటి శక్తి ఉన్నదని ఏవిధమైన అతీంద్రియ శక్తులకు మానవుడు తల ఒగ్గి నమస్కరించవలసిన అవసరం లేదని, ప్రకృతిలో నున్న సమస్తమైన జీవరాసులకు మానవుడు మకుటాయమానమని, ప్రకృతి, ప్రకృతి సంపదలు, ప్రకృతిశక్తులు — సర్వం మానవుని ఆధీనమని, ఆయనను మించిన మరొకశక్తి ఏదీ లేదనీ, ఏదన్నా ఉన్నా అది మానవ కల్పితమనీ నమ్మకం ఉన్నవారిని నాస్తికులంటారు. ఈ రోజుల్లో.

ఐతే దర్శన శాస్త్రం అభివృద్ధి చెందుతున్న రోజుల్లో, (అంటే క్రీస్తుపూర్వం) ఈ శబ్దాలను ఈ రోజుల్లో వాడిన అర్థంలో వారు వాడలేదు. శ్రుతి ప్రమాణాన్ని అంగీకరించిన వారందరినీ ఆస్తికులన్నారు. శ్రుతి ప్రమాణాన్ని నిరాకరించిన వారిని నాస్తికులన్నారు. శ్రుతి ప్రమాణం అంటే ఏమిటి? వేదం అపౌరుషేయం సర్వ కాలాలకు, సర్వ మానవాళికి అది శిరోధార్యం అని భావించిన వారిని ఆస్తికులన్నారు. అట్లాకాదు. మానవునికి ఆలోచనా శక్తి ఉన్నది. దాన్ని సరళంగాను, సమగ్రంగాను రూపొందించుకొని, మనన శీలమైన ఆలోచన ద్వారా మానవుడు సమస్తమైన సమస్యలను అర్థం చేసుకొని, వాటిని పరిష్కరించుకో వచ్చునని నాస్తికులు భావించారు. ఇది వీరి మతమైతే, (అంటే దృక్పథం) అది వారి మతమైంది. అందుకే వారి దృష్టిలో వీరు పాషండులు, హైతుకులు, నాస్తికులు, తీర్థికులు. ఐతే వీరి దృష్టిలో వారుకూడా అట్లాగే పిలువబడ్డారు.

న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, పూర్వమీమాంస ఉత్తరమీమాంస

దర్శనాలను షడ్దర్శనాలు అన్నారు. ఈ దర్శనాలను ఆస్తిక దర్శనాలన్నారు' చార్వాక, లోకాయత, ఆసురి, ఆజీవక, తీర్థంకర, జైన, బౌద్ధ దర్శనాలను నాస్తిక దర్శనాలన్నారు. ఆ తర్వాత కాలంలో దర్శన శబ్దాన్ని వదలివేసి 'మతం' అనే శబ్దాన్ని వాడారు. ఆ విధంగా దర్శన శబ్ధం మతశబ్దానికి చోటిచ్చింది. అదే నేటివరకూ నిలచి ఉన్నది. సమ్మతింపబడినది మతం. తమకు ఆమోద యోగ్యంగా ఉన్నది అంగీకారంగా ఉన్నది తమ మతం. అట్లా లేనిదాన్ని ప్రతివారు నిర సిస్తారు, నిరాకరిస్తారు, నిందిస్తారు, తృణీకరిస్తారు, ఖండిస్తారు. అది పరమత మవుతుంది. ఐతే ఇక్కడ ఏది స్వమతం, ఏది పరమతం అవుతుంది అని ప్రశ్నిస్తే, ఒకరికి స్వమతంగా ఉన్నది మరొకరికి పరమతంగా ఉంటుంది. అట్లాగే ఒకరికి పరమతంగా ఉన్నది మరొకరికి స్వమతంగా ఉంటుంది. కనుకనే దర్శన శాస్త్రాభివృద్ధిలో వైవిధ్యం కన్పిస్తుంది.

## భారతీయ దర్శనశాస్త్రంలోని మౌలికాంశాలు

ఒక దేశం సంస్కృతి నాగరికతలను ప్రతిబింబించే దర్పణం వంటిదే దర్శన శాస్త్రం. దర్పణం ఎంత నిర్మలంగా ఉంటే ప్రతిబింబం అంత స్వచ్ఛంగా కని పిస్తుంది. అట్లాగే దర్శన శాస్త్రం కూడా ఎంత నిర్దుష్టంగా, తార్కిక పటిష్టత తో, ఔన్నత్యంతో ఉంటే అదే విధంగా సంస్కృతి నాగరికతల ప్రతిబింబం కూడా ఉంటుంది. ఈ రెండూ పరస్పర ఆధారాలు మరియు ఒకదాన్ని మరొకటి ఆశ్రయించికూడా ఉంటాయి.

### *సంస్కృతి_నాగరికతల్లో ఉండే అంశాలు ఏమిటి ?*

ఒక జాతి ప్రజల జీవన విధానం, వారి ఆశలు, ఆశయాలు, భయాందోళన, సంరంభాలు, పరిపాలన పద్ధతి, రాజమర్యాద పద్ధతులు, పోషించిన కళలు, నిర్మించిన భవనాలు, కట్టడాలు, వనాలు, చేసిన యుద్ధాలు, నమ్మిన విలువలు, ఆరాధించిన దేవతామూర్తులు, రూపొందించిన విద్యా విధానం, వర్తకవాణిజ్య విధానం, సమాజ నిర్మాణ విధానం, నేరం, శిక్ష, ప్రాయశ్చిత్తం, పశ్చాత్తాపం. వారి దైనందిన చర్యలు, వ్యవసాయ రంగంలోను, పశుసంపదలోను,

వారి నైపుణ్యం—సంస్కృతి నాగరికతలో ఉండే మౌలికాంశాలు. ఇందులో తత్త్వశాస్త్రానికి సంబంధించిన విషయాలను గురించి తెలుసుకొందాం.

ఈ కింది నాలుగు అంశాలను గురించి భారతీయ దర్శనాలన్నీ చర్చించాయి.

అవి :

1 భగవంతునికి ఉనికి లేదా నిరాకరణ

2. ఆత్మ ఉన్నదా ? లేదా ?

3. ఆత్మకు మానవుడు చేసే కర్మకు సంబంధం ఉన్నదా ? లేదా ?

4. మోక్షం అంటే ఏమిటి ?

భగవంతుని శబ్దానికి మారుగా 'ఈశ్వర' శబ్దాన్ని దర్శనాలు వాడాయి. ఈశ్వర స్థాపన కొన్ని దర్శనాలు ఎంత అవసరమని భావించాయో, ఈశ్వర నిరాకరణ కూడా అంతే అవసరమని కొన్ని దర్శనాలు భావించాయి. ఉదాహరణకు బాదరాయణుని "వేదాంత సూత్రాలు" కపిలుని సాంఖ్య సూత్రాలు, పాతంజలి "యోగ సూత్రాలు" కణాదుని "వైశేషిక సూత్రాలు" గోతముని 'న్యాయ సూత్రాలు' జైమిని 'మీమాంసా సూత్రాలు' ఈశ్వరుడు ఉన్నాడని చెప్తాయి. ఆయా సూత్రాల భాష్యకారులు తర్కాన్ని ఆధారం చేసుకొని ఈశ్వరుని నిరూపిస్తారు, వారిలో వాత్స్యాయనుడు, ఉద్యోతకారుడు, ఉదయనాచార్యుడు, కుమారిలభట్టు, ఈశ్వర కృష్ణుడు మొదలైనవారు భారతీయ చింతనా రంగమంతా నాస్తిక భావాలతో నిండిపోయిందని భావించి దాన్ని ప్రక్షాళనం చేయడానికి కంకణం కట్టుకొని ఈశ్వర వాదాన్ని సమర్థించారు. అనేక గ్రంథాలను భాష్యాలరూపంలో, వార్తికల రూపంలో, 'కారికల' రూపంలో టీకల రూపంలో రాశారు.

భగవంతుని నిరూపించటానికి ఈ విధంగా ఆస్తిక దర్శనాలు, వాటి భాష్యకారులు కృషిచేస్తే, నాస్తికదర్శనాలు వాటి భాష్య కర్తలు మరోరకంగా కృషి చేసి భగవంతుని ఉనికిని నిరాకరించారు. అసలు వేదంలోనే దేవుడు ఉన్నాడా? లేడా? అంటే ఎక్కడ ఉన్నాడు ? ఎట్లా ఉన్నాడు? ఆయనను మనం ఎందుకు ఆరాధించాలి? యముడు, అగ్ని, ఇంద్రుడు' వరుణుడు, కుబేరుడు, ఈశానుడు

మొదలయిన దేవతల్లో ఎవరిని మనం ఆరాధించాలి? ఇటువంటి శంకాయుతమైన ప్రశ్నలు అనేకం వేదంలో ఉన్నవి. బుద్ధునికి పూర్వమున్న తాత్వికుల్లో ఆజీవకులు భగవంతుని ఉనికిని నిరాకరించారు. అలారకాలాముడు, ఉద్ధకరామ పుత్రుడు, సంజయవేలత్తి పుత్రుడు, అజితకేశ కంబళుడు, చార్వాకమహాముని, నిర్గ్రంధనాధ పుత్రుడు మొదలగువారు భగవంతుడు లేదని చాటిచెప్పారు. వీరికి సమకాలికుడుగానో లేదా కొద్ది సంవత్సరముల తర్వాతనో వచ్చిన గౌతమ బుద్ధుడు కూడా భగవంతుని ఉనికిని నిరాకరించాడు. దేవుడు ఉన్నాడా లేడా? అనే ప్రశ్నకు, ఆత్మ ఉన్నదా లేదా అనే ప్రశ్నకు బుద్ధుడు మౌనం అంగీకరించాడని కొందరు, ఆయనకు అతి జటిలమైన ఈ పశ్నలకు సమాధానం అర్థం కాలేదని కొందరు, ఈ ప్రశ్నలను అవ్యాకృత ప్రశ్నలంటాడని కొందరు చెప్పారు. ఆయన తర్వాత వచ్చిన నాగార్జునుడు, చంద్రకీర్తి, ధర్మకీర్తి, నాగసేనుడు దిఙ్నాగుడు, మొదలయిన బౌద్ధ తార్కికులంతా భగవంతుడు, ఆత్మ లేవని చెప్పారు. ఈశ్వర నిరాకరణ, ఆత్మ నిరాకరణ మాత్రమే బౌద్ధమతధ్యేయం, లక్షణం అని కూడా వీరు చెప్పారు. ఈ విషయాలను బౌద్ధమతాన్ని గురించి చెప్పే అధ్యాయంలో వివరంగా చూద్దాం.

ఆత్మ ఉన్నదా? లేదా అనే ప్రశ్నకు భారతీయ దర్శన శాస్త్రంలో చెప్పబడిన సమాధానం అత్యంత ఆసక్తికరంగా ఉంటుంది. ప్రతి దర్శనం ఆత్మను నిరూపించడానికి ఎంతో కృషి చేసింది. వైదిక వాఙ్మయంలో జీవ స్వరూపాన్ని, ఆత్మ ఉనికిని, ఆత్మకు శరీరానికి ఉన్న సంబంధాన్ని గురించి మరణానంతరం ఆత్మ ఏమవుతుందనే విషయాన్ని గురించి అనేకమైన చర్చలున్నాయి. వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీత, బాదరాయణుని వేదాంత సూత్రాలు, పురాణాలు, ఇతిహాసాలు మొదలయిన గ్రంథాల్లో ఈ విషయాలను విపులీకరించడం జరిగింది. ఇక్కడ ఒక ఆసక్తికరమైన విషయాన్ని చూద్దాం. జైనమతం నాస్తిక మతంగా పరిగణించిటం జరిగింది. ఆత్మ స్వరూపాన్ని గురించి ఆ దర్శనం చూపినంత శ్రద్ధ మరొక దర్శనం చూపలేదు. అంటే అది అతిశయోక్తి కాదు. ఆత్మకు శరీరానికి ఉండే సంబంధం, ఆత్మపరిమాణం, ఆత్మకు మానవుడు చేసే కర్మకు ఉండే సంబంధం ఈ దర్శనంలో అతి విపులంగా చర్చించటం జరిగింది.

చార్వాక దర్శనం ఆత్మ అనేది ఏమీ లేదన్నారు. శరీరం ఆవిర్భవించటం తోటి శరీరంలో ఉండే అవయవాలు ఉద్భవించినట్లుగా చైతన్యం కూడా శరీరంలో వస్తుంది. శరీరం మరణించగానే చైతన్యం నశిస్తుంది అన్నారు. కేవలం ఈ విధంగా చేస్తె సరిపోదని బౌద్ధులు గుర్తించారు. వారి దర్శనాన్ని అనాత్మవాదమని పిలుపడానికి వారు సందేహించలేదు. నైరాత్మ్య వాదం బౌద్ధమత లక్షణమని చంద్రకీర్తి అను బౌద్ధ దర్శనకారుడు చెప్పాడు. హీనయాన బౌద్ధం మహాయాన బౌద్ధం మధ్య కొన్ని తేడాలున్నప్పటికిని, ఆత్మ విషయంలో ఈ రెండు శాఖలు ఏకాభి ప్రాయాన్ని వ్యక్తం చేశాయి. ఆత్మనిరాకరణే బౌద్ధం తన లక్షణంగా పెట్టుకొన్నప్పటికి భారతీయ చింతనా స్రవంతిలో అది ఒక భాగం కాబట్టి, ఒక వైపు ఆత్మను నిరాకరిస్తూ, మరొక వైపు భగవంతుని నిరాకరిస్తూ, కర్మ సిద్ధాంతాన్ని పునర్జన్మను బౌద్ధం అంగీకరించటం ఆ దర్శనంలోని ప్రత్యేక లక్షణం. అది విలక్షణమని కొందరన్నారు. హేతువాద లక్షణమే అట్లాఉంటుం దని కొందరన్నారు.

## క్రియావాదం అంటే ఏమిటి?

ఆత్మవాదులంతా అంగీకరించిన విషయాలు కొన్ని ఉన్నాయి. శరీరం కేవలం ఒక పనిముట్టు వంటిది. దానికి క్రియాశక్తి ఉన్నదే కాని, ఆలోచనా శక్తి ఇచ్ఛాశక్తి లేవు. కనుక ఆలోచనా శక్తికి, ఇచ్ఛాశక్తికి కేంద్రంగా ఆత్మ ఉంటుంది. ఆత్మ ఆలోచించి, ఉచితం, అనుచితం అని నిర్ణయిస్తుంది. ఆ నిర్ణయం ఇచ్ఛగా మారుతుంది. అపుడు అది మనసు ద్వారా దేహానికి, ఇంద్రి యాలకు ఆదేశాన్ని ఇస్తుంది. అప్పుడు శరీరం, ఇంద్రియాలు పనిచేస్తాయి. ఈ ఆత్మ నిత్యం శాశ్వతం, అనంతం, అవ్యయం. కనుక అదిచేసే పనులకు బాధ్యత అదే వహిస్తుంది. శరీరం పతనం అయిపోయి నశించి పోతుంది కనుక కర్మ ఫలం అంతా ఆత్మే అనుభవించ వలసి ఉంటుందని క్రియావాదులు భావిస్తారు. ఇక్కడ ఆత్మ కర్తగాను, భోక్తగాను ఉంటుంది. ఐతే ఆత్మను అంగీకరిస్తూ ఆత్మకు కర్తృత్వాన్ని, భోక్తృత్వాన్ని అద్వైత వేదాంతం నిరాకరిస్తుంది. రామానుజ దర్శనంలో ఆత్మ నిజంగా కర్త, భోక్తగా ఉంటుంది.

## అక్రియావాదం అంటే ఏమిటి?

శరీరం మాత్రమే అనేక కర్మలు చేస్తుంది. ఆత్మ ఉన్నప్పటికీ అది కేవలం సాక్షీభూతంగా మాత్రమే ఉంటుంది. సాంఖ్య దర్శనం, అద్వైత దర్శనం ఈ విషయాన్ని చెప్తాయి. ఆత్మకు ఉపాంగాలుగా బుద్ధి, అంతః కరణం, అహంకారం, మనస్సు ఉంటాయి. క్రియాశక్తి, ఆలోచనా శక్తి ఇచ్ఛా శక్తి ఆత్మనుంచి ఇవి స్వీకరించి శరీరాన్ని ఒక పనిముట్టుగా వాడుకొంటాయి. వీటికి స్వాతంత్ర ప్రతి పత్తి లేదు అని అక్రియా వాదులు చెప్తారు. ఆత్మ కేవలం ఆజ్ఞలను జారీచేసే టటువంటి అధికారాన్ని, శక్తిని కలిగి ఉంటుంది. కర్మలు చేసేది జీవుడు తిరిగి పుట్టేది జీవుడు. మరణించేది శరీరం. అనేకమైన ఆత్మలు, అనేకమైన శరీరాలు కర్మ ద్వారా సంఘటితం అవుతాయి. దీన్నంతా అక్రియా వాదం అంటారు. చేసేది ఏమీ లేదు, చేయించేది ఏమీలేదు. దీన్ని అంతా మిథ్యా వాదం అనుకోవచ్చు.

## మోక్షం అంటే ఏమిటి?

ఈ ప్రశ్నలకు సమాధానం అత్యంత రమణీయంగా ఉంటుంది. ఎందుకంటే ఈ ప్రశ్నవంటి ప్రశ్న మరొకటి లేదు. దీన్ని మించిన ప్రశ్న లేదు. దాన్ని పొందిన తర్వాత ప్రశ్నించటానికంటూ ఏ ప్రశ్నలు మిగిలి ఉండవు. దాన్ని పొందాలని చాలామంది అనుకొంటారు. మానవ మేధస్సు పరిణామం చెందుతూ వస్తున్న దశలో అనేకమైన ప్రశ్నలు మనస్సుకు తట్టటం జరుగుతుంది. కాని ఆ ప్రశ్న లన్నింటికీ సమాధానం చెప్పదగిన స్థితికి మానవ మేధస్సు ఎదగ లేదు. అందుకే ఇక్కడ నమ్మకం, శ్రద్ధ, విశ్వాసం, అనుభవజ్ఞులు చెప్పారనే విషయాన్ని ప్రశ్నించక పోవడం మొదలయి. వాటిని అంగీకరిస్తే కాని ఈ ప్రశ్న కు సమాధానం దొరకదు. అంటే ఏదో ఒక విశ్వాసాన్ని, నమ్మకాన్ని ఆశ్ర యించి ఈ ప్రశ్నకు సమాధానాన్ని పొందవచ్చునే కాని, కేవలం తరచి తరచి తర్కం ద్వారా తెలుసుకోలేం. తర్కం ద్వారా తెలుసుకోలేని ప్రశ్నలు చాలా ఉన్నాయి. అనుభవం ద్వారా తెలుసుకొనే ప్రశ్నలు కూడా చాలా ఉన్నాయి.

కనక బుద్ధిమంతులైన వారు ఈ ప్రశ్న ఏ కోవకు చెందిందని ముందుగా నిర్ణయించి ఆ తర్వాత తర్కాన్ని హేతువుని, ఆశ్రయించిగాని, లేదా అనుభవజ్ఞులు చెప్పిన విషయంలో శ్రద్ధఉంచిగాని ఈ ప్రశ్నకు సమాధానం తెలుసుకోగలరు.

అంటే ఇక్కడ ఏదో ఒక దర్శనాన్ని ఆశ్రయించి సమాధాన్ని చెప్పవలసిందేగాని మరొక రకంగా చెప్పలేం. ఉదాహరణకు ఉపనిషత్తుల్లో బ్రహ్మసాయుజ్యం, సాలోక్యం, సారూప్యం, సామీప్యం, అనే నాలుగు రకాలైన వర్ణన మోక్షాన్ని గురించి ఉన్నది. ఈ విషయాన్నే తర్వాత వచ్చిన దర్శనాల్లో కొన్ని సమర్థించి విపులీకరించాయి. కొన్ని నిరాకరించాయి. సాంఖ్య దర్శనంలో మోక్షమంటే ప్రకృతి—పురుషులను గురించి వివేక జ్ఞానాన్ని కలిగి ఉండటమే. యోగ దర్శనంలో నిర్వికల్ప సమాధిలో అసంప్రజ్ఞతా సమాధి స్థితిలో ఈశ్వర ప్రణిధానాన్ని కోరటమే. మీమాంసా దర్శనంలో నిత్య కర్మలను చేస్తూ, నైమిత్తి కర్మలు ఇచ్చే ఫలితాన్ని వదలివేస్తూ, శాస్త్ర నిషిద్ధమైన కర్మలు చేయకుండా ఉంటే స్వర్గ ప్రాప్తి లభిస్తుంది. శైవదర్శనంలో శివసాయుజ్యం లభిస్తుంది. వైష్ణవ దర్శనంలో విష్ణుసాయుజ్యం లభిస్తుంది. శంకర అద్వైతంలో బ్రహ్మాద్వైతాను భూతి కలుగుతుంది, రామానుజుని దర్శనంలో వైకుంఠంలో ఉన్న విష్ణు సామీప్యం లభిస్తుంది. బౌద్ధ దర్శనంలో నిర్వాణం లభిస్తుంది. జైన దర్శనంలో జినత్వం లభిస్తుంది. చార్వాక దర్శనంలో ఈ శరీరం కాలిపోయి పిడికెడు బూడిద అవుతుంది. చివరకు మిగిలేది అదే అంటారు. ఎవరి అభిరుచులను బట్టి యోగ్యతలను బట్టి వారు ఆయా సిద్ధాంతాలను అంగీకరిస్తారు.

ఐతే మోక్ష స్వరూప నిరూపణలో ఇంత వైవిధ్యం ఉంటే ఎట్లా అని ప్రశ్నించవచ్చు. ఈ వైవిధ్యంలోనే భారతీయ సంస్కృతి నాగరికతల ఐక్యతను, దాని విశిష్టతను మనం చూడవచ్చు. చార్వాక దర్శనం మినహా అన్ని దర్శనాలు మోక్ష ముందన్నారు. మోక్షం కావాలన్నారు. ఐతే దాన్ని వర్ణించడం లోనే వైవిధ్యమున్నది కాని, మౌలికంగా దాన్ని అంగీకరించడంలో వైవిధ్యం లేదు. అదే భారతీయ సనాతన ధర్మం. అదే భారతీయ దార్శనిక చింతన, ఆలోచన, విశ్లేషణలో ఉన్న సొగసు. ఐతే ఈ ఆలోచనలో ఎంత మాత్రం సత్యం ఉన్న

దని ప్రశ్నించవచ్చు. కాని సత్యమంటే ఏమిటి? అది లౌకిక సత్యమా? అలౌకిక సత్యమా? వ్యావహారిక సత్యమా? లేదా పారమార్థిక సత్యమా? అని ప్రశ్నించే హక్కు దార్శనికునికి ఉన్నది. ఈ విభజన పనికిరాదనే వాదం సహేతుకం కాదు.

భారతీయ సాంప్రదాయం నాలుగురకాలైన పురుషార్థాలను గుర్తించింది. పురుషార్థమంటే మానవుడు సాధించేవి లేదా సేకరించేవి అని అర్థం. అందుకే సామాన్యంగా మన పెద్దలు మనకు ఉత్తరాలు వ్రాస్తూ ''నేను క్షేమంగా ఉన్నాను. మీయోగ క్షేమాలను తెలియపరచవలసింది అని వ్రాస్తారు. ఇక్కడ యోగ క్షేమాలంటే అర్థం వేరు యోగం అంటే అప్రాప్త వస్తు సేకరణ అని అర్థం. అంటే లభ్యం కానివస్తువులను సేకరించటం. మనకు లేని దాన్ని సంపాదించటం అని అర్థం. క్షేమం అంటే 'సంప్రాప్త వస్తు సంరక్షణ'. అనగా మనం సంపాదించిన వాటిని వదిలంగా భద్రపరచటం. అంటే ఉన్నదాన్ని దేన్నీ పోగొట్టుకో కుండా ఉండటం అన్నమాట. యోగ క్షేమాలకు ఇది లౌకికార్థం అవుతుంది.

ఐతే అలౌకికార్థంలో వీటి అర్థం వేరు. అందుకే మనవారు నాలుగు రకాలైన పురుషార్థాలను గుర్తించారు. అవి :

1. ధర్మం
2. అర్థం
3. కామం
4. మోక్షం

చార్వాక దర్శనం మినహా అన్ని దర్శనాలు ఈ నాలుగు పురుషార్థాలను అంగీకరిస్తాయి. చార్వాక దర్శనం అర్థాన్ని, కామాన్ని పురుషార్థాలుగా అంగీకరిస్తుంది. కాని అర్థం కామాన్నివ్వడానికి మాత్రమే ప్రయోజనకారిగా ఉంటుంది. కాబట్టి దీనికి వారు ఎక్కువ ప్రాముఖ్యాన్ని ఇవ్వ లేదు.

కొన్ని దర్శనాలు కేవలం మోక్షానికో, నిర్వాణానికో ప్రాముఖ్యాన్ని ఇచ్చాయి. ఉదాహరణకు, శంకరుని అద్వైత వేదాంతం, బుద్ధుని బోధనలు, మోక్షానికి

నిర్వాణానికి ఎక్కువ ప్రాముఖ్యాన్ని ఇచ్చాయి. శంకరుని దృష్టిలో ఈ ప్రపంచం మాయామోహితం కాబట్టి ఇక్కడ మానవుడు సాధించకలిగిందంతా ఈ మాయామోహం నుంచి బయట పడటమే అంటాడు శంకరుడు.

ఈ ప్రపంచమంతా దుఃఖమయం కాబట్టి ఈ దుఃఖ సాగరం నుంచి బయట పడి నిర్వాణ సోపానాలను అధిగమించమంటాడు బుద్ధుడు కాని ధర్మశాస్త్ర కర్తలు, నీతిశాస్త్రకర్తలు, ధర్మం చాలా ముఖ్యం అన్నారు. మానవ ధర్మం మానవనైజం మిగతా సృష్టిజాలం కన్నా భిన్నంగా వుంటుంది అన్నారు. ఈ ధర్మాన్ని నిర్వర్తించటమే మానవుని కర్తవ్యం అన్నారు. ఈ మానవ ధర్మం పశు ధర్మం కాదు. హేయబద్ధంగా ఉంటుంది. పశు కాముకత్వంలో నుంచి, మానవతకు, మానవతలోనుంచి ఆధ్యాత్మిక చింతనకు మానవుడు పురోగమించాలి.

కాని కామ శాస్త్రకర్తలు మానవుని నైజాన్ని మరోరకంగా చిత్రించారు.

"నరో వై శిశ్నోదర పరాయణః"—అని కామశాస్త్రకారులు మానవుని నిర్వచించారు. అంటే, అంగవేదనతోను, ఉదర పోషణతోను మానవుడు ఎప్పుడూ తృప్తి పడుతూ ఉంటాడు. కనుక ఆ రెంటినీ చనిపోయే వరకు మానవుడు సాధిస్తూనే ఉంటాడు. అదే ఆయన జీవిత ధ్యేయం

అట్లాకాదు అంటారు అర్థశాస్త్రకర్తలు. ఉదాహరణకు, కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో ఈ విధంగా చెప్తాడు. సమస్తమైన. ధర్మ సాధనకు మూలం అర్థం (అంటే డబ్బు) ప్రధానం. అట్లాగే సమస్తమైన కామ సాధనకు కూడా మూలం అర్థమే. కనుక "క్షణశః కణశశ్చైవ విద్యామర్థంచ సాధయేత్" — అంటాడు కౌటిల్యుడు. విశ్రాంతి నెరుగని తేనెటీగలాగా మానవుడు నిరంతరం అర్థాన్ని సేకరించాలి. అదే మానవుని ధ్యేయం

అదికాదు అంటాడు ఆయుర్వేదానికి మూలపురుషుడైన చరకుడు. చరక సంహితలో ఈ విధంగా చెప్తాడు చరకుడు. అర్థం ఉన్నప్పటికి, కామాన్ని తీర్చుకోవాలి, ధర్మాన్ని నెరవేర్చాలి, అని ఉన్నప్పటికీ, ఆరోగ్యం లేనిదేమానవుడు

ఏమీ చేయలేడు. అందుకే బుద్ధిమంతుడైన మానవుడు ఏది హితమో, ఏది అహితమో, తెలుసుకొని ఆ విధంగా నడచుకొంటాడు.

## చతుర్విధ ఆశ్రమాలు అంటే ఏమిటి ?

మానవుని సాంఘిక జీవనం నాలుగు దశల్లో ఉంటే బాగుంటుందని మన పూర్వీకులు భావించారు.

అవి :

1. బ్రహ్మ చర్యాశ్రమం : విద్యార్థి దశ
2. గృహస్థాశ్రమం : భార్యా పిల్లలతో ఉండటం
3. వానప్రస్థాశ్రమం ; అనురక్తి లేదా ఆసక్తి లేనిజీవనం.
4. సన్యాసాశ్రమం : ఏకాంత జీవనం

విద్యార్థి దశలో ప్రతివారూ కొన్ని నిబంధనలకు లోబడి జీవించాలి. ఆయా నిబంధనలను ముందు ముందు తెలుసుకొందాం. గృహస్థాశ్రమ ధర్మం పరమ పవిత్ర మైనది. ఇంకా పరమ ప్రయోజనమైనది. ఇక్కడ అనేకమైన మానవ ధర్మాలను నిర్వర్తించడానికి అవకాశమున్నది. ప్రతిరోజు మానవుడు ఐదు యజ్ఞాలను (పనులను) చేయాలన్నారు ధర్మశాస్త్రకర్తలు.

అవి :

1. దైవ యజ్ఞం : దేవతలను స్మరించటం
2. పితృ యజ్ఞం : మాతా పితరుల సేవ
3. పశు యజ్ఞం : పశుపక్ష్యాదుల యందు కరుణ
4. అధ్యయన యజ్ఞం : గ్రంథాలు చదవటం
5. అధ్యాపనం : తాను చదివింది ఇతరులకు చెప్పటం.

ఈ లోకంలో ఉండే సుఖాలపై విరక్తి కలిగి, జ్ఞాన మార్గంలో ఉంటూ, శరీరాన్ని, మనసును అదుపులో పెట్టుకొని, కోరికలు తనను ఆవహించకుండా జీవించడమే వానప్రస్థం. అడవులకు, వనాలకు పోవడం వానప్రస్థమని మరొక అర్థం చెప్పారు.

సంన్యాసం రెండు రకాలు. అవి :

(1) విద్వత్ సంన్యాసం

(2) వివిదిశ సంన్యాసం

సర్వ సంగ పరిత్యాగం చేసి, ఈ జీవితం మీద విరక్తి చెంది, ఉపశమింప బడిన కోరికలతో, ఏవిధమైన భావోద్రేకం లేకుండా, సర్వ సమానత్వ దృష్టిని కలిగినవారు మాత్రమే ఈ ఆశ్రమాన్ని స్వీకరించగలరు. బాహ్య అడంబరాల కన్నా, మనస్సును శాసించ కలిగిన శక్తి కలవారే దీనికి అర్హులూ.

# 2

# ఉపనిషత్తులు : తాత్విక ఆలోచనలు

## ఉపనిషత్తు అంటే ఏమిటి !

భారతీయ తత్త్వ శాస్త్రానికి ఉపనిషత్తులు శిరోమాణిక్యం వంటివి. ఉపనిషత్ అంటే దగ్గర కూర్చొని అభ్యసించటం లేదా సమీపమున కూర్చొని నేర్చుకొనే విద్య అని భాష్యకారులు అర్థం చెప్పారు. ఈ ఉపనిషత్తులకే 'వేదాంతం' అని మరొక పేరు కలదు. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదాలకు చివరి భాగంగా అనేకమైన ఉపనిషత్తులు అనుబంధంగా ఉన్నాయి. వేదాలకు అంతిమ భాగంగా ఉండడం వలన వీటిని 'వేదాంతం' అని అన్నారు.

అనేకమైన విద్యలను గురించిన చర్చలు ఉపనిషత్తుల్లో మనం చూడవచ్చు. ఈ విద్యలన్నిటిని స్థూలంగా రెండు రకాలుగా విభజించవచ్చు. (1) బ్రహ్మ విద్య లేదా ఆత్మ విద్య (2) తద్భిన్నమైన విద్యలు. ఈ బ్రహ్మ విద్యకు అనేకమైన పర్యాయ పదాలు ఉన్నవి. అవి : ఆత్మవిద్య. మోక్షవిద్య, గుహ్యవిద్య, గుహ్యతర విద్య. సంసార హేతు నివృత్తి విద్య, పరమ విద్య గుహ్యాదేశ విద్య, రహస్యవిద్య, పరమార్థ విద్య మొదలైనవి.

ఉపనిషత్తులు కొన్ని గద్య రూపంలో, కొన్ని పద్యరూపంలో ఉన్నాయి. అందులో కొన్ని భగవంతుని సాకారునిగా, కొన్ని నిరాకారునిగా వర్ణిస్తాయి. నేడు మనకు లభ్యమైన ఉపనిషత్తుల సంఖ్య 108. అవి :

## ఋగ్వేదమునకు అనుబంధగా ఉన్న ఉపనిషత్తులు

1. ఐతరేయ ఉపనిషత్ 2. కేషీతకీ ఉపనిషత్

## సామ వేదమునకు అనుబంధంగా ఉన్న ఉపనిషత్తులు

1. ఛాందోగ్య ఉపనిషత్ 2. కేన ఉపనిషత్ దీనికే తాలవకార ఉపనిషత్ అని మరొక పేరున్నది.

## కృష్ణయజుర్వేదానికి అనుబంధంగా ఉన్న ఉపనిషత్తులు

1. తైత్తిరీయ ఉపనిషత్ 2. మహానారాయణ ఉపనిషత్ 3. కాథక ఉపనిషత్ 4. శ్వేతాశ్వతర ఉపనిషత్ 5. మైత్రాయణ ఉపనిషత్

## శుక్లయజుర్వేదానికి అనుబంధంగా ఉన్న ఉపనిషత్తులు

1. బృహదారణ్యక ఉపనిషత్
2. ఈశ ఉపనిషత్

## అధర్వ వేదానికి అనుబంధంగా ఉన్న ఉపనిషత్తులు

1. ముండక ఉపనిషత్
2. ప్రశ్న ఉపనిషత్
3. మాండూక్య ఉపనిషత్
4. గర్భ ఉపనిషత్
5. ప్రాణాగ్ని హోత్ర ఉపనిషత్
6. పిండ ఉపనిషత్
7. ఆత్మ ఉపనిషత్
8. సర్వ ఉపనిషత్ సార
9. గరుడ ఉపనిషత్

## యోగ ఉపనిషత్తులు

1. బ్రహ్మవిద్య ఉపనిషత్
2. క్షురిక ”
3. శూలిక ”
4. నాదబిందు ”
5. బ్రహ్మబిందు ”
6. అమృత బిందు. ”
7. ధ్యానబిందు ”

8. తేజోబిందు ఉపనిషత్
9. యోగశిఖా ఉపనిషత్
10. యోగతత్త్వ ఉపనిషత్
11. హంస ఉపనిషత్

## సంన్యాసాన్ని తెలిపే ఉపనిషత్తులు

1. బ్రహ్మ ఉపనిషత్
2. సంన్యాస ఉపనిషత్
3. ఆరుణేయ ఉపనిషత్
4. కంఠశ్రుతి ఉపనిషత్
5. పరమ హంస ఉపనిషత్
6. జాబాల ఉపనిషత్
7. ఆశ్రమ ఉపనిషత్

## శైవ ఉపనిషత్తులు

1. అధర్వ శిర ఉపనిషత్
2. అధర్వ శిఖా ఉపనిషత్
3. నీలరుద్ర ఉపనిషత్
4. కాలాగ్ని రుద్ర ఉపనిషత్
5. కైవల్య ఉపనిషత్

## విష్ణు ఉపనిషత్తులు

1. మహా ఉపనిషత్
2. నారాయణ ఉపనిషత్
3. ఆత్మ బోధ ఉపనిషత్
4. నృసింహ పూర్వ తాపనీయ ఉపనిషత్

5. నృసింహోత్తర తాపనీయ ఉపనిషత్
6. రామపూర్వ తాపనీయ ఉపనిషత్
7. రామోత్తర తాపనీయ ఉపనిషత్

**నేడు మనకు లభ్యమైన 108 ఉపనిషత్తుల పేర్లను తెలుసుకొందాం.**

1. ఈశావాస్యోపనిషత్
2. తలవకారోపనిషత్
3. కఠ ఉపనిషత్
4. ముండకోపనిషత్
5. మాండూక్యోపనిషత్
6. తైత్తిరీయోపనిషత్
7. బృహదారణ్యకోపనిషత్
8. బ్రహ్మోపనిషత్
9. కైవల్యోపనిషత్
10. జాబాలోపనిషత్
11. శ్వేతాశ్వతరోపనిషత్
12. హంసోపనిషత్
13. గూఢారుణికోపనిషత్
14. గర్భోపనిషత్
15. నారాయణోపనిషత్
16. పరమహంసోపనిషత్
17. అమృత బిందూపనిషత్
18. అమృతనాదోపనిషత్
19. అధర్వశిరోపనిషత్
20. అధర్వ శిఖోపనిషత్

21. మైత్రాయణ ఉపనిషత్
22. కౌషీతకీ బ్రాహ్మణ ఉపనిషత్
23. బృహజ్జాబాలో పనిషత్
24. నృసింహ తాపనీ–పూర్వతాపనీ ఉపనిషత్
25. ఉత్తర తాపనీ ఉపనిషత్
26. కాలాగ్ని రుద్రోపనిషత్
27. మైత్రేయోపనిషత్
28. సుబాలోపనిషత్
29. క్షురికోపనిషత్
30. మంత్రికోపనిషత్
31. సర్వసారోపనిషత్
32. నిరాలంబోపనిషత్
33. శుకరహస్యోపనిషత్
34. వజ్రసూచికోపనిషత్
35. తేజ బిందూపనిషత్
36. నాద బిందూపనిషత్
37. ధ్యాన బిందూపనిషత్
38. బ్రహ్మ విద్యోపనిషత్
39. ఆత్మ బోధోపనిషత్
40. నారద పరివ్రాజికోపనిషత్
41. త్రిశిఖోపనిషత్
42, సీతోపనిషత్
43. యోగచూడా మణ్యుపనిషత్
44, నిర్వాణోపనిషత్
45. మండల బ్రాహ్మణోపనిషత్
46. దక్షిణా మూర్త్యుపనిషత్
47. శరభోపనిషత్

48. స్కందో పనిషత్
49. త్రిపాద్విభూతి ఉపనిషత్
50. అవ్యయ తారకోపనిషత్
51. రామ రహస్యోపనిషత్
52. రామతాపనీ పూర్వతాపనీ ఉపనిషత్
53 ఉత్తర తాపనీ ఉపనిషత్
54. వాసుదేవోపనిషత్
55. ముద్గలోపనిషత్
56. శాండిల్యోపనిషత్
57. పైంగలోపనిషత్
58. భిక్షుకోపనిషత్
59. మహోపనిషత్
60. శారీరకోపనిషత్
61. యోగశిఖ ఉపనిషత్
62. తురీయాప తీతావధూత ఉపనిషత్
63. సన్యాసోపనిషత్
64. పరమహంస పరివ్రాజికోపనిషత్
65. అక్షమాలికోపనిషత్
66. అవ్యక్తోపనిషత్
67. ఏకాక్షరోపనిషత్
68. అన్నపూర్ణోపనిషత్
69. సూర్యోపనిషత్
70. అక్ష్యుపనిషత్
71. అధ్యాత్మోపనిషత్
72. కుండికోపనిషత్
73. సావిత్ర్యుపనిషత్
74. పాశుపత బ్రహ్మోపనిషత్

75. పరబ్రహ్మోపనిషత్
76. అవధూతోపనిషత్
77. త్రిపురతాపన్యుపనిషత్
78. దేవ్యుపనిషత్
79. కఠోపనిషత్
80. భావోపనిషత్
81. శ్రీచక్రం ఉపనిషత్
82. శ్రీచక్రవిన్యాస ఉపనిషత్
83. శ్రీచక్ర బీజాక్షరన్యాస ఉపనిషత్
84. రుద్రహృదయోపనిషత్
85 యోగకుండల్యుపనిషత్
86. భస్మజాబాలోపనిషత్
87. రుద్రాక్షజాబాలోపనిషత్
88. గణపత్యుపనిషత్
89. దర్శనోపనిషత్
90. తారసారోపనిషత్
91. మహావాక్యోపనిషత్
92. పంచబ్రహ్మోపనిషత్
93 ప్రాణాగ్నిహోత్రోపనిషత్
94. గోపాలతాపన్యుపనిషత్
95. ఉత్తర తాపనీ ఉపనిషత్
96. కృష్ణోపనిషత్
97. యాజ్ఞవల్క్యోపనిషత్
98. వరాహోపనిషత్
99. హయగ్రీవోపనిషత్
100. దత్తాత్రేయోపనిషత్
101. గారుడోపనిషత్

102. కలిసంతారణోపనిషత్
103. జాబాల్యు ఉపనిషత్
104. సౌభాగ్యలక్ష్మి ఉపనిషత్
105. సరస్వతీ రహస్యోపనిషత్
106. బృహ్వాబోపనిషత్
107. ముక్తికోపనిషత్
108. శాట్యాయనీ ఉపనిషత్

ఈ 108 ఉపనిషత్తుల్లో ఉన్న విషయాలేమిటి? వీటిల్లో కొన్ని ఉపనిషత్తులు బ్రహ్మతత్వాన్ని గురించి, కొన్ని ఆత్మ తత్వాన్ని, కొన్ని దేహ తత్వాన్ని, కొన్ని ప్రపంచ స్వరూపాన్ని, కొన్ని జీవ స్వరూపాన్ని, కొన్ని పంచ భూతాలైన పృథ్వీ, నీరు, నిప్పు, గాలి, ఆకాశాల స్థూలరూపాన్ని, సూక్ష్మరూపాన్ని, కొన్ని మరణాన్ని, మరణానంతర స్థితి గతులను, కర్మను, ఆశ్రమ ధర్మాలను, మోక్ష స్వరూపాన్ని గురించి చర్చిస్తాయి. ఈ సమస్యలన్నీ అతి జటిలమైనవి.

ఈ ఉపనిషత్తులు అన్నీ 'సంవాద' రూపంలో ఉన్నాయి. అంటే ఒకరు ఒక విషయాన్ని గురించి ప్రశ్నించడం, ఆ ప్రశ్నకు అనేకమంది కాని లేదా ఏ ఒక్కరో కాని సమాధానం ఇవ్వడం జరిగింది. ఒక ప్రశ్నను వేయడం, దానికి సమాధానం చెప్పడం. ఆ సమాధానాన్ని ఖండించటం లేదా సమర్థించడం లేదా సంస్కరించటం, లేదా మరొక నూతనమైన సమాధానాన్ని చెప్పడం ఉపనిషత్తుల్లోని వాద పద్ధతిని సూచిస్తుంది. ఈ వాద ఉపవాదాలు అతి విశాలమైన అరణ్యాల్లోనూ, ఆశ్రమాల్లోను, విద్వత్ సభల్లోను జరిగాయి. ప్రతి ఉపనిషత్తు ఒక ముఖ్యమైన విషయాన్ని మనకు తెలియ జేస్తుంది. ఆ విషయాలన్నిటిని ఇక్కడ చెప్పటం సాధ్యం కాదు. అందుకని అత్యంత ప్రాముఖ్యాన్ని సంతరించుకొన్న కొన్ని విషయాలను గురించి మాత్రం తెలుసుకొందాం. జగద్గురువులు శ్రీ శంకరాచార్యుల వారు ఏ ఉపనిషత్తులకైతే భాష్యం రాశారో ఆ ఉపనిషత్తులను దశ మహోపనిషత్తులంటారు. వాటిల్లో వున్న విషయాలను గురించి సంగ్రహంగా చూద్దాం.

# 1) కౌషీతకి ఉపనిషత్

ఈ ఉపనిషత్ శాంఖాయన శాఖకు చెందినది. దీన్ని కౌషీతకి—బ్రాహ్మణ—ఉపనిషత్ అని కూడ అంటారు. ఇందులో అనేక విద్యలను గురించిన చర్చలు ఉన్నాయి. అందులో ముఖ్యమైన విద్యలు

1. పర్యాంక విద్య
2. పిత్రాయణ విద్య
3. దేవయాన విద్య
4. ప్రాణవిద్య
5. ఆత్మవిద్య
6. బ్రహ్మవిద్య.

"ప్రాణేంద్రియ సంవాదము''—ఇందులో అతిముఖ్యమైనది. నవద్వారాలను కలిగిన శరీరమనే పట్టణంలో ఉన్న పంచ జ్ఞానేంద్రియాలకు, పంచ కర్మేంద్రియాలకు — తమలో ఎవరు అధికులు ? అనే సమస్య ఉత్పన్నం అవుతుంది. కన్నులు, చెవులు, ముక్కు, నాలుక, చర్మము — జ్ఞానేంద్రియాలు, కాళ్ళు, చేతులు, జననాంగము, గుదము, చేతులు — కర్మేంద్రియాలు. ఇవన్నీ తమలో తాము గొప్ప అని, తమ ఆధిక్యత వల్లనే శరీర ధారణ ఉంటుందని, తాము లేకపోతే శరీరం ఉండదని పోట్లాడు కుంటాయి. తీర్పు కోసం వాటిని సృష్టించిన ప్రజాపతి వద్దకు వెళ్ళి తమలో ఎవరు అధికులో చెప్పవలసిందిగా కోరుతాయి. అయితే, ప్రజాపతిమాత్రం ఎవరు గొప్పవారో ఎవరి ఉనికి ఉన్నపుడే శరీర ధారణం జరుగుతుందో చెప్పక ఒక సూత్రాన్ని చెప్పి, తద్వారా వారిలో ఎవరు అధికులో నిర్ణయించుకోమని చెబుతాడు. అప్పుడు ప్రతి అంగం తన ఆధిక్యతను చూపడానికి తాను శరీరంలో ఉన్నపుడు చేసే పనిని విరమించు కొంటుంది. కన్ను చూడటం మాని వేస్తుంది. చెవి వినడం మాని వేస్తుంది. మనస్సు ఆలోచించడం మాని వేస్తుంది. కాలు కదలడం మాని వేస్తుంది. చెయ్యి పనిచేయడం మానివేస్తుంది. అయా అవయవాలు లోపించినప్పటికీ

శరీరం జీవ యాత్ర చేస్తూనే ఉంటుంది. అప్పుడు శరీరంలో ఉన్న ప్రాణ వాయువు తాను కూడా నిర్గమించి చూస్తానని నిర్గమించడానికి ఉద్యమిస్తుంది. దాని నిర్గమనంతో సమస్తమైన జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు పని చేయడం మానివేస్తాయి. శరీరం నిర్జీవం అవుతుంది.

ప్రాణవాయువే శరీరధారణకు ముఖ్యమని గుర్తించి అవన్నీ ప్రాణవాయువును ఈ శరీరాన్ని వదలి పోవద్దని బతిమాలుతాయి. అందుకే ఈ ఉపనిషత్తు "ప్రాణో వై బ్రహ్మ" అని బోధిస్తుంది. ఈ ప్రాణం అయిదు మహా వాయువుల రూపంలో శరీరంలో సంచరిస్తుంటుంది. అవి : 1) ప్రాణ వాయువు 2) అపాన వాయువు 3) వ్యానవాయువు 4) సమానవాయువు 5) ఉదానవాయువు. ఈ వాయువులు హెచ్చు తగ్గులు లేక, సమంగా ఉన్నంతకాలం శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. వీటి సమస్థితిలో ఏ మాత్రం మార్పు వచ్చినా శరీరం అనారోగ్యం పాలవుతుంది అని ఈ ఉపనిషత్తు హెచ్చరిస్తుంది.

ఇంద్ర—ప్రతర్ధన సంవాదం, అజాతశత్రు—బాలాకిగార్గ్య సంవాదం, ఈ ఉపనిషత్తులో ఉన్నవి. నిద్రావస్థలో సమస్తమైన చైతన్యం ఏ విధంగా ప్రాణంలో లయమయ్యేది, నిద్రావస్థలోను, స్వప్నావస్థలోను చైతన్యం ఏ విధంగా ప్రాణంలో లయమయ్యేది, జాగ్రదావస్థలో చైతన్యం స్వస్థతను ఏ విధంగా పొందేది ఈ సంవాదాల్లోని సారాంశం.

## 2) ఛాందోగ్య ఉపనిషత్

సామవేదానికి అనుబంధంగా ఉంటుంది ఛాందోగ్య ఉపనిషత్. ఇందులో మొత్తం 8 అధ్యాయాలు ఉన్నాయి. అనేకమైన విద్యలను గురించిన చర్చలు ఇందులో ఉన్నాయి. ఉద్గీతస్తుతి, సామస్తుతి, ఓంకార ప్రాముఖ్యత, గాయత్రీ మంత్ర ప్రాముఖ్యత ఇక్కడ చూడవచ్చు. మార్మికవిద్యలు, ఆధ్యాత్మ విద్య ఇందులో ఉన్నాయి. కొన్ని ముఖ్యమైన విద్యలపేర్లు :

1. శాండిల్య విద్య

2. జనశ్రుతి—రైక్వమహర్షి విద్య
3. సత్యకామ—జబాలవిద్య
4 ఉపకోశల విద్య
5. అశ్వపతి—ఉద్దాలక విద్య
6. ఉద్దాలక—శ్వేతకేతు విద్య
7. సనత్కుమార—నారద విద్య
8. ప్రజాపతి—ఇంద్ర విద్య

ఈ విద్యలన్నీ ఆత్మస్వరూపాన్ని, బ్రహ్మస్వరూపాన్ని, పునర్జన్మ సిద్ధాంతాన్ని, ఆశ్రమ ధర్మాలను గురించి చెబుతాయి. అందులో కొన్ని విద్యలను గురించి తెలుసుకొందాం.

శాండిల్యవిద్య భక్తి మార్గాన్నిగురించి చెబుతుంది. 'శాండిల్య భక్తి సూత్రములు' అనే గ్రంథంకూడా ఒకటి ఉన్నది జనశ్రుతి—రైక్వమహర్షివిద్య ప్రాణవాయువు ప్రాముఖ్యాన్ని గురించి చెబుతుంది.

## సత్యకామ - జబాలవిద్య

సత్యకాముడనే పేరుగల ఒకవ్యక్తి బ్రహ్మవిద్యనుగురించి తెలుసుకోవాలని ఆసక్తితో హరిద్రుమత గోతముని ఆశ్రయానికి వచ్చి తనను విద్యార్థిగా స్వీకరించ వలసిందిగా ఆయన్ను ప్రార్థిస్తాడు. సత్యకాముని కులగోత్రాలు ఏమిటని, అతని తల్లి దండ్రులు ఎవరని హరిద్రుమతుడు ప్రశ్నిస్తాడు. వెంటనే సత్యకాముడు తన తల్లి వద్దకు వచ్చి తన తండ్రి ఎవరని ప్రశ్నిస్తాడు. అప్పుడు ఆమె ఈ విధంగా చెబుతుంది. "బాల్యంలో నేను అనేకమంది ఇళ్ళకు పని పాటల నిమిత్తమై వెళ్ళేదాన్ని. ఆ రోజుల్లో ఎవరిద్వారా నిన్ను కన్నానో నాకు ఇప్పుడు తెలియదు. నన్ను జబాల అంటారు. నిన్ను సత్యకామ అంటారు. కనక నీవు నీ గురువుల వద్దకు వెళ్ళి ఈ విషయాన్ని చెప్పి నీ పేరు సత్యకామ—జబాలగా

ప్రకటించు అని చెప్పి కుమారుని హరిద్రుమత గోతముని ఆశ్రమంలో విద్యార్థిగా చేరడానికి అనుమతి ఇచ్చి పంపిస్తుంది."

వెంటనే సత్యకాముడు హరిద్రుమతుని ఆశ్రమానికి వచ్చి అతనితో ఈ విషయాన్నంతా చెబుతాడు. సత్యం చెప్పినవాడే బ్రాహ్మణుడని, సత్యధర్మం బ్రాహ్మణుడిని ఆశ్రయించి ఉంటుంది కనుక సత్యకాముని బ్రాహ్మణ బాలునిగా భావించి తన శిష్యుడిగా హరిద్రుమతుడు అంగీకరిస్తాడు.

తాను చెప్పబోయే బ్రహ్మవిద్యకు గురుదక్షిణగా 400 గోవులను ఇచ్చి వాటిని మేపుకొని రమ్మంటాడు. ఆ పనిని సంతోషంగా స్వీకరిస్తూ ఆ 400 ఆవులు 1000 ఆవులు అయ్యేదాకా తిరిగి రానని కూడా చెప్పి వాటిని అరణ్యంలోకి తోలుకొని పోతాడు. కొంతకాలం అయిన తరవాత ఆవులు 1000అయినట్లు గ్రహిస్తాడు. 400 ఆవులు 1000 ఆవులు కావాలంటే ఎంతకాలం పడుతుంది? ఆ సమయంలోనే అతనికి వాయుదేవుడు, అగ్నిదేవుడు, ఆదిత్యుడు, ప్రాణదేవుడు మొదలయిన దేవతలు ఎద్దు, అగ్ని, ముంగిస ఇంకా హంసరూపాల్లో వచ్చి బ్రహ్మవిద్యను నేర్పిపోతారు. ఆవులు వెయ్యి అయ్యాయిగదా అనే సంతోషంతో సత్యకాముడు గురువుగారి ఆశ్రమానికి బయలుదేరి వెళుతాడు. బ్రహ్మవర్చస్సుతో వెలుగొందుతున్న సత్యకాముని చూసి [స్వయం ప్రతిభ కృషి కలిగిన విద్యార్థులను చూసి ఈర్ష్యపడే నేటి గురువులలా కాక] హరిద్రుమతుడు సంతోషిస్తాడు. "నీ ముఖం బ్రహ్మవర్చస్సుతో వెలుగొందుతున్నది. నీకు బ్రహ్మవిద్య ఎవరు నేర్పారు" అని అడుగుతాడు. "వారు నేర్పారు" అని సత్యకాముడు చెబుతాడు. కాని గురుముఖతా నేర్చుకొన్నది సుస్పష్టంగా ఉంటుంది కనక తనను శిష్యునిగా అంగీకరించవలసిందిగా కోరుతాడు. అంతేకాకుండా గురువుగారి ద్వారా నేర్చుకోవాలనే ఇచ్ఛ ఉన్నదనికూడా తెలుపుతాడు. అపుడు హరిద్రుమతుడు సత్యకామ-జాబాలని తన శిష్యునిగా చేర్చుకొని బ్రహ్మవిద్యను సంపూర్ణంగా బోధిస్తాడు. ఈ కథలోని విశేషాంశాలు :

1) విద్యార్థిని కులమత విచక్షణ లేకుండా సత్యదీక్ష, కార్యదీక్ష, సచ్ఛీలత ఉన్న విద్యార్థులను ఆ రోజుల్లో గురువులు చేర్చుకొనేవారు.

2) స్వయం ప్రతిభ కృషి ఉన్న విద్యార్థులకు ప్రోత్సాహమిచ్చి, మర్మం విడిచి విద్యను బోధించేవారు.

3) విద్యార్థులు సత్యకాములలాగా కార్యదీక్షను కలిగి ఉండాలి.

4) గురుదక్షిణ అనేది సాంఘికంగా అంగీకరించిన ఒక ఆచారం లేక అలవాటుగా ఆ రోజుల్లో ఉండేది.

## ఉద్దాలక ఆరుణి - శ్వేతకేతు విద్య

బ్రహ్మవిద్యను బోధించే పంచమహావాక్యాల్లో "తత్త్వమసి" అనే వాక్యం చాలా ముఖ్యమైనది. పంచ మహావాక్యాలు :

1) సర్వం ఖల్విదం బ్రహ్మ
2) అయమాత్మ బ్రహ్మ
3) ప్రజ్ఞానం బ్రహ్మ
4) అహం బ్రహ్మాస్మి.
5) తత్త్వమసి

ఈ మహావాక్యాలన్నీ ఆత్మ అఖండ స్వరూపాన్ని, జీవాత్మ—పరమాత్మల తాదాత్మ్యాన్ని చాటుతాయి. ఉద్దాలక—శ్వేతకేతు సంవాదం ఈ విషయాన్నే తెలుపుతుంది.

ఉద్దాలక మహర్షి కొడుకు శ్వేతకేతు. పన్నెండు సంవత్సరాలు అనేకమంది గురువుల వద్ద శుశ్రూషచేసి శిక్ష, వ్యాకరణం, మీమాంస, నిరుక్తి, న్యాయ దర్శనాదులను చదివి విద్యావంతుడనే గర్వం తొణికిసలాడుతుండగా ఇంటికి వచ్చి, తన చదువంతా పూర్తయిందని తండ్రికి చెబుతాడు. అప్పుడు అతని వయస్సు 24 సంవత్సరాలు. విద్యాగర్వితుడైన కుమారుని చూసి—"కుమారా! ఏ విద్యను తెలుసుకొన్నందువల్ల, తెలియనిది అంతా తెలుస్తుందో, శ్రుతము

కానిదంతా శృతమవుతుందో అర్థం కానిదంతా అర్థమవుతుందో "దాన్ని గురించి తెలుసుకున్నావా ?''— అని ఉద్దాలకుడు అడుగుతాడు. అటువంటి విద్య ఏదీ తన గురువులు తనకు చెప్పలేదని, బహుశ వారికి తెలియదని, తెలిసిఉంటే తనకు చెప్పేవారని శ్వేతకేతు సమాధానం చెబుతాడు. ఆ విద్య తనకు తెలిసే టట్లు చెప్పవలసిందిగా తండ్రిని ప్రార్థిస్తాడు. అప్పుడు ఉద్దాలకుడు ఈ విధంగా చెబుతాడు :

ఉన్నదంతా బ్రహ్మమయం. ఆ బ్రహ్మ తాను అనేక రూపాలుగా భాసించా లని అనుకొంటుంది. అనుకొన్న వెంటనే అది మూడు రూపాల్లోకి విడిపోయింది. అవి : 1) తేజస్సు 2) నీరు 3) అన్నం. ఈ మూడుమూర్తులు మానవుడిలో ప్రవేశించి మూడేసి విధాలుగా రూపాంతరాన్ని పొందుతాయి. మనం తిన్న అన్నం శరీరంలో మూడురకాలుగా మార్పు చెందుతుంది. జీర్ణమై మిగిలి పోయిన స్థూల పదార్థమంతా మలంగాను, మధ్యభాగం మాంసం, కొవ్వుగాను సూక్ష్మమైన భాగం మనస్సుగాను మారుతుంది. మనం తాగిన నీరుకూడా మూడు రకాలుగా మార్పు చెందుతుంది. స్థూల భాగమంతా మూత్రంగాను, మధ్య భాగమంతా రక్తంగాను, సూక్ష్మ భాగమంతా ప్రాణవాయువు రూపం గాను మారుతుంది. అగ్ని రూపంలో ఉండే తేజస్సు స్థూలభాగం ఎముకలుగాను, మధ్యభాగం మజ్జగాను, సూక్ష్మభాగం వాక్కు లేక ధ్వనిగాను మారుతుంది.

పెరుగునుచిలికితే బయలుపడేవెన్న ఆ మజ్జిగలో ఏ విధంగా అయితే తేలుతూ పైన ఉంటుందో అదేవిధంగా, మనం తిన్న అన్నం జఠరాగ్నితో చిలుకబడి మనస్సు రూపేణ శరీరం పై భాగమైన శిరస్సులో భద్రంగా ఉంటుంది. మనస్సు అన్నంపై ఆధారపడి ఉంటుంది. ప్రాణం నీటిపై ఆధారపడి ఉంటుంది (నీరే ప్రాణాధారమని సుమతి శతకం చెబుతుంది). వాక్కు అగ్నిపై ఆధార పడి ఉంటుంది. వీటి రక్షణ చాలా అవసరం.

ఈ విషయాన్ని నిరూపించడానికి ఉద్దాలకుడు ఒక ప్రయోగం చేస్తాడు. శ్వేతకేతుని 16 రోజులు అన్నం మానివేయమంటాడు. అతను మానివేస్తాడు.

అప్పుడు అతనికి చెవులు వినబడవు. కళ్ళకు చూసేశక్తి సన్నగిలుతుంది. పూర్వం నేర్చుకొన్న శాస్త్రాల స్ఫురణ మనస్సుకు ఉండదు. అట్లాంటి స్థితిలో కొద్ది కొద్దిగా అన్నం తిని 16 రోజులయిన తరవాత పళ్ళీ రమ్మంటాడు. శ్వేతకేతువు అన్నం బాగా తిన్న తరవాత వస్తాడు. సమస్తం అతనికి మామూలుగానే ఉంటుంది. అన్నం తినడం వల్లనే పోగొట్టుకొన్న సర్వశక్తులు తిరిగి వచ్చాయని ఉద్దాలకుడు చెబుతాడు.

"అన్నం వై బ్రహ్మ''-- అని ఉపనిషత్తు చెబుతుంది.

జాగ్రదావస్థలో మనిషి అన్నమయుడని, అన్నసంభవుడని ఉద్దాలకుడు చెబుతాడు. మానవునికి నాలుగు రకాలైన అవస్థలు ఉన్నాయి. అవి :

1) జాగ్రదావస్థ
2) నిద్రావస్థ
3) స్వప్నావస్థ
4) తురీయావస్థ

పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి—సమస్తం పని చేస్తున్నప్పుడు ఇంద్రియ గోచరమైన జగత్తులో మన మనస్సు లయం కావడమే జాగ్రదావస్థ.

ఈ స్థితిలో నుంచి అనేకమైన విషయానుభవాలను, వస్తువులను—అన్నింటినీ విస్మరించి, కర్మేంద్రియాలకు, జ్ఞానేంద్రియాలకు విశ్రాంతిని ఇచ్చి, చైతన్యాన్ని, ఉచ్ఛ్వాస నిశ్వాసలను, హృదయాన్ని జాగ్రత్తగా పదిల పరచుకొని ఉండే స్థితిని నిద్రావస్థ అంటారు. ఇది అనేక వశల్లో జరుగుతూ ఉంటుంది. చైతన్య స్వరూపమైన ఆత్మ బ్రహ్మపట్నం దాకా పోయివస్తానని బుద్ధితో చెబుతుంది. ఈ శరీరాన్ని మనస్సును, ఇంద్రియాలను, శరీరాన్ని జాగ్రత్తగా కాపాడమని చెప్పి చైతన్యం నిర్గమిస్తుంది. అప్పుడు శరీరం చైతన్యవంతమైనప్పటికీ, నిర్జీవంగా పడి ఉంటుంది. ఇదే నిద్రావస్థ.

అయితే జాగ్రదావస్థలో తీరని కోరికలు, తీర్చుకోలేని కోరికలు అన్నీ కలసి అణగదొక్కబడి అంతర్గతంగా ఉంటాయి. నిద్ర పడుతున్నప్పుడు అవన్నీ తమలో తాము పోట్లాడుకొని, ఏదో ఒక భావనాశక్తి రూపంలో నిద్రా యుతమైన చైతన్యంలో ప్రవేశిస్తాయి. కాని ఆత్మనుంచి పొందిన చైతన్యశక్తి వాటిని ఆపివేస్తుంది. అట్లా నెట్టివేసినవి మళ్ళీ రావడానికి ప్రయత్నిస్తాయి. మళ్ళీ నెట్టివేయటం జరుగుతుంది. ఈ విధంగా మనస్సులో అలజడి జరుగుతూనే ఉంటుంది. ఇట్లా జరుగుతున్న స్థితినే స్వాప్నికస్థితి అంటారు.

మానవుడు మైమరచి, ఏ విధమైన చైతన్య స్పృహ లేకుండా, ఆద మరచి పూర్తిగా నిద్రపోతాడో అదే తురీయావస్థ. ఇక్కడ జీవాత్మలు పరమా త్మలో ఏకమవుతూ ఉంటాయి. ఇది ప్రతిరోజూ ప్రతి ప్రాణికీ జరుగుతూనే ఉంటుంది.

ఈ విధంగా ప్రతి ప్రాణికి నాలుగు అవస్థలుంటాయి అని ఉద్దాలకుడు శ్వేతకేతువుకు చెబుతాడు. అప్పుడు శ్వేతకేతువు ఈ విధంగా ప్రశ్నిస్తాడు. ప్రతి రోజూ సమస్తమైన జీవులు బ్రహ్మలో ఐక్యం చెందుతుంటే, నిద్రలేచిన తరవాత జీవులకు అట్లా బ్రహ్మతో ఐక్యం చెందామని ఎందుకు గుర్తుండదు అని అడుగు తాడు. దానికి ఉద్దాలకుడు అంటాడు—"ఓ కుమారా! ఏ విధంగా అయితే అనేక మైన తేనెటీగలు రకరకాల పుష్పాలమీద వ్రాలి రకరకాల తేనెను సేకరిస్తే, అంతా తేనెగానే ఉంటుందో, కాని ఏ తేనెటీగ ఏ పువ్వుమీదనుంచి తేనెను సేక రించిందో చెప్పటం కష్టమో, కాని తేనె అంతా మధువుగానే ఉంటుందో అట్లాగే ఈ జీవులన్నీకూడా ఆనంద రసమయమైన పరమాత్మలో నిత్యమూ ఆనందాన్ని అనుభవిస్తున్నప్పటికినీ వాటికి తెలియదు.

అంతేగాకుండా సముద్రంలోని నీరు ఇంకిపోయి మేఘంగా మారి, మేఘం నీరు వర్షంగా భూమి మీదపడి తటాకాలు, కాలువలు, చెరువులు, నదులుగా —ఇవన్నీ ఎక్కడో ఒకచోట సముద్రంలో కలిసిపోయి, మళ్ళీ అదంతా నీరుగా మారుతూ ఉంటుందో అట్లాగే, ఈ నదీనదాలు సముద్రంలో

కలసిపోయినప్పుడు అవి వాటి నామరూపాలు కోల్పోతాయి. అంటే గోదావరి, గండకి, తపతి, నర్మద, కృష్ణ, మొదలయిన నదుల నీరు సముద్రంలో కలిసి నప్పుడు వాటి వాటి ఉనికిని అవి కోల్పోతాయి. అట్లాగే ఈ సమస్తమైన జీవ రాసులు తురీయావస్థలో వాటి వాటి ప్రత్యేకతను కోల్పోతాయి. అట్లా కోల్పోయి నప్పుడు సర్వే సర్వత్రా సమత్వం ఏర్పడుతుంది. ఈ దశలో రాజు రాజుకాడు ; మంత్రి మంత్రి కాడు ; పేదవాడు పేదవాడు కాదు. అందరూ మూడు దశల్లో సమాన స్థితిలో ఉంటారు. అవి : 1) గర్భస్థదశ 2) తురీయదశ 3) మరణా వస్థ.

ఈ అనంతమైన విశ్వం — ఓ శ్వేతకేతూ !, అణువుకన్నా చిన్నదైన బ్రహ్మకుక్షిలో ఉంటుంది. ఇది నిరంతరం ఉత్పన్నమవుతూ ఉంటుంది. నిరం తరం నాశనమవుతూ ఉంటుంది. అయినప్పటికీ మన కంటికి కనిపించదు. దాన్ని తెలుసుకోవాలంటే ప్రత్యేకమైన యోగమార్గాన్ని అవలంభించవలసి ఉంటుంది అన్నాడు.

ఇదంతా తనకేమీ అర్థం కావటంలేదు అంటాడు శ్వేతకేతు. అందుకే మరో ఉదాహరణనిచ్చి, ప్రయోగాత్మకంగా అతనికి నిరూపిస్తాడు ఉద్దాలకుడు. "ఇద్దరూ కలసి ఒక మర్రిచెట్టు దగ్గరికి వెళుతారు. మర్రిచెట్టు నెక్కి ఒక మర్రి కాయను కోసి తీసుకొని రమ్మంటాడు ఉద్దాలకుడు. అట్లాగే తెస్తాడు శ్వేతకేతువు. మర్రికాయను విప్పతీయమంటాడు ఉద్దాలకుడు. విప్పతీస్తాడు శ్వేతకేతువు. ఏమి కన్పిస్తుంది నీకు అని ఉద్దాలకుడు అడిగితే చిన్న చిన్న విత్తనాలు లేక గింజలు కన్పిస్తున్నాయంటాడు. ఒక గింజను తీసుకొని నలిపివేయమంటాడు. నలిపి పారేస్తాడు శ్వేతకేతువు. ఏమి కన్పిస్తున్నదంటాడు ఉద్దాలకుడు. తనకు ఏమీ కన్పించలేదని చెప్తాడు శ్వేతకేతువు."

కనుక ఓ శ్వేతకేతూ ఏమీ కనిపించని దాంట్లోనుంచే ఈ మహా మర్రి వృక్షం వచ్చినట్లుగానే, ఈ పరమాత్మలోనుంచి ఈ సమస్తం వస్తుంది. ఈ ప్రపంచానికి ఆధారం ఆయనే. అయినప్పటికీ సామాన్య దృష్టికి అది గోచరంకాదు. కనక హేతువుచేతను, ఉపమానంచేతను, ప్రయోగాత్మకంగా, శాస్త్ర ప్రమాణ

పూర్వకంగా చెప్పిన ఈ విషయాన్ని విశ్వసిస్తే మేలు జరుగుతుంది అని ఉద్దాలకుడు చెబుతాడు.

ఈ సమస్తమైన జీవరాసుల్లో ఉండే అన్నం పంచభూతాత్మకం. ఈ జీవరాసుల్లో ఉండే ప్రాణవాయువు అంతా ఒకటే. మనస్సులు అంతా ఒకటే వీటి కలయిక, విడిపోవటం అన్ని జీవరాసులకు జరుగుతూ ఉంటుందని తెలుసుకోవడం జ్ఞానం. అది లేనివారు అజ్ఞానులు. కనక తర తమ భేదాలు లేవనీ, ఏవైనా ఉన్నట్లు కన్పించినా అదంతా భ్రాంతి జన్యమని, తెలుసుకోవడం జ్ఞానం. ఈ జ్ఞానాన్ని కలిగి మరణించిన జీవులకు తిరిగి జన్మ ఉండదు. అట్లా లేని జీవులు తిరిగి జన్మిస్తాయి. ఇదే అద్వైత రహస్యం. ఇదే జ్ఞానానికి పరమావధి. సమత, సమానత్వం, మమత్వం ఏకత్వం, ఐక్యత—అన్నీ ఇక్కడ లభిస్తాయి. ఇదే ఉద్ధాలక—శ్వేతకేతు ఉపాఖ్యానం లోని విశేషార్థం. "తత్త్వమసి" అంటే శ్రీ శంకరులువారు చెప్పిన భాష్యాన్ని అనుసరించి పై విషయాలను వ్రాయడం జరిగింది.

## 3) తైత్తిరీయ ఉపనిషత్

తైత్తిరీయ ఉపనిషత్ కృష్ణయజుర్వేదానికి అనుబంధ గ్రంథం. ఇందులో మూడు వల్లిలు ఉన్నవి. అవి :

1) శిక్షావల్లి
2) ఆనందవల్లి
3) భృగువల్లి

వల్లి అంటే ఎగబ్రాకే తీగ అని అర్థం. ఈ వల్లిలను అధ్యయనం చేయడం వల్ల, అందులో ఉన్న విషయాలను ఆచరణలో పెట్టడం వల్ల మానవుడు పైకి ఎగబ్రాకే తీగలాగా ఆధ్యాత్మిక సోపానాలను అధిగమించి పైకి, పైపైకి, ఇంకా పైకిపోయి ఆనంద రసజగత్తులో ఉంటాడనేది ఈ ఉప

నిషత్ లోని సారాంశం. ఆనాడు ఉండే సాంఘిక పరిస్థితులను, విద్యా విధా నాన్ని, విద్యార్థులచేత ఎట్లాంటి ప్రమాణం చేయించేదో, వారి సత్ప్రవర్తనను తీర్చిదిద్దడానికి కావలసిన సంఘ నియమావళిని ఇందులో చూడవచ్చు.

సంఘ నియమావళి :

"త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి"
మనకు కనిపించేది అంతా బ్రహ్మ స్వరూపమే.

"బ్రహ్మ వదిష్యామి"
బ్రహ్మను గురించి తెలుసుకొందుముగాక

"ఋతం వదిష్యామి"
యథార్థాన్నే చెప్పుదుముగాక

"సత్యం వదిష్యామి"
సత్యాన్నే చెప్పుదుముగాక

తన్మామవతు ; తద్వక్తారమవతు ; అవతుమాం ;

అవతు వక్తారం ॥ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥
సత్యం, ధర్మం, ఋతాల స్వరూపమైన బ్రహ్మం
నన్ను రక్షించుగాక. నేను దానిచే రక్షణ పొందుదునుగాక.
ఓం శాంతి, ఓం శాంతి, ఓం శాంతిః

పైన చెప్పిన ప్రార్థనా మంత్రం సంఘంలో ఉండే సామాన్య మానవుని నైతిక ఆశయాన్ని తెలియచేస్తుంది.

వ్యక్తి నియమావళి :

స్వాధ్యాయం : ప్రవచనం— ఉపాధ్యాయుని లక్షణాలు.

ఆరోజుల్లో ఉండే సంఘ నియమావళిని గురించి తైత్తిరియ ఉపనిషత్

చెబుతుంది. అంతేగాకుండా ఏ విధమైన సంఘనియమావళి ఉంటే సంఘంలో అలజడులు రాకుండా ఉంటాయోకూడా తెలుపుతుంది. వ్యక్తి ధర్మాన్ని వ్యక్తి నిగ్రహాన్ని, వ్యక్తి ఏ విధంగా సహృదయుడవుతాడో ఇక్కడ మనం చూడవచ్చు. ముఖ్యంగా ఉపాధ్యాయుడు ఎట్లాంటి వాడుగా ఉండాలి ? విద్యార్థికి—ఉపాధ్యాయునికి ఏ విధమైన సంబంధం ఉంటుంది ? ఏ లక్షణాలనుకలిగి ఉంటే ఉపాధ్యాయుడు ఉపాధ్యాయుడుగా గుర్తించటం జరుగుతుంది ? సామాజిక ధర్మాన్ని లేదా సంఘ ధర్మాన్ని ఉపాధ్యాయుడు ఏ విధంగా నిర్వహిస్తాడు ?

ఈ ప్రశ్నలన్నింటికి తైత్తిరీయ ఉపనిషత్ లో మౌద్గల్య ? మహర్షి చెప్పిన సమాధానాలను చూద్దాం :

## మౌద్గల్య మహర్షి చెప్పిన ఉపాధ్యాయుల విధి

1. ఋతంచ స్వాధ్యాయ ప్రవచనేచ ॥
   ఋతం, అధ్యయనం, బోధించటం ఉపాధ్యాయుని విధి.

2. సత్యంచ స్వాధ్యాయ ప్రవచనేచ ॥
   సత్యం చెప్పటం, సత్యాన్ని ఆచరించటం, అధ్యయనం బోధన ఉపాధ్యాయుని విధి.

3. తపశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ ॥
   తపస్సు చేసుకొనటం, అధ్యయనం, బోధన ఉపాధ్యాయుని విధి.

4. దమశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ ॥
   దమము (మనస్సు) అంటే అంతరింద్రియ నిగ్రహం, బాహ్యేంద్రియ నిగ్రహం అధ్యయనం, బోధన ఉపాధ్యాయుని విధి.

5. శమశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ ॥
   శమం—అంటే కోపాన్ని నిగ్రహించుకొనటం అధ్యయనం, బోధన ఉపాధ్యాయుని విధి.

6. అగ్నియశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ ॥
అగ్నిని ఆరాధించటం, అధ్యయనం, బోధన ఉపాధ్యాయుని విధి.

7. అగ్ని హోత్రంచ స్వాధ్యాయ ప్రవచనేచ ॥
అగ్నిలో హోమాలు చేయటం, అధ్యయనం, బోధన ఉపాధ్యాయునివిధి.

8. అతిథ యశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ ॥
అతిథి అభ్యాగతులను ఆదరించి సత్కరించటం, అధ్యయనం, బోధన ఉపాధ్యాయుని విధి.

9. మానుషంచ స్వాధ్యాయ ప్రవచనేచ ॥
మానవుల యందు దయ, దాక్షిణ్యం, కరుణ, మైత్రి, నమ్రత, వినయం, అణకువ, శ్రద్ధతో ఉండటం.

10. ప్రజాచ స్వాధ్యాయ ప్రవచనేచ ॥
సంతానము పొందటం, అధ్యయనం, బోధన ఉపాధ్యాయుని విధి.

11. ప్రజనశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ ॥
ధర్మ విరుద్ధం కాకుండా సంసారము చేయటం, గృహస్థాశ్రమ ధర్మాలను సక్రమంగా నెరవేర్చటం, అధ్యయనం, బోధన ఉపాధ్యాయునివిధి.

12. ప్రజాతిశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ ॥
వంశ పారంపర్యమైన గౌరవాన్ని పరిరక్షించటం, అధ్యయనం, బోధన ఉపాధ్యాయుని విధి.

13. సత్యమితి సత్యవచస్ రాథీతర
సత్యవచన కాముడైన రాథీతరుని దృష్టిలో సత్యాన్ని చెప్పటం మాత్రమే ఉపాధ్యాయుని విధి.

14. తప ఇతి తపో నిత్యః పౌరుశిష్టిః ॥
పౌరులకు శిక్షణ ఇస్తూ ; తపోనిష్ఠ కలిగిన 'పౌరు శిష్టి' అనే మహర్షి దృష్టిలో తపస్సు చేసుకొనటం మాత్రమే ఉపాధ్యాయుని విధి

15. స్వాధ్యాయ ప్రవచనే ఏ వేతి నాకో మౌద్గల్యః ॥
అధ్యయనం, బోధన మాత్రమే ఉపాధ్యాయుని విధి అని నాక మౌద్గల్య మహర్షి అభిప్రాయం. ఎందుకంటే ఈ రెండూ — అంటే అధ్యయనం—బోధన—తపస్సుతో సమానం.

పైన చెప్పిన 15 నియమాలు ఉపాధ్యాయుని విధిని నిర్దేశిస్తాయి. ఆ లక్షణాలు ఉన్న వ్యక్తి ఉపాధ్యాయ పదవికి అర్హుడు. ఉపాధ్యాయుడు గృహస్థుడుగా ఉండాలని, ఆయన ఏ ధర్మం నెరవేరుస్తున్నప్పటికీ ప్రాధమిక ధర్మాలు స్వాధ్యాయ ప్రవచనాలని పద్మభూషణ ప్రాచార్య కొత్త సచ్చిదానందమూర్తి తన షష్ట్యబ్ది సన్మాన మహోత్సవంలో తత్త్వశాఖ విద్యార్థులకు చెప్పి వారిని ప్రబోధితులను చేయడం ఎంతో హర్షదాయకమైన విషయం.

తైత్తిరీయ ఉపనిషత్తు ఉపాధ్యాయుని విధిని గురించి, ఏమి చెప్పిందో తెలుసుకొన్నాం. ఈ విషయాలు సర్వసాధారణంగా ప్రతి ఉపాధ్యాయునికి వర్తిస్తాయి. అయితే ప్రత్యేకమైన శాస్త్రాలను అధ్యయనం చేసే ఉపాధ్యాయుని లక్షణాలు ఎట్లా ఉండాలో తెలుసుకొందాం. ఈవిషయాన్ని తెలుసుకోడానికి సర్వ మానవాళికి హితాన్ని, ఆరోగ్యాన్ని, ఆయుర్దాయాన్ని కలిగించే వైద్య శాస్త్రం ఎంతో ఉపయోగపడుతుంది. ఆయుర్వేదానికి మూలగ్రంథమైన చరక సంహిత వైద్యవిద్యను అధ్యయనం చేసే విద్యార్థిని గురించి దాన్ని బోధించే ఉపాధ్యాయుని గురించి ఏమి చెప్పిందో తెలుసుకొందాం.

## చరక సంహిత : ఉపాధ్యాయుని లక్షణాలు : విధులు.

పూర్వకాలంలో విద్యావిధానం ఎట్లా ఉండేది ? అది శాస్త్రీయంగా ఉండేదా లేక అశాస్త్రీయ పద్ధతులపై ఆధారపడి ఉండేదా ? ఉపాధ్యాయుని లక్షణాలు ఎట్లా ఉండాలి ? ప్రత్యేకమైన శాస్త్రాలను, విశేషమైన శాస్త్ర విజ్ఞానాన్ని బోధించే అధ్యాపకుని అర్హతలు, ఆయన జ్ఞానపు లోతులు, లోటుపాట్లు, ఆయన వ్యక్తిశీలం, చదువు చెప్పాలనే ఆరాటం ఆయనలో ఉన్నదా లేదా ?

మొదలయిన ప్రశ్నలకు సమాధానం కావాలంటే ఆరోజుల్లో విజ్ఞాన శాస్త్రాన్ని ప్రోత్సహించిన గ్రంథాల్లో ఈ ప్రశ్నలకు సమాధానం దొరుకుతుంది.

ఒక శాస్త్రవేత్త విధులు ఏమిటి ? ఆయన బాధ్యతలు ఏమిటి ? ఆయన అర్హతలు ఏమిటి ? మొదలయిన విషయాలు అన్నీ ఆయా అధ్యాపకుల కీర్తి ప్రతిష్ఠలను బట్టి ఉండేవి. ఉదాహరణకు తక్షశిల, నలంద, విక్రమశిల మొదలయిన విశ్వవిద్యాలయాచార్యుల ప్రతిభనువిని భారతదేశం నాలుగుమూలల నుంచి, ఖండాంతరాల నుంచి అనేకమంది విద్యార్థులు వచ్చి, ఆయా విశ్వ విద్యాలయాల్లో చేరి, తమ తమ అభిమాన శాస్త్రాలను అధ్యయనం చేసేవారు.

ఖగోళశాస్త్రం, నక్షత్రశాస్త్రం, రత్నశాస్త్రం, గణితశాస్త్రం, యుద్ధ తంత్రం, రాజనీతి,వ్యాకరణం, శిక్ష, నిరుక్తం, మీమాంస మొదలయిన విద్యలను ఆదరించేవారు. ముఖ్యంగా వాదవిద్య, హేతువిద్య, యుక్తివిద్య, తర్కవిద్య, వాణిజ్యవిద్య, దైవశాస్త్రం, దండనీతి, మొదలయిన విద్యలను కూడా అభ్యసించే వారు. అయితే ఇక్కడ ముఖ్యంగా మనం చూడవలసిన విషయాలు అనేకం ఉన్న ప్పటికీ కొన్నింటినే చూద్దాం.

అధ్యాపకుని అర్హతను, యోగ్యతను నిర్ణయించేది ఎవరు ? ఆయన అర్హతను, యోగ్యతను నిర్ణయించేదాన్ని 'పరిషత్' అంటారు. ఏ శాస్త్రానికి సంబంధించిన వ్యక్తి అయినా అతనికి ఒక సిద్ధాంతం ఉండాలి. దాన్ని ఆయన తర్కంతోను, హేతువుతోను, సప్రమాణంగాను సమర్థించాలి. అప్పటికే స్థిరపడిన సిద్ధాంతాలను విమర్శించడంకాని, ఖండించటంగాని లేదా సమర్థించటంగాని చేయ గల సామర్థ్యం నేర్పు ఉపాధ్యాయునిలో ఉండాలి. పరిషత్ సమావేశం పెట్టేంత వరకే రాజుకు అధికారం ఉంటుంది. పరిషత్ సమావేశమైన తరవాత చర్చ నీయాంశం నిర్ణయిస్తారు. ఎవరో ఒకరు సిద్ధాంత స్థాపన చేస్తారు. దీన్ని 'ప్రతిజ్ఞ' అంటారు. దాన్ని సమర్థించడానికి కొందరు, ఖండించి నిరాకరించ డానికి మరి కొందరు సన్నద్ధులవుతారు. ఇది ఏ ఇద్దరు వ్యక్తులమధ్యకూడా జరగవచ్చు. ఈ వాగ్వివాదం అంతా సంభాషణా చాతుర్యంతోను, వాక్ పటిష్టత

తోను, సరళంగానూ, అందరికీ అర్థమయ్యేలా చెప్పకలిగిన నేర్పుతోను ఉంటుంది.

ముఖ్యంగా వైద్యశాస్త్రంలోను, వేదాంతంలోను ఈ చర్చలు విపరీతంగా సాగుతూ ఉండేవి ఆరోజుల్లో. దేహం ముఖ్యమా ? ఆత్మ ముఖ్యమా ? సర్వధర్మాలను, అర్థాలను, కామాలను, మోక్షాన్ని సాధించాలంటే దేహం, దాని ఆరోగ్యం చాలా అవసరమని వైద్యులు చెప్పేవారు. అందుకే దేహపతనానంతరమే మోక్షం సిద్ధిస్తుందని వేదాంతులు చెప్పేవారు. ఒకరిది సిద్ధాంతమైతే మరొకరిది పూర్వపక్షం అయ్యేది. అందుకే వైద్యులు వారి వాదాన్ని సమర్థించడానికి కావలసిన తర్కాన్ని, వాదవిద్యను రూపొందించుకోవలసి వచ్చింది. అట్లాగే వైద్యవృత్తిని ఎవరు చేపట్టాలి ? వైద్యవిద్యను బోధించే ఆచార్యుని గుణగణాలు ఎట్లా ఉండాలి మొదలగు ప్రశ్నలను వారే వేసుకొని, ఆ ప్రశ్నలకు తగిన సమాధానాలను వారే చెప్పారు, అవన్నీ అగ్నివేశునిచేత పరిష్కృతమైన 'చరక సంహిత' అనే గ్రంథంలోపొందుపరచడమయింది. వాటినిగురించి సంక్షిప్తంగాతెలుసుకొందాం.

అగ్నిని ఆవాహనం చేసి, బ్రాహ్మణుల సమక్షంలోను, తదితర వైద్యుల సమక్షంలోను వైద్య విద్యను బోధించేవారిని, వైద్య వృత్తిని అవలంభించేవారి చేత ఆరోజుల్లో ఈ విధంగా ప్రమాణం చేయించేవారు.

1. బ్రహ్మచర్యాన్ని అవలంభించాలి. సత్యం చెప్పాలి. బుద్ధిని మనస్సును అధికం చేసే అన్నాన్ని మాత్రమే భుజించాలి.

2. రాజద్రోహాన్ని తలపెట్టకూడదు. గురువు ఆజ్ఞను జవదాటకూడదు. ప్రాణాపాయ పరిస్థితుల్లో తప్ప మిగతా పరిస్థితుల్లో సాంప్రదాయాన్ని, రాజాజ్ఞను, గురువాజ్ఞను, అంతర్వాణి ఆజ్ఞను జవదాటకూడదు.

3. తనకన్నా అధికులైన విజ్ఞులకు నమ్రతతో నమస్కరించాలి.

4. అహంకారం, దర్పం, గర్వం లేకుండా సహనంతో చిన్నా, పెద్ద, బీద, సాద, ధనికులు అనే తేడా లేకుండా వైద్యం చేయాలి.

5. వైద్యవృత్తిని చేస్తూ ధనం ఆర్జించవచ్చు. కాని అందులో కొంతభాగం ధర్మకార్యాలకు వినియోగించాలి.

6. ఏదోవిధంగా కాకుండా సశాస్త్రీయంగా రోగికి చికిత్స చేసి అతనికి తగిన ఊరట కలిగించాలి.

7. రోగులయందు చిరాకు, విసుగు, నిర్లక్ష్యం ఉండరాదు.

8. ముఖ్యంగా స్త్రీలను పరీక్షిస్తున్నప్పుడు,వారికి చికిత్స చేస్తున్నప్పుడు వారి ఆత్మాభిమానాన్ని చూరగొనాలి. అంతేగాని వారియందు వ్యామోహాన్ని కాని, విరక్తిని కాని పెంచుకోరాదు.

9. సురాపానం చేసి వైద్యం చేయరాదు. నీ దుస్తులు, నీ ఆహార వ్యవహార ప్రవర్తన, పైకి కనుపించే స్వరూపం, అంతర్గతంగా ఉండే భావ వీచికలు అన్నీ సౌమ్యంగా, ఆహ్లాదంగా, సరళంగా ఉండాలి.

10. పాపచరితులతో స్నేహం ఉండరాదు. పాపం చేయరాదు. వైద్యుని భాష, సంభాషణ—అంతా సత్య ధర్మంతో కలిసి ఉండాలి.

11. పూర్వానుభవాన్ని బట్టి వైద్యుని ప్రవర్తన, రీతి, సంచారం మొదలైనవి ఉండాలి.

12. రాజద్రోహులకు చికిత్సచేయరాదు. రాజు అనుమతి పొందిన తరవాతనే వారికి చికిత్స చేయాలి.

13. కపట ప్రవర్తన కలిగి ఉన్న వారికి చికిత్స చేయరాదు.

14. భర్తలు లేని తరుణంలోకాని, వారి సంరక్షకులు లేని సమయంలోకాని, స్త్రీలను ఏకాంత ప్రదేశంలో పరీక్ష చేయరాదు వైద్యం చేయరాదు. చికిత్స చేయరాదు.

15. ఏ స్త్రీ అయినా సంతోషం కొద్దీ ఇచ్చే బహుమానాన్ని అంగీకరించరాదు. ఒకవేళ తీసుకొన్నప్పటికీ ఆమె భర్త అంగీకారంతోనే తీసుకోవాలి.

16. రోగి కుటుంబ విషయాలు, రోగాన్ని గురించిన చరిత్ర, ఆయన అలవాట్లు, దురలవాట్లు అన్నీ వైద్యునితో చెప్పుకుంటాడు. ఈ విషయాలను ఎక్కడా చెప్పడంకానీ, విమర్శించడంకానీ చేయకూడదు. విద్వత్ సభల్లో రోగిపేరు, గోత్రం చెప్పకుండా ఆయా విషయాలమధ్య ఉండే కార్యకరణత సంబంధాన్ని చర్చించవచ్చు.

17. రోగికి మృత్యువు ఆసన్నమైనదని వైద్యునికి తెలిసినప్పటికీ దాన్ని ఆయన రోగికి కాని, ఆయన బంధువులకు కాని చెప్పరాదు. ఆ విషయాన్ని చెబితే తట్టుకొనే పెద్ద మనుషులు ఎవరైనా ఉంటే వారిని ఏకాంత ప్రదేశంలోకి తీసుకొనివెళ్ళి చెప్పాలి.

18. వైద్యుడు తన ప్రతిభను గురించి తాను ఎప్పుడూ చెప్పుకోకూడదు. సూర్యుని కాంతిలాగ అది దిగంతాలకు ప్రాకుతూ ఉంటుంది నిజంగా ఆయనే కనుక ప్రతిభావంతుడైనట్లయితే.

19. జీవిత రహస్యాన్ని గురించి అన్ని విషయాలూ ఏ ఒక్క వైద్యుడికీ తెలియవు. తెలిసిన విషయాలను మననం చేసుకొంటూ, వాటిని పెంచుకొంటూ వైద్య సేవలో గడిపిన వారు ధన్యులు.

20. వైద్యవృత్తిని, ఆయుర్దాయాన్ని, మందును గురించి శత్రువులు చెబితే సంశయించి పరీక్షించి తెలుసుకోవాలి. అవి నిజంగా సత్ఫలితాలనిస్తే వాటిని స్వీకరించవచ్చు.

ఈ విధంగా ఆత్మ తత్త్వం—దేహతత్త్వం—రెంటినీ గురించిన జ్ఞాన పిపాస మన ప్రాచీన సాంప్రదాయంలో కనిపిస్తుంది. ఆత్మను గురించి చెప్పిన గురువులను గురించి—

గురువు విష్ణువు
గురువు బ్రహ్మ

గురువు దేవుడు — అని చెప్పారు. అట్లాగే వైద్యుని గురించికూడా "వైద్యో నారాయణ హరిః" అనే నానుడి ఉంది.

శరీర తత్వాన్ని గురించి, దేహధర్మాలను గురించి, దేహ తత్వాన్ని గురించి వైద్యశాస్త్రం, కామశాస్త్రం, శృంగారశాస్త్రం, భరతనాట్య శాస్త్రం, యోగశాస్త్రం, తంత్రశాస్త్రం, ఆయుర్వేదం, అధర్వవేదం—అతి విపులంగా చెప్పారు. అయితే కొంతమంది ఈ శాస్త్రాలను చెప్పిన గురువులకన్నా ఆధ్యాత్మిక విద్యను బోధించిన గురువులకు ఎక్కువ ప్రాముఖ్యాన్ని ఇచ్చారు. అందుకే నేడు 'గురు' శబ్దానికి కొంత న్యూనత ఏర్పడింది. లౌకిక విద్యలను బోధించడంలో కొంతమంది అసమర్థులైన అధ్యాపకులు ఎట్లా అయితే ఉన్నారో, ఆధ్యాత్మిక విద్యను బోధించడంలో కూడా కొంతమంది వంచకులు లేకపోలేదు. సంసార సాగరాన్ని తరింప చేసేవాడు ఆధ్యాత్మిక గురువైతే, ఈ సంసార సాగరంలో హాయిగా జీవితాన్ని ఈదేవాడు లౌకిక గురువవుతాడు.

ఇంతవరకూ ఉపాధ్యాయుని లక్షణాలను, ఆయన నిర్వహించవలసిన విధులను గురించి తైత్తిరీయ ఉపనిషత్, ఇంకా ఆయుర్వేదానికి మూల గ్రంథమైన చరక సంహిత ఏమి చెప్పిందో తెలుసుకొన్నాం. ఇప్పుడు విద్యార్థి లక్షణాలను గురించి, అతని ఆశయాలను గురించి, విధినిర్వహణలో అతను చూపవలసిన కార్యదీక్షను గురించి ఈ రెండు గ్రంథాలు ఏమి చెప్పాయో చూద్దాం. ముందుగా తైత్తిరీయ ఉపనిషత్ చెప్పిన విషయాలను గురించి తెలుసు కొందాం.

## విద్యార్థి లక్షణాలు : ఆశయాలు : విధులు : తైత్తిరీయ ఉపనిషత్

బాల్య దశనుంచి విద్యార్థి దశకు వచ్చి పన్నెండు సంవత్సరాలు విద్యాభ్యాసం కొనసాగించి ఇరువై నాలుగు సంవత్సరాల వయసు వచ్చి పాఠశాలను, గురువుల ఆశ్రమాలను వదలి యాతనా ప్రపంచంలోకి అడుగు పెట్టే విద్యార్థి

లకు ఆ రోజుల్లో గురువులు చెప్పే హితవాక్యాలు లేక స్నాతకోత్సవహిత వాక్యాలు ఈ విధంగా ఉండేవి.

1. "సత్యం వద"
   సత్యాన్నే చెప్పు

2. ధర్మం చర
   ధర్మాన్నే ఆచరించు

3. స్వాధ్యాయాన్మా ప్రమదః
   నీవు నేర్చిన విద్యను అశ్రద్ధ చేయవద్దు

4. గురువుకు సంప్రీతికరమైన దక్షిణ ఇచ్చిన తరవాత గృహస్థాశ్రమం లోకి ప్రవేశించు.
   ఆ గృహస్థాశ్రమంలో :

5. సత్యాన్న ప్రమదితవ్యం ॥
   సత్యాన్ని ఆచరించడంలో అశ్రద్ధ చేయవద్దు

6. ధర్మాన్న ప్రమదితవ్యం ॥
   ధర్మాన్ని ఆచరించడంలో అశ్రద్ధ చేయవద్దు

7. కుశలాన్న ప్రమదితవ్యం ॥
   నీ యోగ క్షేమాలలో అంటే (అప్రాప్త వస్తుసేకరణ, ప్రాప్త వస్తు సంరక్షణ) లభించనిదాన్ని సేకరించటంలో లభించినదాన్ని సంరక్షించు కొనటంలో అశ్రద్ధ చేయవద్దు.

8. భూత్యైన్న ప్రమది తవ్యం ॥
   సంపదను సేకరించటంలో అశ్రద్ధ చేయవద్దు.

9. స్వాధ్యాయ ప్రవచనాభ్యాన్న ప్రమదితవ్యం ॥
నీవు నేర్చుకొన్న విద్యను ఇతరులకు చెప్పటంలో అశ్రద్ధ చేయకు

10. దేవ పితృ కార్యాభ్యాం న ప్రమది తవ్యం ॥
దేవతలకు, స్వర్గస్థులైన మాతాపితురలకు శ్రద్ధాంజలి ఘటించటంలో అశ్రద్ధ చేయవద్దు.

11. మాతృ దేవో భవ
నీ తల్లిని దేవతగా గౌరవించు.

12. పితృదేవో భవ ॥
నీ తండ్రిని దేవుడిగా గౌరవించు.

13. ఆచార్య దేవోభవ ॥
నీ ఆచార్యుని దేవునిగా గౌరవించు

14. అతిధి దేవో భవ ॥
అతిథులను దేవతలుగా గౌరవించు

15. అనింద్యమైన పనులను మాత్రమే చేయి.

16. నింద్యమైన కర్మలను చేయకు.

17. ప్రజా బాహుళ్యంలో సుచరితులుగ గణించే వారు చేసే పనులే చేయి

18. సుచరితులు కాని వారు చేసే పనులు చేయకు

19. సంఘంలో మనం అనేకమంది విద్వద్వరేణ్యులను శాస్త్రవేత్తలను, విజ్ఞాన వేత్తలను చూస్తాం. వారిపద్ద అణుకువగా మెలగాలి.

20. శ్రద్ధయా దేయం ॥
ఎవరికైనా ఏదైనా ఇచ్చేటప్పుడు శ్రద్ధతో ఇవ్వు. (సర్వాత్ర ఆస్తికత ఇతి శ్రద్ధః ॥) అని శంకరాచార్యుల వారు చెప్పారు.

21. అశ్రద్ధయా దేయం ॥
అశ్రద్ధతో ఏటీ ఎవరికీ ఇవ్వరాదు.

22. శ్రియా దేయం ॥
ఏది ఎవరికి ఇచ్చినా సంతోషంతో ఇవ్వు.

23. హ్రియా దేయం ॥
సవినయంగా ఇవ్వు.

24. భియా దేయం ॥
సంభ్రమాశ్చర్యాలతో,భయ భక్తులతో ఇవ్వు

25. సంవిదా దేయం ॥
కరుణ, నమ్రత, వినయం, శీలత, మైత్రితో ఇవ్వు.

పైన చెప్పిన విషయాలను రెండు రకాలైన బోధనల కింద విభజించి చూడవచ్చు. అవి :

(1) విధి వాక్యాలు (2) నిషిద్ధ వాక్యాలు.

## చరక సంహిత : విద్యార్థి లక్షణాలు : ఆశయాలు : విధులు

విద్యను ఆర్జించే వారందరూ విద్యార్థులు. మహనీయులనదగ్గ వారందరూ విద్య నర్జించిన వారే. సిద్ధార్ధ గౌతమ బుద్ధుడు ఆలారకాలాముని శిష్యుడు. శ్రీరామచంద్రుడు వసిష్ఠ — విశ్వామిత్రులను విద్యనర్జించాడు. శ్రీకృష్ణుడు సాందీపుని శిష్యుడు. భీష్ముడు పరశురాముని శిష్యుడు. దుర్యోధనుడు బలరాముని శిష్యుడు. శంకర భగవత్పాదులు గోవిందాచార్యుల వారి శిష్యుడు. ఏకలవ్యుడు ద్రోణుని శిష్యుడు. ఈ విధంగా ఎంతమందినైనా చెప్పవచ్చు.

అయితే ఇక్కడ చూడవలసిన విషయం ఏమిటంటే మన ప్రాచీన భారతీయ సాంప్రదాయంలో విద్యార్థి గురువును వెతుక్కుంటూ వెళ్ళి ఆయన

వద్ద చేరి విద్యనభ్యసించేవాడా ? లేదా ఆశ్రమాలు, పాఠశాలలు విద్యా కేంద్రాలు, విశ్వ విద్యాలయాలు స్థాపితమయి ఉంటే అక్కడికి వెళ్ళి విద్యనభ్యసించేవాడా ? లేక గురువుగారే యోగ్యమైన శిష్యుణ్ణి వెదుక్కుంటూ వెళ్ళి ఆయన తటస్థ పడగానే తన విద్యను ఆయనకు బోధించేవాడా ?—అనే ప్రశ్నలకు ఏ విధమైన ఏకపక్ష సమాధానం చాలా సంక్షిప్తంగా, సత్యదూరంగా ఉంటుంది.

కాని ఒక్క విషయం మాత్రం సత్యం. విద్యార్థి యోగ్యతను, అర్హతను, గుణ గణాలను, వంశాన్ని, వర్ణాన్ని బట్టి, ప్రతిభను బట్టి విద్యా దానం చేసిన గురువులు, వారు నేర్చుకొన్న విద్యకు ఘనంగా ప్రతిఫలం సమర్పించిన శిష్యులు మన దేశ విద్యా చరిత్రలో ఉన్నారు.

ఒక శాస్త్రాన్ని, లేక ఒక ప్రత్యేకమైన విద్యను అభ్యసించాలంటే దానికి కావలసిన అర్హతలను, యోగ్యతను నిర్ణయించేదెవరు ? ప్రభుత్వమా ? విద్యా వేత్తలా ? (రాజా ? గురువా ?) అసలు విద్యా స్వాతంత్ర్యం అంటే ఏమిటి ? ఏఏ గుణాలు, అర్హతలు ఉన్నవారు, ఏఏ విద్యలను అభ్యసించాలి ? ఈ ప్రశ్నలన్నిటికీ మన ప్రాచీన గ్రంథాల్లో సమాధానాలు లభ్యం అవుతాయి. అందులో కొన్ని నేటి సమాజానికి సరిపోవచ్చు. కొన్ని సరిపోకపోవచ్చు. ఏది ఎట్లున్నా వారు ఇటువంటి ప్రశ్నలు అడగటం, వాటికి సమాధానం చెప్పడం అనేది వారి ఉదారతను, విశాలబుద్ధిని సూచిస్తుంది. ఐతే ఒక శాస్త్రకారుడు చెప్పిన విషయాన్ని మరొక శాస్త్రకారుడు అంగీకరించలేదు. ఆయా శాస్త్రాలకు కావలసిన అర్హతలను, యోగ్యతలను, ఆయా శాస్త్రాధిపతులే నిర్ణయించేవారే కాని ప్రభుత్వం జోక్యం ఉండేది కాదు.

అంతే గాకుండా పూర్వపు రోజుల్లో విద్యార్థి ఒక విచిత్రమైన పరిస్థితిని ఎదుర్కోవలసి వచ్చేది. దాన్ని "ఆచార్య ముష్టి" అంటారు. అంటే ఒకానొక గురువు దగ్గర ప్రత్యేకమైన విద్యను గురించిన విశేష జ్ఞానం ఉండేది. అది ఆయన అందరికీ చెప్పేవాడు కాదు. తన దగ్గర ఉన్నదాన్ని ఇతరులకు చెప్ప డానికి నిరాకరించినందువల్ల, ఆ విద్య ఆయనతోనే అంతమొందేది. అందువల్ల

అనేకమైనవిద్యలు భారతదేశంలో నశించిపోయాయి. ఉదాహరణకు సర్పవిద్య, మంత్రవిద్య, మాన్త్రికవిద్య, తంత్రవిద్య, ధనుర్విద్య మొదలైనవి దాదాపు నామమాత్రంగానే మిగిలి ఉన్నాయి. అటువంటప్పుడు విద్యార్థి చేయవలసింది ఏమిటి అని ప్రశ్నించారు మన పూర్వులు. వారు చెప్పిన సమాధానాన్ని చూద్దాం.

1. ఏదైనా ఒక ప్రత్యేకమైన శాస్త్రాన్ని అభ్యసించదలచిన విద్యార్థి తన అభిమాన శాస్త్రంలో ఉన్న గ్రంథాలను ముందుగా సేకరించాలి. అట్లా ఈ రోజుల్లో ఎంతమంది విద్యార్థులవద్ద వారి వారి చదువులకు కావలసిన గ్రంథాలు ఉన్నాయి?

2. ఎంతమంది విద్యార్థులకు విద్యలో సరైన ఆసక్తి, గ్రహణశక్తి ఉన్నది? లేని విద్యార్థుల బాగోగులకోసం అధ్యాపకులు చేస్తున్న కృషి ఏమిటి? అది ఎంత చిత్తశుద్ధితో చేస్తున్నారు?

3. విద్య అందరికీ అవసరమే. అయితే వైద్యశాస్త్రాన్ని చదవడానికి కొన్ని అర్హతలు లేనివారు దాన్ని చదవరాదని పూర్వం నిషేధించారు. ఉదాహరణకు, వైద్యవృత్తి సేవాధర్మంగా భావించనివారు, అది నీచవృత్తి అని భావించేవారు వైద్య విద్యను చదువరాదు.

4. అదే విధంగా వికలాంగులను గురించి వైద్యశాస్త్రం, మంత్రశాస్త్రం అనేకమైన నిషేధాలు పెట్టాయి. ముఖ్యంగా శస్త్ర చికిత్స చేయడానికి వికలాంగుడు పనికిరాడని చరక సంహిత, శుశ్రుత సంహిత చెబుతాయి. అంత మాత్రాన వారిమీద వారికి దయలేదనికాని, లేక శాస్త్రకారులు నిర్దయులని భావించరాదు. ఏదైనా ఒక శాస్త్రం అభివృద్ధి చెందుతూ ఉంటే అది కొన్ని నిషేధాలున్నప్పుడు మాత్రమే పురోగమించగలదు. ఈ భావనతోనే ప్రతి శాస్త్రం కొన్ని నిషిద్ధాలు ప్రవేశ పెట్టింది.

ప్రతి విద్యార్థి శాంతి కాముకుడుగా ఉండాలి. అల్పమైన బుద్ధి లేకుండా, నీచమైన లేదా హేయ ప్రవర్తన లేకుండా ఉండాలి.

6 దృఢ శరీరుడై, చక్కని వాగ్ధాటిని, మంచి చూపును, అవయవ పుష్టిని కలిగి ఉండాలి.

7. ప్రతిరోజు వ్యాయామం చేయాలి. అతని దినచర్య నిందాయుతంగా ఉండరాదు.

సంఘనీతి, వ్యక్తిధర్మం, వ్యక్తి బాధ్యత మొదలయిన లౌకిక ధర్మాలను మనం విస్మరించామని, అలౌకిక విలువలకే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చామని కొందరు విమర్శకులు భావిస్తారు. అంతేగాకుండా అన్ని వర్ణాలవారికి విద్య చెప్పకుండా, కొద్దిమందికి మాత్రమే విద్య చెప్పేవారనికూడా మన విద్యా చారిత్రకులు అభిప్రాయ పడ్డారు. వీటిలో కొంత సత్యం లేకపోలేదు. కాని విద్యపై కొన్ని వర్గాలవారుకాని, కొన్ని వర్ణాలవారు కాని గుత్తాధిపత్యం వహించారనడం కొంతమట్టుకు ఏకపక్ష వాదం అవుతుంది. ఆ రోజుల్లో విద్యార్థి ప్రతిభ, గోత్రం, వంశం, వర్ణం, కార్యదీక్ష ఇత్యాదులన్నింటినీ చూసి విద్యార్థిగా చేర్చుకొనేవారు. కేవలం కులాన్ని చూసి విద్యార్థిగా చేర్చుకొనేవారు అనేదికూడా సంక్షిప్తమైన వాదంగా కన్పిస్తుంది. సత్యవాక్పరిపాలనకు ప్రాముఖ్యం ఇచ్చే వారు. సత్యదీక్ష, కార్య నిర్వహణదీక్ష, శ్రద్ధ గురువుపట్ల భక్తి విశ్వాసం, అణకువ, నమ్రత, శీలం, బ్రహ్మచర్యం, చదువులో శ్రద్ధాసక్తులు మొదలయిన గుణాలకు ప్రాముఖ్యం ఇచ్చారు.

మార్మిక విద్యలు, బ్రహ్మవిద్య, క్షుద్ర విద్యలు, యోగవిద్య, తంత్ర విద్య, రసాయనక విద్య, మంత్ర విద్య మొదలయిన విద్యలను నేర్పడానికి విద్యార్థుల ప్రతిభ, గుణగణాలను ముఖ్యంగా పరీక్షించి చూసేవారు. మహా భారతంలో, యమధర్మశాస్త్రంలో, గృహ్యసూత్రాల్లో బ్రహ్మచర్యాన్ని గురించి అనేకమైన విషయాలు ఉన్నాయి. అయితే అందులో కొన్ని నేటి సమాజానికి వర్తించక పోవచ్చు. అంతమాత్రాన ఆయా సిద్ధాంతాలు నేటి నవనాగరక యువతకు పనికిరావని చెప్పలేం. విజ్ఞాన శాస్త్రాలతోపాటు ఇతరుల సంస్కృతీ నాగరికతలను కూడ నేటి యువలోకం అప్పు పుచ్చుకుంటు ఉన్నది. అది

భారంగా, అతికినట్లుగా, ఏదో మనది కానట్లుగా అంతర్గతంలో ఉంటుంది. మన ప్రాచీన విశ్వాసాలు, సమ్మకాలు, ఆచారాలు నేటి విద్యార్థి పూర్తిగా అంగీకరించ లేదు ; పూర్తిగా వాటిని వదలివేయలేదు. సంస్కారపరమైన శూన్యతలో నేటి యువత ఉన్నట్లు కనిపిస్తుంది.

అందుకే విద్యావేత్తలు, విద్యావంతులు, విద్యార్థులు—అందరూ కలసి ఏ విధమైన విద్యాసంస్కృతి, ఏ విధమైన విద్యావిధానం, బోధనా విధానం ఉంటే మన యువత సజీవమైన శక్తిగా రూపొందుతుందో ఆలోచించవలసిన తరుణం ఇది.

అటువంటి సమావేశాలు అక్కడక్కడ జరుగుతూనే ఉన్నాయి. అయితే ఆయా సమావేశాల్లో తీర్మానం చేసే విషయాలు కార్యరూపం దాల్చిననాడు నేడు విద్యారంగాన్ని ఆవహించిన నిస్తేజం నుంచి విద్యార్థులు, అధ్యాపకులు బయట పడలేరు. నేటి అధ్యాపకుల్లో సర్ రాధాకృష్ణన్ వంటివారు, సర్ సి. వి. రామన్ వంటివారు అరుదుగా ఎందుకు ఉన్నారు. ఉన్నత విద్యకై భారత ప్రభుత్వం ఖర్చు పెడుతున్న కోట్ల రూపాయలు ఎంతవరకు సద్వినియోగం అవుతున్నాయి ? వైజ్ఞానిక రంగంలో కాని, పారిశ్రామిక రంగంలో కాని, పరిశోధనా రంగంలో కాని, వైద్యవిద్యలో కాని మనం ఎంతవరకు ముందంజ వేశాం ? ఈ ప్రశ్నలను సంఘం వేయదు. ఆత్మగౌరవమున్న ప్రతి విద్యార్థి, ప్రతి అధ్యాపకుడు, ప్రతి పరిశోధకుడు తనకు తానై ప్రశ్నించుకోవాలి. సమాధానాన్ని రాబట్టుకోవాలి అంతేగాని విద్యారంగాన్ని మరెవరో వచ్చి చక్కదిద్దుతారనే ఆశతో ఉండరాదు. "విద్వాన్ సర్వత్ర పూజ్యతే" అను నానుడి గుర్తుకు తెచ్చుకొని, ప్రతి విద్యార్థి అధ్యాపకుడు ఆత్మ పరిశీలన చేసుకోవాలని చరక సంహిత చెబుతుంది.

## భృగు-వారుణీ విద్య : అన్నం యొక్క గొప్పదనం

వేదాంతం అంటే కేవలం ఆధ్యాత్మ చింతనతో కూడిఉన్న, విషయాలను గురించి తెలుసుకొనడం మాత్రమే అని చాలామంది అనుకొంటారు.

కాని వేదాంతానికి మూల గ్రంథాలైన ఉపనిషత్తులను పరిశీలించి చూసినట్లయితే ఇక్కడ ఆధ్యాత్మ చింతనకు ఎక్కువ ప్రాముఖ్యాన్ని ఇచ్చారనడంలో ఎంత మాత్రం సందేహం లేదు. కాని ఈ ఉపనిషత్తుల్లో ఉన్న విద్యలు రెండు రకాలు. అవి : (1) పారలౌకిక దృక్పథాన్ని కల్పించే విద్యలు, (2) లౌకిక విద్యలు. మంత్రద్రష్టలైన ఉపనిషత్ మహర్షులు ఈ రెండు రకాలైన విద్యలను చెప్పారు. భార్గవీ—వారుణీ విద్యల్లో, భృగు—వారుణీ విద్యల్లో అతి ప్రాముఖ్యమైన లౌకిక విద్య (అన్న ప్రాశస్త్య విద్య) ఉన్నది. దాని గురించి తెలుసుకొందాం.

## అన్నం గొప్పదనం

అన్నం లోనుంచి సమస్తమైన జీవులు ఉద్భవిస్తాయి, అన్నంచేతనే అవి అభివృద్ధి చెందుతాయి, అన్నం పంచభూతాలకన్నా గొప్పది, అన్నం సర్వ ఔషధులు చేసే పని చేస్తుంది, అన్నాన్ని వృథా చేయరాదు, అన్నాన్ని సమృద్ధిగా పండించాలి, అన్నాన్ని నిందించరాదు, సమృద్ధిగా అన్నాన్ని పండించే రాష్ట్రాలు ఇతర దేశాలకు ఇవ్వాలి, దేశంలో పండిన ఆహార ధాన్యాలు అందరికీ అందుబాటులో ఉండాలి అని ఈ ఉపనిషత్ చెబుతుంది. దీన్నే అన్నమంత్రంగా బ్రాహ్మణులు పితృ కార్యాలలో చెబుతారు. ఆ మంత్రం సారాంశాన్ని చూద్దాం.

## అన్నమంత్రం సారాంశం

"అన్నం బ్రహ్మస్వరూపం

ఎందుకంటే సమస్తమైన జీవులు అన్నరసం లోనుంచే ఉద్భవిస్తాయి. అన్నరసం వల్ల సర్వజీవులు జీవిస్తాయి. మరణానంతరం జీవరాసులు అన్నీ అన్నంలోనే లయమవుతాయి."

అంతే కాకుండా ప్రతి పౌరుడు, ప్రతి గృహస్థు ఆహార సమృద్ధికోసం ఆహార సంతుష్టి కోసం, పోషకాహారాన్ని భుజించటానికి కావలసిన నియమావళిని కూడా తైత్తిరీయ ఉపనిషత్ సూచిస్తుంది. ఉదాహరణకు :

"అన్నం న నింద్యాత్ ॥ తద్వ్రతం ॥"

అన్నాన్ని నిందించకు. ఇది నీ వ్రతం.

"ప్రాణోవా అన్నం"

"ప్రాణమంటే ఏమిటనుకున్నావు ? ప్రాణమంటే అన్న రసమయం.

"శరీర మన్నాదం"

ఈ అన్నాన్ని తినేదెవరు ? శరీరమే అన్నాన్ని తింటుంది.

ప్రాణే శరీరం ప్రతిష్ఠితం ॥

అయితే ఈ శరీరం ఎక్కడ ప్రతిష్ఠాపితమై ఉన్నది ?

ఈ శరీరం ప్రాణంలో ప్రతిష్ఠాపితమై ఉన్నది.

"తదేత దన్నమన్నే ప్రతిష్ఠితం ॥"

అయితే ఈ ప్రాణం ఎక్కడ ప్రతిష్ఠితమై ఉన్నది ?

ఈ ప్రాణం శరీరంలోనే ప్రతిష్ఠితమై ఉన్నది. అంటే, అన్న రసం లోనుంచి శరీరం వస్తుంది. ఆ శరీరంలో ప్రాణం ప్రతిష్ఠానమై ఉంటుంది కాబట్టి అన్నం — అన్నంలోనే ప్రతిష్ఠానమై ఉంటుంది. అంటే అన్నంలోనుంచే అన్నం వస్తుంది. ఈ రహస్యాన్ని తెలుసుకొన్నవారు మహానుభావులవుతారు వారికి పశు సంపద, సంతానవృద్ధి, బ్రహ్మవర్చస్సు, మహాకీర్తి లభిస్తాయి.

అన్నం న పరిచక్షీత ॥ తద్వ్రతం ॥

అన్నాన్ని పారవేయకూడదు. అన్నాన్ని వృధా చేయరాదు. అని చెబుత ఈ ఉపనిషత్ పొదుపు ఉద్యమాన్ని సూచించడమేగాక నేటి 5 స్టా హోటళ్ళలో, అనేక పార్టీ విందుల్లో జరిగే వృధా వ్యయాన్ని పరోక్షంగా ని శించిందా అని అనిపిస్తుంది. విందులు. వినోదాల పేరిట ఆ రోజుల్లో రాజుల వణిక్ పుత్రులు, యజ్ఞ యాగాల పేరిట ప్రజాధనం వృధా అవుతున్నద

గ్రహించి భృగువు **"అన్నాన్ని వృథా చేయనని"** ఆ రోజుల్లో ప్రతి గృహస్థు చేత ప్రమాణం చేయించినట్లు ఈ కథ ద్వారా మనకు తెలుస్తుంది.

అన్నం = శరీరం = ప్రాణం = అన్నం.

"అన్నం బహు కుర్వీత ॥ తద్వ్రతం ॥"

అన్నాన్ని సమృద్ధిగానూ, అధికంగానూ పండించాలి. భూమిలోనుంచి అన్నం వస్తుంది. ఆకాశం లోనుంచి అన్నం వస్తుంది. నీళ్ళలోనుంచి అన్నం వస్తుంది. అన్నం సమృద్ధిగా ఉన్నప్పుడు, అన్నాన్ని అధికంగా పండించినప్పుడు కరువు కాటకాలు, దుర్భిక్షం, కొరత, లేమి ఉండవు. అంటే అన్నం సమృద్ధిగా ఉన్నప్పుడు అతిథులను,బంధువులను, స్నేహితులను సాదరంగా గౌరవించవచ్చు.

మనం భుజించిన అన్నరసం ప్రాణంగా మారుతుంది. ఆ ప్రాణం శక్తి రూపంగా మారుతుంది. మనకు మాట్లాడే శక్తి ఇచ్చేది అన్నమే. మనం ఒక చోటనుంచి మరొక చోటికి కదలి వెళ్ళడానికి ఉపయోగపడే కాళ్ళల్లోని శక్తి అన్నరసం వల్ల కలుగుతుంది. మన కళ్ళల్లో ఉండే కాంతి అన్నరసం వల్ల కలుగుతుంది. ఉచ్ఛ్వాస నిశ్వాసలు అన్నం వల్ల కలుగుతాయి. మల మూత్రాలు అన్నరసం వల్ల కలుగుతాయి. ఈ విధంగా మనం భుజించే అన్నం మనకు ప్రాణాన్ని ఇస్తుంది.

ఈ అన్నమే దైవ సంబంధంగా ఆకాశంలో వర్షరూపేణ ఘనీభవించి ఉంటుంది. విద్యుత్ రూపంలో మెరుపు తీగలో ఉంటుంది. జ్యోతి రూపంలో నక్షత్రాల్లో ఉంటుంది. ఈ అన్నం దర్పరూపంలో పశువుల్లో ఉంటుంది. ఈ అన్నం మానవ, జంతు జననాంగాల్లో ఆనంద రూపంలో ఉంటుంది.

కనక ఈ అన్న స్వరూపం సర్వే సర్వత్రా వ్యాపించి ఉన్నదని గుర్తించి దాన్ని సక్రమంగా వినియోగించుకోవాలి. దాని స్థూలరూపాన్ని ఎక్కువగా పండించాలి. దాని సూక్ష్మ రూపాన్ని మితంగా భుజించాలి. అన్నం ప్రాథమిక అంశమని గుర్తించి దాన్ని ఉపాసించినవారు మహానుభావులు అవు

తారు. అన్నాన్ని మానసీయమైన పదార్థంగా గుర్తించినవారు మానసీయులు అవుతారు.

## పంచకోశ సిద్ధాంతం

సమస్తమైన జీవరాసుల్లోను అయిదు కోశాలుంటాయి. అవి :

1. అన్నమయకోశం
2. ప్రాణమయకోశం
3. మనోమయకోశం
4. విజ్ఞానమయకోశం
5. ఆనందమయకోశం

## 1. అన్నమయకోశం అంటే ఏమిటి ?

మయం అంటే ఆధిక్యత, ఎక్కువ అని అర్థం. తైత్తిరీయ ఉపనిషత్తులో ఆనందవల్లి అధ్యాయంలో భృగువారుణీ విద్యల్లో ఈ పంచకోశ సిద్ధాంతాన్ని గురించి ఉన్నది. దాని సారాంశాన్ని చూద్దాం.

"ఆత్మలోనుంచి ఆకాశం వచ్చింది. ఆకాశంలోనుంచి వాయువు సంభవించింది. వాయువులోనుంచి అగ్ని సంభవించింది. అగ్నిలోనుంచి నీళ్ళు వచ్చాయి. నీళ్ళల్లోనుంచి పృథ్వి వచ్చింది. పృథ్విలోనుంచి ఓషధులు వచ్చాయి. ఓషధులనుంచి అన్నం వచ్చింది. అన్నంలోనుంచి ఇంద్రియం, వీర్యం, బీజం సంభూతమయ్యాయి. వీర్యంలోనుంచి పురుషుడు (అంటే ప్రాణికోటి) సంభూతమైంది." ఈ విషయాన్నే ఉపనిషత్ ఈ విధంగా చెప్పింది.

ఆత్మన ఆకాశస్సంభూతః ॥
ఆకాశా ద్వాయుః ॥
వాయో రగ్నిః ॥

అగ్నే రాపః ॥
అద్భ్యః పృథివీ ॥
పృథివ్యా ఓషధయః ॥
ఓషధీ భ్యోఽన్నః ॥
అన్నాత్ పురుషః ॥

పంచకోశాలు ప్రాణిలో ఈ విధంగా ఉంటాయి :

ఆనందమయ కోశం

విజ్ఞానమయ కోశం
మనోమయ కోశం
ప్రాణమయ కోశం
అన్నమయ కోశం

ఈ అన్నంలోనుంచే సమస్తమైన జీవరాసులు జన్మిస్తాయి. ఈ భూమి మీద ఉన్న సమస్తమైన జీవరాసులకు అన్నమే ప్రాణాధారం. అన్నంలోనుంచి భూతరాసులు ఉద్భవించి, అన్నంచేత వర్థిల్లడమయి, మరణానంతరం (మరొక ప్రాణికి) అవి అన్నంగా మారతాయి. (ఇక్కడ నైట్రోజన్ సర్కిల్‌ను వారు ఊహించారా !) అన్నరసం శిరస్సు నుంచి కాలి పాదం చివరి గోరు వరకు వ్యాపించి ఉంటుంది. ఇది భౌతికంగా, స్థూలంగా ఉంటుంది. ఇది శరీరమంతా వ్యాపించి ఒక కోశం (సంచి, తిత్తి)లాగా ఉంటుంది.

## ప్రాణమయ కోశమంటే ఏమిటి ?

అన్నమయ కోశానికి భిన్నంగా ప్రాణమయ కోశం ఉంటుంది. గాలితో నింపబడిన ఒక తిత్తితో గాలి ఎట్లా అయితే అంతటా వ్యాపించి ఉంటుందో అదే విధంగా "అన్యోంతర అత్మ" ప్రాణమయ స్వరూపంలో శరీరమంతటా ఉంటుంది. మనుష్యులు, పశువులు, పక్షులు, జలచరాలు, వృక్షాలు అన్నీకూడా ప్రాణమయ కోశాన్ని కలిగి ఉంటాయి.

ప్రాణోహి భూతా నామాయుః ॥

ప్రాణమే సమస్తమైన భూతాలకు ఆయుర్దాయం ఈ ప్రాణం లేనిది ఏ భూతం జీవించలేదు. ఇది ఉచ్ఛ్వాస నిశ్వాసాల రూపంలో అన్ని జీవుల్లో ఉంటుంది.

## మనోమయ కోశం అంటే ఏమిటి ?

ప్రాణమయ కోశంలో అంతర్లీనంగా మనోమయ కోశం ఉంటుంది. సమస్తమైన దేహ—ఇంద్రియ కార్యక్రమాలను మనస్సు ఆదేశిస్తూ ఉంటుంది. ఈ మనస్సు సంకల్పానికి, వికల్పానికి కేంద్రం. బుద్ధి, అంతకరణం, చిత్తం, అహంకారం ఇత్యాదులన్నీ అంతరంగంలో ఉండే ఇంద్రియాలు. శరీరం అంతా వాటి అధీనంలో ఉంటుంది. శరీరం — మనస్సు ఈ రెంటిమధ్యా ఒక సమన్వయం, సదవగాహన అవసరం. అది లోపించినప్పుడు శరీరం వ్యాధిగ్రస్త మవుతుంది. అట్లా కాకుండా కేవలం శరీరానికి మాత్రమే పరిమితం అయ్యే రోగాలు కొన్ని ఉన్నాయి. అదే విధంగా కేవలం మనస్సుకు మాత్రమే పరిమితం అయ్యే రోగాలు ఉన్నాయి. వాటికి చికిత్స ఉన్నా ఒకసారి మనస్సు రోగానికి లోనయితే అది చిట్లిపోయిన మట్టికుండతో సమానం. అందుకే మనస్సును సంయమనంలో ఉంచుకోమంటారు యోగులు.

## విజ్ఞానమయ కోశం అంటే ఏమిటి ?

అంతరింద్రియంగా ఉంటూ స్వసంవేదనను పొందుతూ, మంచి చెడ్డలను గురించి చెబుతూ ఉంటుంది. బాహ్య ప్రపంచానికి నియమితమై మనస్సు ఉంటే, అంతర్గతంగా ఉండే భావ ప్రపంచానికి వర్తిస్తుంది విజ్ఞానమయ కోశం. శ్రద్ధ, ధ్యానం, అంతర్బుద్ధి మొదలయిన వాటిని పెంపొందించుకోవడం ద్వారా విజ్ఞాన మయ ఆత్మ స్వయం ప్రకాశంగా ఉంటుంది. అటువంటప్పుడు ఆధ్యాత్మిక విషయాలు అవగతం అవుతాయి.

## ఆనందమయ కోశం అంటే ఏమిటి ?

పిపీలికాది బ్రహ్మ పర్యంతం ఆనందం కోసం ప్రయత్నిస్తాయి. ఆనంద రసాన్ని మించింది లేదు. ఇక్కడ సాధారణంగా మనం వాడే భాషకాని, మాటలుకాని పని చేయవు. 'ఆనందో బ్రహ్మ' అని వేదం చెబుతుంది. ఈ ఆనందంలో తారతమ్యం ఉన్నది. లౌకికానందం వేరు, అలౌకికానందం వేరు. అయితే సమస్తమైన జీవరాసులు ఆనందంలో పాలుపంచుకొంటాయి.

## ఆనంద తారతమ్యం

ఆరోగ్యాన్ని కలిగిఉండి, సమస్తమైన సంపదలతో తులతూగుతూ వాటిని అనుభవించటం మానవునికి పరమానందాన్ని ఇస్తుంది. ఈ ఆనందానికి వందరెట్లు పితృలోకపు అనందం ఉంటుంది. దానికి వందరెట్లు దేవలోకపు ఆనందం ఉంటుంది దానికి వందరెట్లు ప్రజాపతిలోకపు ఆనందం ఉంటుంది. దానికి వంద రెట్లు బ్రహ్మలోకపు ఆనందం ఉంటుంది. వర్ణనకు అతీతంగా కేవలం తాదాత్మ్య భావంతో బ్రహ్మ—ఆత్మ ఐక్యతతోఉన్న ఆనందం ఉంటుంది అది అనిర్వాచ నీయం. కాని అనుభవానికి అందుబాటులో ఉంటుంది.

"అన్నం వై బ్రహ్మ"—(అన్నం బ్రహ్మస్వరూపం) అనే సూక్తితో మొదలు పెట్టి "ఆనందో వై బ్రహ్మ"—అనే సూక్తితో ఉపనిషత్తులు తమ సిద్ధాంతాన్ని ముగిస్తాయి. ఈ రెంటికీ మధ్య ఉండే ఆనంద తారతమ్యాన్ని, అవస్థలను మాన వుడు గ్రహించాలి. మానవుడు నూరు సంవత్సరాల పరిమితంగా జీవిస్తాడు. అందులో 50 సంవత్సరాలు నిద్రపోతాడు. మిగిలిన 50 సంవత్సరాల్లో 10 సంవత్సరాలు బాల్య చాపల్యంతో గడుపుతాడు. మిగతా కాలాన్ని అర్థాన్ని, కామాన్ని సముపార్జించడానికై వెచ్చించమని ఉపనిషత్తులు చెబుతాయి. కాని అట్లా సంపాదించే అర్థం, కామం—ఈ రెండూ ధర్మ సమ్మతింగా ఉండా లన్నారు. ప్రతి మానవుడు దయ, దానం, ధర్మం కలిగి ఉండాలి. ఇష్టమొచ్చి నంత ధర్మయుతంగా సంపాదించి స్వేచ్ఛగా అనుభవించి, మిగిలించి ఇతరు

లకు—అంటే పేదలకు, అవసరం ఉన్నవారికీ ఇవ్వమని ఉపనిషత్తుల సందేశ అంతేగాని దాచుకోమని వారు చెప్పలేదు. ఇతరులకు ఇస్తే అయిపోతుంద తత్వాన్ని వారు బోధించలేదు. ఇతరులకు ఇస్తే పుణ్యం వస్తుంది. పునర్జన్మలో దాన్ని మరలా అనుభవించవచ్చు అన్నారు వారు.

## 4) బృహదారణ్యక ఉపనిషత్

యజుర్వేదంలో రెండు భాగాలు ఉన్నాయి. అవి :

1) కృష్ణ యజుర్వేదం 2) శుక్ల యజుర్వేదం. బృహదారణ్యక ఉపనిషత్ శుక్లయజుర్వేదంలో ఒక భాగం. ఇందులో మూడు కాండలు ఉన్నవి. అవి :

1) మధుకాండం
2) యాజ్ఞవల్క్య కాండం
3) ఖిలకాండం (శిథిలమైన కాండం)

ఈ మూడు కాండలు మళ్ళీ ఆరు అధ్యాయాల్లోకి, ప్రతి అధ్యాయం కొన్ని బ్రాహ్మణాల్లోకి విభజింపబడి ఉన్నవి.

## మధుకాండలోని విశేషాలు :

అశ్వమేధయాగం ఎట్లా నిర్వహించవలసిందీ, ప్రాణవాయువు ప్రాముఖ్యం, 'అహం బ్రహ్మాస్మి' అనే మహా వాక్యార్థ వివరణ, మనస్సు, వాక్కు, ప్రాణం మానవ శరీరంలో ఏవిధంగా ఏర్పడేది ఇందులోని ప్రథమాధ్యాయం విశేషాలు. రెండో అధ్యాయంలో అజాతశత్రు—బాలాకి గార్గ్య సంవాదం ఉన్నది. నిద్ర పోయేటప్పుడు చైతన్యం (విజ్ఞానమయ పురుషుడు) ఏమవుతాడు? నిద్రావస్థలో శరీరాన్ని వదలివెళ్ళిన చైతన్యం నిద్రనుండి మేల్కొనగానే శరీరంలోకి ఎట్లా ప్రవేశిస్తుంది—మొదలయిన విషయాలు ఉన్నాయి.

## యాజ్ఞవల్క్యకాండ బ్రహ్మవిద్యను గురించి చెబుతుంది

ఇందులో అనేక విషయాలను గురించిన చర్చలు ఉన్నప్పటికీ, నాలుగు సంవాదాలే ముఖ్యమైనవి. వాటిని గురించి తెలుసుకొంటే ఈ ఉపనిషత్‌లోని సారాంశం తెలిసినట్లే. ఆ నాలుగు సంవాదాలు :

1) విదేహరాజైన జనకుని సభలో జరిగిన సంవాదం
2) మైత్రేయ–యాజ్ఞవల్క్య సంవాదం
3) గార్గి–యాజ్ఞవల్క్య సంవాదం
4) జనక–యాజ్ఞవల్క్య సంవాదం

## 1) జనకుని సభలో జరిగిన సంవాదం

విదేహరాజ్యాన్ని పాలించే జనక మహారాజు బ్రహ్మవిద్యను గురించి తెలుసుకోవాలని ఒక మహాయజ్ఞం చేయ సంకల్పించి దానికి రావలసిందిగా అనేక దేశాల్లోని మహా పండితులకు ఆహ్వానాలు పంపిస్తాడు. కురు–పాంచాల దేశాలనుంచి అనేకమంది బ్రహ్మవాదులు ఆ యజ్ఞానికి వస్తారు. అందులో ముఖ్యులైన వారి పేర్లు :

1) అశ్వలాయనుడు
2) ఆర్తభాగుడు
3) భుజ్యుడు
4) ఉషస్తుడు
5) కహోలుడు
6) గార్గి
7) ఉద్దాలకుడు
8) విదగ్ధ శాకల్యుడు

వీరందరినీ ఉద్దేశించి జనకుడు ఈ విధంగా అంటాడు.

"ఇక్కడ సమావేశమైన బ్రహ్మవాదుల్లో ఎవరు అగ్రగణ్యులో నాకు తెలుసుకోవాలని ఉంది. ఎవరు గొప్ప బ్రహ్మవాది అని నిరూపితమవుతారో వారికి పది తులాల బంగారంతో కప్పబడిన కొమ్ములున్న వెయ్యి ఆవులను బ్రహ్మదక్షిణగా ఇచ్చి సత్కరిస్తాను అంటాడు." అప్పుడు అక్కడ చేరిన బ్రహ్మవేత్తలందరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకొంటారు. ప్రతివారిలోనూ అంతర్గతంగా ఒకవిధమైన భీతి కనిపిస్తుంది. అప్పుడు యాజ్ఞవల్క్యుడు లేచి తన ప్రియ శిష్యుడైన సామశ్రవసుపుని పిలిచి సువర్ణయుతమైన వెయ్యి గోవులను తన ఆశ్రమానికి తోలుకొని పోవలసిందిగా ఆదేశిస్తాడు. అతను అట్లాగేనని వాటిని తోలుకొని పోతాడు. అప్పుడు అక్కడ సమావేశమైన బ్రహ్మవాదులందరూ కోపోద్దీపితులై, జనక మహారాజుగారి రాజపురోహితుడు, ఋగ్వేద పండితుడు, హోతా స్థాయిలో ఉన్న అశ్వలాయనుడంతటివాడు సభలో ఉండగా తగుదునమ్మా అని యాజ్ఞవల్క్యుడు బ్రహ్మవాదంలో తన ఆధిక్యత నిరూపితం కాకముందే ఎట్లా ఆవులను తోలుకొని వెళ్ళమని ఆదేశిస్తాడని తమలో తాము అనుకొంటారు. అప్పుడు అశ్వలాయనుడు లేచి యాజ్ఞవల్క్యుని ఈ విధంగా ప్రశ్నిస్తాడు.

అశ్వలాయుని ప్రశ్న : "సమస్తమైనటువంటి జీవరాసులు మృత్యువుచే ఆవరింపగా, యజ్ఞయాగాది కర్మలను నిర్వహించిన కర్మవాది మృత్యుగృహ్వారం నుండి ఏ విధంగా బయట పడతాడు ?

యాజ్ఞవల్క్యుని సమాధానం : "ఋగ్వేద మంత్ర పాఠకుడైన హోతృని వల్ల, అగ్నివల్ల, వాక్కువల్ల ముక్తి (అతిముక్తి) లభిస్తుంది." ఈ విధంగా అశ్వలాయనుడు అనేకమైన ప్రశ్నలను వేయడం యాజ్ఞవల్క్యుడు వాటన్నింటికి సముచితరీతిలో సమాధానం చెప్పడం జరుగుతుంది. అంతట హోత అశ్వలాయనుడు నిశ్శబ్దంగా కూర్చుంటాడు. అప్పుడు జరత్కారుని వంశానికి చెందిన ఆర్తభాగుడు లేచి యాజ్ఞవల్క్యుని ఈ విధంగా ప్రశ్నిస్తాడు.

జరత్కారుని వంశీకుడైన ఆర్తభాగుని ప్రశ్న : మానవుడు చనిపోయినపుడు అతని వాక్కు అగ్నిలోకి, అతని ఉచ్ఛ్వాస నిశ్వాసలు గాలిలోకి, అతని

కళ్ళలోని చూసే శక్తి సూర్యునిలోనికి, అతని మనస్సు చంద్రునిలోనికి, అతని వినే శక్తి దిక్కులలోకి, అతని శరీరం భూమిలోకి, అతని ఆత్మ విశ్వాకాశం లోకి, అతని శరీరంమీది వెంట్రుకలు వృక్షల్లోకి, అతని చీము, నెత్తురు, వీర్యం నీళ్ళలోకి కలసిపోతే—అప్పుడు ఈ మానవుడు ఎక్కడ ఉంటాడు ? అతనిలో మిగిలిపోయేది ఏమిటి ?

యాజ్ఞవల్క్యుని సమాధానం : అప్పుడు ఆర్తభాగుని చేయి పట్టుకొని యాజ్ఞవల్క్యుడు ఈ విధంగా అంటాడు. "ఈ ప్రశ్నకు సమాధానం అతి రహస్యం. అది మన ఇద్దరిమధ్యే ఉండాలి. ఈ నిండు సభలో ఆ విషయం చర్చించరాదు." ఆ తరవాత వారిద్దరూ కలసి సభ బయటికి వెళతారు. వారు ఏమి మాట్లాడుకున్నది ఉపనిషత్తులో లేదు. ఆర్తభాగుడు మౌనం వహించి కూర్చుంటాడు. ఆ తరవాత భుజ్యుడు, ఉషస్త చక్రాయనుడు మరికొన్ని ప్రశ్న లను వేస్తారు వారి ప్రశ్నలకు కూడా యాజ్ఞవల్క్యుడు తగిన విధంగా సమాధానం చెప్పి వారినికూడా శాంతపరుస్తాడు.

అప్పుడు వచక్నుని కుమార్తె అయిన గార్గి లేచి ప్రశ్నిస్తుంది వారిద్దరి మధ్య జరిగిన సంవాదాన్ని సంగ్రహంగా చూద్దాం.

గార్గి ప్రశ్న : ఈ సమస్తమైన ప్రపంచం నీళ్ళలో ఓతప్రోతం మాదిరి (పడుగు, పేక—ఒక వస్త్రంలో మాదిరిగ) ఉంటే ఆ నీళ్ళు ఎందులో ఓత ప్రోతంలా ఉన్నవి ?

యాజ్ఞవల్క్యుడు సమాధానం : ఆ నీళ్ళు గాలిలో ఓతప్రోతంలా ఉన్నవి.

ప్రశ్న : ఆ గాలి ఎందులో ఉన్నది ?
సమాధానం : అంతరిక్షంలో ఆ గాలి ఉన్నది.
ప్రశ్న : ఆ అంతరిక్షం ఎందులో ఉన్నది ?
సమాధానం : గంధర్వలోకంలో ఉన్నది.
ప్రశ్న : గంధర్వలోకం ఎందులో ఉన్నది ?

సమాధానం : ఆదిత్య లోకంలో ఉన్నవి.

ప్రశ్న : ఆదిత్యలోకం ఎందులో ఉన్నది ?

సమాధానం : చంద్రలోకంలో ఉన్నది (సీతలం అని అర్థం)

ప్రశ్న : చంద్రలోకం ఎందులో ఉన్నది ?

సమాధానం : నక్షత్రలోకంలో ఉన్నది.

ప్రశ్న : నక్షత్రలోకం ఎందులో ఉన్నది ?

సమాధానం : దేవలోకంలో ఉన్నది ?

ప్రశ్న : దేవలోకం ఎందులో ఉన్నది ?

సమాధానం : ఇంద్రలోకంలో ఉన్నది ?

ప్రశ్న : ఇంద్రలోకం ఎందులో ఉన్నది ?

సమాధానం : ప్రజాపతి లోకంలో ఉన్నది.

ప్రశ్న : ప్రజాపతిలోకం ఎందులో ఉన్నది ?

సమాధానం : బ్రహ్మలోకంలో ఉన్నది.

ప్రశ్న : ఆ బ్రహ్మలోకం ఎందులో ఉన్నది ?

సమాధానం : ఓ గార్గి ఏ విషయాన్ని గురించి తరచి తరచి ప్రశ్నించ రాదో, ఏ విషయాన్ని తర్కంద్వారా తెలుసుకోలేమో, ఏ విషయాన్ని గురించి హద్దులు దాటి ప్రశ్నించరాదో, దాన్ని గురించి నీవు ప్రశ్నించకు. అట్లా ప్రశ్నించినట్లయితే నీ శిరస్సు వేయి ముక్కలు కాగలదు. నీ ప్రశ్నను 'అనతి ప్రశ్న' అంటారు. కనక ఇంకా ప్రశ్నించకు అని యాజ్ఞవల్క్యుడు ఆదే శిస్తాడు. అప్పుడు గార్గి మౌనంగా సభలో కూర్చుంటుంది. (మా అతి ప్రాక్షిః॥ అనతి ప్రశ్నాదేవతా ॥)

ఆ తరవాత ఉద్దాలకుడు ప్రశ్నిస్తాడు. ఆయస్నుకూడా యాజ్ఞవల్క్యుడు సమాధాన పరుస్తాడు.

అప్పుడు మళ్ళీ వచక్నుని కుమార్తె అయిన గార్గి సభలో లేచి ఈ విధంగా అంటుంది. "ఓ బ్రహ్మవాదులారా ! కాశీపట్టణంలో ఉన్న ఒకానొక

గొప్ప విలుకాడు విలుతాడును బాగా లాగి వదలివేసిన బాణం చెవికి తగిలితే ఎంత నొప్పి పుడుతుందో, అంతే బాధను కలిగించే రెండే రెండు ప్రశ్నలను ఈ మహానుభావుణ్ణి అడుగుతాను. వాటికి ఆయన సంతృప్తికరంగా సమాధానం చెప్పినట్లయితే బ్రహ్మవిద్యా వాదంలో మీరెవ్వరూ గెలవలేరు." అటువంటి ప్రశ్నలను అడగడానికై యాజ్ఞవల్క్యుని అనుమతిని వేడుకుంటుంది. ఆయన అనుమతిస్తాడు.

గార్గి మొదటి ప్రశ్న : "దివికి భూమికి మధ్య, దివికి భూమికి అతీతంగాను, దివి-భూమిలో భూత భవిష్యత్ వర్తమానకాలాల్లో, వీటన్నింటిలో పడుగు-పేక ఒక వస్త్రంలో ఉన్నట్లు ఉండేది ఏమిటి ?"

సమాధానం : "మహదాకాశం-అని యాజ్ఞవల్క్యుని సమాధానం.

గార్గి రెండో ప్రశ్న : మొదటి ప్రశ్ననే తిరిగి అడుగుతుంది.

యాజ్ఞవల్క్యుని సమాధానం : దివికి భూమికి మధ్య, దివికి భూమికి అతీతంగా, దివిభూమిలో, భూత భవిష్యత్ వర్తమాన కాలాల్లో, వీటన్నింటిలో పడుగు పేక రూపంలో అతివ్యాప్తమై ఉండేది, ఉన్నది, ఉండబోయేది "మహదాకాశం"

అయితే ఆ మహదాకాశం ఎందులో ఓతప్రోతమై (పడుగు పేకలా) ఉన్నది ? అని మరల ప్రశ్నిస్తుంది.

ఇక్కడ నేరుగా సమాధానం చెప్పకుండా బ్రహ్మవేత్తలయిన వారు దాన్ని 'అక్షరం' అంటే నాశనం లేనిదని చెబుతారు, వారివల్ల శ్రుతమైనదాన్ని గురించి చెబుతాను వినుమంటాడు. "ఈ అక్షర పరబ్రహ్మ స్వరూపం ఈ విధంగా ఉంటుంది. అది చిన్నదికాదు, పెద్దదికాదు, అది స్థూలమైనదికాదు, సూక్ష్మమైనది కాదు. అది ఘనమైనదికాదు, పలుచనైనది కాదు. అది దిక్కుకాదు, కాలం కాదు. రూపం, గ్రంధం, స్పర్శ, రుచి, శబ్దాలు దానికి లేవు.

బాహ్యాభ్యంతరాలు దానికి లేవు. కర్మేంద్రియాలుకాని జ్ఞానేంద్రియాలు కాని దానికి లేవు. అది దేనినీ తినదు. అది దేనిచేత తినబడదు."

ఈ అక్షర పరబ్రహ్మ ప్రశాసనంవల్ల సూర్యచంద్రాదులు తమ తమ గతులు తప్పకుండా తమ కక్ష్యలో ఉన్నారు. ఈ అక్షర పరబ్రహ్మ ప్రశాసనం వల్ల దివి భూమి ఒకదానితో ఒకటి ఢీ కొట్టుకోకుండా ఉన్నాయి. ఈ అక్షర పరబ్రహ్మ ప్రశాసనంవల్ల ముహూర్తాలు, నిమిషాలు, గంటలు, దివారాత్రాలు, పక్షాలు, వారాలు, నెలలు సంవత్సరాలు, ఋతువులు ఏర్పడుతాయి. ఈ అక్షర పరబ్రహ్మ ప్రశాసనంవల్ల నదీనదాలు ప్రవహిస్తాయి.

ఈ అక్షర పరబ్రహ్మ ప్రశాసనంవల్ల పుణ్యకార్యాలు దానధర్మాలు, యజ్ఞయాగాది క్రతువులు చేసినవారు ఆయా కర్మల సత్ఫలితాలు పొందుతారు.

ఈ అక్షర పరబ్రహ్మ స్వరూపాన్ని, దాని స్వరూప జ్ఞానాన్ని తెలియకుండా ఎన్ని మంచిపనులు చేసినప్పటికీ అవన్నీ తాత్కాలిక ఫలితాన్ని మాత్రమే ఇస్తాయి. అట్లా కాకుండా ఈ అక్షర పరబ్రహ్మ జ్ఞానాన్ని పొంది మరణించినవారికి పునర్జన్మ అంటూ ఉండదు. బ్రహ్మవాది, బ్రహ్మవేత్త అవుతాడు. అంతేగాకుండా ఓ గార్గి! ఈ అక్షర పరబ్రహ్మ అన్నింటినీ చూస్తుంటుంది కాని ఇది మాత్రం చూపుకు అందదు. ఇంకా దేనిచేతకూడ చూడబడదు. అన్నింటిని వింటుంది. కాని ఇదిమాత్రం వినబడదు. అన్నింటిని గురించి ఆలోచిస్తుంది కాని ఇది ఆలోచనకు అందదు. అందుకే ఉపనిషత్తులు దీన్ని "మనో వాఙ్మానస గోచరం కాదని" వర్ణించాయి. కాని అది తప్పక చూసేది మరొకటి ఏదీ లేదు. అది తప్పక వినేది మరొకటి ఏదీలేదు. అటువంటి అక్షర పరబ్రహ్మలో ఈ మహదాకాశం ఓతప్రోతంలా ఉన్నది" అని యాజ్ఞవల్క్యుడు చెబుతాడు.

అప్పుడు గార్గి అంటుంది : 'ఓ పూజనీయమైన బ్రహ్మవాదులారా! ఈ బ్రహ్మోద్యమంలో మీరెవ్వరూ ఇతనితో సరికారు కనక ఆయనకు నమస్క-

రించి ధన్యులు కండి" అని చెప్పి ఆమె సభలో నిశ్శబ్దం వహించి కూర్చుం టుంది. వారందరూ అట్లాగే చేస్తారు.

అందుకే ఉపనిషత్తు ఈ విధంగా చెబుతుంది.

"నిశ్శబ్దం బ్రహ్మ ఉచ్యతే ॥"

ఈ అక్షర పరబ్రహ్మను తెలుసుకొనేదెట్లా ? మనస్సు, ఇంద్రియాలు, శరీరం, బుద్ధిని ఉపశమింప చేసినట్లయితే అంతర్గతమైన నిశ్శబ్దం ఏర్పడుతుంది. తురీయావస్థలో ఈ విధంగా సమస్తం ఉపశమింపబడి ఉంటుంది. ఆ దశలో జీవులన్నీ బ్రహ్మానుభూతిని పొందుతాయి. అదేవిధంగా మానవుడు జాగ్రదావస్థలో ఉన్నప్పుడు అంతర్గతంగా, బాహ్యంగా సంయమాన్ని కలిగి ఉన్నప్పుడు ధ్యానముద్రలో, సమాధి స్థితిలో ప్రతివారికి బ్రహ్మదర్శనం అవుతుంది అని ఈ ఉపనిషత్తు చెబుతుంది.

అసతో మా సద్గమయ ॥
తమసోమా జ్యోతిర్గమయ ॥
మృత్యోర్మా అమృత గమయ ॥

"అసత్తునుంచి (ఏదైతే యథార్థం కాదో దాన్నుంచి) సత్తుకు (యథార్థమైన దాన్ని) పొందుదుముగాక. తమస్సునుంచి జ్యోతికి వెళ్ళుదుముగాక. జనన మరణ, పునర్జన్మ—పునర్మృత్యువుల నుంచి అమృతత్వానికి, నిర్వాణపథానికి, బ్రహ్మ సంస్థీభూత అవస్థకు వెళ్ళుదుముగాక".—అని ఈ ఉపనిషత్తులో ఒక ప్రార్థనా మంత్రం సారాంశం.

## మైత్రేయ-యాజ్ఞవల్క్యుల సంవాదం

గార్గి, మైత్రేయ అనే వీరు యాజ్ఞవల్క్యుని భార్యలు. మైత్రేయి బ్రహ్మవాదిని. ఆధ్యాత్మిక చింతన కలది. కాత్యాయని స్త్రీ ప్రజ్ఞ కలది, ఒక నాడు యాజ్ఞవల్క్యుడు మైత్రేయితో అంటాడు. "ఓ మైత్రేయీ! ఈ గృహస్థా

శ్రమ ధర్మాన్ని నేను వదలిపెట్టదలచుకొన్నాను. నా వద్ద ఉన్న ధన, కనక, వస్తు, వాహనాదులు, సర్వసంపదలు మీ ఇద్దరికి చెరిసగం ఇవ్వదలచుకొన్నాను. కనక నా ఆస్తిలో సగభాగాన్ని నీవు స్వీకరించవలసింది." అప్పుడు మైత్రేయి ఈ విధంగా అంటుంది : "ఓ నా ప్రియమైన నాథా ! ఈ ప్రపంచంలో ఉండే సర్వ సంపదలు వజ్ర, వైడూర్య, మరకత, గోమేధిక, పుష్యరాగ, సువర్ణ, రత్న రాసులు అన్నీ నావైనప్పుడు, నా ఆధీనంలో ఉన్నప్పుడు నాకు అమృతత్వం లభిస్తుందా ?"

సంపదలవల్ల గాని, సంపదలు ఉండటంవల్ల కాని అమృతత్వం లభించదు. వాటివల్ల లభించేదంతా ఇష్టకామ్యం (అంటే కోరినది లౌకికంగా లభించటం). సంపదవల్ల సుఖంగా జీవించవచ్చు. సంపద ప్రయోజనం నిరవధికం కాదు. దాని ప్రయోజనానికి అవధులు ఉన్నాయి. అటువంటప్పుడు, దేనివల్ల నాకు అమృతత్వం లభించదో అది నాకెందుకు. అమృతత్వం లభించేది ఏదైనా అతనిదగ్గర ఉంటే తనకు ఇవ్వమంటుంది మైత్రేయి.

ఈ మాటలు విని యాజ్ఞవల్క్యుడు సంతోషిస్తాడు. నాకు ఎల్లప్పుడూ నీవు చాలా ప్రియమైన దానివి. ఇప్పుడు మరింత ప్రియమైన దానివి అయ్యావు. భౌతిక సంపదను తృణీకరించి, జ్ఞాన సంపదను సమపార్జింప సమకట్టిన నీవు నాకు అత్యంత ప్రేమపాత్రురాలివి అయ్యావు. అందుకే దేనివల్లయితే నీకు అమృతత్వం సిద్ధిస్తుందో దాన్ని చెబుతాను వినవలసింది. శ్రద్ధగా విన్న తరవాత దాన్ని మననం చేసుకోవలసింది. మననం చేసుకొన్న తరవాత నిరంతరం దాన్నే ధ్యానించవలసింది అని యాజ్ఞవల్క్యుడు చెబుతాడు.

శ్రవణం, మననం, నిధిధ్యాసన అనే మూడు అమృతత్వ సాధనకు ముఖ్యమైన సోపానాలు.

"ఆత్మావరే శ్రోతవ్య, మంతవ్య, నిధిధ్యాసి తవ్యం ॥ అని ఉపనిషత్తు చెబుతుంది.

"ఓ మైత్రేయి ! ఈ ప్రపంచంలో ఏ పదార్థమైనా దానంతట అది, దానికోసం ప్రీతిపాత్రం కాదు. అది మరొకరికి మాత్రమే ప్రీతిపాత్రంగా ఉంటుంది. ఈ విషయాన్ని తెలుసుకో. అన్ని విషయాలు, అన్ని వస్తువులు ఎవరికైతే ప్రీతిపాత్రమో దాన్ని తెలుసుకో! అప్పుడు అన్నీ ప్రీతిపాత్రమైనది మినహా మిగతా వాటియందు విరక్తి కలుగుతుంది." ఈ విషయాన్నే ఈ విధంగా యాజ్ఞవల్క్యుడు చెప్పాడు

ఏ స్త్రీకూడా ఆమె భర్తకోసం మాత్రమే ప్రీతిపాత్రం కాదు. తన ఆత్మ కోసం మాత్రమే ప్రియపాత్రమవుతుంది. ఏ భర్తకూడా ఏ స్త్రీకి, ఆమె కోసం మాత్రమే ప్రియపాత్రుడు కాడు. తన ఆత్మకోసమే ఆమెకు ప్రియపాత్రుడవు తాడు. సంతానం, డబ్బు, రాజ్యం, సంపదలు, అధికారం, వర్ణం, వంశ గౌరవం, కీర్తి—ఇవన్నీ కూడా వాటంతట అవి వాటికోసం మాత్రం ప్రియపాత్రం కావు. దేవతారాధన, పుణ్యాలు, దానధర్మాలు, త్యాగం మొదలయినవన్నీ వాటంతట అవి వాటికోసం ప్రీతిపాత్రం కావు. ఇవన్నీకూడా ఆత్మకోసం ప్రీతిపాత్రం అవుతాయి.

"ఆత్మనస్తు కామాయ ప్రియం భవంతి" ॥

అసలు ఈ ప్రపంచం అంతాకూడా ఆత్మ కోసమే ప్రీతి పాత్రమవు తుంది. వేదవేదాంత వేద్యులైన వారు చెప్పిన విషయం ఏమిటంటే — ఆత్మను గురించి తెలుసుకొన్న వారికి సమస్తం తెలుస్తుంది. ఆత్మను ప్రియదర్శినిగా భావించిన వారికి అన్నీ ప్రేమమయంగా కనిపిస్తాయి. ఈ ప్రపంచంలో ఉన్నది, మరియు లేనిది కూడా ఆత్మ దర్శనులకు లభిస్తుంది.

ఈ మాటలు వింటూనే మైత్రేయి అంటుంది : "మీరు చెప్పేది, చెప్పింది ఏమీ నాకు ఒక్క అక్షరం కూడా బోధ పడలేదు. ఒక్క ఆత్మ గురించి తెలుసుకొంటే అన్నీ ఎట్లా తెలుస్తాయి? ఆత్మదర్శనం అయితే సమస్తం ఏ విధంగా లభ్యమవుతాయి?" ఈ ప్రశ్నలన్నింటికి సమాధానాన్ని కొన్ని ఉపమా నాలను ఆశ్రయించి చెబుతాడు యాజ్ఞవల్క్యుడు.

ఒక మద్దెల ఉందనుకోండి. ఆ మద్దెలను మోగించేవాడు ఒక్కడైనా అనేకమైన ధ్వనులు అందులోనుంచి వస్తాయి. ఆ మద్దెలను మోగించటం ఆపివేస్తే ఆ ధ్వనులన్నీ ఆగిపోతాయి. అవి మనకు వినిపించవు. అదే విధంగా శంఖధ్వని, వీణాధ్వని మొదలయిన వాటిని ఇక్కడ అన్వయించుకోవచ్చు.

అదేవిధంగా ఈ శరీరంలోకి ఆత్మ ప్రవేశించి, జ్ఞానేంద్రియాల్లో, కర్మేంద్రియాల్లో, మనస్సులో ప్రతిబింబించి వాటికి తన జ్ఞానశక్తిని ఇచ్చి వాటి చేత అనేకమైన పనులను చేయిస్తుంది. దేహేంద్రియ వ్యాపారం ఈ విధంగా జరుగుతుంటుంది. ఏ విధంగా అయితే ఒక మహాసముద్రంలో ఉన్న నీరు, పైన ఇంకా లోపల, ఇంకా లోపల లవణ రసమయంగా ఉంటుందో, అదే విధంగా ఈ ఆత్మ పంచభూతాత్మకమైన ఈ శరీరంలో ప్రవేశించి శరీరానికి అనువినశ్యతిని కలిగిస్తుంది. తాను మాత్రం అనుచ్ఛితి ధర్మాన్ని కలిగి ఉంటుంది. అందుకే దానికి చావు పుట్టుకలు లేవు కాని దానికి చావు పుట్టుకలు ఉన్నట్లు, ఏదో పని చేస్తున్నట్లు, చేయిస్తున్నట్లు భాసిస్తుంది అయినప్పటికీ దాని స్వరూపాన్ని ఇదమిద్ధమని నిరూపించి చూపలేము. ఏదైతే మనం ఆత్మ అని భావిస్తామో అది ఆత్మకాదు. ఏదైతే అనంతమో, అగ్రాహ్యమో, అచ్యుతమో అది ఆత్మ అవుతుంది. దానికి రంగు, రూపు, రుచి, వాసన, స్పర్శ లేవు. అది పొట్టిదీ కాదు. పొడుగుదీకాదు, లావుపాటిదీకాదు. సన్నపాటిదీ కాదు. దాన్ని అది కాదు, ఇదికాదు, మరొకటి కాదని మాత్రం చెప్పగలం. దీన్నే 'నేతి నేతి వాదం' అంటారు. ఈ ఆత్మను గురించి అపవాద, అధ్యారోప, లక్షణావృత్తి, అనుభవం, తర్కం, శృతి మొదలయిన ప్రమాణాల ద్వారా తెలుసుకోవచ్చు. అట్లా తెలుసుకొన్నదే అమృతత్వం అని చెప్పి ఆ సంపదను, అమృతమయమైన ఆత్మ బోధనను మైత్రేయికి ఇస్తాడు యాజ్ఞవల్క్యుడు.

శ్రీకృష్ణుడు కాని భాష్యకారులుకాని, ఆ తరవాత వచ్చినవారు కాని కాదు. అర్జునుడు మధ్యమాధికారి అయినట్లయితే శ్రీకృష్ణుడు ఆయనకు యోగశాస్త్రం బ్రహ్మవిద్య అయిన ఈ గుహ్యాశాస్త్రాన్ని చెప్పేవాడేకాదు. పాండవ రాయ బారిగా వెళ్ళి హస్తినాపురంలో భీష్మ ధృతరాష్ట్రాదులున్న కొలువులో విశ్వ రూపాన్ని ప్రదర్శించాడేగాని అక్కడ బ్రహ్మవిద్యను బోధించలేదు. ఆ సభలో విదురుడు, సంజయుడు ధౌమ్యుడు ఇత్యాది మహాసుభావులున్నప్పటికినీ అర్జునుని అర్హతను గుర్తించినందువల్ల, అతని గుణగణాదులను తెలుసుకొన్నందువల్ల బ్రహ్మవిద్యా స్వీకారానికి కావలసిన అర్హతతో కూడిన సద్గుణ సంపత్తి కలవాడు అని శ్రీకృష్ణుడు గుర్తించినందువల్ల అర్జునునిలో విషాదాన్ని పోగొట్టటానికై చెప్పిన గీత భగవద్గీత.

తత్త్వోపదేశానికి బీజభూతమైన అద్వైతం అనే అమృతపు జల్లును పది నెనిమిది కలశములనే అధ్యాయాలద్వారా చల్లడం జరిగింది. భగవద్గీతలో 18 అధ్యాయాలున్నవి అవి :

1. అర్జున విషాదయోగం
2. సాంఖ్య యోగం
3. కర్మ యోగం
4. జ్ఞాన యోగం
5. కర్మ సంన్యాస యోగం
6. ఆత్మ సంయమ యోగం
7 విజ్ఞాన యోగం
8. అక్షర పరబ్రహ్మ యోగం
9. రాజవిద్యారాజ గుహ్య యోగం
10. విభూతి యోగం
11. విశ్వరూప సందర్శన యోగం
12. భక్తి యోగం
13. క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగం

14. గుణత్రయ విభాగయోగం
15. పురుషోత్తమ ప్రాప్తి యోగం
16. దైవాసుర సంపద్విభాగ యోగం
17. శ్రద్ధాత్రయ విభాగ యోగం
18. మోక్ష సంన్యాస యోగం

## మకుటార్థం :

భగవద్గీతలో ప్రతి అధ్యాయం ఆఖరున ఈ విధంగా ఉంటుంది.
"ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే. శ్రీ కృష్ణార్జున సంవాదే క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ
యోగేనామ త్రయోదశ అధ్యాయం" ॥

దీన్ని ఉదాహరణకు మాత్రమే ఇవ్వడం జరిగింది. శ్రీ కృష్ణార్జునుల సంవాదం ఇది. ఉపనిషత్తులతో సమానమైనది. యోగశాస్త్రం అంటే అప్రాప్త మైనదాన్ని ఇస్తుంది. ఈ విధంగా ప్రతి అధ్యాయానికి అన్వయం చేసుకోవాలి.

## 2) సాంఖ్య యోగం

'సాంఖ్యయోగం' అనే ఈ రెండో అధ్యాయంలో శోకమోహాలు సమసిపోవడానికై కావలసిన ఆత్మ తత్త్వజ్ఞానం, స్థితప్రజ్ఞుని లక్షణాలు చెప్ప బడ్డాయి. బంధు మిత్రాదుల యందున్న అభిమానంవల్ల వారినందరినీ చంపి పాపాన్ని మూటకట్టుకొనేదానికన్నా భిక్షుకవృత్తితో ఉండటం మేలని అర్జునుడు భావిస్తాడు. యుద్ధాన్ని చేయనంటాడు. అట్లా యుద్ధవిముఖుడైన అర్జునుడిలో సాంఖ్య యోగప్రబోధం ద్వారా యుద్ధాసక్తిని కృష్ణుడు కలిగిస్తాడు.

సమస్తమైన జీవరాసులు మరణించడమనేది ప్రకృతిలోని పరమ సత్య మంటాడు. "జాతస్య మరణం ధృవం". అట్లాంటప్పుడు క్షత్రియుడైన అర్జునుడు క్షాత్ర ధర్మమైన యుద్ధాన్ని తప్పక చేయాలి అట్లా చేయకుండా ఇతరుల ధర్మ మైన అహింసా మార్గాన్ని అవలంభించినట్లయితే రెండువిధాలా అతను చెడిపోవ

శానికి అవకాశముంటుంది. అట్లాకాకుండా యుద్ధం కనక చేసినట్లయితే, ఆ యుద్ధంలో గెలుపో లేక ఓటమో సంభవించవచ్చు. గెలిచినట్లయితే భూలోక సుఖాలను, రాజ్యసంపదను అనుభవించవచ్చు. యుద్ధంలో మరణించినట్లయితే స్వర్గసుఖాలను అనుభవించవచ్చు. కనక యుద్ధం చేయడం అనివార్యమని, దాని వల్ల పాపం సంభవించదని శ్రీకృష్ణుడు చెబుతాడు.

ఈ సిద్ధాంతాన్ని వేదాంతపరంగా సమర్థించి ఆత్మతత్త్వాన్ని అర్జునుడికి బోధిస్తాడు కృష్ణుడు. ఈ అధ్యాయంలో 12వ శ్లోకం మొదలుకొని 30వ శ్లోకం వరకు ఆత్మతత్త్వానికి సంబంధించిన విషయం ఉన్నది. ఆత్మకు పుట్టుక, వృద్ధి, చావు లేవు. ఖడ్గములవల్ల నరుకుటకు వీలుకాదు. గాలివల్ల శోషింపబడదు. ఎండచేత ఎండింపబడదు. నీటివల్ల తడువదు. అంతమాత్రాన అది ఒక నిస్తేజ మైన, నిర్వీర్యమైన పదార్థం కాదు. అది ఒక విజ్ఞాన ఘనస్వరూపం. ఆనంద మయం. సచ్చిదానంద స్వరూపం దాని తటస్థ లక్షణం. ప్రతి మానవుడు చివికి జీర్ణమైన ఒక చొక్కాను ఏ విధంగా అయితే పారవేసి మరొక నూతన వస్త్రాన్ని ధరిస్తాడో అదేవిధంగా ఈ ఆత్మకూడా, చివికి జీర్ణమైన శరీరాలను వదలివేసి కొత్త శరీరాలను ధరిస్తుంది. "దీన్నే శరీరాత్మ భావమంటారు వేదాంతులు." 40వ శ్లోకం నుంచి 51వ శ్లోకం వరకు కర్మబంధాన్ని నివర్తింపజేసి మోక్ష సాధనమైన జ్ఞానాన్ని పుట్టించే కర్మయోగాన్ని గురించి శ్రీకృష్ణుడు అర్జునుడికి బోధిస్తాడు. ఆ తరవాత 52 నుంచి 72 శ్లోకం దాకా స్థితప్రజ్ఞుని లక్షణాలను గురించి బోధిస్తాడు.

దేహమే ఆత్మ అని భావించడం అవివేకమవుతుంది. దీన్నే అజ్ఞానమని కూడా అంటారు. ఆత్మతత్త్వం తెలియని వానికి మరణభీతి ఉంటుంది. అటు వంటివారు పామర జీవితం గడుపుతారు. కర్తృత్వ భావాన్ని ; అంటే "నేనే సమస్తమైన కర్మలను చేస్తాను ; నేనే సమస్తమైన కర్మల ఫలితాలను అనుభ విస్తాను"—అని భావిస్తాడు. ఆత్మతత్త్వాన్ని తెలుసుకొన్నవారు అట్లా కాకుండా, శరీరంకన్నా భిన్నమైనది మరొకటి ఉన్నదని, అది ఆత్మ అని గుర్తిస్తాడు. ఈ ఆత్మ సర్వవ్యాప్తి, సర్వసాక్షి, సర్వద్రష్ట, సర్వకర్త, సదానిత్యుడనే

జ్ఞానాన్ని కలిగి ఉంటాడు. అట్టి ఆత్మజ్ఞానానికి శోకమోహాదులు ఉండవు. చిత్తశుద్ధి ఉన్నవారికి అట్లాంటి ఆత్మజ్ఞానం కలుగుతుంది. చిత్తశుద్ధి ఉన్నవారు సమస్తమైన కర్మలను ఈశ్వరార్పణ బుద్ధితో చేస్తారు. అట్లాంటప్పుడు వారి బుద్ధి నైర్మల్యంగా ఉంటుంది. నిర్మలమైన బుద్ధి కలవారు ఏ కర్మచేసినా దాని ఫలితాలు వారికి చెందవు. అదే నిష్కామకర్మ అవుతుంది. కనక అటువంటి నిర్మలమైన బుద్ధితో, చిత్తశుద్ధిని కలిగి, నిష్కామంగా, కర్తృత్వ త్యాగంచేసి, ఫలాసక్తి లేకుండా యుద్ధం చేయవలసిందని ఈ అధ్యాయంలో ఉన్న కృష్ణుని సందేశం మానవజాతి కంతటికీ వర్తిస్తుంది.

## స్థితప్రజ్ఞుని లక్షణాలు

అర్జునుడు శ్రీకృష్ణుని అడుగుతాడు : స్థిత ప్రజ్ఞుడనగానెవరు ? సమాధియందున్నవాడై నిశ్చలమైన బుద్ధి కలవానికి ఏమి లక్షణం ? అతను ఏమి చేయును ? అతను ఏమి పొందును ?

శ్రీకృష్ణుడు చెప్పిన సమాధానం : ఆత్మానాత్మ వివేకజ్ఞానాన్ని కలిగి ఉండి, నిశ్చలమైన జ్ఞానం కలవాడు, దారేషణ, ధనేషణ, పుత్రేషణాలను వదలి, మానసికంగా సర్వస్వాన్ని సన్యసించి "అహం బ్రహ్మాస్మి", "ప్రజ్ఞానం బ్రహ్మ" మొదలయిన శృతి వ్యాక్యార్థాలను అనుభవంలోకి తెచ్చుకొన్నవానిని స్థిత ప్రజ్ఞుడు అంటారు. ఆయనే జీవన్ముక్తుడని అద్వైతంలో అంటారు. అట్లాంటి వారు శుభాలు కలిగినప్పుడు సంతోషించరు. అశుభాలు కలిగినప్పుడు దుఃఖాన్ని పొందరు. పీత, రాగ, భయ, క్రోధాలు లేక నిర్మలమైన మనస్సుతో ఉంటారు. తాబేలు తన అవయవాలను లోపలికి ముడుచుకొన్నట్లు స్థితప్రజ్ఞుడు ఇంద్రియ వేదనను అణచివేసి, నిర్మలమైన బుద్ధితో ఉంటాడు. దేహధారణకు మాత్రమే ఆహారాన్ని తీసుకొంటాడు. ఇంద్రియాలను నిగ్రహించి భగవంతుని యందు మనస్సును లగ్నంచేస్తాడు. మనస్సు నిర్మలంగా ఉన్నందువల్ల ఆయనకు సమస్తమైన మానసిక ఆందోళనకు ఉపశాంతి కలుగుతుంది. నిగ్రహంతోను, శాంతితోను, పరమశాంతితోను అతని మనస్సు, వాక్కు, బుద్ధి, చేష్టలు

ఉంటాయి. అప్పుడే ఆయనకు "బ్రహ్మదర్శనం'' అవుతుంది. అప్పుడే నిర్వాణం సిద్ధిస్తుంది.

## 3) కర్మయోగం

రెండో అధ్యాయం "ఏషాబ్రాహ్మీస్థితి'' అని ముగుస్తుంది. అంటే జ్ఞానం-కర్మ-ఈ రెంటిలో కర్మకన్నా జ్ఞానం గొప్పదని చెప్పిన కృష్ణుడు, తనను హింసాయుతమైన కర్మను-(యుద్ధాన్ని) చేయమని ఎందుకు ప్రేరేపిస్తున్నాడో అర్జునుడికి అర్థంకాదు. అందుకే జ్ఞానం, ఇంకా కర్మల స్థూలరూపాన్ని, సూక్ష్మరూపాన్ని ఇక్కడ వివరించడం జరిగింది. "లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ'' అని చెప్పాడు కృష్ణుడు. లోకంలో రెండు రకాలైన మార్గాలున్నాయి. అవి : (1) కర్మయోగం (2) జ్ఞానయోగం.

నిరంతరం బ్రహ్మనిష్టచే బ్రహ్మభావమును పొంది, అఖండ ఆనంద స్వరూపమైన బ్రహ్మసాక్షాత్కారాన్ని పొందిన బ్రహ్మవిదునకు కర్మతో పని కాని, కర్మ చేయడంవల్ల ప్రయోజనంకాని ఏమీ ఉండదు. కర్మ జనితమైన సుఖాదులు బ్రహ్మవేత్తకు తుచ్ఛంగా కనిపిస్తాయి. వాటిని అనిత్యమని ఆయన భావిస్తాడు. కర్మవల్ల పొందతగిన అణిమాది అష్టసిద్ధులుకాని, జపతపాదులచేత పొందదగిన ఇంద్రాది పదవులను బ్రహ్మవాది కాంక్షించడు. జ్ఞానమనే అమృతం చేత తృప్తి పొందుతాడు. ఆయన కృతకృత్యుడవుతాడు. ఆయన చేయవలసిన కర్మలంటూ ఏవీ ఉండవు. ఉంటే ఆయన బ్రహ్మదర్శనుడు కాడు.

కాని అట్లాంటి బ్రహ్మదర్శనం కానంతవరకు ప్రతి జీవి కర్మలు చేయవలసిందే. ఈశ్వరార్పణ బుద్ధితో విహితమైన నిత్యనైమిత్తిక కామ్య కర్మలను ప్రతివారు వారి వారి వర్ణాశ్రమాలకు అనుగుణంగా చేయవలసిందే. అట్లాచేయడం వల్ల ఇంద్రియ నిగ్రహం ఏర్పడుతుంది. ఇంద్రియ నిగ్రహంవల్ల నిర్మలమైన బుద్ధి ఏర్పడుతుంది. నిర్మలమైన బుద్ధిద్వారా చిత్తశుద్ధి ఏర్పడుతుంది. చిత్తశుద్ధి కలవారు మోక్షార్హులవుతారు. ఇదే ఈ అధ్యాయంలోని సారాంశం.

## 4) జ్ఞానయోగం

అతి ప్రాచీనమై అనేకమందిచేత పారంపర్యంగా అనుశ్రుతమైన జ్ఞాన యోగంలోని రహస్యాన్ని కృష్ణుడు బోధిస్తాడు. ఈ అధ్యాయంలో సమస్తమైన కర్మ మూడురకాలు. అది : 1) శాస్త్రోక్తమైన కర్మ 2) శాస్త్రనిషిద్ధమైనకర్మ 3) కర్మాభావము. లేదా 1) కర్మ 2) అకర్మ 3) వికర్మ. బుద్ధిమంతుడైన మానవుడు మొదటినుంచీ ఈ మూడింటి మధ్యనున్న తేడాను తెలుసుకొని ప్రవర్తి స్తాడు. కర్మ చేయడంలో సంకల్పానికి చాలా ప్రాముఖ్యమున్నది, అందుకే ఆధు నిక సైకాలజీ 'మోటివ్ పవర్'కు ఎక్కువ ప్రాముఖ్యమిస్తుంది. సంకల్పాన్నిబట్టి కర్మ ఫలితంలో తేడా ఉంటుంది. ఫలాసక్తితో చేసే కర్మ బంధాన్ని కలిగి స్తుంది. ఫలితమందు అసక్తి లేకుండా చేసే కర్మ చిత్తశుద్ధికి దారి తీస్తుంది. చిత్తశుద్ధి లేనివారికి కర్మయందు ఆసక్తి ఉంటుంది. కర్మ ఫలితాన్ని కాంక్షి స్తారు. కాని జ్ఞానయోగి మాత్రం అట్లా కాదు. ఆయనకు కర్మ సంగమంలో ఆసక్తి ఉండదు. కామక్రోధలోభ మద మాత్సర్యాదులచే కలుగు భావవికారాలు ఆయన్ను బాధించవు. భగవంతునియందు సంప్రీతితో, భగవదర్పిత బుద్ధితో సమస్తమైన కర్మలు చేసే బ్రహ్మజ్ఞాని సమస్త కర్మఫలాలు వాటి వాసనా రూపంతోకూడా సమసిపోతాయి. అట్లాంటి భగవదారాధనా రూపమైన కర్మ జ్ఞానోత్పత్తికి సాధనం అవుతుంది. అట్లాంటి కర్మ బంధ హేతువు కాదు.

## 5) కర్మ సంన్యాస యోగం

నాలుగో అధ్యాయంలో "కర్మణ్య కర్మయః పశ్యేత్"— కర్మలో అకర్మను చూస్తాడు ; 'శరీరం కేవలం కర్మ' శరీరం కేవలం కర్మ చేయడానికి ఒక సాధనం ; "యదృచ్ఛాలాభ సంతుష్టః"— లభించిన దానితో సంతృప్తి చెందుతాడు. జ్ఞానమనే అగ్నిచే సమస్తమైన కర్మలు దహింపబడుతాయి అని చెప్పడం జరిగింది. కనక బ్రహ్మవిదునకు కర్మ పరిత్యాగమే కర్తవ్యమవుతుంది.

ఒకే పురుషునికి ఏకకాలంలో కర్మానుష్ఠానం, కర్మ త్యాగం సాధ్యం

కాదు. కొంతవరకు కాల వ్యవధితో ఈ రెండూ మోక్షాన్ని ప్రసాదిస్తాయి. కనక కర్మను ఒక సాధనంగాను, జ్ఞానాన్ని సాధ్యంగాను భావించి, జ్ఞానసంపద లభించగానే జ్ఞాని అన్ని కర్మలను త్యాగం చేయాలి.

జ్ఞానం సంప్రాప్తమైన వెంటనే కర్మలయందుండే ఆసక్తిని వదిలిపెట్ట డమే కర్మ సంన్యాసం. చిత్తశుద్ధితో కర్మల ఫలితాలను అపేక్షించక కర్మ చేయడమే కర్మ యోగమవుతుంది. ఈ సంన్యాస కర్మ యోగాలచేత ఏ బ్రహ్మజ్ఞాని సమస్త ఇంద్రియ వ్యాపారాలను ప్రాణాయామం ద్వారా బుద్ధిలోను, ఆ బుద్ధిని చిత్తంలోను, ఆ చిత్తాన్ని బ్రహ్మలోను లయం చేస్తాడో అట్లాంటి జ్ఞాని బ్రహ్మైక్యం చెందుతాడు.

## 6) ఆత్మ సంయమ యోగం

ఆత్మవిదుడైన యతి శ్రవణం, మననం, నిధిధ్యాసన ద్వారా ఆత్మ తత్త్వాన్ని గురించి తెలుసుకొంటాడు. ఆ జ్ఞానానికి ఏ విధమైనటువంటి అంత రాయం కలుగకుండా ఉండడానికై ధ్యానం చాలా అవసరం. ఆ ధ్యానసాధన రెండు రకాలుగా ఉంటుంది. అవి : 1) బహిరంగ సాధన 2) అంతరంగ సాధన అధికార తారతమ్యాన్ని బట్టి ఈ సాధన జరుగుతుంది. అదేవిధంగా సాధనను బట్టి ఫలితముంటుంది.

యోగి అంటే ఎవరు ? స్నేహితులయందు, శత్రువులయందు, ఉదా సీనుల యందు, మధ్యవర్తులయందు, సమస్తమైన జీవరాసియందును సమబుద్ధి కలిగినటువంటివాడు యోగి. "యోగినః సర్వత్ర సమబుద్ధిః" అటువంటి యోగి తనకు పరమ ఇష్టుడని శ్రీకృష్ణుడు చెప్పాడు. దీన్నే సమత్వ యోగం లేదా సామ్యయోగం అంటారు.

ఈ సమత్వ యోగాన్ని ఏ విధంగా సాధించవచ్చునని అర్జునుడు ప్రశ్ని స్తాడు. అప్పుడు శ్రీకృష్ణుడు ఈ విధంగా చెబుతాడు. మనస్సు చంచలమైంది. దాన్ని నిగ్రహించటం చాలా కష్టం. అయినప్పటికినీ సంతతాభ్యాసంచేతను,

వైరాగ్యాన్ని అలవరచుకోవడంవల్ల, అట్టి మనస్సును స్వాధీనపరచుకోవచ్చు. మనస్సును నిశ్చలంగా ఉంచుకొని, ఆహార విహారాది నియమాలద్వారా, శాస్త్రాల్లో చెప్పబడిన కర్మలు చేస్తూ ఏకాంత ప్రదేశంలో సుఖాశీనుడై స్వస్వరూపాను సంధానం చేయకలిగిన వ్యక్తికి సమత్వయోగం సిద్ధిస్తుంది. అట్లాంటి యోగికి పాపపుణ్యాలతో నిమిత్తం లేదు. ఆయనకు స్వపర భేదాలుండవు. కనకనే సమత్వ యోగాన్ని చేరిన యోగి భగవంతునికి ప్రీతిపాత్రుడవుతాడు. లోక కళ్యాణ కారకుడవుతాడు.

## 7) విజ్ఞాన యోగం

మొదటి ఆరు అధ్యాయాలు కర్మ సంన్యాసం ప్రాముఖ్యాన్ని గురించి చెబుతాయి. ఆ తరవాత ఆరు అధ్యాయాలు ఉపాసనాక్రమాన్ని గురించి చెబుతాయి. భగవంతుని ఆశ్రయించి ఆయన్ను ఉపాసన చేసేవారు సాధారణంగా నాలుగు రకాలుగా ఉంటారు. వారు :

1) ఆర్తుడు

2) అర్థార్థి

3) జిజ్ఞాసువు

4) జ్ఞాని

## ఆర్తుడంటే ఎవరు ?

ఆపదలో ఉండి, తనకున్నదాన్ని కోల్పోయి, స్వశక్తిమీద నమ్మకం పోయి, తన అల్పత్వాన్ని గుర్తించి, తనకన్నా మహత్తరమైన శక్తి ఏదో ఒకటి ఉన్నదని అంతర్గతంలో తెలుసుకొని దాన్ని శరణుజొచ్చేవాడు ఆర్తుడు. ఇటువంటి భావన ప్రకృతిలో పశు పక్ష్యాదుల్లోను, మానవుల్లోను ఉంటుంది. ఉదాహరణకు గజేంద్రుని కథను ఇక్కడ గుర్తుంచుకోవచ్చు.

## అర్థార్థి అంటే ఎవరు ?

ఉన్నదానిలో సంతృప్తి చెందక అయిశ్వర్యాన్ని ఇష్టమని భగవంతుని ఆరాధించేవారు కొందరు. సంసార బాధలు పడలేక, ఆర్థిక ఇబ్బందులను తట్టుకోలేక, కుటుంబాన్ని పోషించలేక ఐశ్వర్యం కోసం భగవంతుని శరణు జొచ్చేవారు కొందరు. ఉదాహరణకు ఇక్కడ కుచేలుని చెప్పవచ్చు.

## జిజ్ఞాసువు అంటే ఎవరు ?

"జ్ఞాతుమిచ్ఛ జిజ్ఞాసా"— అంటే తెలుసుకోవాలని తీవ్రమైన కోరిక కల వాడు జిజ్ఞాసువు అని శంకర భగవత్పాదులు చెప్పారు. కేవలం భగవంతుని గురించి తెలుసుకోవాలనే కోరిక మాత్రమే కలవాడు. ప్రహ్లాదుడు, నారదుడు ఇత్యాదులను ఉదాహరణగా చెప్పవచ్చు.

## ముముక్షువు లేక జ్ఞాని అంటే ఎవరు ?

ఆత్మ స్వరూపం కేవలం బ్రహ్మ స్వరూపమని గుర్తించి ఆత్మాను సంధానం చేసేవాడిని జ్ఞాని అంటారు. ఈ నలుగురిలో చలింపని భక్తిగల జ్ఞాని అందరి కన్న శ్రేష్ఠుడు.

## 8) అక్షర బ్రహ్మయోగం

ఈ అధ్యాయంలో ఆధ్యాత్మ తత్త్వచింతనను సూచించే ప్రశ్నలు ఎనిమి దింటిని అర్జునుడు అడిగి తెలుసుకొంటాడు. ఆ ప్రశ్నలు :

1. బ్రహ్మ అనగానేమి ?
2. అధ్యాత్మ మనగానేమి ?
3. కర్మ అనగానేమి ?
4. అధిభూతమనగానేమి ?

5. అధి దైవమనగానేమి ?
6. ఈ శరీరంలో ఉండి; దీన్ని నియమిస్తూ ఫలితాలను ఇస్తూ ఉండే వారెవరు ?
7. అది దేనిచేత వెలయుచున్నది ?
8. అంతిమ కాలంలో నియత చిత్తులైనవారు ఏ ఉపాయంద్వారా భగవంతుని చేరుతున్నారు ?

ఈ ప్రశ్నలకు శ్రీకృష్ణుని సమాధానం : జీవునికన్నా భిన్నంగా ఉండేదే బ్రహ్మం. ఈ దేహమునకు అధికారిఅయి భోక్త్రృరూపంలో ఉండేవాడే ఆధ్యాత్మ మనబడుచున్నాడు. జీవుల జన్మస్థితి మరణానికి కారణమయిన ద్రవ్యత్యాగరూపమగు యజ్ఞమే కర్మ అని పిలువటం జరుగుతున్నది. ఏ శరీరాలైతే నశించి పోతుంటాయో వాటినే అధిభూతమంటారు. సర్వ దేవతలకు అధిపతియగు సూర్యమండల మధ్యవర్తినియగు వైరాజపురుషుని అధదైవమంటారు. ఈ శరీరాల్లో అంతర్యామి రూపంలో ఉంటూ నేనే ఈ శరీరాలను నియమిస్తూ, వాటి వాటి ఫలతాలను ఇస్తుంటాను. యజ్ఞ ప్రవర్తకుడను, యజ్ఞాధిష్ఠాన దేవతను, యజ్ఞఫల ప్రదాతను—అంతా నేనే—అని కృష్ణుని సమాధానం.

అవసాన కాలంలో ఏ జీవులు నన్ను అంతర్యామిగను, పరమేశ్వరునిగను, స్మరిస్తారో, వారు నా భావమును, నా రూపమును పొందుతారు. అంత్యకాలమున ఎవరైతే దేవతాభావం లేకుండా, అన్య విషయాలను గురించి చింతిస్తారో, అట్లా చింతిస్తూ శరీరాన్ని విడుస్తారో వారు ఆయా అన్యభావాలను, పదార్థాలను పొందుతారు.

నిరంతరం అనుస్మరణీయుడగు పరమ పురుషుని గురించి శ్రీకృష్ణుడు ఈ విధంగా ఈ అధ్యాయంలో వర్ణించి చెప్పాడు.

ఆ పరమ పురుషుడు సర్వ విద్యా నిర్మాత, ఆయన సనాతనుడు. ఆయన విశ్వనియంత అతి సూక్ష్మమైన దానికన్నా సూక్ష్మతరుడు. మనస్సుకు,

బుద్ధికి గోచరుడు కాడు. "ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ" అని శ్రుతులు చెప్పు తున్నవి. ఇంద్రియాలను నిగ్రహించి, మనస్సును హృదయమున నిలిపి, బాహ్య విషయ స్మరణను విస్మరించి, భ్రూ మధ్యలో ప్రాణాన్ని స్థాపించి, ఆత్మ సందర్శనం చేసుకొంటూ ఓంకార శబ్దాన్ని ఉచ్చరిస్తూ ప్రాణాలను వదలిన వారు శ్రేష్ఠమైన మార్గాన ప్రయాణించి అంత్యకాలంలో భగవంతుని చేరుతారు.

## 9) రాజ విద్యా రాజ గుహ్య యోగం

భగవద్గీతలో చెప్పిన విద్యలు అనేకం. అందులో ధర్మజ్ఞానం, ఆత్మ జ్ఞానం, బ్రహ్మజ్ఞానం అనేవి ఒకదానికన్నా మరొకటి గుహ్యతరమైన విద్యలు అతీంద్రియ స్వరూపుడైన, కారణభూతుడైన భగవంతునిచే ఈ మంతయు ఆవరింపబడినది. సమస్తమైన చరాచర భూతాలు అన్నీ 'నాయం న్నవి.' కాని అవి చేసే పనుల ఫలితాలు నాకు అంటవు. నేను నిత్య—శుద్ధ—బుద్ధ ముక్త స్వభావుడను అని శ్రీకృష్ణుడు చెబుతాడు.

అటువంటి భగవంతుని కొందరు స్తోత్రమంత్రాలతో కీర్తించి ఆయన్ను పొందుతున్నారు. మరి కొందరు దృఢ నియమంతోను, మరి కొందరు ప్రణా మము చేస్తూ, మరి కొందరు నిరంతరం ఆయన్ను జపిస్తూ, మరి కొందరు ఆయన రూపాన్ని స్మరిస్తూ ఉపాసిస్తూ ఆయన్ను పొందుతున్నారు. "శ్రౌత యజ్ఞం, స్మార్త యజ్ఞం, శ్రాద్ధకర్మ, ఔషధం, మంత్రం, హోమఘృతం, హోమాగ్ని, హవనక్రియ—అంతా భగవంతుని స్వరూపమే. "ఈ జగత్తుకు మాతా పితరులు నేనే"— అని కృష్ణుడు చెప్పాడు.

అట్లాంటి భగవంతుని ఆరాధించటం అతి సులభం. భక్తితో, ఆకునో, పువ్వునో, నీటినో, పండునో సమర్పించవచ్చు. అది సాత్విక అర్చన.

పవిత్రమైన చిత్తంతో భక్తుడిచ్చే కానుకను సంప్రీతితో గ్రహిస్తాడు భగ వంతుడు. మానవుడు చేసే ప్రతి పనిని, ఆ పని ఫలితాన్ని నిర్మల చిత్తంతో భగవంతునికి సమర్పించవచ్చు. అట్లా సమర్పించినప్పుడు మానవులు కర్మ

బంధాలనుంచి విముక్తులవుతారు. కర్మ బంధాలనుండి విముక్తులయినవారు జీవన్ముక్తులవుతారు. జీవులందరూ భగవంతునికి సమానులే. ఆయనకు అప్రియుడంటూ ఎవరూ లేరు. కాని భక్తి విశ్వాసాలతో భగవంతుని కొలుచువారి హృదయాల్లో ఆయన ఉంటాడు. వారు ఆయన హృదయంలో ఉంటారు. దుర్మార్గుడు కూడా అనన్యచిత్తుడై భగవంతుని భజిస్తే అతనిని సాధువనియే భావించవచ్చు. భక్తులెవ్వరూ కూడా నష్టపోరు. మనస్సుల్లో భగవంతుని సాకార రూపాన్ని నింపుకొని, ఆయనకు భక్తులై, ఆయన్ను నిరంతరం పూజలు, నమస్కారాలు, అర్చన చేస్తూ ఆయన్ను శరణు గోరినవారికి మోక్షం తథ్యం. ఆశ్చర్యకరమైన భగవదైశ్వర్యాన్ని భక్తుడు పొందుతాడు. ఇదే రాజ గుహ్యము అను విద్య.

## 10) విభూతి యోగం

ఆత్మజ్ఞానంవల్ల ఎటువంటి ఫలితం లభిస్తుందో ఈ అధ్యాయంలో తెలుపటం జరిగింది.

సూక్ష్మ విషయాలను గ్రహించే శక్తి, సామర్థ్యం, సత్యం, బాహ్య అంతరేంద్రియ నిగ్రహం, సుఖం, దుఃఖం, జన్మ, మృత్యువు, భయం, అభయం అహింస, సమచిత్తత, తపస్సు, దానం, ధర్మంవల్ల వచ్చే కీర్తి, అధర్మంవల్ల వచ్చే అపకీర్తి—అన్నికూడా జీవులకు వారి వారి కర్మానుసారంగా భగవంతుని నుంచి వస్తాయి. భృగువు, మరీచి, అత్రి, పులహ, అంగిర, క్రతు, పులస్త్యులనే సప్తమహర్షులు, సనక, సనందన, సనత్కుమారులగు సనాతనులు, స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుష, వైవస్వత, సావర్ణి. దక్ష సావర్ణి, బ్రహ్మసావర్ణి ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, దేవసావర్ణి, ఇంద్రసావర్ణి మొదలయిన 14 మనువులు సాకారమైన భగవంతుని సంకల్పం వల్ల ఏర్పడ్డారు. వీరినుంచే ఈ ప్రపంచంలోని స్థావర, జంగమాత్మకమగు సంతతి కలిగింది.

ఎవరు నిత్యయుక్తులై ప్రీతి పూర్వకముగ అన్యవాంఛలను పరిత్యజించి భగవంతుని ఉపాశిస్తారో వారి బుద్ధికి భగవంతుడు మార్గదర్శిగా గోచరిస్తాడు.

భగవంతుని స్వరూపాన్ని ఏ విధంగా తెలుసుకోవచ్చని అర్జునుడు అడుగుతాడు. ప్రధానమైన భగవంతుని అంశాలను గురించి ఈ అధ్యాయంలో చెప్పి, అట్లా చెప్పిన విభూత్యాంశాలను విశ్వరూప సందర్శన యోగంలో అర్జునునికి అనుభూతి కలిగేటట్లు చేయడం జరిగింది. అన్ని ప్రాణుల హృదయాల్లో ఉండే ప్రత్యగాత్మే భగవంతుడు. ప్రాణుల ఉత్పత్తి, స్థితి, లయాలకు కారణం భగవంతుడే. ద్వాదశాదిత్యులలో విష్ణువనెడి ఆదిత్యుడు. జ్యోతిలో—సూర్యుడు. మరుద్గణాల్లో—మరీచి. నక్షత్రాలకు అధిపతి అయిన చంద్రుడు భగవదాంశం వేదాల్లో సామవేదం, ముక్కోటి దేవతల్లో ఇంద్రుడు. పదకొండు ఇంద్రియాల్లో సంకల్ప వికల్పాలకు తావయిన మనస్సు భగవంతుని అంశమే. ఏకాదశ రుద్రులలో శంకరుడు. యక్షరాక్షసుల్లో కుబేరుడు. శిఖరాగ్రముకల పర్వతాల్లో మేరు పర్వతం భగవదంశం. పురోహితుల్లో దేవపురోహితుడను బృహస్పతి భగవదంశం. సేనానాయకుల్లో దేవసేనానాయకుడు కుమారస్వామి భగవదంశం. మహర్షుల్లో భృగువు, శబ్దసమూహంలో ఓంకారం యజ్ఞాల్లో జపయజ్ఞం, స్థావరపదార్థాల్లో హిమాలయ పర్వతం—అంతా—అన్నీ భగవదాంశాలే. వృక్షాల్లో—అశ్వత్థ వృక్షం, దేవర్షులలో నారదుడు, గంధర్వులలో చిత్రరథుడు, సిద్ధులలో కపిలుడు అశ్వములలో ఉచ్చైశ్రవం, ఏనుగులలో ఐరావతం, మనుష్యుల్లో రాజు, ఆయుధాల్లో వజ్రాయుధం, ఆవుల్లో కామధేనువు, సంతానోత్పాదనలో మన్మథుడు, విషసర్పాల్లో వాసుకి, విషసర్పాలు కాని వాటిల్లో అనంతుడు, పితృదేవతల్లో ఆర్యముడు, శాసించువారిలో యముడు—అన్నీ భగవదాంశాలే.

ఈ విభూతులను తెలుసుకొన్న లాభమేమి? "నా ఒక్క అంశంవల్లనే సమస్త విశ్వాన్ని వ్యాపించి ధరించి ఉన్నాను." దాన్ని తెలుసుకోవలసిందని శ్రీకృష్ణుడు విభూతి యోగంలో అర్జునుని ఆదేశిస్తాడు.

# 11) విశ్వరూప దర్శన యోగం

ఈ విధంగా విభూతియోగాన్ని విన్న అర్జునుడు అంటాడు : "ఓ శ్రీకృష్ణా నీవు చెప్పిన విషయాల్లో నాకు సందేహం లేదు. అవన్నీ విశ్వసిస్తు న్నాను. కాని నీ ఈశ్వరీయ రూపాన్ని, నీ జగదాత్మ రూపాన్ని చూడకోరు తున్నాను." అర్జునుని యందున్న వాత్సల్యంకొద్దీ శ్రీకృష్ణుడు జగదాత్మ స్వరూపాన్ని ఆయనకు చూపుతాడు. అదే విశ్వరూప సందర్శనం. ఆ విశ్వ ఆత్మలో అర్జునుడు ఏమి చూశాడు ? ఎట్లా చూశాడు ?

అయన 12 మంది ఆదిత్యులను (సూర్యులను) 8 మంది వసువులను, 11 మంది రుద్రులను, 2 అశ్వనీ దేవతలను (వైద్యులు) 7గురు మరుద్దేవతలను, చూశాడు అంతేగాక ఇంతవరకూ ఎవ్వరూ చూడని అద్భుతాలను కూడా అర్జునుడు చూశాడు ఆ విశ్వరూపం సంక్షిప్త వర్ణనను చూద్దాం.

"ఆ విశ్వరూపం దివ్యమాలా వస్త్రాలతో అలంకరింపబడి, దివ్యగంధాలతో పూయబడినదై, దీప్తిమంతమై ఏకబాండమై, విశ్వతోముఖమై ఉండెను."

"అప్పుడు ఆకాశంలో ఒకే సమయంలో అనేక వేలమంది సూర్యులు ఉదయిస్తే ఆ కాంతి ఎంత కాంతివంతంగా ఉంటుందో, ఈ విశ్వ పురుషుని కాంతి దానికి అనేకరెట్లు అధికంగా ఉన్నది." అణువును విచ్ఛిన్నం చేసి అణు బాంబును బ్రద్దలు చేసినప్పుడు విజ్ఞాన శాస్త్రవేత్తయగు ఐన్‌స్టీన్ ఇవే మాటలు అన్నాడు. పైన చెప్పిన విభూతియోగంలోని అంశాలన్నింటినీ అర్జునుడు ఒక రాశిగా చూస్తాడు. భయకంపితుడవుతాడు. ఆదిమధ్యాంతాలు లేని విశ్వాత్మను చూసి, వణుకుతున్న దేహంతో, "దేవా ! ఈ నీ భీకర స్వరూపాన్ని చూడ లేకున్నాను. ఉపసంహరించుకొని సాత్త్వికమైన నీ స్వరూపాన్ని చూపించవల సింది" అంటాడు అర్జునడు. లోక సంగ్రహార్థమై విజృంభించిన కాలుడు శ్రీకృష్ణుడు. తన సంహార రూపాన్ని ఉపశమింపచేసి, ప్రసన్నుడవుతాడు. ఆయన స్వరూపజ్ఞానం లేనందువల్ల తనను క్షమించవలసిందిగా ప్రార్థిస్తాడు.

అర్జునుడు. భక్తులను ఆదరించటమే తన లోక కళ్యాణ విధి అని శ్రీకృష్ణుడు చెబుతాడు.

## 12) భక్తియోగం అంటే ఏమిటి ?

సగుణోపాసనకు, నిర్గుణోపాసనకు కల వ్యత్యాసం ఏమిటని అర్జునుడు అడుగుతాడు. సగుణోపాసన చేసే యోగులు శ్రేష్ఠులని, వారు తనకు ఇష్టులని శ్రీకృష్ణుడు చెబుతాడు. ఇంకా సమబుద్ధులై అనిర్వచనీయం, అప్రమేయం, ప్రమాణాతీతం, కూటస్థం (నిశ్చలం), అచలం అయిన నిర్గుణ బ్రహ్మోపాసన చేసేవారు నిర్గుణ బ్రహ్మను పొందుతారని శ్రీకృష్ణుడు చెప్పాడు. కాని అటు వంటి నిర్గుణోపాసన చాలా కష్టం. అందుకే భక్తి మార్గం సులభం, సుగమం. ఏ మానవులు సమస్తమైన కర్మలను భగవంతునికి అర్పించి భగవంతుని అనేక రూపాల ధ్యానిస్తారో వారు అంత్యకాలమున సాయుజ్యాన్ని పొందుతారు. అట్లా చేయడానికికూడా సామర్థ్యం లేనిచో భగవంతునికి ప్రీతిపాత్రాలగు కర్మలైన, ఏకాదశవ్రతం, పూజ, నామసంకీర్తనం, వందనం, దాస్యం, సేవ మొదలయినవి చేసి భగవంతుని పొందవచ్చు.

అటువంటి భగవంతునికి ఏ ప్రాణియందు ద్వేషం లేదు. కనక ఆయన సర్వ మిత్రుడు, పూర్ణదయాళువు, నిరహంకారుడు, క్షమాశీలుడు, సర్వదా సంతోషాన్ని కలిగిఉండి, దాన్ని ఇతరులకు ఇచ్చువాడు ఆయనయందు మనస్సును, బుద్ధిని ఉంచినవాడు ఆయనకు ప్రియుడు. భక్తునికి ఉండవలసిన 42 కళ్యాణ గుణాలు ఈ అధ్యాయంలో చెప్పటం జరిగింది. అందులో ముఖ్య మైనవాటిని గురించి తెలుసుకొందాం.

1. భక్తుడైన వారెవ్వరూ కూడా ఎవరికీ ఉద్వేగాన్ని కలిగించడు. ఎవరి నుంచీ కూడా ఉద్వేగ పడడు.

2. ఆనందం విషాదం, భయం, సంక్షోభాలు ఆయన్ను ఏమీ చేయ లేవు. అసలు వాటిని పొందడుకూడా.

3. భక్తుడు నిస్పృహతోను, బాహ్యాంభ్యంతరశుచిగాను, దక్షతతోను, పక్షపాతం లేకుండాను, సర్వకామ్య కర్మలను విసర్జించిన వాడుగను ఉంటాడు. అట్లాంటి భక్తుడంటే తనకు ఇష్టుడని శ్రీకృష్ణుడు చెప్పాడు.

4. అంతేగాకుండా, భక్తుడనే వాడెవ్వడూకూడా శుభాలు సంప్రాప్త మైతే సంతోషించడు ; కీడు వాటిల్లి తే దుఃఖం పొందడు. తనకు ఇష్టమైన వాటిని కోల్పోతే దుఃఖించడు తనకు లేని వస్తువును కోరడు. అటువంటి భక్తుని ఆదరిస్తాడు భగవంతుడు.

5. నిజమైన భక్తునికి శత్రువులుకాని, మిత్రులుకాని ఉండరు. ఆయనకు గౌరవం లభించినా, పరాభవం జరిగినా, ఎవరైనా నిందించినా, స్తుతించినా సమదృష్టిని కలిగి ఉంటాడు.

6. ఎవరు శ్రద్ధావంతులు, భగవత్పరాయణులై, ధర్మమార్గంలో పయనిస్తారో వారు భగవంతునికి అత్యంత ప్రియులని భక్తి యోగంలోని సారాంశం.

## 13) క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగం

భక్తులను సంసార సాగరంనుంచి తరింపచేస్తాను అని భగవంతుడు చెప్పగా, వారిని ఎట్లా తరింప చేస్తావని అర్జునుడు ప్రశ్నిస్తాడు. ఏ జ్ఞానంవల్ల భక్తులు తరిస్తారో ఆ తత్త్వజ్ఞానం ఈ అధ్యాయంలో చెప్పటం జరిగింది.

అర్జునుని ప్రశ్నలు :

1. ప్రకృతి అంటే ఏమిటి ?
2. పురుషుడనగా ఎవరు ?
3. క్షేత్రమంటే ఏమిటి ?

4. క్షేత్రజ్ఞుడనగా ఎవరు ?
5. జ్ఞానమనగా నేమి ?
6. జ్ఞేయమనగానేమి ?

సత్వం, రజస్సు, తమం—అనే మూడు గుణాల కలయికవల్ల ఏర్పడ్డదే ప్రకృతి. ఆ ప్రకృతి జీవునకు రెండు ప్రయోజనాలను సిద్ధింపచేస్తుంది. అందులో మొదటిది భోగం. రెండవది మోక్షం ఈ రెండు నిమిత్తాల కోసం ప్రకృతి దేహేంద్రియాకారాలను దాల్చుతున్నది. అప్పుడు దాన్ని శరీరం అంటారు. అదే క్షేత్రం. ఇది అన్ని జీవరాసులకు మూలం.

ఈ శరీరంకన్నా భిన్నంగా మరొకటి ఉన్నదని తెలుసుకొనువాడే క్షేత్రజ్ఞుడు. ఈ దేహాన్ని చూసువాడు, తెలుసుకొనువాడు ఈ దేహానికన్న భిన్నంగా ఉంటాడు. ఆయనే క్షేత్రజ్ఞుడు.

క్షేత్రస్వరూపం : పంచ మహా భూతములగు పృథ్వి, నీరు, గాలి, నిప్పు, ఆకాశం, వాటి తన్మాత్రలగు రూపం, రసం, గంధం, స్పర్శ, శబ్దం, అహంకారం, బుద్ధి, మహత్, మనస్సు—వాటి సంయోగమే క్షేత్రం. అంతే గాకుండా పంచ కర్మేంద్రియాలగు వాక్కు, పాణి, పాద, పాయు, ఉపస్థ, పంచ జ్ఞానేంద్రియాలగు కన్ను, ముక్కు, నోరు, చెవి, చర్మం—మొదలగు వాటి సమీకృతాకారమే క్షేత్రం. అదే శరీరం.

క్షేత్రజ్ఞుడనగా, క్షేత్రానికి భిన్నంగా ఉండేది. దాని గురించి తెలుసుకొనటమే జీవిత పరమావధి. ఆ క్షేత్రజ్ఞుడు చేతులు, కాళ్ళు, కన్నులు, శిరస్సులు, ముఖము, చెవులు, కలిగినదై ప్రపంచమంతా వ్యాపించి ఉన్నది. అది సూక్ష్మాతి సూక్ష్మముగను, అతి విస్తారముగను వ్యాపించి ఉన్నది. దానికి చావు పుట్టుకలు లేవు. ఆద్యంతాలు లేవు. ఆ క్షేత్రజ్ఞుని వల్లనే జ్యోతి స్వరూపమైన సూర్య చంద్రాదుల కాంతి, నక్షత్రాల కాంతి, గ్రహగతులు, భూ పరిభ్రమణం అన్నీ జరుగుతున్నవి. అది అజ్ఞానానికి వ్యతిరిక్తమైనది. జ్ఞానగోచరమైనది. ఇదే సమస్త వేదాంత గ్రంథాలలోని సారాంశం.

## 17. శ్రద్ధాత్రయ విభాగయోగం అంటే ఏమి ?

ప్రతి మానవుడు తన పూర్వజన్మలో చేసిన కర్మ ఫలితాలనుబట్టి సాత్త్వికి, రాజసిక, తామసికమైన కర్మలను చేస్తున్నాడు. భగవంతుని యందు మానవుడికి ఉండే శ్రద్ధ, భక్తి, వినయం, ఆసక్తి, పూజా పునస్కారాదులు ఆయా గుణాలవల్ల ఏర్పడుతున్నవి. సత్త్వగుణమున్నవారు దేవతలను, రజోగుణమున్నవారు రాక్షసులను, తమోగుణమున్నవారు ప్రేతభూతగణాలను పూజిస్తారు, మనం భుజించే ఆహారం కూడా సత్వరజస్తమో గుణాత్మకంగా ఉంటుంది. మనం భుజించే ఆహారం సారవంతంగా మారిపోయి రక్తమవుతున్నది ఆ రక్తంయొక్క సారం మేదస్సుగా మారి మన మనస్సును పోషిస్తుంది. అందుకే మన మనో ప్రవృత్తి మనం తినే ఆహారాన్ని బట్టికూడా ఉంటుంది. అట్లాగే మనం చేసే తపస్సు, యజ్ఞం, దానధర్మాలు, అన్నీకూడా సత్త్వ, రజస్తమోగుణాలచే ఆవరింపబడి ఉంటాయి. సాత్త్వక యజ్ఞదాన తపః కర్మలను చేసేవారు 'ఓం తత్ సత్' అనే పరబ్రహ్మ వాచక శబ్దాలను నిరంతరం ఉచ్చరిస్తూ సమస్తమైన కర్మలను బ్రహ్మార్పితంగా చేయాలి ఆటువంటి కర్మకు ఫలితముండదు కనక ముక్తి లభిస్తుంది.

## 18) మోక్ష సంన్యాస యోగమంటే ఏమి ?

ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥ (61)

సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥ (66)

పై రెండు శ్లోకాలు భగవద్గీతలో చెప్పబడిన భగవత్ తత్త్వాన్ని విశదీకరిస్తాయి. సమస్తమైన జీవరాసుల హృదయాంతర్గతంలో భగవంతుడు ఉంటాడు. అందుకే మానవులు చేసే ఏ పనైనా ఈశ్వరార్పితంగా చేస్తే ఆయన

సంతోషిస్తాడు. మనం జనన మరణ రూపమైన సంసారం నుంచి విముక్తి చెందాలంటే కర్మ, జ్ఞానం, భక్తి, వైరాగ్యం, శరణాగతి, ప్రపత్తి మొదలయిన మార్గాలున్నవి. సాధకుని శక్తినిబట్టి ఏ మార్గాన్నైనా ఎంచుకోవచ్చు. అర్హత అనేది యోగ్యతనుబట్టి వస్తుంది. యోగ్యతనుబట్టి సాధన చేయకలుగుతాడు. సాధనను బట్టి ఫలితం ఉంటుంది.

# 4

# జగద్గురు శ్రీ శంకరాచార్యులు : అద్వైత వేదాంతం

## జననం : బాల్యం : గ్రంథరచన : మఠాలస్థాపన

బ్రహ్మ సత్యం జగన్ మిథ్య
జీవో బ్రహ్మైవనా పరః

లోక సంగ్రహార్థం అవతార పురుషులు మహాపురుషులు ఉద్భవిస్తారని భగవద్గీత చెబుతుంది. ప్రపంచంలో పుట్టిన మహా ప్రతిభావంతులలోను, మహా జ్ఞానులలోను భగవత్పాదులు జగద్గురు బిరుదాంకితులు శ్రీ శంకరాచార్యులు ఒకరు. ఏ దృష్టితో చూసినను ఈయన మహాపురుషుడు. ఈయన ఈశ్వరాంశ సంభూతుడని, ఈశ్వరావతారమని బుధులు చెబుతారు. ఈయన జన్మస్థానం గురించికాని, జనన కాలాన్ని గురించికాని ఏకాభిప్రాయం లేదు. ఈయన పుట్టు కను గురించి అనేకమైన ఐతిహ్యాలు ఉన్నవి. ఇతని తండ్రిపేరు శివగురువు. పరమేశ్వరుడు శివగురునికి కలలో కనిపించి అల్పాయువు కలిగి లోకారాధ్యు డైన కుమారుడు ఒకరు జన్మిస్తాడని చెప్పి అదృశ్యుడవుతాడు. కొంతకాలానికి శివగురుని భార్యకు ఒక పుత్రుడు జన్మించాడు. అతనికే శంకరుడని పేరు పెట్టారు. అయితే ఈ విషయాన్ని నిరూపించడానికి చారిత్రక నిదర్శనాలు ఏవీ లేవు.

ప్రస్తుతం కొచ్చిను పట్టణానికి, షోరనూరు పట్టణానికి అయిదారు మైళ్ళ దూరంలో ఉన్న 'కలాది' అనే ఒక చిన్న గ్రామంలో శంకరుడు జన్మించినట్లు తెలుస్తున్నది. కృష్ణబ్రహ్మానందుడు రాసిన "శంకర విజయము", నీలకంఠ

భట్టు రాసిన "శంకర మందార సౌరభము", ఆనందగిరి వ్రాసిన "శంకర విజయం" మొదలయిన గ్రంథాలు శంకరుని జన్మస్థలాన్ని గురించి, కాలాన్ని గురించి చెబుతాయి. క్రీ. శ. 877–886 వ సంవత్సరాల్లో దక్షిణ భారత దేశాన్ని పరిపాలించిన ఇంద్రవర్మ గురువైన శివసోముడు సాక్షాత్తు శంకరుల వారికి శిష్యుడని కాంబోడియాలో ఉన్న ఒక శిలాశాసనాన్ని ఆధారం చేసుకొని శ్రీ శంకరులవారు క్రీ. శ. 788 లో జన్మించి, క్రీ. శ. 820లో మరణించిరని కొందరు విద్వాంసులు భావిస్తారు. "శంకర పద్ధతి" అనే ఒక ప్రాచీన గ్రంథంలో శంకరులు క్రీ. శ. 720లో మరణించినట్లున్నది.

ఆయన జన్మస్థలాన్ని గురించికూడా అనేకమైన అభిప్రాయాలున్నాయి. కేరళలోగల కలాది లేక కలాడి అనే గ్రామంలో పుట్టాడని కొందరు రాశారు. ఆనందగిరి శంకర విజయం అనే గ్రంథంలో శంకరులవారు చిదంబరంలో పుట్టినట్లు రాశారు. "మణి మంజరి" అనే మాధ్వ గ్రంథంలో మరొక కథ ఉన్నది. కలాడి అను ఒక శైవ గొడ్రాలు ప్రతిరోజు శివాలయానికి వెళ్ళి శివుని ప్రార్థించేదని, శివుడు ఆమెను కరుణించి లోకానికి గురువు కాదగిన తనయుడు ఉద్భవిస్తాడని ఆమెకు వరమిచ్చాడని ఈ గ్రంథంలో ఉన్నది. ఆ వంధ్యాతనయుడే శంకరుడని మాధ్వులు భావిస్తారు. అంతేగాక శ్రీ శంకరులు ఒక దైత్యుని అవతారమని కూడా వారు భావిస్తారు. ఈ గ్రంథకర్త అసత్య ప్రలాపన చేయడానికి సంశయించలేదు. గౌతమబుద్ధుడు జగద్వంచనార్థం పుట్టిన అవతార పురుషుడని కొన్ని పురాణాలు చెబుతున్నాయి. అంటే మతాగ్రహం ఏ విధంగా ఉండేదో తెలుస్తుంది. ఆంగ్ల పండితులగు మాక్సుముల్లరు, మాక్‌డన్‌లు, మొదలయినవారు శంకరుని జననం క్రీ. శ. 788వ సంవత్సరంగా తెలిపారు. చారిత్రక సత్యాలు ఏవి ఎట్లున్నప్పటికి పైన చెప్పిన విషయాలను పూర్తిగా విశ్వసించనూలేం, పూర్తిగా తీసి పారవేయనూలేం. అయితే చాలా మంది అంగీకరించిన విషయాలను గురించి, వివాదాస్పదం కాని విషయాలను గురించి తెలుసుకొందాం.

శంకరుని బాల్యం సామాన్య మానవుని జీవితంలాగాక కొంతవరకు

అసాధారణంగా ఉన్నదనడంలో సందేహం లేదు. 5వ సంవత్సరంలో ఉప నయం కాకముందే ఇతని తండ్రి మరణించాడు. ఆ తరవాత ఉపనయనం చేసు కొని నర్మదా నదీతీరాన, ఓంకారనాథంలోను, గోవిందాచార్యుని వద్ద దాదాపు మూడు సంవత్సరాలు వేదాంతాన్ని అధ్యయనం చేసాడు. గోవిందాచార్యుని గురువు పేరు గౌడపాదాచార్యుడు. గౌడపాదుడు రాసిన 'కారికలు' అనే గ్రంథం అద్వైత వేదాంతానికి ఆధార గ్రంథాల్లో చాలా ప్రామాణికమైనది. ఆ తరవాత కాశీ వెళ్ళి అక్కడ కొంతకాలం వేదాంతాన్ని అధ్యయనం చేసి, అటుపిమ్మట బదరికాశ్రమం శంకరుడు వెళ్ళి అక్కడ అద్వైత సాధన చేశాడు ఆ కాలంలోనే ఆయన జగద్విదితమైన ప్రస్థానత్రయ భాష్యం రాశాడు. కాశీ లోనో, బదరీ, కేదార తీర్థాల్లో ఈయన ఈ గ్రంథాలను రాసి ఉండవచ్చు. ఆ తరవాత యావద్భారత దేశం తిరిగి అనేకమంది మహా విద్వాంసులతో శాస్త్రార్థం చేసి, ముఖ్యంగా బౌద్ధులను, మీమాంసకులను, సాంఖ్యులను, కాపాలి కులను వారినందరినీ ఓడించాడు. కేరళనుంచి కాశ్మీరదేశం, నేపాల దేశంవరకు, ద్వారక నుంచి కామరూప దేశంవరకు, అంటే నేటి అస్సాం వరకు, ఆయన తన విద్యా విజయ యాత్రను చేసాడు.

ఎనిమిదవఏట ఆయన చతుర్వేది. 12 సంవత్సరాల వయస్సప్పుడు ఆయన సర్వశాస్త్రవేత్త. 16వ ఏట ప్రస్థానత్రయానికి భాష్యకర్త, 32వ ఏట మరణించాడు. ఈ విషయాలు అన్నీ ఆయన జీవిత చరిత్రలో ఉన్న విషయాలు. బాల్యంలోనే ఆయన సంన్యసించాడు. ఇందుకు ఒక కథ చెబుతారు. తల్లితోపాటు ఆయన ఒకనాడు నదీస్నానం చేయడానికై వెళతాడు. అప్పుడు అయన్ను ఒక మొసలి నీటిలోకి లాక్కొని వెళుతుంది. సంన్యాసమంటే తిరిగి మరొక జన్మమెత్తడంగా శాస్త్రాలు చెబుతున్నందున తల్లి అనుమతితో అయన మనసా వాచా కర్మణా సంన్యసిస్తాడు. మొసలి ఆయన్ను వదలి వెడుతుంది. అప్పటి నుంచిఆయన సంన్యాసిగనే ఉండిపోయాడు.

# శ్రీ శంకరులు రాసిన గ్రంథాలు

దశ మహోపనిషత్ భాష్యాలు. అవి :

1. బృహదారణ్యక ఉపనిషత్ భాష్యం
2. ఛాందోగ్య ఉపనిషత్ భాష్యం
3. తైత్తిరీయ ఉపనిషత్ భాష్యం
4. ఐతరేయ ఉపనిషత్ భాష్యం
5. ముండక ఉపనిషత్ భాష్యం
6. మాండూక్య ఉపనిషత్ భాష్యం
7. ఈశ ఉపనిషత్ భాష్యం
8. ప్రశ్న ఉపనిషత్ భాష్యం
9. శ్వేతాశ్వేతర ఉపనిషత్ భాష్యం
10. కఠ ఉపనిషత్ భాష్యం
11. బ్రహ్మసూత్ర భాష్యం
12. భగవద్గీతా భాష్యం
13. దక్షిణామూర్తి స్తోత్రం
14. ఆనందలహరి, ప్రబోధసుధాకరం
15. సౌందర్యలహరి, శతశ్లోకి
16. శివానందలహరి, భజగోవింద శ్లోకాలు
17. ఆత్మ వజ్రసూచి, నృసింహస్తోత్రం
18. మహాముద్గర,
19. దశశ్లోకి, ఉపదేశసాహస్రి
20. ఆత్మబోధ
21. విష్ణు సహస్రనామావళికి భాష్యం
22. సనత్సు జాతీయం
23. అపరకోశానుభూతి—మొదలగునవి.
24. అపరోక్షానుభూతి, వివేకచూడామణి.

## ఆయన చేసిన యాత్రలు

ఆ రోజుల్లో యావద్భారత దేశంలో బౌద్ధుల నిరీశ్వర వాదం, అనాత్మ వాదం, మీమాంసకుల కర్మవాదం, చార్వాకుల నాస్తికవాదం ప్రబలంగా ఉన్నాయి. అందుకే భారతదేశమంతటా పర్యటించి శృంగేరి, ద్వారక, పూరి, కాంచి అనే నాలుగుచోట్ల శంకరుడు అద్వైత వేదాంతాన్ని చాటుటకై నాలుగు మఠాలను నిర్మించాడు. కర్మ మీమాంసలో అగ్రగణ్యుడైన మండన మిశ్రునికి శంకరాచార్యులవారికి మధ్య జరిగిన సంవాదం ఎంతో ఆసక్తికరంగా ఉంటుంది. కర్మకాండను సమర్థిస్తూ కుమారిలభట్టు మండన మిశ్రాచార్యులు చేస్తున్న ప్రచారాన్ని ఖండించి జ్ఞానమార్గాన్ని స్థాపించాడు శంకరుడు. గృహస్థుడైన మండన మిశ్రుడు తండ్రి తద్దినం పెడుతున్న సమయంలో శంకరుడు అయన ఇంటికి వచ్చి భిక్ష పెట్టమని మండన మిశ్రుని అర్థిస్తాడు. శంకరుడు సంన్యాసి అయినందువల్ల, ఆరోజు పితృకార్యం నెరవేరుస్తున్నందువల్ల శంకరునికి భిక్ష పెట్టడానికి నిరాకరిస్తాడు. మండన మిశ్రాచార్యుడు అయితే సంవాదభిక్ష పెట్టమని శిష్యులతో కబురుపెడతాడు శంకరుడు. అప్పుడు వారిద్దరూ వాదించుకోడానికి సన్నద్ధులవుతారు. కర్మకాండ (అంటే యజ్ఞయాగాది క్రతు నిర్వహణ) గొప్పదని మండనమిశ్రుడు, అట్లాకాదు, జ్ఞానకాండ (అంటే సగుణ, నిర్గుణాకారమైన నిత్య సత్య పదార్థాన్ని అన్వేషించి, అర్థం చేసుకొని అనుభవంతో ఉంచుకోవడం) గొప్పదని శంకరులు సమర్థించి, పరస్పరం వాదించుకోడానికి సంసిద్ధులవుతారు. మండనమిశ్రుని భార్యపేరు భారతీదేవి. ఆమెను మధ్యవర్తిగా ఉండమని వారిద్దరూ కోరుతారు. ఆమె సవినయంగా వారి అభ్యర్థనను త్రోసివేసి ఒక నియమాన్ని సూచిస్తుంది. ఇద్దరి మెడల్లోను పూలమాల వేసి, ఎవరి మెడలో పూలమాల ముందుగా వాడిపోతుందో వారు వాదంలో ఓడిపోయినట్లు అంగీకరించాలని షరతుపెట్టి అమె తన పనులు చూసుకోవడానికై వెళుతుంది.

వీరిద్దరు కర్మకాండ గొప్పదని మండనమిశ్రుడు, అట్లాకాదు బ్రహ్మజ్ఞానం గొప్పదని శంకరుడు దాదాపు పదునెనిమిదిరోజులు అహోరాత్రాలు వాదోపవాదాలు చేస్తారు. అంతట పందొమ్మిదోరోజున బ్రహ్మజ్ఞానాన్ని

పొందటమెలా ? అనే ప్రశ్నకు సమాధానాన్ని సమర్థవంతంగా మండనమిశ్రుడు చెప్పలేకపోతాడు. క్రమంగా ఆయన మెడలోని దండ వాడిపోవడం ప్రారంభిస్తుంది. అప్పుడు భారతీదేవి వచ్చి, తాను మండనుని అర్ధాంగి కాబట్టి ఆమెను కూడా జయించినప్పుడే శంకరుడు మండనమిశ్రుని పూర్తిగా జయించినట్లు అవుతుంది కనుక తనతో వాగ్వాదానికి తలపడమని ఆమె శంకరుని కోరుతుంది. ఆయన సరే అని అంగీకరిస్తాడు. అనేకమైన శాస్త్రాల్లో ఆమెకూడా ప్రావీణ్యురాలు కాబట్టి శంకరుని అనేక శాస్త్రాల్లో ప్రశ్నిస్తుంది. ఆయన చెప్పిన సమాధానాలను బట్టి ఆయన మహా ప్రతిభావంతుడని గుర్తించి, ఆయన్ని ఇరకాటంలో పెట్టే శాస్త్రాన్ని ఆమె ఆశ్రయిస్తుంది. వేదానికి ఉపాంగాలైన వ్యాకరణ, శిక్ష, తర్క, జ్యోతిష, నాట్య శాస్త్రాల్లో ప్రశ్నించి, ఇక అతన్ని జయించే మార్గం లేదని భావించి కామశాస్త్రాన్ని ఆశ్రయిస్తుంది.

శాస్త్రజ్ఞానం మాత్రమే శంకరులవారికి ఉన్నది. కాని కామసాస్త్రానుభవం లేదు. అందుచేత ఎప్పుడైతే అమె అటువంటి ప్రశ్నలను అడగటం మొదలు పెట్టిందో, ఆజన్మ బ్రహ్మచారి అవటంవల్ల కొంత వ్యవధిని ఇమ్మని అడుగుతాడు శంకరుడు. ఆమె సరేనంటుంది. కాలం కలసివచ్చినట్లు అప్పుడే కాశీ రాజుగు అమరకుడు మరణిస్తాడు. ఆయన మృతదేహంలో పరకాయ ప్రవేశవిద్య ద్వారా తన జీవిని ప్రవేశపెట్టి తన శరీరాన్ని భద్రంగా కాపాడమని శిష్యులకు చెప్పి ఆయన ప్రాణాన్ని త్యజిస్తాడు. అక్కడ రాజాంతపురంలో అమరకుడు చనిపోయినవాడల్లా లేచి కూర్చుంటాడు. పరకాయ విద్యద్వారా అమరకుని దేహంలో ప్రవేశించిన శంకరుని జీవాత్మ కామేచ్ఛతో రాణిని రతిక్రియకు ప్రేరేపిస్తుంది. ఇదంతా రాణికి ఒక నూతనానుభవంగా తోస్తుంది. దీర్ఘంగా ఆలోచించినమీదట ఎక్కడో ఏదో మోసం జరిగిపోయిందని గుర్తిస్తుంది. వెంటనే రాజు దేహంలో మరొక జీవాత్మ ప్రవేశించిందని గుర్తించి, తన రాజ్యంలో ఉన్న శవాలన్నింటినీ వెంటనే దహించి వేయవలసిందని ఆజ్ఞ ఇస్తుంది. రాజభటులు అన్ని ప్రదేశాలు వెదుకుతూ వచ్చి ఒకానొక గుహలో శంకరుని మృతదేహాన్ని

చూసి దాన్ని దహించివేయడానికై నిప్పులో ఉంచుతారు. శంకరులవారి దేహం మంటలకు దగ్ధం కావడానికి సిద్ధమవుతుంది.

ఈ విషయాన్నంతా శంకరుడు యోగదృష్టితో తెలుసుకొని శ్రీ వరాహ లక్ష్మీ నృసింహదేవుని కింది విధంగా ప్రార్థిస్తాడు.

"సంసార సాగర విశాల కరాళ కామ
నక్ర గ్రహ గ్రసన నిగ్రహ విగ్రహస్య
మగ్నస్య రాగల సదూర్మిని పీడితస్య.
లక్ష్మీ నృసింహ మమదేహి కరావలంబం" ॥

ఓ లక్ష్మీ నృసింహస్వామీ, సంసారమనే ఈ మహాసముద్రంలో కామ మనే ఒక మహా మొసలి నోట్లో చిక్కుకొన్నాడను విషయచింతననే వలచేత ముందుకు వెనుకకు లాగబడుతున్న నాకు నీ అమృతహస్తాన్ని అభయంగా ప్రసాదించి ఈ నా శరీరాన్ని కాపాడవలసింది"— అని అర్థం. అంతట లక్ష్మీ నృసింహస్వామి కరుణాకటాక్షంవల్ల అమృతం శంకరుని శరీరంపై దేవతలు చల్లగా ఆయన స్వస్థదేహుడై భారతిని సమీపించి ఆమెను ఓడించి అద్వైతాన్ని స్థాపించాడు.

## శంకరుడు బోధించిన అద్వైత సిద్ధాంతం

## ఆత్మసిద్ధాంతం

ఉపనిషత్తులు ఆత్మను అనేక విధాలుగా వర్ణించాయి. వ్యావహారికాను భవంలో అంతర్గతంగా ఉన్న సత్యాన్ని అన్వేషించి తెలియచెప్పేదే ఆధ్యాత్మిక విద్య. కంటికి కనిపించే ఈ సమస్తమైన భౌతిక ప్రపంచానికి ఆధారభూత మైనది ఏమిటి? ఈ ప్రశ్నను అన్ని దర్శనాలు చర్చించాయి. కాని శంకరుడు చెప్పిన సమాధానం మాత్రం విశేషంగా గోచరిస్తుంది. మన ఇంద్రియాలు మన లను మోసం చేయవచ్చు. మన స్మృతి జ్ఞానంలో లోపం ఉండవచ్చు. భవి

ష్యత్ విషయాలు మన ఊహాగానాలు కావచ్చు. కాని వీటన్నింటినీ మించి ఏదో ఒక అంతర్గతమైన శక్తి ఉన్నట్లు మనకు తోస్తుంది. ఆత్మ ఉనికిని ప్రత్యేకించి రుజువు చేయనక్కరలేదు. ఆత్మ స్వయంప్రకాశం కలది. బుద్ధికీ, మనస్సుకు, ఇంద్రియాలకు ఆత్మ ఒక సంధాతగా ఉంటుంది. వాటిద్వారా ఆత్మను తెలుసుకోలేం. తర్కం ద్వారా ఆత్మను గురించి తెలుసుకోలేం. అయితే మనకు లభించే జ్ఞానం ఆత్మ స్వరూపమే. జ్ఞానం—ఆత్మా రెండూ భిన్నం కావు. ఆ రెండూ ఒకటే. జ్ఞానస్వరూపమే ఆత్మ. ఆత్మే జ్ఞానస్వరూపం. ఆత్మతో సంబంధం లేని జ్ఞానం కాని, అనుభవంకాని ఉండవు. ఆత్మ భావానికి ఆత్మే విషయమవుతుంది. ఆత్మ స్వయంగా విదితమవుతుంది. ఆత్మను గురించి ఏ ప్రమాణం ద్వారానూ తెలుసు కోలేం. అన్ని ప్రమాణాలకు ఆత్మే ఆధారం. అన్ని ప్రమాణాలు వాటి సుసంగ త్వానికి ఆత్మను ఆశ్రయించి ఉంటాయి. ఆత్మ ఒక సాధ్యవస్తువు కాదు. అది సిద్ధవస్తువు. అది ఎప్పుడూ ఉన్నది. దాన్ని గురించి తెలుసుకోవడమే ఆధ్యాత్మ విద్య అవుతుంది.

## ఆత్మ జనన మరణ రహితం

శంకరుని దృష్టిలో అహంప్రత్యయ విషయరూపమైన కర్తకు ఆత్మ భిన్నంగా ఉంటుంది. అది సర్వసాక్షి. అది ఏకంగానూ, అద్వితీయంగానూ, అన్నింటిలో సమానంగానూ ఉంటుంది. ఆత్మ లేదని ఎవరైతే చెబుతారో వారి స్వరూపమే ఆత్మ. అందువల్ల దానిని ఎవరూ లేదని చెప్పలేరు. కనక ఎవరైనా మరణిస్తే శరీరం నశించిందని భావించాలేకాని, ఆత్మ నశించిందని చెప్పటానికి వీలులేదు. జనన మరణాలు ఆత్మ ఉపాధులు. అవి ఆత్మ స్వరూపాలు కావు.

## ఆత్మ జ్ఞాన స్వరూపం

జ్ఞానం ఆత్మకు ఆగంతుక ధర్మమని కొందరన్నారు. అంటే ఆత్మలో జ్ఞానం వస్తూ పోతూ ఉంటుంది. కాని శుద్ధజ్ఞానమే ఆత్మ స్వరూపమని శంకరుడు చెప్పాడు. నిద్ర మొదలయిన అవస్థల్లోకూడా ఆత్మ జ్ఞాన స్వరూపమే.

మాయామోహితమైన ఈ ప్రపంచంలో ఆత్మ ఉన్నంతకాలం దాన్ని జీవుడని పిలుస్తారు. బుద్ధికి వర్తించే లక్షణాలన్నీ జీవునికి వర్తిస్తాయి. అహంకార మమకారాలు, రాగద్వేషాలు, సుఖదుఃఖాలు మొదలయిన గుణాలన్నీ జీవి సంసారంలో ఉన్నంతకాలం ఉంటాయి. అయితే అవి ఆత్మకు ఎంతమాత్రం వర్తించవు. ఆత్మ తన స్వస్వరూపాన్ని గుర్తించినప్పుడు, జీవి, ప్రపంచం—అంతా దానికి మిథ్యగా గోచరిస్తాయి. కాని అంతవరకూ అన్నీ యథార్థమే.

## ఆత్మకు కర్తృత్వం - భోక్తృత్వం లేవు

ఆత్మ స్వయంప్రకాశమనీ, స్వయంసిద్ధమనీ, శుద్ధజ్ఞాన స్వరూపమనీ, చావు పుట్టుకలు దానికి లేవని చెప్పాం. జీవుడు అనేకమైన కర్మలు చేస్తాడు. అందులో కొన్ని మంచి కర్మలు కావచ్చు. కొన్ని చెడు కర్మలు కావచ్చు. అవిద్యా ప్రభావంవల్ల కర్తృత్వం—భోక్తృత్వం ఆత్మకు ఆపాదింపబడ్డాయేగాని, యథార్థ దృష్టితో చూస్తే ఆత్మకు కర్తృత్వంగాని, భోక్తృత్వంగాని అంటదు. నిత్యం మనకు కనిపించే కొన్ని సాధారణాంశాల సహాయంతో ఈ విషయాన్ని శంకరుడు వివరించాడు. ఉదాహరణకు ఒక వడ్రంగి ఉన్నాడనుకొందాం. ఆయన శ్రమించేటప్పుడు, ఉలి, కత్తి, రంపం, బాడిస మొదలయిన పనిముట్లతో తన పనిని నిర్వహిస్తాడు. తన పని అయిపోయిన వెంటనే వాటిని పక్కన పెడతాడు. అంటే అతని విశ్రాంతి సమయంలో ఆ పనిముట్లకు ఆయనకూ ఏమీ సంబంధం లేదు. అదేవిధంగా ఆత్మ, శరీరం, బుద్ధి, అంతఃకరణం, మనస్సు, ఇంద్రియాలు అనే పనిముట్లతో జాగ్రదావస్థలో పని చేస్తుంది. దాని అసలు స్వరూపంలో వీటికి, ఆత్మకూ ఏ విధమైన సంబంధం ఉండదు.

## బంధం అంటే అద్వైతంలో ఏమిటి?

1. శరీరమే ఆత్మ అనుకొని, ఆత్మకు భిన్నంగా జీవుడు ఉన్నాడనుకోవడం అవిద్య. దేహంమీద అభిమానాన్ని పెంచుకోవడం అవిద్య.
2. తల్లి దండ్రులు, భార్యాబిడ్డలు, ఇల్లు వాకిలి మొదలయిన వాటిమీద మమకారాన్ని పెంచుకోవడం బంధం.

3. వర్ణాశ్రమ ధర్మాలున్నాయనుకోవడం బంధం.

4. నేను కర్తను, నేను భోక్తను, అనే అహంకారాన్ని పెంచుకోవడం బంధం.

5. నేను ఇతరులను ఆజ్ఞాపిస్తున్నాననుకోవడం, ఇతరుల ఆజ్ఞను పాటిస్తున్నాననుకోవడం, భయకంపితులు కావడం అవిద్య.

6 యజ్ఞాలు, వ్రతాలు, తపాలు, విధి విధానాలు, దానాలు మోక్షాన్ని ఇస్తావనుకోవడం బంధం.

7. విషయ సంకల్పము వాటి నివృత్తే మోక్షం. బంధం.

## అద్వైతంలో మోక్షమంటే ఏమిటి ?

భగవత్పాదులు శంకరాచార్యులవారి దృష్టిలో సమస్తమైన వేదాంత విద్యకు రెండు పరమ ప్రయోజనాలు ఉన్నాయి. అవి : 1. సంసారహేతు నివృత్తి 2. బ్రహ్మాత్మల ఐక్యత. ఈ రెంటినీ సాధించేదే మోక్షవిద్య. ఈ జగత్తు అంతా విభిన్నంగానూ, నానాత్వంగానూ కనిపిస్తుంది. ఇందులో అనేక భేదాలు ఉన్నాయి. స్వగత భేదం, సజాతీయ భేదం, విజాతీయ భేదం. ఈ విధంగా అనేకమైన భేదాలతో కూడిఉండి ఈ వ్యావహారిక ప్రపంచం మనకు కనిపిస్తుంది. అయితే దానికి భిన్నంగా ఉండి, నిత్య, శుద్ధ, ముక్త స్వరూపమైన నిర్గుణ బహ్మను తెలుసుకోవడమే మోక్షం. భేదదృష్టి బంధాలను కలిగిస్తుంది. అభేదదృష్టి ఐక్యతను చూపుతుంది. అభేదదృష్టే అద్వైత దృష్టి. అంటే చూసేవాడు, చూడబడింది, చూసినదాన్ని గురించిన జ్ఞానం అంతా ఒకటే అని ఎవరికైతే ఉంటుందో వారికి అభేద దృష్టి ఉన్నట్లు. వారికి ఈ ప్రపంచం అంతా ఒకటిగానే కనిపిస్తుంది. బంధాలు భ్రాంతివల్ల కలుగుతాయి. భ్రాంతి అంటే అసలు స్వరూపాన్ని గ్రహించకుండా, తాత్కాలిక స్వరూపాన్ని, లేక యాదృచ్ఛిక స్వరూపాన్ని గ్రహిస్తే అది భ్రాంతి అవుతుంది. సమస్తమైన బంధాల నుంచి విముక్తుడు కావటమే భ్రాంతి రహిత స్థితి. ఈ స్థితి జ్ఞానంవల్ల సిద్ధిస్తుంది.

ఆ విధంగా జ్ఞానం మోక్షానికి సాధనమవుతుందని శంకరులవారు గీతాభాష్యంలో చెప్పారు.

అద్వైత వేదాంతంలో మోక్షం నూతనంగా లభించే ఒక దశగాని, అవస్థగాని కాదు. అది నూతనంగా సంపాదించవలసిన సంపద కాదు. లేనిదాన్ని పొందటంకూడా కాదు. ఆత్మకు ఇది సహజ స్థితి. కాని అది మరుగునపడి ఈ వ్యవహార ప్రపంచంలో ఉంటుంది. మోక్షమంటే దుఃఖరాహిత్యం కాదు. జన్మ రాహిత్యం అంతకంటె కాదు. ఎందుకంటే అద్వైత వేదాంతం జీవన్ముక్తుని అంగీకరిస్తుంది. మోక్షావస్థలో ఆనందం వెల్లివిరుస్తుంది. ఈ ఆనందం సమస్త మైన లౌకికానందాలకు అతీతంగా ఉంటుంది. దీన్నే బ్రహ్మానందమని ఉపనిష త్తులు వర్ణించాయి. ఈ దశలో ఆత్మ తన స్వ స్వరూపాన్ని గ్రహిస్తుంది. నిరతి శయ విజ్ఞానం, నిరతిశయ ఆనందం ఆత్మ స్వ స్వరూపాలు. మోక్షం పొందిన వారు ఇక్కడి నుంచి మరో లోకానికి వెళ్ళడంకాని, మరొక రూపం దాల్చడం కాని, లేక నూతన పరిణామాన్ని పొందడంగాని అద్వైతంలో జరగదు. బ్రహ్మానుభవం పొందినప్పటికినీ దేహం పతనమై పోయేవరకు మానవుడు జీవించే ఉంటాడు.

జ్ఞానం మన భ్రాంతిని ఎట్లా తొలగిస్తుందో శంకరుడు సాధారణమైన కొన్ని ఉదాహరణల ద్వారా వివరించాడు. బాల్యంలోనే ఒకానొక రాజకుమారుని దొంగలు ఎత్తుకొనిపోయి, అతనికి దొంగబుద్ధులు నేర్పి, ఆయన్ను ఒక దొంగగా తయారు చేశారనుకొందాం. ఆయన అప్పుడు వారి జీవన విధానాన్ని అనుస రిస్తూ తానుకూడా ఒక దొంగననే భావిస్తాడు. కాని కొంతకాలం జరిగిన తరవాత రాజుగారి మంత్రులు తమ అన్వేషణా కార్యక్రమంలో ఇతన్ని చూడడం సంభ వించవచ్చు. అతన్ని రాజకుమారుడుగా గుర్తించవచ్చు. అప్పుడు ఆయన్ను సమీపించి ఆయనకు హితబోధచేసి, ఆయన దొంగల వారసుడు కాదని, రాజ కుమారుడని చెప్పి అయనలో మార్పు తేవచ్చు. అప్పటిదాకా దొంగతనం చేస్తూ జీవిస్తూ వచ్చిన అతనిలో మార్పువచ్చి, ఆ జీవన విధానానికి స్వస్తిచెప్పి, నూతన మార్గాన్ని అవలంబించవచ్చు.

అదేవిధంగా ఈ సంసార జీవన యాత్రలో అలసిపోయిన వ్యక్తికి, ఆయన స్వ స్వరూపం గురూపదేశంవల్లకాని, లేదా గ్రంథాధ్యయనంవల్లకాని తెలియవచ్చు ఆయన స్వ స్వరూపం తెలియగానే ఆయనలో మార్పు వచ్చి అంత వరకూ జీవిస్తున్న విధానానికి స్వస్తి చెప్పి, వైరాగ్యంతో కూడిన జీవితాన్ని గడపవచ్చు. అదే జ్ఞానోదయం. అయితే ఈ విధమైన జ్ఞానోదయం ఎట్లా కలుగు తుందనే సంశయం ఉండకూడదు. అభేద శృతి వాక్యార్థజ్ఞానం వల్ల ఇటువంటి మార్పు వచ్చి జ్ఞానం కలుగుతుందని శంకరుడు చెప్పాడు. అభేధశృతి వాక్యాలు నాలుగు. అవి :

1) ప్రజ్ఞానం బ్రహ్మ
2) అహం బ్రహ్మాస్మి
3) తత్త్వమసి
4) అయం ఆత్మా బ్రహ్మ

## ప్రజ్ఞానం బ్రహ్మ అంటే ఏమిటి ?

ఏ చైతన్య శక్తివల్ల ఇంద్రియాలకు శక్తి సామర్థ్యాలు కలుగుతున్నాయో దానినే ప్రజ్ఞానం అంటారు. ఈ చైతన్యం మనుష్యుల్లోనేగాక చతుష్పాదులయిన జంతువుల్లోను క్రిమికీటకాదుల్లోను ఉంటుంది. ఈ చైతన్యం సర్వవ్యాపకం. కాబట్టే దీన్ని బ్రహ్మ అంటారు. బాల్య,యౌవన, కౌమార, వార్థక్యాది అవస్థలు మారినా, జాగ్రద్, స్వప్న, సుషుప్తి దశలు మారినా, సర్వకాల సర్వావస్థల లోను, జీవరాసులన్నింటిలోను ఈ చైతన్యం ఉంటుంది. ఆ చైతన్య స్వరూపం 'నేనే' అనే భావం కలగాలి. అదే ప్రజ్ఞానం బ్రహ్మకు అర్థం.

## అహం బ్రహ్మాస్మి

'అహం' అనే శబ్దానికి లక్షణావృత్తి వల్ల 'ప్రత్యగాత్మ' అనే అర్థం వస్తుంది. సచ్చిదానంద స్వరూపమైన బ్రహ్మ శబ్దాన్ని ఇది సూచిస్తుంది 'అస్మి'

అనే శబ్దం ప్రత్యగాత్మ—ఇంకా పరమాత్మలకు గల ఐక్యాన్ని బోధిస్తుంది. అందుచేత నేను బ్రహ్మను, తద్భిన్నుడను కాను అనేదే అహం బ్రహ్మస్మి అర్థం.

## తత్త్వమసి

సమస్తమైన జీవరాసుల్లో పరమాణుస్వరూపంకన్నా సూక్ష్మంగా ఉండే జీవమే 'నేను' అని తెలుసుకోవడమే తత్త్వమసి వాక్యార్థ వివరణం.

## అయం ఆత్మాబ్రహ్మ

'అయం' అనే శబ్దం స్వయం ప్రకాశమైన అపరోక్షపు వస్తువును సూచిస్తుంది. 'ఆత్మ' అనే శబ్దం అహంకారం, ప్రాణం, మనస్సు, మొదలయినవాటికి అధిష్ఠానమైన అంతర్యామిని సూచిస్తుంది. బ్రహ్మశబ్దం నిర్గుణ, నిరంజన, నిరాకార బ్రహ్మను సూచిస్తుంది.

ఈ మహావాక్యాలలోని అర్థం : ప్రపంచం మాయాకల్పితమయి భాసిస్తుందని, దానికి అధిష్ఠానం సచ్చిదానంద స్వరూపమైన బ్రహ్మ అని, అదే మన ఆత్మ స్వరూపం. ఆత్మకూ – బ్రహ్మ పదార్థానికీ తేడా లేదని ఈ వాక్యాలు తెలుపుతాయి. ఆ అర్థాన్ని తెలుసుకోవడమే జ్ఞానం. ఈ జ్ఞానాన్ని అభేదశృతి వాక్యాలు ప్రసాదిస్తాయి. వాటి అర్థాన్ని గురువులు విపులీకరిస్తారు.

## మోక్ష సాధన లేదా మోక్ష మార్గం

ఈ అభేద శృతి వాక్యాలవల్ల జ్ఞానం ఎట్లా కలుగుతుంది ? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పటం అంత తేలిక కాదు. ఎంతో నైతిక శిక్షణ ధార్మికశిక్షణ పొందవలసి ఉన్నది. హృదయ నైర్మల్యాన్ని, మానసిక పవిత్రతను, ధార్మిక బుద్ధిని పొందవలసి ఉంటుంది. మానవుడు తాను చేయవలసిన పనులన్నింటినీ చక్కగా చేసిన తరవాత సాధనలో ప్రవేశించాలి. ఈ సాధనలో నాలుగు ముఖ్యమైన అంశాలు ఉన్నాయి. అవి :

1. నిత్య — అనిత్య వస్తు వివేక జ్ఞానం
2. ఇహలోక—పరలోక ఫలాసక్తియందు విరాగం
3. శమదమాది సాధన సంపత్తి
4. ముముక్షుత్వం

శమం అంటే మనోనిగ్రహం అన్నాడు శంకరుడు. ఏకాగ్రతవల్ల ఏ లక్ష్యాన్ని సాధించాలనుకొంటామో దానిమీద స్థిరచిత్తాన్ని కలిగి ఉండటమే శమం. దమం అంటే బాహ్యేంద్రియ నిగ్రహం. ఉపరతి అంటే శమించిన కోరికలు కలవాడు అని అర్థం. తితిక్ష అవస్థ అంటే కష్టనష్టాలను, సుఖదుఃఖాలను సమానంగా స్వీకరించగలిగిన బుద్ధి అని అర్థం. శ్రద్ధ అంటే వేద, వేదాంతాల్లో చెప్పబడిన విషయాలలో ఆసక్తి, నమ్మకం ఉండటం. ముముక్షత్వం అంటే మోక్షం కావాలనే కోరికతో తపించి పోవటం.

ఇవన్నీ శ్రవణం ద్వారాను, విన్నదాన్ని మననం చేసుకోవడం వల్లను, మననం చేసుకొన్నదాన్ని అనుభవంలోకి తెచ్చుకోవడంవల్లనూ సాధ్యమవుతుంది. ఈ అనుభవంలో మానవునిలో కొంత మార్పు వస్తుంది. అప్పటిదాకా 'నాది', 'నీది', నేను, నీవు అనే స్వపర భేదభావంతో నిండిఉన్న మనస్సు "ఆత్మవత్సర్వభూతాని'' అనే ఉపనిషద్ వాక్యాన్ని అవగాహనచేసుకొని అనుభవంలోకి తెచ్చుకొంటాడు సాధకుడు. ఈ దశలో సాధకుడు స్వపర భేధాలను విస్మరిస్తాడు. నానాత్వంగానూ, భిన్నంత్వాగాను, అనేకత్వంగానూ గోచరించే ఈ సమస్తమైన వస్తు ప్రపంచాన్ని, భావప్రపంచంలో ఏకత్వమైన రూపంలో చూడడానికై సాధకుడు ప్రయత్నిస్తాడు. ఎప్పుడైతే అతని మనో ఫలకం మీద నానాత్వస్వరూపం సమసిపోయి ఏకత్వం ప్రతిబింబిస్తుందో అప్పుడు ఆయనకు స్వపరబేధాలు గోచరించవు. ఏకతను, ఐక్యతను, సమతను మాత్రమే చూస్తాడు. ఈ ఐక్యత, సమతాదృక్పథంలోనుంచి ఏకతను మాత్రమే చూస్తాడు. దాన్నికూడా అధిగమించిపోయి చూస్తే చూడడానికి, వినడానికి,

తాకడానికి, కదలడానికి, చేయడానికి అంటూ ఏమిలేని స్థితికి మానసికంగా సాధకుడు ఎదుగుతాడు.

ఉపనిషద్ భాష్యంలో ఈ విషయాలను శంకరులు ఏ విధంగా చెప్పిందీ చూద్దాం.

సాధకుని మొదటి దశ :

అనేకత్వం, నానాత్వం పశ్యతిః
అనేకత్వాన్ని, భిన్నత్వాన్ని, నానాత్వాన్ని సాధకుడు చూస్తాడు.

సాధకుని రెండోదశ :

నానాత్వం నపశ్యతి
నానాత్వాన్ని, భిన్నత్వాన్ని, చూడడు

మూడోదశ :

సమతాం పశ్యతి
సమానత్వాన్ని సాధకుడు చూస్తాడు

నాలుగోదశ :

సమం పశ్యతి
అన్నీ సమానమనే దృష్టి ఏర్పడి స్థిరంగా ఉంటుంది

అయిదో దశ :

ఏకం పశ్యతి
ఒక్కటే చూస్తాడు (బ్రహ్మదర్శనమవుతుంది)

ఆరో దశ :

నపశ్యతి
చూడడానికంటూ, (అన్నీ ఉన్నప్పటికినీ) ఆయనకు అంటూ ఏమీ ఉండదు.

దీన్నే "మౌనం బ్రహ్మ ఉచ్యతి" అన్నారు. ఈ స్థితి అనిర్వచనీయం. మాటల్లో చెప్పలేం. ఏ విధంగా వర్ణించి చెప్పడానికి వీలులేదు. అయితే ఈ స్థితి లోనుంచి బయట పడ్డవారు, వారి వారి అనుభూతులను గురించి అప్పుడప్పుడూ కొన్ని విషయాలను చెబుతుంటారు. అవి మన సాధారణ దృష్టికి విరుద్ధాం శాలుగా తోచవచ్చు.



## బౌద్ధమతం భారతదేశంలో నశించిపోయి అద్వైత వేదాంతం ఎందుకు ప్రాబల్యాన్ని పొందింది?



బుద్ధుని అనంతరం బౌద్ధమతం అనేకమైన శాఖలుగా చీలిపోయింది. తన వారసునిగా బుద్ధుడు ఎవ్వరినీ నియమించలేదు. అతని అనుయాయులూ ప్రముఖ శిష్యులు ఆ స్థానంకోసం ఆరాట పడ్డారు. సారిపుత్తుడు, మొగ్గల్లానుడు, బుద్ధునికి ముందుగానే మరణించారు. కాని ఆనందుడు, కాశ్యపుడు, అనూరథుడు కాత్యాయనుడు, ఉప్పలవరుడు మొదలయినవారిని అగ్రశ్రావకులుగా బౌద్ధసంఘం గుర్తించింది. వారిని స్థవిరులని, మహాథేరులని పిలిచారు.

అనాయాచితంగా లభించిన దానితో సంతృప్తి పడాలని బుద్ధుడు బోధించాడు. కాని సంఘం అభివృద్ధి చెందుతున్న సమయంలో అనేకమైన నియమాలను, సంఘ శాసనాలను బౌద్ధభిక్షులు ఉల్లంగించవలసి వచ్చింది. బౌద్ధ సంఘంలోను, బౌద్ధ నైతిక విలువల్లోను, బౌద్ధ ధర్మంలోను పటిష్టత లేకపోవడంవల్ల బౌద్ధ ధర్మాన్ని ప్రజలు నిరాదరించారు. అందువల్ల బౌద్ధమతం పతనానికి అంకురార్పణ జరిగిందని చారిత్రకులు చెబుతారు.

హుయాయన్‌సాంగ్ భారతదేశమంతటా పర్యటించాడు. ఆయన రచనలను బట్టి బౌద్ధమతం హిందూమతం రెండూ పరస్పరాకర్షితులయ్యాయి. కాని బౌద్ధులు ప్రతిపాదించిన అనాత్మవాదం, ఈశ్వర నిరాకరణ వాదం, నిర్వాణ స్వరూపం వారిని నాస్తికులుగా ముద్రవేసాయి. సామాన్య ప్రజలకు అర్థంకాని ద్వంద్వ తర్కం, శూన్యవాదం, అనిత్యవాదం అన్నీ కలసి బౌద్ధాన్ని ప్రజలకు దూరంగా ఉండేటట్లు చేసాయి. సనాతన ధర్మ పునరుద్ధరణకై కుమారిలభట్టు కంకణం

కట్టుకొన్నాడు. ఉత్తర భారతదేశంలో ప్రాభాకర మిశ్ర, కుమారిలభట్టు (వీరిద్దరూ గురు శిష్యులు) కర్మకాండను సముద్ధరించడానికై ప్రయత్నం చేసారు. దక్షిణ భారతదేశంలో శంకరాచార్యులవారు దశమహోపనిషత్తులకు భాష్యం రాస్తూ జ్ఞానమార్గాన్ని సూచించారు. వీరిద్దరి పిలుపునూ అందుకొని అనేకమంది రాజులు సనాతనమైన వైదిక మతాన్ని స్వీకరించి బౌద్ధమతాన్ని నిరాకరించారు.

సింధు దేశాన్ని అరబ్బులు జయించిన తరవాత వేలకు వేలు భారతీయులు శ్రమ లేకుండా జీవితం గడిపే ఉద్దేశంతో కాషాయ వస్త్రాలు ధరించి బౌద్ధ ఆరామాల్లోను, సంఘాల్లోను చేరారు. కాని వారికి ఆ సంఘాల్లో చేరే అర్హత లేదు. నాలంద, తక్షశిల, విక్రమశాల విశ్వవిద్యాలయాలు ప్రతిభను కోల్పోయాయి. స్వయం ప్రతిభ లేనివారు, సోమరులు, అర్హత లేనివారు ఆరామాల్లో చేరారు. సాధువులు, సన్యాసులు, పరివ్రాజకులు, భిక్షువుల సంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. బౌద్ధులూ, హిందువులూ సాధించిన ప్రగతిని చూసి మొగలాయి చక్రవర్తులు ఈర్ష్య పడ్డారు.

బౌద్ధమతం వేదప్రామాణ్యాన్ని నిరాకరించింది. ఇది అనేకమందికి నచ్చ లేదు. అందుకే సహేతుకమైన వైదికమతాన్ని ప్రజలు ఆదరించారు. శృతి ప్రమాణం, తర్కబద్ధం—ఈ రెండూ కలసివున్న దర్శనం ప్రజలకు కావలసి వచ్చింది. అవి రెండూ అద్వైతంలో కనిపించాయి ప్రజలకు. అందుకే నిర్గుణ నిరాకారమైన బ్రహ్మతత్వాన్ని శంకరుడు బోధించాడు. నిరాకారమైన బ్రహ్మ పదార్థం మాత్రమే సత్యమని, నానారకాలుగా కనిపించే ఈ జగత్తు అంతా మిధ్య అని, జీవుడు—బ్రహ్మ ఒక్కటేనని శంకరుడు బోధించాడు. ఈ విషయాన్ని శృతి, తర్కం, హేతువు, ఉపమాన ప్రమాణాలద్వారా నిరూపించాడు. ఈ నిరూపణలో అధ్యారోపవాదం, అపవాదం, లక్షణావృత్తి సహకరిస్తాయి.

బ్రహ్మం, స్వగత—విగత—సజాతీయ విజాతీయ భేదరహితం. కాని ఆ నిర్గుణ బ్రహ్మమే మాయలో ప్రతిబింబించినప్పుడు సాకారమైన ఈశ్వరుడుగా భాసిస్తాడు. ఆ బ్రహ్మమే అవిద్యలో ప్రతిబింబించినప్పుడు జీవుడుగా భాసిస్తాడు. అయితే ఉన్నదంతా బ్రహ్మమయమే. నిర్గుణ స్వరూపమైన బ్రహ్మం ఆ విధంగా

ఎందుకు భాసిస్తుంది అని ప్రశ్నిస్తే దానికి సమాధానంగా బ్రహ్మసూత్ర భాష్యంలో శంకరుడు ఈ విధంగా చెప్పాడు. సర్వగుణాతీతమైన బ్రహ్మస్వరూపాన్ని సామాన్య మానవబుద్ధి అంత సులభంగా గ్రహించలేదు. అంగీకరించలేదు. సమస్తమైన మానవాళి బ్రహ్మస్వరూపాన్ని గ్రహించి తరించగలందులకై నిర్గుణ బ్రహ్మతత్త్వం సాకారంగాను, సగుణంగాను కనిపిస్తుంది. అదే భగవంతుని స్వరూపం. మానవ మేధస్సు ఊహించకలిగిన దైవస్వరూపం. మానవ మనస్సు భావించి తరించకలిగిన కళ్యాణగుణశోభితుడు భగవంతుడు. ఈ భగవంతుని ఆరాధించవచ్చు. పూజించవచ్చు. ప్రార్థించవచ్చు. మన ఆపదలు ఆయనతో మొరపెట్టుకోవచ్చు. అయన అనుగ్రహాన్ని పొందవచ్చు. ఈ సగుణ బ్రహ్మకు ఒక నిర్దుష్టమైన ఆకారాన్ని ఏర్పరచుకోవచ్చు. ఆయన్ను అనేకమైన పేర్లతో పిలువవచ్చు. నారాయణ, వాసుదేవ. పరమేశ్వర, అల్లా, ఏసుక్రీస్తు– ఇవన్నీ ఆయన నామాంతరాలు.

ఆ విధంగా శంకరుని బ్రహ్మ తత్త్వంలో ఈశ్వరుడు, భగవంతుడు, జీవుడు. కర్మ, ఉపాసన, ధ్యానం, భక్తి, పూజ, ఆత్మనివేదన అన్నీ అంతర్గతంగా చోటు చేసుకొన్నాయి. వీటితో సామాన్య మానవునికి కొంత ఊరట కలిగి జీవితంపై ఆశ కనిస్తుంది ఇవేవీ బౌద్ధంలో లేనందువల్ల బౌద్ధాన్ని నిరాకరించారు ప్రజలు.

శంకరుని దర్శనంలో పరబ్రహ్మ స్వరూపం మూడురకాలుగా ఉంటుంది.

1. పారమార్థిక సత్త
2. వ్యవహార సత్త
3. ప్రాతిభాసిక సత్త

ప్రాతిభాసిక సత్త అంటే కంటికి కనిపిస్తుంది కాని అదిమాత్రం యథార్థం కాదు. ఇక్కడ భ్రమ ప్రమాదులకు చోటు ఉన్నది. ఉదాహరణకు, ముత్యపు చిప్పను చూసి వెండి అని భావించామనుకొన్నప్పుడు, తాడును చూసి

పాము అని భ్రమించినప్పుడు, ఎండమావులను చూసి నీటికొలను అని భావించి నప్పుడు—వాటి యథార్థ స్వరూపం తెలిసిందాకా మనలో ఉన్న భ్రమ ప్రమాదులు తొలిగిపోవు. వీటికి ఉనికిలేదు. అయినప్పటికీ మనం వాటిని భావిస్తాం.

వ్యవహారసత్త అంటే నిత్యం మనం చూసే ప్రపంచం. దీనికి ఉనికి ఉన్నది. అయితే ఎప్పటిదాకా అంటే విజ్ఞాన ఘనమైన బ్రహ్మతత్వాన్ని గురించి మనం తెలుసుకోనంతవరకే. ఆ తరవాత ఈ ప్రపంచం పాము కుబుసంలా నిష్ప్రయోజనం అంటాడు శంకరుడు.

## ఈ జగత్తు మిథ్యా ?

శంకరులవారి భాష్యాలను చూసినట్లయితే జగన్మిధ్యావాదాన్ని ఆయన చెప్పారని, అందుకే భారతదేశం విజ్ఞాన శాస్త్రరంగంలోను, ఆర్థికరంగంలోను ముందంజ వేయలేకపోయిందని భావించినవారు లేకపోలేదు. అంతేగాకుండా 'జగమే మాయ' అనే నానుడి ప్రతి భారతీయుని మనస్సుపై చెరగని ముద్ర వేసిందని; అందువల్ల భారతీయులు లౌకికపరమైన నీతిని, సంఘ బాధ్యతను, వ్యక్తిధర్మాన్ని ఎక్కువగా పట్టించుకోరని కొందరి విమర్శకుల అభిప్రాయం.

కాని శంకరులవారి దృష్టిలో "ఈ జగత్తంతా మిథ్యే". కాని అది ఎవరి దృష్టిలో మిథ్య? ఎవరికి మిథ్య? ఎందుకు మిథ్యగా గోచరిస్తుంది? మిథ్యగా గోచరించటమంటే ఆయన దృష్టిలో ఏమిటి? మొదలయిన ప్రశ్నలకు ఆయన చెప్పిన సమాధానాలను పరిశీలించి తెలుసుకొన్న వారికి పైన చెప్పిన అభ్యంతరాలు అంతగా వర్తించవు. ఈ జగత్తు బ్రహ్మజ్ఞానికి మాత్రమే మిథ్య. ఇతరులకు అది వ్యవహారిక సత్త. ఈ ప్రపంచం మిథ్యత్వం వంధ్యాపుత్రుని వంటిది కాదు. గగనకుసుమం వంటిదికాదు. ఆకాశనగరం వంటిదికాదు. అని శంకరుడు స్పష్టం చేసాడు. అజ్ఞాన పరిమితినిబట్టి జ్ఞాన పరాకాష్టనుబట్టి ఈ జగత్తు యథార్థంగానూ, మిథ్యగానూ గోచరిస్తుంది.

# శంకరుని అనంతరం వేదాంత మత అభివృద్ధి

శంకరుని అనంతరం వేదాంతాన్ని అనేక మంది అభివృద్ధి చేశారు. శంకరుని ప్రముఖ శిష్యుడగు పద్మపాదుడు చతుస్సూత్రీ భాష్యం రాశాడు. దీన్ని "పంచపాదిక" అంటారు. అంతే ప్రాముఖ్యాన్ని కలిగిన సురేశ్వరాచార్యులు నైష్కర్మ్యసిద్ధి తైత్తిరీయ, బృహదారణ్యక ఉపనిషత్తులపై భాష్యం రాశాడు. క్రీ. శ. 900 సం॥ లో సర్వజ్ఞాత్మముని 'సంక్షేపశారీరకం' వాచస్పతి మిశ్ర, శంకారాచార్యుడు రాసిన బ్రహ్మసూత్ర భాష్యంపై 'భామతి' అనే టీకా గ్రంథాన్ని, క్రీ. శ. 1200 వ సంవత్సరంలో పంచపాదికపై వివరణ అనే గ్రంథాన్ని, 13వ శతాబ్దంలో భావతి పై అమలానందుడు 'కల్పతరువు' అనే గ్రంథాన్ని, 14వ శతాబ్దంలో విద్యారణ్యుడు 'వివరణప్రమేయసంగ్రహ' అనే గ్రంథాన్ని, 16వ శతాబ్దంలో అప్పయ దీక్షితులు కల్పతరువుపై 'పరిమళము' అనే టీకా గ్రంథాన్ని రాశారు. భామతి ఒక రకమైన వేదాంత మార్గానికి, 'వివరణము' మరొక రకమైన వేదాంత మార్గానికి దారి తీశాయి.

క్రీ. శ. 16వ శతాబ్దంలో మధుసూదన సరస్వతి 'అద్వైతసిద్ధి' అనే గ్రంథాన్ని, శ్రీ హర్షుడు ఖండనఖండఖాద్యం అనే గ్రంథాన్ని రాశారు. ఈ రెండూ అద్వైత దర్శనంలో మహా గ్రంధాలు. ధర్మరాజాధ్వరిన్ రాసిన వేదాంత పరిభాష, సదానందుడు వ్రాసిన వేదాంతసారం అనే గ్రంథాలు బాలురకు కూడా బోధించదగిన గ్రంథాలు.

ఆనందగిరి, గోవిందానందుడు, ప్రకాశానందుడు సూత్ర భాష్యాలకు సరళమైన టీకలను రాశారు. ప్రతిభా పాండిత్యాల్లో పైవారికి తీసిపోని వారు ఇద్దరు అద్వైత వేదాంతులు 19వ శతాబ్దంలో పుట్టారు. వారిలో ఒకరు వివేకానందుడు, మరొకరు స్వామి రామతీర్థ. పాశ్చాత్య దర్శనంచేత ప్రభావితులై, ఆధునిక విజ్ఞాన శాస్త్రాన్ని ఆమోదించి, దీని ప్రగతిని అంగీకరించి

సామాన్యప్రజల దుఃఖ, దారిద్ర్య, అసమానత్వాలను ఖండిస్తూ అద్వైతాన్ని సృజనాత్మకంగా వ్యాఖ్యానించి, మానవ జీవితాల్లో సుఖశాంతులను నెలకొల్పడానికై మానవతావాదాన్ని "మానవసేవయే మాధవసేవ" అని చెప్పారు. ఇదే వేదాంతంలోని పరమ రహస్యమన్నారు.

# 5

# శ్రీ రామానుజాచార్యులు
## (క్రీ. శ. 1017-1137)

### జననం : బాల్యం : విద్య : గ్రంథాలు : విశిష్టాద్వైత స్థాపన : విశిష్టాద్వైత ముఖ్య సిద్ధాంతాలు :

దక్షిణ భారతదేశంలో శ్రీవైష్ణవ సంప్రదాయాన్ని స్థాపించి, దానికి ఒక రూపాన్ని ఏర్పరచిన మహాపురుషుడు జగద్గురు శ్రీ రామానుజాచార్యులు. శ్రీ పెరుంబుదూరు అనే గ్రామంలో (మద్రాసుకు 60 కి. మీ) శ్రీమద్ ఆసురి సర్వక్రతు కేశవదీక్షితులు రామానుజుని తండ్రి. కాంతిమతి ఇతని తల్లి. క్రీ శ 1017 వ సంవత్సరం చైత్రశుద్ధ పంచమినాడు రామానుజాచార్యుడు జన్మించాడు. ఇతనిది ఆరుద్ర నక్షత్రం. హరితస గోత్రికుడు. లక్ష్మణుని అవతారమని శ్రీవైష్ణవులు భావిస్తారు. బృహత్‌పురాణం, శారద పురాణం, స్కాందపురాణాల్లో దక్షిణ దేశంలోఉన్న కావేరి, తామ్రపర్ణి పెరియాక్ నదులమధ్య ఉన్న పుణ్య ప్రదేశాల్లో అవతార పురుషులు పుడతారని ఉన్నది. బాల్యంనుంచి పుణ్య పురుషులతో రామానుజుడు కలిసి మెలిసి తిరుగుతూ వారివద్ద అనేకమైన విషయాలు నేర్చుకొనేవాడు.

ఆ రోజుల్లో కాంచీనగరంలో కాంచీపూర్ణుడనే ఒక మహా భక్తుడు ఉండేవాడు. కాంచి పట్టణానికి పూనమల్లె పట్టణానికి మధ్యలో శ్రీపెరుంబుదూరు పట్టణం ఉన్నది. శ్రీ కాంచీపూర్ణుడు జన్మత శూద్రుడైనప్పటికినీ, ఆయన మహా భక్తుడు కావడంవల్ల బ్రాహ్మణులు సైతం ఆయనకు పాదాభివందనం చేసేవారు. ఒకనాడు రామానుజుడు కాంచీపూర్ణుని చూడటం తటస్థించింది. ఆయన్ను తన

ఇంటికి ఆహ్వానించి భోజనం పెట్టి ఆయనకు సేవలు చేస్తాడు రామానుజుడు. ఇతనికి 16వ ఏట పెళ్ళి అవుతుంది. ఆ తరవాత కొద్దికాలానికి రామానుజుని తండ్రి మరణిస్తాడు. తండ్రి మరణానంతరం యాదవ ప్రకాశునివద్ద శిష్యునిగా చేరుతాడు బాల్యంనుంచి మంచి ప్రతిభ కలవాడు కాబట్టి గురువుగారు చెప్పిన విషయాలతో ఏకీభవించక స్వతంత్రంగా ఆలోచించేవాడు. ఒకనాడు ఉప నిషత్తుల్లో వర్ణించిన భగవంతుని స్వరూపాన్ని గురించి గురువుగారు ఈవిధంగా చెప్పారు : "కప్యాశం పుండరీకం" అని ఉపనిషత్తుల్లో ఉన్నది. ఈ విషయం భగవంతుని ముఖ లక్షణాలను గురించి వివరిస్తుంది. తన వివరణలో యాదవ ప్రకాశుడు ఈ విధంగా చెప్పాడు. "భగవంతుని ముఖం కోతి ముడ్డివలె ఎర్రగా ఉన్నది." ఈ మాటలు వింటూనే రామానుజుడు మూర్ఛపోయినంతపని చేసాడు. తేరుకొని గురువుగారిని సమీపించి ఏడుస్తూ నిలబడతాడు. ఎందుకు ఏడుస్తున్నా వని గురువుగారు మందలిస్తారు. అయ్యా తమరు అనవసరంగా భగవంతుని నిందించి భాగవతాపచారం చేసినందుకు చింతిస్తున్నానని రామానుజుడు చెబు తాడు. ఆ మాటలకు యాదవ ప్రకాశుడు కోపం తెచ్చుకొని అంతకన్నా బాగా చెప్పగలవా అని ప్రశ్నిస్తాడు. గురువు అనుగ్రహం ఉంటే అంతకన్నా బాగా చెబుతానని ఈ విధంగా దానికి భాష్యం చెప్పాడు.

"కప్యాశం పుండరీకం".

కం జలం పిబతీతి కపిః

కపి : సూర్యుడు.

నీళ్ళను నిరంతరం ఎవరు తాగుతారో వారు. ఎవరి కాంతివల్ల నీళ్ళలో ఉండే పద్మం వికసించి ఎర్రగా ఉంటుందో, అట్లాగే భగవంతుని మూర్తి కమలంవలె ఎర్రగా ఉంటుంది. అదే ఈ మంత్రానికి అర్థం అని రామానుజుడు చెప్పాడు.

అదేవిధంగా మరొకనాడు తైత్తిరీయ ఉపనిషత్తులోఉన్న భగవంతుని వర్ణనను గురించి చెబుతూ యాదవ ప్రకాశుడు ఈ విధంగా చెప్పాడు.

"సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ"

సత్యం, జ్ఞానం, అనంతం బ్రహ్మ అని యాదవ ప్రకాశుడు చెబుతాడు. వెంటనే రామానుజుడు ఆయన్ను ఖండిస్తూ సత్యం, జ్ఞానం, అనంతం అనేది భగవంతుని నుంచి విడదీసి చూడలేని గుణాలు. అవి ఆయన విగ్రహ గుణాలు. తటస్థ గుణాలు వేరుగా ఉంటాయి అని చెప్పాడు.

ఈ విధమైన గురుధిక్కారాన్ని సహించలేని యాదవ ప్రకాశుడు రామానుజుని అంతమొందింప ప్రయత్నిస్తాడు. ఇతర శిష్యులతో కలిసి కపటాలోచన చేసి రామానుజుని దీర్ఘయాత్ర నెపంతో భాగీరథిలో స్నానం చేయడానికై అందరూ కలసి వెళతారు. కాని గోవిందుడనే తోటి విద్యార్థివల్ల ఈ కుతంత్రాన్ని తెలుసుకొని తన జీవితాన్ని మొదటిసారిగా రామానుజుడు కాపాడు కొంటాడు. ఆ తరవాత కొంతకాలానికి రామానుజుని తల్లి కాంతిమతి మరణి స్తుంది. ఆ తరవాత కొంతకాలానికి భార్యను వదలివేసి సంన్యాసం స్వీకరిస్తాడు రామానుజుడు. ఆ తరవాత మరికొంత కాలానికి తిరిగి యాదవ ప్రకాశుని ఆశ్ర మంలో చేరుతాడు. అప్పుడు యామునాచార్యుడు వచ్చి దూరంనుంచి చూసి రామానుజుడు "దర్శన ప్రవర్తకాచార్యుడు" కాగలడని ఆశీర్వదించి వెళుతాడు. యాదవ ప్రకాశునితో పడలేక తల్లిని సలహా అడుగుతాడు. ఆమె సమదృష్టి కలిగిన భక్తురాలు కాబట్టి పరమ భక్తాగ్రగణ్యులైన యామునాచార్యుని, తిరు కచ్చికాచార్యుని, నంబిని ఆశ్రయించమంటుంది. వీరందరూ శూద్రులు. వీరి శుశ్రూషకూడా చేస్తాడు రామానుజుడు.

అప్పటికే రామానుజుని భాగవత తత్త్వాన్ని గుర్తించిన యామునాచార్యుడు రామానుజునికి ఒక సందేశం తన శిష్యుడైన పెరియనంబిద్వారా పంపిస్తాడు. ఇతన్నే మహాపూర్ణుడు అనికూడా పిలుస్తారు. అయితే పెరియనంబి, శ్రీ రామా నుజుడు శ్రీరంగపట్టణం చేరేసరికి యామునాచార్యుడు మరణిస్తాడు. ఎవరినైతే తాను చూసి, సేవించి తరించాలనుకొన్నాడో ఆయన మరణం రామానుజునిలో ఎనలేని ఆవేదన కలిగిస్తుంది. దగ్గరగా వచ్చి యామునాచార్యుని శవాన్ని చూసి

ఆశ్చర్యపోతాడు రామానుజుడు. చేతివేళ్ళు మూడు ముడుచుకొని ఉంటాయి. మిగతా శిష్యులను పిలచి గురువుగారు చనిపోతూ అంతిమ సందేశం ఏదైనా చెప్పారా అని అడుగుతాడు రామానుజుడు. విశిష్టాద్వైత సాంప్రదాయంలో వేదాంత సూత్రాలకు భాష్యం రాయాలని, వ్యాసునికి సర్వదా కృతజ్ఞునిగా ఉండాలని, నమ్మాళ్వార్‌కు విధేయుడుగా ఉండాలని గురువుగారు ఎప్పుడూ అంటూ ఉండేవారని తోటి శిష్యులు చెబుతారు. ఈ మూడు కార్యక్రమాలను తాను నెరవేరుస్తానంటాడు రామానుజుడు. వెంటనే మూడువేళ్ళు తెరుచుకొంటాయి. ఆ తరవాత శ్రీ తిరుకచ్చినంబి వద్ద శిష్యునిగా చేరుతాడు. ఆయనవద్ద శిష్యరికం చేసి శ్రీవైష్ణవం స్వీకరిస్తాడు. అంటే శ్రీ మహావిష్ణువు శంఖ చక్రాంకితాలను శరీరంపై ధరించాడు. తిరునామాన్ని తీర్చి దిద్దుతాడు. అదే రామానుజ రూపాన్ని మనం ఇప్పుడు ఆలయాల్లో చూస్తాం.

కాంచీపురంలోఉన్న శ్రీ మహావిష్ణువు ఆలయ సమీపంలోనే ప్రథమంగా ఒక మఠాన్ని స్థాపించాడు రామానుజుడు. అప్పుడు ఆయనవద్ద ఇద్దరు శిష్యులు చేరారు. వారు : ముదలిఆండాన్ లేదా దాశరథి, ఇంకా కూరత్తాల్వాన్ లేదా కూరేశ లేదా శ్రీ వత్సాంక అనికూడా అంటారు. ముఖ్యంగా స్వాధ్యాయనం, ప్రవచనం (అంటే శృతి, స్మృతి, ఇతిహాస పురాణాలను చదవడం, అందులో ఉన్న విశేషాలను ఇతరులకు చెప్పటం) తన ముఖ్య వృత్తిగా ఎంచుకొన్నాడు రామానుజుడు. అందుకే ఆయన అనేకమైన గ్రంథాలను రాయగలిగాడు.

## రామానుజుడు రాసిన గ్రంథాలు

1. శ్రీ భాష్యం : వేదాంత సూత్రాలకు విశిష్టాద్వైతపరంగా రాసిన భాష్య గ్రంథం.
2. శ్రీమద్ భగవద్గీతా భాష్యం
3. వేదార్థ సంగ్రహం
4. శరణాగతి గద్యం

5. వేదాంత దీపం
6. వేదాంత సారం
7. గద్యత్రయం

ఈ గ్రంథాలన్నీ ఆంగ్లంలోకి అనువాదమైనాయి. ముఖ్యంగా శ్రీభాష్యం, గీతాభాష్యంలో సాకారుడైన భగవంతుని నిరూపించడానికై రామానుజుడు యత్నించాడు.

## రామానుజుని సర్వమత సమాన దృష్టికి దృష్టాంతం

తిరుకొత్తయూర్ అనే గ్రామంలో నివశించే నంబి వద్ద శిష్యరికం చేశాడు రామానుజుడు. శ్రీరంగపట్టణం నుంచి తిరుకొత్తయూర్ పోయివస్తూ ఉండేవాడు. భక్తిమార్గంలో నామస్మరణద్వారా, ముఖ్యంగా అష్టాక్షరీ మంత్రమైన "ఓం నమో నారాయణ" అనే మంత్రాన్ని జపించడం ద్వారా భగవంతుని సన్నిధికి చేరవచ్చునని వైష్ణవ సాంప్రదాయం. అయితే ఈ మంత్రాన్ని గురువుద్వారా నేర్చుకొని శుచియై జపించాలనే నియమం ఒకటి ఉన్నది. సాధారణ మానవుల నందరినీ ఉద్ధరిద్దామనే ఉద్దేశంతోను, అన్ని మతాలవారు విష్ణువు కృపకు పాత్రులని చెప్పుటకు రామానుజుడు అతి రహస్యంగా ఉంచవలసిన ఈ మంత్రాన్ని, అతి రహస్యంగా బోధించవలసిన ఈ మంత్రాన్ని మత సామరస్య ధోరణిలో అందరికీ బోధించాడు. అందుకే శ్రీరంగపట్టణంలో ఉన్న దేవాలయంమీదికి ఎక్కి అందరినీ పోగుచేసి అతి బిగ్గరగా "ఓం నమో నారాయణ" అని అందరినీ అరవమని చెప్పేవాడు. ప్రహ్లాదుడు కూడా రాక్షస బాలురనందరినీ చేరదీసి వారందరికీ ఈ మంత్రాన్నే బోధించినట్లు భాగవత పురాణం చెబుతుంది.

అయితే రామానుజుడు తలపెట్టిన ఈ సర్వమత సమదృష్టిని కొందరు ఆ రోజుల్లో అంగీకరించలేదు. అందుకే రామానుజుని మందలిద్దామనే బుద్ధితో నంబి తిరుకొత్తూరునుంచి శ్రీరంగపట్టణం వస్తాడు. వారిద్దరి మధ్య జరిగిన సంవాదం చూద్దాం.

నంబి : మహానారాయణ మంత్రాన్ని అనేకమంది శ్రీవైష్ణవులకు నీవు చెప్పావట నిజమేనా ?

రామానుజుడు : నిజమే. చెప్పాను. అయితే మీ పాదాలను శరణుజొచ్చి మీ దయకు పాత్రుడనై ఈ మంత్రాన్ని అందరికీ మీ అనుమతితోనే చెప్పినట్లు భావించాను.

నంబి : ఇతరులకు చెప్పవద్దన్నానుకదా ? చెప్పినందుకు శిక్ష ఏమిటో తెలుసా ?

రామానుజుడు : గురువు ఆజ్ఞను ధిక్కరిస్తే నరకానికి పోతానని తెలుసు.

నంబి : శాస్త్రం తెలిసిఉండి, శిక్షను అనుభవించవలసి ఉంటుందని తెలిసుకొని కూడా నువ్వు ఈ పని ఎందుకు చేశావు ?

రామానుజుడు : మీ చరణాలు ఆనగా అందరికీ మంచి చేస్తున్నాననే ఆనందంలో నేను నరకానికి పోయినా పర్వాలేదు అనే తృప్తితో ఈ పని చేశాను.

అప్పటిదాకా విశిష్టాద్వైతాన్ని పరమ వైదిక దర్శనం అనేవారు. కాని ఆ సంఘటన జరిగినప్పటి నుంచి దాన్ని "ఎంబెరుమానార్ దర్శనం" అని పిలిచారు.

## రామానుజుని కాలంలో సామాజిక పరిస్థితులు

శ్రీరంగపట్టణానికి 50 మైళ్ళ దూరంలో ఉన్న కావేరి నదీప్రాంతం అంతా ఆ రోజుల్లో సస్యశ్యామలంగా ఉండి చోళరాజుల పరిపాలన కింద ఉండేది. చోళ సామ్రాజ్యం దక్షిణ భారతదేశం అంతా వ్యాపించి సింహళ దేశాన్నికూడా తన అధీనంలోనే ఉంచుకొన్నది. చోళ సామ్రాజ్య వైభవం గురించి చెప్పడానికి ఇక్కడ వీలుకాదు. వారు అనేకమైన యుద్ధాలు చేసినప్పటి

కినీ దేశంలో ఆర్థికాభివృద్ధికి కావలసిన చర్యలను, కళలను, సంస్కృతిని పెంపొందించడానికి తగిన భావ వికాసాన్ని రూపొందించారు. పరిపాలన అంతా వికేంద్రీకృతమై ఉండేది. గ్రామ పంచాయతీలు, దేవాలయాలకు వారిచ్చిన ఉదారమైన దానాలు, మత సామరస్యానికై వారు చేసిన కృషి ప్రశంసనీయం. చోళరాజులు ప్రథమంలో శైవులు. వారు శైవమతాన్ని ఎక్కువగా ఆదరించారు. అయినప్పటికీ శైవ-వైష్ణవ దేవాలయాలకు వారు చేసిన సేవ అనన్యం. అంతేగాకుండా బౌద్ధ జైన మతాలను వారు ఆదరించారు. తంజావూర్శు పట్టణం, శ్రీరంగపట్టణం చోళ సామ్రాజ్యం నడిబొడ్డు నగరాలుగా ఉండేవి. ఇవి పల్లవులకు, పాండ్యులకు సరిహద్దు పట్టణాలుగా ఒకానొకప్పుడు ఉండేవి. కాంచీపురం పల్లవుల రాజధాని. కాంచీపురం సంస్కృత భాషకు వికాస కేంద్రమయితే తమిళుల సంస్కృతికి తంజావూరు, మధురై, తామ్రపర్ణి, వికాస కేంద్రంగా ఉండేవి.

భాష్యకారులందరూ దక్షిణ భారతదేశంలో జన్మించి ఉత్తర భారత దేశంలో తమ వాణిని ప్రచారం చేశారు. శంకరుడు, రామానుజుడు, మధ్వాచార్యుడు, నింబార్కాచార్యుడు, శ్రీకృష్ణ చైతన్యుడు ఇత్యాదులందరూ ఒక విధమైన సాంస్కృతిక వారధిని నిర్మించారు. శ్రీ రామానుజుడు కాశ్మీరుదేశం వెళ్ళి బోధాయనుడు రాసిన వేదాంత సూత్రాలను అక్కడి వారికి తెలిపాడు. అంతేగాకుండా ఆలయాల్లో ఉండే అర్చన, పూజ, ఆరాధన, యజ్ఞయాగాలకు ఒక నిర్దిష్టమైన రూపాన్ని రామానుజుడు ఏర్పరిచాడు. వైష్ణవ సాంప్రదాయంలో ఉన్న లోపాలను సరిదిద్దాడు. స్మార్త విధానంలో ఉన్న లోపాలనుకూడా సరిదిద్దాడు. వైదిక కర్మకాండతో సమానమైన విలువ వైఖానస, పాంచరాత్ర ఆగమ కర్మలకు దేవాలయాల్లో ఏర్పడింది.

దేవాలయ నిర్మాణం, తటాక నిర్మాణం, శిల్పశాస్త్రం, ఆగమశాస్త్రం, వాస్తుశాస్త్రం, వైద్యశాస్త్రం, లలిత కళలు, భూ సంస్కరణ — భూ దానం, ఇత్యాదులు ఎన్నో సమగ్రమైన రూపాన్ని ఏర్పరచుకొన్నాయి. త్రివేంద్రంలోని

అనంత పద్మనాభస్వామి దేవాలయం, పూరీలో ఉన్న జగన్నాధస్వామి దేవా లయం మాత్రం సంప్రదాయాన్ని విడనాడటానికి ఆరోజుల్లో సుముఖంగా లేవు. తిరుమలలో ఉన్న శ్రీ వెంకటేశ్వరుని దేవాలయం వైష్ణవ దేవాలయంగా రామానుజుడు ప్రకటించాడు. అభయ ముద్రతో ఉన్న శ్రీ మహావిష్ణువు, వదలి వేసిన త్రిశూలం ఆధారంతో ఈ విషయాన్ని నిర్ధారణ చేసాడు రామానుజుడు. అంతేగాకుండా ధనాకర్షణ బీజమంత్రంతో ఒక యంత్రాన్ని కూడా రామానుజుడు అక్కడ స్థాపించాడని ప్రతీతి.

చోళరాజుల్లో కుళోత్తుంగ చోళుడు శైవ మతాభిమాని. చోళ రాజధానికి వచ్చి శివునికన్నా మించిన దైవం మరొకరు లేరని చెప్పవలసిందిగా శ్రీరంగ పట్టణంలో ఉన్న రామానుజునికి ఆదేశం పంపుతాడు కుళోత్తుంగ చోళుడు. అంతేగాకుండా అట్లా చెప్పకపోయినట్లయితే మరణ దండన విధిస్తాననికూడా భయపెడతాడు. ఈ వార్తను విన్న వెంటనే రూపం మార్చుకొని శ్రీరంగ పట్టణాన్ని వదలి నేడు దక్షిణ మైసూరుగా పిలువబడుతున్న హోయసల దేశానికి పారిపోతాడు రామానుజుడు. ఆ రాజ్యాన్ని బిట్టి దేవుడనే రాజు పరిపాలిస్తుండే వాడు. ఆయన జైనమతాభిమాని. అతన్ని వైష్ణవ మతస్థునిగా మార్చి, విష్ణు వర్ధనుడు అనే పేరు పెట్టాడు రామానుజుడు. కుళోత్తుంగ చోళుడు చనిపోయిన తరవాత రామానుజుడు మళ్ళీ శ్రీరంగపట్టణం వస్తాడు.

శ్రీవైష్ణవంలో రెండు తెగలు ఉన్నవి. అవి : 1. వాదగళై 2. తెంగళై రామానుజుడు తెంగళై తెగకు చెందినవాడు. తాను స్థాపించిన మఠాలకు పరాశరభట్టార్‌ను అధిపతిగా నియమించాడు రామానుజుడు. విష్ణు సహస్రనామా వళికి భాష్యం రాశాడు పరాశరభట్టు. ఈ వైష్ణవుల్లో మళ్ళీ అనేకమైన చిన్న చిన్న తెగలు ఉన్నవి. వారు : 1. పాంచరాత్రులు 2. వైఖానసలు 3. శ్రీవైష్ణ వులు 4 నంబివారు.

రామానుజుని ఒక అవతారమూర్తిగా భావించి ఆయన చిత్రపటాన్ని, ఆయన మూర్తిని వైష్ణవ దేవాలయాల్లో ఆరాధనా స్థలంలో ఉంచుతారు.

నారాయణ మంత్రాన్ని అందరికీ చాటిచెప్పి సర్వమానవ విముక్తికై పాటుపడిన మహానుభావుడు రామానుజుడు. అందుకే అట్టడుగున ఉన్న ప్రజానీకం అందరూ తరించాలనీ, వారందరూ భగవంతుని స్వరూపులే అని చెప్పాడు రామానుజుడు. ఆలయప్రవేశం, భగవదార్చన, భగవదనుగ్రహం అందరి సొత్తనీ, ఏ ఒక్కరి సొత్తు కాదని చెప్పి, పరోక్షంగా సమసమాజ నిర్మాణాన్ని స్థాపించడానికి కావలసిన సామాజిక భావాలను బీజప్రాయంగా వెదజల్లిన మహానుభావుడు రామానుజుడు.

## రామానుజుడు బోధించిన భగవత్స్వరూపం

"విష్ణో పరమం పదం". శ్రీ మహావిష్ణువు భగవంతుడు. ఆయన సాకారుడు గుణసహితుడు. ఆయన వైకుంఠంలో ఉంటాడు "భగవాన్" అంటే రక్షించేవాడు అని అర్థం. అట్లాగే సర్వాధారభూతుడు అని మరొక అర్థం. భగవంతుడు కళ్యాణ గుణస్వరూపుడు. ఆయనలో ఉండే గుణాలు రెండు రకాలుగా భాసిస్తాయి అవి : 1. స్వరూపగతగుణాలు 2. విగ్రహగుణాలు. స్వరూప గుణాలు మళ్ళీ రెండు రకాలుగా ఉంటాయి. అవి : 1. భక్తులను పీడించేవారి మదాన్ని అణచివేసే గుణాలు 2. భక్తులను ఆకర్షించే గుణాలు.

ముఖ్యంగా భగవంతునిలో ఉండే గుణాలు తొమ్మిది. అవి : 1. శౌర్యం 2. ధైర్యం 3. ప్రకరణం 4. వాత్సల్యం 5. సౌశీల్యం 6. సౌలభ్యం 7. సౌందర్యం 8. నిత్యయౌవ్వనం 9. లావణ్యం. ఈ గుణాలు కాకుండా ఆయన దివ్యమంగళ విగ్రహ స్వరూపంలో ఉండే గుణాలు ఆరు. అవి :

1. జ్ఞానం
2. బలం
3. ఐశ్వర్యం
4. వీర్యం
5. శక్తి
6. తేజస్సు

## భగవంతుడు ఎక్కడ ఉంటాడు ?

భగవంతుని ఉనికి ఎక్కడ ? ఆయన స్వరూపం ఏ విధంగా ఉంటుంది ? ఆయనకు మానవులకు ఉన్న సంబంధం ఏమిటి? ఆయన ఏమి చేస్తూ ఉంటాడు? ఆయన సాకారుడా ? లేక నిరాకారుడా ? మొదలయిన ప్రశ్నలన్నింటికి రామానుజుడు 'పరీష్కృత న్యాయాన్ని' పాటించి సమాధానం చెప్పాడు. అయనకు ముందున్నటువంటి వైష్ణవ సాంప్రదాయం, శృతి, స్మృతి, ఇతిహాస పురాణాదులు ధర్మశాస్త్రాలను ఆధారం చేసుకొని ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పాడు రామానుజుడు. దాన్నే 'మహా సిద్ధాంతం' అంటారు. విశిష్టాద్వైతులు.

భగవంతుడు ఎప్పుడూ రెండు రూపాల్లో భాసిస్తూ ఉంటాడు. అవి :

1. లీలావిభూతి
2. నిత్యవిభూతి

మన కంటికి కనిపించే సమస్తమైన భౌతిక ప్రపంచం ఆయనకు లీలా విభూతి. ఈ జగత్తులో భౌతిక పదార్థం చేతనాయుతమైన ఆత్మలు ఉంటాయి ఈ రెండూ ఆయనలో లీలలు అంటాడు రామానుజుడు. ఇక్కడ లీల అంటే మిధ్య కాదు. యథార్థంగా ఉన్నదే. దీన్నే 'శరీరాత్మాభావం' అని ఆయన వర్ణించాడు. శరీరాత్మా భావం అంటే ఏమిటి ? ఒక ద్రవ్యంలో ఉంటూ అచేతన మైన ఆ పదార్థాన్ని చైతన్యవంతం చేస్తూ, ఆ శరీరాన్ని తనకిష్టమైనట్లు వినియో గించుకొంటుంది ఆత్మ. అటువంటప్పుడు ఆ శరీరం ఆత్మకు విధేయురాలై ఉంటుంది. అదేవిధంగా ఆత్మకూడా దాని ఉనికికి, దాని రూపానికి, దాని చర్య లకు, దాని ధ్యేయాన్ని సాధించడానికి ఒక శరీరాన్ని ఆశ్రయించవలసి ఉంటుంది. ప్రపంచంలో ఉన్న ప్రతి శరీరానికి ఒక జీవి ఉండి దాన్ని చైతన్య వంతం చేస్తుంది. అట్లాగే ఈ జీవుల సమూహమంతా కలసి చైతన్య స్వరూప మైన భగవంతుని శరీరంగా భాసిస్తాయి. ఆత్మలు అన్నీ కలసి భగవంతుని శరీరంగా భాసిస్తాయి. ఆత్మలు శరీరాలను ఏ విధంగా అయితే వాడుకొంటాయో

అదేవిధంగా భగవంతుడుకూడా ఆత్మలను వాడుకొంటాడు. ఇక్కడ ఈ రెండూ పరస్పర ఆధార న్యాయాన్ని సూచిస్తాయి. దీన్నే రామానుజుడు ఆధార—అధేయ న్యాయమని, శేషి—శేష న్యాయమని, నియంత—నియత న్యాయమని చెప్పాడు.

పైన చెప్పిన వర్ణన అంతా లీలావిభూతి తత్త్వానికే వర్తిస్తుంది. ఆయన నిత్యవిభూతిలో ఈ వర్ణన వర్తించదు. పరమ పదమైన నిత్య విభూతిలో ఈ వర్ణన వర్తించదు. పరమపదమైన నిత్యవిభూతిలో వైకుంఠధాముడైన శ్రీమహావిష్ణువు ఉంటాడని రామానుజుడు చెప్పాడు. ఆయన సగుణుడా? లేక నిర్గుణుడా అనే ప్రశ్నకు రామానుజుడు చెప్పిన సమాధానాన్ని చూద్దాం. భగవంతుడు సాకారుడని, నిరాకారుడని, ఆయన సగుణుడని, ఆయన నిర్గుణుడని రామానుజుని మతం. ఒకే ద్రవ్యం ఒకే కాలంలో ఒకేచోట సాకారంగానూ, నిరాకారంగానూ, సగుణంగానూ, నిర్గుణంగానూ ఎట్లా ఉంటుందని ప్రశ్నించవచ్చు. ఎవరైన భగవంతుడు సగుణుడని భావిస్తే ఆయన స్వరూపం కళ్యాణ గుణరూపమని రామానుజుడు చెప్పాడు. అట్లా కాకుండా భగవంతుని నిర్గుణుడుగా భావిస్తే ఆ భావన కొంతవరకు పరిమితిని కలిగి ఉంటుంది. భగవంతుడు నిర్గుణుడు అంటే, ఆయనలో ఏ విధమైన హేయగుణాలు లేవు కనక, అంతవరకే ఆయన నిర్గుణుడని భాష్యం చెప్పాడు రామానుజుడు. నిర్గుణ, నిరంజన, నిరాకార ఇత్యాది శబ్దాలను ఈ విధంగా అన్వయించుకోవాలి. ఆయన అపహత పాపుడు. కళ్యాణ గుణస్వరూపుడు. సౌశీల్యుడు. సులభుడు. జగద్రక్షుడు. అవికారత్వం, నిర్వికారత్వం, సశరీరత్వం, అశరీరత్వం మొదలయిన వాటిని ఈ విధంగానే అర్థం చేసుకోవాలి. అంతేగాకుండా మోక్షప్రదాతత్వం అనే గుణం ఆయనకు ఒక్కడికే ఉన్నది. మరెవ్వరికీ లేదు.

## మానవునికి భగవంతునికి ఉన్న సంబంధం

ఈ సృష్టిలో ఉన్న సమస్తమైన జీవరాసులు భగవంతుని అధీనంలో ఉంటే మానవునికి క్రియాశీల యుతమైన స్వేచ్ఛ ఉన్నదా? లేదా? సమస్తం

భగవంతుని లీల అయితే మానవుడిలో ఉన్న సంకల్పం, ఇచ్ఛ, శక్తి, ఇత్యాదులకు అర్థం ఏమిటి?

సమస్తమైన జీవరాసుల్లోను భగవంతుడు 'అంతర్యామిగా' ఉంటాడు. దీన్నే 'అన్యోంతర ఆత్మ' అన్నాడు రామానుజుడు. ఈ అన్యోంతర ఆత్మ మానవులు చేసే అన్ని కర్మలకు, నీతిగాని, అవినీతికాని, మంచికాని, చెడుకాని, పుణ్యంకాని, పాపంకాని, సాక్షీభూతంగా ఉంటుంది. కేవలం అది నిర్వ్యాపారంగా ఉండదు. దాన్నే "ఉదాసీన వదాసీనము" అని చెప్పాడు రామానుజుడు. అంటే క్రియాశక్తి, సంకల్పశక్తి ఈ రెండూ భగవంతుని నుంచి జీవులకు సంక్రమిస్తాయి. ఈ దశలో ఆత్మలు సర్వతంత్ర స్వతంత్రంగా ఉంటాయి. అయితే ఆ తరవాత మానవుడు చేసే ప్రతిపని తన ఇచ్ఛాశక్తి ప్రకారం, తన ఆలోచనాశక్తి ప్రకారం, తన క్రియాశక్తి ప్రకారం చేస్తాడు. అట్లా చేయబోయేముందు భగవంతుని అంశమైన అన్యోంతర ఆత్మ ఇది మంచిది, ఇది చెడ్డది, ఇది చేయవచ్చు, ఇది చేయరాదు అని అంతర్వాణికి సూచనా ప్రాయమైన హెచ్చరిక చేస్తుంది. దీన్నే 'అనుమంత్రిత్వము' అంటాడు రామానుజుడు. ఇదే భగవంతునికి మానవునికి మధ్య ఉన్న సంబంధం. దాన్ని పాటించిన మానవుడు సద్గతికి పోతాడు. పాటించని వానికి కూడా ఏదో ఒక మార్గం ఉంటుంది కనక దాన్ని దుర్గతి అన్నారు. అందువల్ల మానవుడు చేసే ప్రతి పనికి ఆయనే బాధ్యుడు అవుతాడు. అట్లాంటప్పుడు భగవంతుడెందుకు? ఆయన అనుమంత్రిత్వమెందుకు? కర్మఫలాన్ని మానవుడు అనుభవించాల్సి ఉంటే ఆయన కరుణా సముద్రుడు ఎట్లా అవుతాడు? ఇంకా ఆయన రక్షించేది ఎవరిని? మొదలయిన ప్రశ్నలు వస్తాయి.

ఈ ప్రశ్నలకు రామానుజుడు చెప్పిన సమాధానాన్ని చూద్దాం. ప్రతి జీవికి ఆలోచనాశక్తి ఉంటుంది. క్రియాశక్తి ఉంటుంది. కనక ప్రతిజీవి తాము చేసే పనులకు, వాటి ఫలితాలకు అవే బాధ్యత వహిస్తాయి. రకరకాలైన ఆశయాలు, ఆశల మధ్య ఉన్న జీవులు ఏదో ఒక భావవీచికలో, ఏదో ఒక

మానసిక అవస్థలో యుక్తాయుక్త విచక్షణాజ్ఞానాన్ని కోల్పోతాయి. జీవుడప్పుడు తనకు తోచింది చేస్తాడు. అంతమాత్రాన భగవంతుడు నిర్దయుడని చెప్పలేం. తన ఇష్టానికి విరుద్ధంగా భగవంతుని అభీష్టానికి అనుగుణంగా పొమ్మని భగవంతుడు జీవులను శాసించడు. ఇక్కడ నియతివాదానికి, నియంతృత్వానికి తావులేదు. భగవంతుని వద్దనుంచి కర్తృత్వాన్ని జీవులు పొందుతాయి. అంత మాత్రంచేత ఈ జీవులన్నీ చేసిన పనుల ఫలితం భగవంతునికి అంటదు. ఏ జీవి ఏ కర్మను చేస్తుందో అ జీవే ఆ కర్మను, ఆ కర్మ ఫలితాన్ని అనుభ విస్తుంది. జీవులు తమకున్న సేచ్ఛను, ఇచ్ఛను సంపూర్ణంగా వినియోగించుకో వచ్చు భగవంతుడు అడ్డుపడడు. అందుకే ఆయన కర్మాధ్యక్షుడు అని పిలువ బడ్డాడు. అటువంటప్పుడు ఆయనకు ఈ అధ్యక్ష పదవిమాత్రం ఎందుకు? జీవులకు అనుమంత్రిత్వం ఇవ్వడంమాత్రం ఎందుకు?

ఇదంతా ఆద్యప్రవృత్తి అని రామానుజుడు చెప్పాడు. తన సిద్ధాంతాన్ని సమర్థించుకోడానికై స్మృతి, శృతి, ఇతిహాస పురాణాదుల్లోనుంచి అనేకమైన విషయాలను ఉదహరిస్తాడు. జీవుల్లో ఉన్న ఇచ్ఛ, స్వేచ్ఛ అనుమంత్రిత్వం, పరాధీనత అన్నీ పరస్పర విరుద్ధాలు కావంటాడు రామానుజుడు. జీవ స్వరూపాన్ని గురించి తెలుసుకొన్నట్లయితే ఈ విషయాలన్నీ ఎట్లా విరుద్ధం కావో ప్రతివారికి తెలుస్తుంది. కనక రామానుజుని దర్శనంలోని జీవ స్వరూపాన్ని గురించి తెలుసుకొందాం.

## రామానుజ దర్శనంలో జీవస్వరూపం

1. బుద్ధి, మనస్సు ఇంద్రియాలకన్నా భిన్నంగా ఆత్మ ఉంటుంది.
2. ఆత్మ స్వయంప్రకాశత్వాన్ని కలిగి ఉంటుంది.
3. చైతన్యం ఆత్మకున్న లక్షణాలన్నింటిలోకి విశేషమైన గుణం.
4. ఆత్మ ముఖ్యంగా జ్ఞానాన్ని తెలుసుకొనేది.
5. ఆత్మ సగుణ బ్రహ్మస్వరూపంలో ఒక అంశం.

6. జీవాత్మకు ఒక శరీరం ఉంటుంది. దాన్ని సూక్ష్మ శరీరం లేదా లింగ శరీరం లేదా 'ధర్మ భూతజ్ఞాన శరీరం' అంటారు.
7. ఆత్మలు అనంతం, అనేకం.
8. ఆత్మలకు స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలున్నాయి.
9. ఆత్మ అణుస్వరూపి.
10. ఆత్మలు స్వ స్వరూపంలో అన్నీ సమానంగానే ఉంటాయి.
11. ఆత్మ కర్త, భోక్త.
12. ఆత్మలు పరమేశ్వరుని దివ్యమంగళ విగ్రహానికి శరీరంగా ఉంటాయి.
13. మోక్షదశలో భగవంతుని గుణాలన్నింటినీ పొందుతాయికాని సృష్టి కర్తృత్వము, మోక్షప్రదాతత్వం మాత్రం ఉండవు.

## రామానుజుని దర్శనంలో భక్తిస్వరూపం

'భజ్' అనే ధాతువు నుంచి 'భక్తి' అనే పదం వస్తుంది. వేద మంత్రాలలో భక్తి శబ్దం ఉన్నది. భగవంతుని భజించమనీ, భగవంతుని సేవ చేయమని, ఋగ్వేదంలో ఉన్నది. ప్రజలందరూ ఏ దేవతను ఆరాధిస్తారో, ఏ దేవుణ్ణి ఉపాసిస్తారో వారినే పూజించమని యజుర్వేదం చెబుతుంది. ఉపాసన అంటె సమీపంలో కూర్చోవటం అని అర్థం. దేనికి సమీపంలో కూర్చోవడం అనే ప్రశ్న వస్తుంది. భగవంతునికి దగ్గరగా కూర్చోవడం అని సమాధానంచెప్పారు. భగవంతునిలో తప్ప ఇతరత్రా దేనిలో ఆసక్తి లేకపోవడం భక్తి అని శాండిల్య మహర్షి భక్తిసూత్రాల్లో చెప్పాడు. వ్యాకులత లేని మనస్సుతో నిరంతరం భగవంతుని దివ్య నామాన్ని స్మరిస్తూ భగవంతునికి అంకితమై పోవడమే భక్తి అని నారద భక్తిసూత్రాలు చెబుతాయి. ఈశ్వరమహర్షి. ప్రణిధానమే భక్తి అన్నాడు. ప్రణిధానం భక్తి విశేషరూపమని వ్యాసుడు చెప్పాడు. నిరంతరం భగవంతుని మనస్సులో నింపుకొని ఆరాధించటమే భక్తి అని భగవద్గీత చెబుతుంది.

వివేక చూడామణి అనే గ్రంథంలో శంకరులవారు భక్తిని గురించి ఈ విధంగా చెప్పారు. స్వ స్వరూపానుసంధానమే పరభక్తి. శివానందలహరిలో పరమేశ్వరుని పాదసన్నిధిని అంటిపెట్టుకొని ఉండటమే భక్తి అన్నాడు శంకరుడు.

కపిలమహర్షి సాంఖ్య ప్రవచన సూత్రాల్లో భక్తిని గురించి ఈ విధంగా చెప్పాడు. సమస్తమైన జీవరాసుల హృదయాంతర్గతమైన పరమేశ్వరుని నిరంతరం చింతించుటే పరమ భక్తి.

యామునాచార్యుడు భక్తిని గురించి ఇట్లా చెప్పాడు : భగవంతుని దర్శించటం పరమభక్తి లక్షణం. భగవంతునిలో ఐక్యమవటం పరజ్ఞానం. ఆ విధంగా భగవంతునిలో ఐక్యమై ఉండాలనే భావమే పరమ భక్తి.

మధ్వాచార్యులు భక్తిని గురించి ఈ విధంగా చెప్పారు. భగవంతునిలో దృఢమైన ప్రేమను కలిగి ఉండాలి. మరేదానిలో ఆసక్తిని కలిగి ఉండరాదు. భగవంతునిలో ఉండే పరమప్రేమ రూపానికే భక్తి అని పేరు.

## భక్తిస్వరూపం

1. భగవంతుని గుణ గణాల మహత్తులో ఆసక్తిని కలిగి ఉండాలి.
2. భగవంతుని రూపమందు ఆసక్తిని కలిగి ఉండాలి.
3. పూజాసక్తి
4 స్మరణాసక్తి
5. దాస్య స్వాసక్తి
6. సేవాసక్తి
7. సఖ్యాసక్తి
8. వాత్సల్యాసక్తి

9. కాంతాసక్తి

10. ఆత్మనివేదనాసక్తి

11. తన్మయాసక్తి

12. పరమ విరహాసక్తి

ఇవన్నీ భక్తి భావాన్ని తెలియచేస్తాయి.

## భక్తుని లక్షణాలు

ఆధ్యాత్మికమైన చింతనలో మునిగి ఉండి, తన వంశాన్ని గురించికాని, తను పుట్టిన కులాన్ని గురించికాని, తాను పెరిగిన వాతావరణాన్ని గురించి కాని, తాను సంపాదించిన ఐశ్వర్యాన్ని గురించికాని, విజ్ఞానాన్ని గురించికాని గర్వపడడు భక్తుడు, లేదా తక్కువగా భావించడు భక్తుడు. వినయం, కరుణ, నమ్రత, శీలం, సత్య సంధత, ఆశ్రితరక్షణ భక్తునిలో ఎప్పుడూ ఉంటాయి. తన్ను గురించి ఎక్కువ తక్కువలు చెప్పుకోడు భక్తుడు. పరమ శాంతితోను, గంభీరంగాను, సరళమైన సాధు స్వభావంతోను, అందరిలో సమభావం తోను భక్తుడు ఉంటాడు. ఎవ్వరినీ ఆయన ద్వేషించడు; ఆయనను ఎవ్వరూ ద్వేషించరు.

భారతీయ భక్తి సాంప్రదాయం చాలా గొప్పది. చరిత్రకు అందినవారు, చరిత్రకు అందనివారు అనేకమంది మహాభక్తులు జన్మించిన భూమి భారతావని. వ్యాసుడు, శుకమహర్షి, నారదుడు, తుంబురుడు, శాండిల్యుడు, గార్గి, విష్ణు వర్ధనుడు, ప్రహ్లాదుడు, భీష్ముడు, విదురుడు, సంజయుడు. ఉద్ధవుడు, కుచేలుడు, బలిచక్రవర్తి, హనుమంతుడు, విభీషణుడు, సుగ్రీవుడు — మొదలయినవారు పురాణపురుషులు. నిత్య స్మరణీయులు. మహాభక్తులు.

నందుడు, గోకులంలో పుట్టినవారు, వ్రజస్త్రీలు, గోకమేళుడు, శ్రీకృష్ణ చైతన్యుడు, రవిదాసు, తుకారాం, నానక్, పండరీబాయి, కబీరు, రామదాసు,

తులసీదాసు, కనకదాసు, తిరుమంగై ళ్వార్, అండాళ్, నాయనారులు, ఆళ్వారులు మహా భక్తాగ్రేసరులు.

## నవవిధ భక్తులు : జపం

జపం మూడురకాలు : 1. మంత్రజపం. 2. మానసిక జపం. 3. సంకీర్తనా జపం. ఏ రకమైన జపం చేస్తున్నా కొన్ని ఉపాంగాలు భక్తిలో ఉన్నాయి. అవి : 1. ప్రదక్షిణ. 2. ప్రణవం. 3. పూజ. 4. గురుదేవుల దర్శనం. 5. భావమందిరంలో ఏకాగ్రత. 6 ఏకభుక్తం. ఇవన్నీ భక్తి భావాన్ని పెంపొందిస్తాయి. 1. శాంతభక్తి, 2. దాస్యభక్తి, 3. సఖ్యభక్తి, 4. వాత్సల్యభక్తి, 5. వందనభక్తి, 6. అర్చనాభక్తి, 7. సేవాభక్తి, 8. స్మరణభక్తి, 9. ఏకాంతభక్తి—అనేవి నవవిధ భక్తులు. భక్తిమార్గం మూడు రకాలు. ఏ మార్గాన్ని అనుసరించినా భగవంతుని చేరవచ్చు. అవి :

1. మార్జాల కిశోర న్యాయం
2. మర్కట కిశోర న్యాయం
3. కచ్ఛప కిశోర న్యాయం

భక్తి, ప్రపత్తి శరణాగతి — వైష్ణవంలో అంగీకరించిన మోక్ష మార్గాలు. వీటినే సామాన్య జనం ఆదరించి మోక్షాన్ని పొందుతారు.

# 6

# మాధ్వదర్శనం

అద్వైతం, విశిష్టాద్వైతం, ద్వైతం అనే మూడు దర్శనాలు వేదాంతానికి పట్టుకొమ్మలు. బ్రహ్మసూత్రాలు, భగవద్గీత, ఉపనిషత్తులకు శ్రీ శంకరాచార్యులవారు, శ్రీ రామానుజాచార్యులవారు, శ్రీ మధ్వాచార్యులవారు భాష్యాలు రాసి వేదాంతాన్ని సుస్థిరం చేశారు. ఆ విధంగా వీరు త్రిమతాచార్యులయ్యారు. అందుకే వీ.ని త్రిమత స్థాపకుల.్నారు.

జగద్గురు మధ్వాచార్యులవారు క్రీ. శ. 1199వ సంవత్సరంలో జన్మించారు. వీరి -న్మస్థలం——————క్రీ. శ. 1294లో పరమపదించారు. వీరు రాసిన గ్రంథాలు అనేకం. అందులో ముఖ్యమైనవి :

1. ప్రస్థానత్రయం మీద భాష్యాలు
2. దశప్రకరణ గ్రంథాలు
3. మహాభారతంమీద వ్యాఖ్యానం
4. ఋగ్వేదంమీద భాష్యం
5 మహాభారత తాత్పర్య నిర్ణయ
6. న్యాయ వివరణ
7. కర్మ నిర్ణయ
8. కృష్ణామృత మహార్ణవ
9. గీతాభాష్యం
10. పురాణ ప్రస్థానం
11. ఉపనిషద్ భాష్య, ఋగ్ భాష్యం

ఈ గ్రంథాలన్నింటినీ కలిపి 'సర్వమూల' అంటారు. ఇవన్నీ కుంభ కోణం నుంచి ప్రచురితమయ్యాయి.

## మధ్వ దర్శనంలో జీవస్వరూపం

మధ్వ దర్శనంలో మనకు విశేషంగా కనిపించే అంశాలు అనేకం ఉన్నాయి. అందులో 'పంచభేదసిద్ధాంతం' చాలా ఆసక్తికరంగా ఉంటుంది. ఈ సమస్తమైన ప్రపంచంలో ఉన్నవి మూడే పదార్థాలు. అవి 1. భగవంతుడు 2. జీవులు 3. భౌతికపదార్థం. కాని వాటి సంబంధంలోనూ, అనుబంధంలోనూ తేడాలు ఉన్నవి. ఆ తేడా ఎట్లా ఉన్నదీ చెప్పేదే "పంచభేదసిద్ధాంతం".

1. ఒక జడపదార్థానికీ మరొక జడపదార్థానికీ తేడా ఉన్నది.
2. ఒక జడపదార్థానికీ జీవపదార్థానికీ తేడా ఉన్నది.
3. ఒక జడ పదార్థానికీ భగవంతునికీ తేడా ఉన్నది
4. ఒక జీవునికీ మరొక జీవునికీ తేడా ఉన్నది.
5. ఒక జీవునికీ భగవంతునికీ తేడా ఉన్నది.

## జీవ స్వరూపం

జీవరాసులు కేవలం జ్ఞాన స్వరూపాలు కావు. అవి స్వయంప్రకాశితాలు అద్వైతులు చెపిన సిద్ధాంతాన్ని మధ్వాచార్యుడు నిరాకరించాడు. జీవులు కర్తృత్వాన్ని, భోక్తృత్వాన్ని కలిగి ఉంటాయి. ఆనందం, చైతన్యం వాటి గుణాలు. జీవులు కూడా నామ రూపాలను కలిగి ఉంటాయి. అంతమాత్రాన ప్రకృతిలో ఉన్న మిగతా పదార్థాలలాగ జీవులు కూడా నశిస్తాయనుకోరాదు. జీవులు ప్రకృతినుంచి ఉద్భవించినవికావు. అందువల్ల వాటికి నాశనం అనేది లేదు. దీని ఆకృతి భౌతికమైనప్పటికినీ, దాని స్వస్వరూపం దైవికం కాబట్టి జీవులకు నశింపు అనేది లేదు. అందుకే జీవులన్నీ భగవంతుని ప్రతిబింబాలు అంటాడు మధ్వాచార్యులు. ప్రతిబింబం రెండు రకాలుగా ఉంటుంది. అవి :

1. సోపాధిక ప్రతిబింబం 2. నిరూపాధిక ప్రతిబింబం

## సోపాధిక, నిరూపాధిక ప్రతిబింబ వాదం

సోపాధిక ప్రతిబింబం అంటే ఒక ఉపాధిలో ఒక పదార్థం ప్రతిబింబించినప్పుడు అది సోపాధిక ప్రతిబింబమవుతుంది. ఏ ఉపాధిలో అయితే ప్రతిబింబం ప్రతిబింబిస్తుందో ఆ ఉపాధి నిర్మలంగానూ, స్వచ్ఛంగాను ఉండవచ్చు లేదా ఉండకపోవచ్చు. ఇక్కడ ఉపాధి స్వచ్ఛతను, నిర్మలత్వాన్ని బట్టి ప్రతిబింబం స్వచ్ఛతను, నిర్మాల్యతలు ఉంటాయి. ఉదాహరణకు ఒక నీటి సరస్సులో సూర్యుడు ప్రతిబింబిస్తే అది సోపాధిక ప్రతిబింబం అవుతుంది.

అట్లాకాకుండా ఉండేదే నిరూపాధిక ప్రతిబింబం సోపాధిక ప్రతిబింబంలో ఉపాధి, ఇంకా ప్రతిబింబించిన వస్తువు వేరువేరుగా ఉంటాయి. ఈ రెండూ ఒకటికావు. కాని నిరూపాధిక ప్రతిబింబంలో, ఏ వస్తువైతే ఏ ఉపాధిలో ప్రతిబింబిస్తుందో, అప్పుడు ఆ ఉపాధి ఆ ప్రతిబింబించే వస్తువు స్వరూపాన్ని దాలుస్తుంది. ఉదాహరణకు—సూర్యుడు నుంచి కిరణాలు బయల్వెడతాయి. ఈ సూర్య కిరణాలు వర్షం కురుస్తున్నప్పుడు ఒకానొక నీటి బిందువుగుండా ప్రయాణిస్తున్నప్పుడు ఏదో ఒక సూర్యకిరణం ఒకానొక నీటి బిందువులో ప్రతిబింబించి అది విశ్లేషణ పొంది ఇంద్ర ధనుస్సు (రంగుల హరివిల్లు, ఏడు రంగుల విల్లు) గా మనకు కనిపిస్తుంది. ఈ రంగుల హరివిల్లు సూర్యుని నుంచి వచ్చే కాంతి కిరణం ద్వారా ఏర్పడినప్పటికినీ, అది సూర్యుడుకన్నా భిన్నంగా ఉంటుంది. కాంతి కిరణంకన్నా భిన్నంగా ఉంటుంది. కాని ఏ నీటి బిందువుగుండా అయితే ఈ కాంతి కిరణం ప్రవహిస్తుంటుందో ఆ నీటి బిందువు హరివిల్లును ప్రదర్శిస్తుంది. మిగతావి మామూలుగానే అట్లానే ఉంటాయి. అదేవిధంగా జీవులన్నీకూడా భగవంతుని ప్రతిబింబాలే. అంతమాత్రాన, హరివిల్లును ప్రతిబింబించే కాంతికిరణం ఏ విధంగా అయితే సూర్యుడు కాదో (అది సూర్యుని నుంచి వచ్చినప్పటికి), అట్లాగే జీవుడు కూడా భగవంతుడు కాడు. దీన్నే స్వరూపోపాధి అని మధ్వాచార్యులు చెప్పారు. అనేకమైన ఉపమానాలతో ఈ విధమైన జీవ—ఈశ్వరుల సంబంధాన్ని వర్ణించారు. రూప—ప్రతిరూపం,

అంశ–అంశి, ఛాయాపురుష, అగ్ని విస్ఫులింగం, మొదలయిన ఉపమానాలతో జీవులకు–ఈశ్వరునికి కల సంబంధాన్ని వర్ణించారు.

స్వరూపభేధాన్ని పట్టి జీవుల నానాత్వం సాధ్యం అవుతుందని మధ్వాచార్యుడు చెప్పాడు. అంతేగాకుండా అనాది స్వరూపయోగ్యతను బట్టి కూడా జీవుల్లో తారతమ్యాలు ఉంటాయి.

## జీవుల ఆశయం ఏమిటి ?

## పురుషోత్తమ సంప్రాప్తమే జీవుల పరమ ఆశయం

"విష్ణుతత్వవినిర్ణయ" అనే గ్రంథంలో మధ్వాచార్యుడు పురుషోత్తమప్రాప్తి విధానాన్ని గురించి చెప్పాడు. "తత్త్వనిర్ణయం" అనే గ్రంథంలో జీవుడు, ప్రకృతి, భగవంతుని స్వరూపాన్ని గురించి చెప్పాడు. భగవద్గీత, మహాభారతం, అష్టాదశమహాపురాణాలు, ప్రశ్న ఉపనిషత్‌లకు మహాతాత్పర్యం రాస్తూ శ్రీ మహావిష్ణువు పరమ పురుషుడని, ఆయన్ను సందర్శించడం జీవి పరమావధి అని అయన చెప్పాడు.

"విష్ణోః పరమం పదం" ॥

ఆధ్యాత్మిక పరమపద సోపానాల్లో శ్రీ మహావిష్ణువు పదం పరమపదం. ఆయన అనుగ్రహం లేనిది మోక్షం సిద్ధించదు. "తేషాం అహం సముద్ధరత" అని గీతలో ఉన్నది. భగవంతుని శరణుజొచ్చిన వారికి, వారి వారి యోగ్యతలను బట్టి భగవంతుని అనుగ్రహం సంప్రాప్తమవుతుంది. భగవంతుని అష్ట మహిమలు జీవులకు సంప్రాప్తమవుతాయి అవి :

1. ప్రపంచోత్పత్తి
2. ప్రపంచ స్థితి
3. ప్రపంచ సంహారం
4. ప్రపంచ నియతి

5. జ్ఞానం
6. ఆవృతి
7. బంధం
8. మోక్షం

## క్రమముక్తి, జీవన్ముక్తి, సద్యోముక్తి, సర్వజనముక్తి

వేదాల్లో మనకు మోక్షాన్ని గురించి ముక్తిని గురించి అనేకమైన వర్ణనలు ఉన్నాయి. ప్రతి జీవి కర్మ చేస్తూ, కర్మ ఫలితాలను అనుభవిస్తూ కేవలం పుణ్య కర్మ ఫలితాలు ఉన్నప్పుడే 'స్వర్గసుఖాలు అనుభవించటం క్రమముక్తి. శ్రీ శంకరాచార్యులవారి అద్వైత వేదాంతం మాత్రమే జీవన్ముక్తిని అంగీకరిస్తుంది. మాధ్వదర్శనం, రామానుజ దర్శనం జీవన్ముక్తిని అంగీకరించవు. జీవుడు శరీరంలో ఉండగానే మోక్షం లభించటం దుస్తరం అన్నారు. సాయుజ్యం, సామీప్యం, సాలోకం, సారూప్యం అనేవి ఉన్నతమైన మోక్ష ప్రదాలు. కాని అద్వైతంలోమటుకు బ్రహ్మ తాదాత్మ్యం మాత్రమే అత్యున్నతమైన ముక్తి. భక్తిమార్గంలో సర్వజన ముక్తికి తావున్నది. నామసంకీర్తన ద్వారా, భగవదనుగ్రహం లభిస్తుంది. అప్పుడు అందరికీ ముక్తి లభిస్తుంది. జీవాత్మలన్నీ పరమాత్మలో లయనువుతాయి. తిరిగి సృష్టి ప్రారంభమవుతుంది.

## మధ్వాచార్యులవారి జీవిత సంగ్రహం

నారాయణ పండితాచార్యులవారు రాసిన 'మధ్వ విజయం' అనే గ్రంథాన్ని చూసినట్లయితే మధ్వాచార్యుని జీవితాన్ని గురించి, ఆయన రాసిన గ్రంథాలను గురించి, ఆయన చేసిన దిగ్విజయ యాత్రలను గురించి, ఆయన స్థాపించిన మఠాలను గురించి, ప్రవేశ పెట్టిన సంఘ సంస్కరణలను గురించి తెలుస్తుంది.

ఉడిపి పట్టణానికి తూర్పునఉన్న పాజక అనే గ్రామంలో తుళువ వంశీయులైన ఒక సాధారణ బ్రాహ్మణ దంపతులకు క్రీ. శ. 1199న శ్రీ మధ్వా

చార్యులవారు జన్మించారు. ఆయన తండ్రి ఇంటిపేరు 'నడ్డం తిల్లీయ'. దాన్నే సంస్కృత భాషలో 'మధ్యగేహ' లేదా 'మధ్య మందిర' అంటారు. మధ్వాచార్యుని ప్రథమ పేరు 'నారాయణ' లేదా వాసుదేవ. ఆయన గురువుగారి పేరుతో తంతిల్లీయ. వేదశాస్త్రమందలి అభిమానంతో, అద్వైతమతమందలి విరక్తి భావంతో, పూర్ణప్రజ్ఞ బిరుదాంకితుడై, అచ్యుతప్రజ్ఞుల వారివద్ద సంన్యాసం స్వీకరించారు. అప్పటికి ఆయన వయస్సు 16 సం॥ విముక్తాత్మ ముని రాసిన ఇష్టసిద్ధి అనే గ్రంథం మధ్వాచార్యుని బాగా ప్రభావితం చేసింది. అప్పుడే మధ్వనామాంకితుడై త్రివేంద్రం, కన్యాకుమారి, శ్రీరంగం, రామేశ్వరం మొదలయిన పుణ్యస్థలాలను సందర్శించారు. ఆ తరవాత ఉత్తర భారతదేశాన్ని సందర్శించారు. అనేకమైన పుణ్యక్షేత్రాలకు వెళ్ళారు.

తన జీవితాంతంలో శ్రీమధ్వాచార్యులవారు ఎనిమిదిమంది తీర్థులను ఆదరించి వారిని తాను స్థాపించిన మఠాలకు అధిపతులుగా నియమించారు. వారు : 1. హృషీకేశతీర్థ 2. నృసింహతీర్థ 3. జనార్దనతీర్థ 4. ఉపేంద్రతీర్థ 5. వామనతీర్థ 6. విష్ణుతీర్థ 7. రామతీర్థ 8 అధోక్షజతీర్థ. వీరందరినీ ఉడిపిలో తాను స్థాపించిన మఠానికి పూజలు మొదలయిన నిత్యకృత్యాలు చేయడానికై నియోగించారు.

## అష్టమఠాలు :

1. పాలిమార్ మఠం 2. అదమార్ మఠం 3. కృష్ణపూర్ మఠం 4. పుత్తిగె మఠం 5. సీరూర్ మఠం 6. సోదెమఠం 7. కాణూర్ మఠం 8. పెజావర్ మఠం. ఉత్తర భారతదేశ పర్యటన చేసి అనేకమంది పండితులను ఓడించి, అనేక మంది రాజులను కృష్ణతత్త్వానికి, నారాయణ తత్త్వానికి అభిమానులుగ ఉండేటట్లు చేసాడు. ఢిల్లీ, కురుక్షేత్ర, గోవా మొదలయిన ప్రాంతాలు సందర్శించి నారాయణ తత్త్వాన్ని బోధించాడు. అద్వైత మతఖండన చేసాడు. జీవుడు ఒక్కడే! భగవంతుడు భగవంతుడే! — అనేది ఇతని బోధనల్లోని సారాంశం.

నారాయణ పండితాచార్యుడు రాసిన 'మణి మంజరి' అనే గ్రంథంలో

మాధ్వ సాంప్రదాయాన్ని గురించి అనేకమైన విషయాలున్నవి. పద్మపురాణంలో కూడా మాధ్వ సాంప్రదాయాన్ని గురించిన విషయాలున్నాయి. మధ్వుల గురు పరంపర ఈ విధంగా ఉన్నది.

## గురుపరంపర

శ్రీహంస (నారాయణ)
బ్రహ్మ
దూర్వాస తీర్థ
జ్ఞాననిధి తీర్థ, గరుడవాహన తీర్థ, కైవల్యతీర్థ
పరతీర్థ
సత్యప్రజ్ఞ తీర్థ
అచ్యుతప్రజ్ఞ తీర్థ లేదా పురుషోత్తమ తీర్థ
ఆనందతీర్థ లేదా మధ్వాచార్య

మొదలయిన మహాపురుషులు ఎందరో జన్మించి తత్త్వ స్వరూపాన్ని బోధించారు. ఈ దర్శనంలో తత్త్వాలు రెండు. 1. సర్వతంత్ర స్వతంత్ర మైన తత్త్వం – శ్రీ మహావిష్ణువు. 2. అస్వతంత్రమైన తత్త్వం – జీవం. నారాయణుని మీద ఆధారపడి, ఆయన అనుజ్ఞమేరకు జీవులు వర్తిస్తుంటాయి.

మాధ్వ సాంప్రదాయానికి అనుబంధంగా 'దాససాంప్రదాయం'ఉంటుంది. శ్రీమహావిష్ణువుకు జీవులు దాసులు, కింకరులు, సేవకులు. ఆయన ఆజ్ఞలను పాటిస్తుంటాయి జీవులు. ఆ జీవులను సంరక్షిస్తుంటాడు పరమాత్ముడు. ఏ విధ మైన చదువు, సంస్కారం, జ్ఞానం, కర్మ, భక్తి మొదలయిన మార్గాలు తెలియని అతి పామరుడుకూడా, చివరకు జంతుజాలం కూడా ఈ దాససాంప్ర దాయం ద్వారా తరించవచ్చు. భగవంతుని భక్తులకు, వారి భక్తులకు, వారి వారి భక్తులకు కేవలం నమస్కరించి, సహృదయంతో వారిని పూజించి, గౌరవిస్తే నారాయణుని సేవించినట్లే. అందుకే 'హరిదాస' సంప్రదాయం కన్నడ, ఆంధ్ర దేశాల్లో బాగా విస్తరిల్లింది.

# 7

# చార్వాక మతం

భారతీయ దార్శనిక ఆలోచనా సముద్రంలో ఉవ్వెత్తున పైకి లేచి సమసిపోయిన మహా తరంగం వంటిది చార్వాక దర్శనం. దీన్నే లోకాయత దర్శనం అనికూడా అంటారు. పరమ నాస్తిక మహాముని అయిన చార్వాకుడు చెప్పిన దర్శనం కావటంవల్ల దీన్ని చార్వాక దర్శనమన్నారు కొందరు. చారు + వాక్ = చార్వాక్, అంటే, చారు = సులభమైన లేక సరళమైన, మధుర మైన ; వాక్ = శబ్దం, మాటలు, అని అర్థం. అంటే, చార్వాక = మధురమైన మాటలు చెప్పే దర్శనమని కొంతమంది భావించారు. అట్లాగే లోకాయత దర్శన శబ్దానికి కూడా వ్యుత్పత్తి అర్థం చెప్పారు. లోకాయత = "ఆయంతతీ, ఉస్సాహంతి వాయమంతి వాదస్సదేనాతి" అని నిర్వచించారు. అంటే లోకాన్ని గురించి చెబుతారు. లోకంకోసం పాటుపడతారు. లోకంలోని సుఖాలకోసం ఆరాట పడతారు. ఈ లోకమే పరమావధి.

దేవతల గురువగు బృహస్పతి రాక్షసులమీద ఉండే ద్వేషంకొద్దీ వారం దరినీ ఇంద్రియ లోలురుగ చేయడానికై ఈ దర్శనాన్ని రాశాడని ఒక కథ ఉన్నది. అందుకే దాన్ని బార్హస్పత్య దర్శనం అనికూడా అంటారు నేడు మనకు ఈ గ్రంథం లభించటంలేదు. కాని బౌద్ధ గ్రంథాల్లో ఈ విషయం ఉటంకించబడింది. రామాయణంలో చార్వాక మహాముని రామునికి తన మతాన్ని బోధిస్తాడు. ఆ విషయాన్ని సంక్షిప్తంగా చూద్దాం.

## రామాయణంలో చార్వాక మతం

రామాయణంలో చార్వాక మతం ఏమిటని కొందరు అనుకోవచ్చు. అయోధ్యా కాండలో ఉన్న విషయాలను మాత్రమే ఇక్కడ చూద్దాం.

మందాకినీ తీరప్రాంతంలో రాముడు ఆశ్రమం నిర్మించుకొని ఉంటున్న సమయంలో భరతుడు ఆయన్ను రాజ్యం స్వీకరించమని వేడుకొంటానికి వస్తాడు. అనేకమైన రాజధర్మాలను రాముడు భరతునికి చెప్పి ఆయన్ను రాజ్యం ఏలుకోమని తాను సత్యసంధుణ్ణని, పితృవాక్య పరిపాలకుడినని చెబుతాడు. ఆ తరుణంలో చార్వాక మహాముని చేసిన ప్రసంగ సారాంశాన్ని చూద్దాం.

"ఓ రామచంద్రా అన్నీ తెలిసినవాడివి నీవు. కాని పామరునివలె, మందమతివలె రాజ్యాన్ని వదలుకొంటానంటావేమిటి? ఎక్కడి తల్లి! ఎక్కడి తండ్రి! ఒక ప్రాణికి మరో ప్రాణికి సంబంధం లేదు. అందరినీ అందరూ ఈ భూమ్మీదనుంచి వదలిపోతారు. నీవు యౌవనంలో ఉన్నావు. భోగ భాగ్యాలు అనుభవించవలసిన తరుణమిది. రాజ్యం సుఖాలకు, భోగాలకు ఆట పట్టు. అరణ్యం కష్టనష్టాలకు హేతువు. సమస్తమైన జీవరాసులు నాలుగు భూతాల సంయోగ వియోగం వల్ల ఏర్పడుతున్నవి. మరణానంతరం జీవరాసులన్నీ ఆయా చతుర్భూతాల్లో కలుస్తాయి. పుట్టిన ప్రతివారు ఎవరైనా మరణించక తప్పదు. ఓ రామచంద్రా, ధర్మాన్నికాని మోక్షాన్నికాని ఇంకా అర్థాన్నికాని సంపాదించాలని ప్రయత్నిస్తే వారికోసం నేను దుఃఖిస్తాను. ఎందుకంటె వీటిని సంపాదించడంతోనే వారి ఆయుష్షు సరిపోతుంది. ఇంక వాటిని అనుభవించేదెప్పుడు. మరణానంతరం అని భావిస్తామా, మరణానంతరం ఏమున్నది! ఏమీలేదు. కనక బుద్ధిమంతుడైనవాడు దేహం ఉండగానే సుఖించాలి. సుఖించే దేహం లేనప్పుడు సుఖమెవ్వరికి? పితృకర్మ చేయమని భరతుని ఆదేశిస్తున్నావు. బాగు బాగు! కష్టపడి ఒకరు సంపాదిస్తే, పదిమంది చేరి పితృకర్మ అని ఇష్టాన్న భోజనం చేస్తారు. దానివల్ల రెండు అనర్థాలు ఉన్నాయి. మనం సంపాదించింది ఇతరులు అనుభవిస్తారు. మనకున్నది అంతా వ్యర్థమయిపోతుంది. అంతేగాకుండా ఒకరు అన్నం తించే మరొకరి పొట్ట ఎట్లా నిండుతుందయా రామచంద్రా! ఆ మాత్రం మతిలేదా నీకు! యాగం చేయమని, తపం చేయమని, దీక్ష వహించమని, దానం చేయ

మని, ఇతరుల ధనాన్ని అపహరిద్దామనే బుద్ధికల నయవంచకులైన బ్రాహ్మణులు చెప్పిన మాటలివి. పండితులెవ్వరూ ఆ మాటలను నమ్మరు. నీవు పండితుడవు. కనక ఆ మాటలు విశ్వసించకు. బుద్ధిలేనివారు మాత్రమే ఈ భూమిలో ప్రత్యక్షమైనదాన్ని వదలుకొని, పరోక్షమైనదాన్ని నమ్ముకుంటారు. నీవు బుద్ధి హీనుడవు కావు కనక ఈ విషయాలు నమ్మవద్దు. మబ్బు పట్టినంత మాత్రాన చెరువులో ఉన్న నీళ్ళను గట్టు కొట్టివేసి బయటకు పంపిస్తామా!

ఓ రామచంద్రా! ఉన్నదంతా కామం. ఆత్మ లేదు. మోక్షం లేదు. స్వర్గం లేదు. కర్మ లేదు. కర్మఫలం అనుభవించేవారు లేరు. పాప పుణ్యాలు లేవు. భగవంతుడు లేడు. సన్యాసం, భస్మధారణ, వేదాధ్యయనం, అగ్ని నారాధించడం మొదలయినవన్నీ బుద్ధి, పౌరుషం, స్వయంశక్తి లేనివారికి ధాత సృజించాడని పరాన్న జీవులైన బ్రాహ్మణులు సృజించారు. ప్రత్యక్షంగా కనిపించే రాజే పరమేశ్వరుడు. ఆయనకన్న మించిన దైవం మరొకరు లేరు. స్త్రీని కౌగిలించుకోవడం వల్ల కలిగే పులకాంకితమైన ఆనందమే మహదానందం. కష్టాలను, దుఃఖాన్ని ప్రజ్ఞచేత సాధ్యమయినంతవరకు తగ్గించుకొని, దేహాన్ని పటిష్ఠం చేసుకోవడమే బుద్ధిమంతుని లక్షణం. ఎందుకంటావా ఈ దేహం పతనమైపోతే మళ్ళీ తిరిగి రాదు."

ఈ మాటలన్నీ జాబాలి రామచంద్రమూర్తితో అంటాడు. ఈ మాటలన్నీ విన్న తరవాత జాబాలితో రామచంద్రమూర్తి అంటాడు. "ఓ జాబాలి! నీవు చెప్పిన మాటల్లోని హితాన్ని, వాస్తవాన్ని, అహితాన్ని, మంచి చెడులను గ్రహించాను. నీవు చెప్పిన విషయాలన్నీ భువన సమ్మతమైనవని నీవు చెప్పావు కాని అవన్నీ నా దృష్టిలో లోకనింద్యమైనవి." బుద్ధిమంతులు విషయాలను విన్న తరవాత, తమ బుద్ధి వివేచనతో ఆలోచించి ఒక నిర్ణయానికి వస్తారు.

చార్వాకులను పాషండులని, హైతుకులని, నాస్తికులని, వితండవాదులని శుద్ధ తార్కికులని, శుద్ధ ప్రత్యక్షవాదులని. వేదబాహ్యులని పిలిచారు. వీరి దర్శనాన్ని ఆసురదర్శనమని భగవద్గీతలో ఉన్నది. దైవాసుర సంపద్వి

భాగ యోగంలో (16వ అధ్యాయం, 7–18 శ్లోకాలు) చార్వాక మత ఖండన ఉన్నది. మహాభారతంలో భరద్వాజ మహర్షి వైద్యశాస్త్ర దృక్పథాన్ని అల వరచుకొని జీవనయాత్రనంతా అవైదికంగా వివరిస్తాడు. అట్లాగే విష్ణుపురాణం (I.6.29–31) యజ్ఞయాగాది క్రతువులు చేయడం నిరర్థకమనే వాదన ఉన్నది. బౌద్ధ గ్రంథాలన్నీ దాదాపు లోకాయత మత సిద్ధాంతాలను పేర్కొం టాయి. బృహస్పతి సూత్రాలు, అర్థశాస్త్రం, కామశాస్త్రం, లోకాయత శాస్త్రం, ప్రబోధ చంద్రోదయం, తత్త్వోపప్లవసింహ మొదలయిన గ్రంథాలు చార్వాక, లోకాయత దర్శనానికి ఆధార గ్రంథాలు.

గుణరత్న, హరిభద్ర అనే జైన దర్శన చరిత్ర రచయితలు, మాధవా చార్యుడు వారి గ్రంథాల్లో లోకాయత మతాన్ని ఖండిస్తారు. బృహస్పతిని పరమ నాస్తిక శిరోమణి అని పిలుస్తారు. శీలాంకుడు అనే బౌద్ధ భాష్యకారుడు లోకాయతులను ప్రగల్భ నాస్తికులు అని పిలిచాడు.

లోకాయత, చార్వాక దర్శనం ఒక ప్రత్యేకమైన దర్శనంగా అభివృద్ధి చెందలేదు అయినప్పటికినీ ఈ దర్శనాన్ని ప్రతివారూ పూర్వపక్షంగా పేర్కొని తమ తమ దర్శనాల్లో దీన్ని ఖండించారు. జైనులు, బౌద్ధులు, వేదాంతులు ఈ దర్శనాన్ని తీవ్రంగా నిరసించారు. అంతేగాకుండా అపహాస్యం చేసారు. ముఖ్యంగా ప్రత్యక్ష ప్రమాణాన్నే అంగీకరించిన వీరి ప్రమాణ శాస్త్రాన్ని హేళన చేసారు. అది ఎంతవరకు వెళ్ళిందంటే — "ఓ చార్వాకా! ఋతు స్నాతమై నీ భార్య పుట్టింటికి వెళ్ళి పురుడు పోసుకొని వచ్చింది. ఆమె గర్భ వతి అవడం, ప్రసవించడం నీవు చూశావా! చూడలేదుకదా! అట్లాంటప్పుడు ఆమె రంకులాడి అని రోదించి నీ సిద్ధాంతాన్ని నీవే అపహాస్యం చేయకు"—అని చెప్పారు కొందరు. అంతేగాకుండా పురుషార్థాల్లో కామాన్ని మాత్రమే అంగీక రించిన చార్వాకమతాన్ని, సంన్యాసాన్ని, నిరశన వ్రతాన్ని, దేహాన్ని శుష్కింప చేసే సిద్ధాంతాలను అంగీకరించే జైన, బౌద్ధులు తీవ్రంగా ఖండించారు. కామమనేదాన్ని కణకణ మండే నిప్పుతో పోల్చి, ఈ శరీరాన్ని ఆ మంటకు దూరంగా ఉంచమన్నారు జైనులు, బౌద్ధులు, వేదాంతులు. భోగలాలసత ను

ధర్మ శాస్త్రకర్తలు, నీతి, వైరాగ్య శతక కర్తలు ఖండించారు. అయితే శృంగార శతక కర్తలు దానికి కొంత ప్రాణం పోసారు.

## చార్వాక, లోకాయత మత సిద్ధాంతాలు

పరమ నాస్తిక మతంగా ఖ్యాతిగాంచిన చార్వాకులు చెప్పిన సిద్ధాంతాన్ని చూద్దాం.

ఈ సమస్తమైన ప్రపంచంలో ఉన్నదంతా పంచభూతాత్మకం. అంటే భూమి, నీరు, గాలి, నిప్పు, ఆకాశం. ఈ అయిదు భూతాలు (భూతం అంటే చాలా పెద్దది అని అర్థం) పరస్పరం ఒకదానితో ఒకటి ఎప్పుడూ పెనవేసుకొని, ఒకదాన్ని మరొకటి పరిగ్రహించి, ఒకటి మరొకదానితో సంసర్గాన్ని కలిగి ఉంటాయి. ఆ ప్రక్రియ వల్లనే ప్రకృతిలో నిరంతరం మార్పు చెందుతూ ఉంటుంది. ఈ ప్రక్రియ మానవ శరీరం దగ్గరికి వచ్చేటప్పటికి ఈ విధంగా ఉంటుంది. మానవుడు భుజించిన ఆహారం శరీరంలో జీర్ణమై అనేకమైన ధాతువులుగ మారిపోతుంది. రక్తంగానూ, వీర్యంగాను, శ్లేష్మంగాను,లాలాజలంగాను లోపల ఉంటుంది. బయట చర్మం, గోళ్ళు, వెంట్రుకలుగా మారుతుంది. స్త్రీ పురుషుల సంభోగంవల్ల మానవుడు కాని, తదితర ప్రాణులుకాని జని స్తాయి. శరీరం ఆవిర్భవించడంతోపాటే, శరీరంలో ఉండే చైతన్యం కూడా శరీరంతోపాటే వస్తుంది. శరీరం నశించిపోగానే చైతన్యంకూడా నశిస్తుంది.

అయితే, ఆ చైతన్యం ఎట్లా ఏర్పడుతుంది? ఈ ప్రశ్నకు చార్వాకులు చెప్పినసమాధానాన్ని చూద్దాం.

## భూత చైతన్య వాదం

భూత చైతన్య వాదం అంటే ఏమిటి? పంచభూతాలు శరీరంలో ఒక ప్రత్యేకమైన పాళ్ళలో కలియడంవల్ల చైతన్యం శరీరంలో ఉత్పాద్యమవుతుంది. ఈ కలయిక నశించడంతోపాటు ఆ చైతన్యంకూడా నశిస్తుంది. శరీరానికుండే

ప్రత్యేకమైన విశిష్ట లక్షణం చైతన్యం. అంతేగాని ఆత్మ అంటూ ఏమీ లేదు. శరీరం లేకుండా ఎక్కడాకూడా మనకు చైతన్యం కనిపించదు. శరీరాలను ఆశ్రయించి మాత్రమే చైతన్యం ఉంటుంది. ఈ శరీరంలో ఏదో ఒక ఆత్మ ఉన్నదని భావించటం మూర్ఖత్వమంటారు చార్వాకులు. ఈ శరీరంలో జరిగే మార్పులన్నీ దాని స్వభావంచేత జరుగుతుంటాయేకాని, ఈ శరీరంలో ఉండే ఆత్మవల్ల కాదు. శరీరం చేసే పనులన్నింటినీ సంఘటిత పరచడానికి ఒక సూత్రధారి కావాలని వీరు అంగీకరిస్తారు. అయితే ఆ సూత్రధారి అది భౌతిక మైంది మాత్రం కాదంటారు. మనస్సే ప్రధానం అంటారు.

ఈ విషయాలను వీరు కొన్ని ఉదాహరణల ద్వారా వివరిస్తారు. అంటే, ఈ పంచ మహాభూతాల్లో భూమి, నీరు, గాలి, నిప్పు, ఆకాశంలో విడివిడిగా కాని, సమ్మిశ్రితంగాకాని వాటిని చూసినట్లయితే వాటిలో చైతన్యం కనిపించదు కదా ! అట్లాంటప్పుడు అవి ప్రత్యేకమైన పాళ్ళలో శరీరంలో కలిస్తే చైతన్యం ఎట్లా ఏర్పడుతుందనేది ఇక్కడ ప్రశ్న. లోకంలో జరిగే కొన్ని విషయాలను ఆధారం చేసుకొని వారు ఈ విషయాన్ని విపులీకరించారు. ఉదాహరణకు, బెల్లం, కొన్ని కాయకూరలు, మొలాసిస్ వీటిని తీసుకొని కొన్ని పాళ్ళలో కలిపి బాగా కాగపెట్టి వడకట్టి, ఈథర్ కలిపి కొన్నాళ్ళు నిల్వ ఉంచితే వచ్చే పదార్థాన్ని 'సారాయి' అంటారు. దీని ముఖ్య గుణం నిషానివ్వడం, మత్తును కలుగచేయడం. అయితే ఈ మత్తుగుణం పైన చెప్పిన ఏ పదార్థంలోను లేదు. కాని ఆ పదార్థాలను ఒక రకంగా కలిపి మరగపెట్టి చెయ్యవలసినదంతా చేస్తే వచ్చేది మత్తును కలిగించే ద్రవం. అదే సారా తమ సిద్ధాంతాన్ని బలపరచు కోడానికి వీరు మరొక ఉదాహరణ ఇస్తారు. తమలపాకులు, వక్క, సున్నం అనే మూడు పదార్థాలను తీసుకొందాం. వీటిని సమపాళ్ళలో తీసుకొని, తాంబూలంగా నమిలినప్పుడు ఎర్రదనం వస్తుంది. ఆ ఎర్రదనం ఎక్కడ ఉన్నదని వీరు ప్రశ్నిస్తారు. వక్కలో లేదు. తమలపాకులో లేదు. సున్నంలో అసలుండదు. ఎందుకంటే అది తెల్లగా ఉంటుంది కనక. మరి అట్లాంటప్పుడు ఎర్రదనం ఎక్కడినుంచి వచ్చింది? కొన్ని పదార్థాలు, కొన్ని ప్రక్రియల్లో

తమ సహజత్వాన్ని కోల్పోయి, కొత్త రంగును, రుచిని, వాసనను, క్రియా శక్తిని పొందుతాయి. అట్లాగే శరీరంలో ఉండే పంచభూతాలు కూడా నిరంతరం మార్పు చెందుతూ ఉంటాయి. ఈ మార్పువల్ల మన ఆలోచనాశక్తి, తెలివితేటలు, ప్రతిభ, చైతన్యం ఏర్పడతాయి. అట్లా మార్పు చెందటం ఆగిపోగానే శరీరం పతనం చెందుతుంది. అదే మరణం. దానితో శరీరం కొన్ని ముఖ్యమైన ధర్మాలను, గుణాలను కోల్పోతుంది. అందులో చైతన్యం ఒకటి. అంతేగాని ఆత్మ అంటూ ఏమీ లేదంటారు చార్వాకులు.

## భగవంతుని నిరాకరణ

భూత చైతన్యవాదాన్ని అంగీకరించిన చార్వాకులు, దేహమే ఆత్మ అని చెప్పారు. దాన్నే దేహాత్మవాదం అంటారు. ఆత్మ లేదని అంగీకరించినవారికి భగవంతునితో నిమిత్తం లేదు. సహజవాదులు, దేహాత్మవాదులు, ఇంద్రియాత్మవాదులు, మనో ఆత్మవాదులు, భౌతికవాదులు, పరిణామవాదులు, యాంత్రికవాదులు, ప్రకృతివాదులు, జడవాదులు, హేతువాదులు అంతా భగవంతుని నిరాకరిస్తారు. చార్వాక మతంలో భగవంతుని నిరాకరణ ఎట్లా జరిగిందో చూద్దాం.

అసలు భగవంతుడు అంటే ఎవరు? సర్వశక్తిమంతుడు, సర్వాంతర్యామి, సర్వజ్ఞుడు అయినవాడు భగవంతుడు అన్నారు. అట్లాంటి వారిని ఎవరైనా ఎప్పుడైనా, ఎక్కడైనా చూడలేదు. ప్రత్యక్షమే ప్రమాణంగా అంగీకరించిన చార్వాకుల వాదం ఈ విధంగా ఉంటుంది. ఏ పవిత్ర గ్రంథమైనా, లేక ఏ మహర్షి అయినా భగవంతుడున్నాడనికాని, లేక ఆయనతో తాను మాట్లాడానని కాని చెప్పి ఉన్నట్లయితే అది వంచనతో కూడి ఉన్న అసత్య ప్రలాపన అంటారు వీరు. భూత భవిష్యత్ వర్తమాన కాలాల్లో మానవుడికి కాని మరొకరెవరైనా కాని వారికి కాని తెలిసిందీ, తెలిసేదంతా భూతకాలం, వర్తమానకాలం మాత్రమే. జరుగబోయేది ఎవ్వరికీ తెలియదు.

ఎందుకంటే అసలు అక్కడ అది లేదు కనక. లేనిదాన్ని గురించిన జ్ఞానం ఎట్లా సాధ్యం ?

భగవంతుని సర్వాంతర్యత్వాన్ని, ఆయన సర్వజ్ఞతను నిరాకరించిన చార్వాకులు అయన మోక్ష ప్రదాతత్వాన్ని కూడా నిరాకరిస్తారు. ఆత్మ లేనప్పుడు, శరీరం మరణానంతరం పిడికెడు బూడిదయై పోయినప్పుడు మోక్షం అనేది అర్థరహితమైన శబ్దం. పుణ్యాత్ముడు చనిపోయినా, పాపాత్ముడు చనిపోయినా పూడ్చిపెడతారు లేకపోతే దహనం చేస్తారు. పుణ్యాత్ముడు కదా అని అతని చితాభస్మం తెల్లగా ఉండదు. పాపాత్ముడు కదా అని అతని చితాభస్మం నల్లగా ఉండదు. మరణానంతరం మిగిలేది అంటూ ఏమీ ఉండదు. కనక మోక్షం అనేది లేనప్పుడు ఇచ్చేవారు ఉండరు. పొందేవారు ఉండరు. ఇదంతా స్వార్థపరులు, సోమరిపోతులు, అసందర్భ ప్రలాపులు, అసత్యం చెప్పడమే జీవిత లక్ష్యం కలవారు చెప్పిన మాటలంటారు చార్వాకులు.

స్వర్గం లేదు. నరకం లేదు. పాపం లేదు. పుణ్యం లేదు గంగా గోదావరీ నదుల తీరాన బయలుదేరి ఆయా పుణ్యనదుల్లో తీర్థాలాడి, అక్కడున్న ఆర్తులకు దానం చేసినా పుణ్యం రాదు. వారందరినీ సంహరించినా పాపం రాదు. జరిగేదంతా కత్తి అనే ఒక పదార్థం శరీరం అనే పదార్థాన్ని రెండుగా చేస్తుంది. అట్లాగే దానధర్మాలు చేసినవారు పేదవారయిపోయి తరవాత చింతిస్తారు. తీర్థయాత్రలు చేస్తూ, పవిత్ర నదీజలాల్లో స్నానంచేస్తే పాపం పోయి పుణ్యం వస్తుందనుకోవడం శుద్ధ అవివేకం. అట్లా పుణ్యంగనక వస్తే ఆయా నదీజలాల్లో ఉండే జలచరాలైన చేపలు, కప్పలు, మొసళ్ళు, తాబేళ్ళు, జలగలు, నీటిపాములు, నాచు, మొదలయిన జీవరాసులన్నీ ఈ తీర్థ యాత్రలు చేసేవారికన్నా ఎంతో ఎక్కువ పుణ్యం చేసుకొన్నవై ఉండాలి. అంతేకదా మరి !

అట్లాగే తపస్సు, పూజ, నిరసన వ్రతం, ఉపోష్యాలు. శరీరాన్ని శుష్కింపచేస్తాయేకాని వాటివల్ల ఏమీ ఫలితముండదు. "కూడు విడిచి మలము కుడుచునా ఉపవాసి" అన్నాడు వేమన. ఈ శరీరం మనకు మన తల్లిదండ్రుల

సంభోగ ఫలంవల్ల లభించింది. అది దేవుడిచ్చిందికాదు. బుద్ధిమంతుడైనటు వంటివాడు దాన్ని చందన, కర్పూర, జాజి, జాపత్రి, ఇత్యాది సుగంధాలతో తయారు చేయబడ్డ లేపనాలను పూసుకొని, పుష్టిని, హితాన్ని, వీర్యాన్ని, రక్తాన్ని, బలాన్ని ఇచ్చే ఆహారాన్ని తిని సంతృప్తిగా జీవించాలేకాని ఈ శరీరాన్ని ఆకలి దప్పులతో బాధించకూడదు. ఎందుకంటే ఈ శరీరం పోయిన తరవాత మళ్ళీ ఇటువంటి దృఢమైన, అందమైన శరీరం మనకు లభిస్తుందని నిదర్శనం లేదు. అందుకే :

రుణంకృత్వా ఘృతంపీత్వా
భస్మీ భూతశ్చ పునరాగతం కృత్వా ॥
అని బృహస్పతి సూత్రాల్లో ఉన్నది.

ధర్మం, అర్థం, కామం, మోక్షం అనే నాలుగు పురుషార్థాల్లో చార్వాకులు కేవలం కామాన్ని మాత్రమే అంగీకరిస్తారు. ధర్మాన్ని, మోక్షాన్ని మూర్ఖుల మనోబుద్ధి మాంద్యాలకు నిదర్శనంగా చెబుతారు. అయితే సమస్తమైన అర్థం (అంటే డబ్బు) కామసాధనం కాబట్టి దాన్ని మానవుడు సాధించాలి. డబ్బు వల్ల సాధించేది ఏమీలేదు కాని కామానికి అది తోడ్పడుతుంది కనక మానవుడు చీమ కూడపెట్టినట్లుగా కూడపెట్టక సంపాదించిందంతా తన భోగలాలసత్వానికై ఖర్చు చేసుకోవాలి ఎందుకంటే మరణానంతరం సుఖంకాని, భోగంకాని సాధ్యం కాదు.

అదేవిధంగా వేద విషయంలో కూడా చార్వాకులు చాలా తీవ్రమైన విషయాలు చెప్పారు. వేదమంటే కర్మకాండతో కూడి ఉన్నది. అసలు వేదంలో ఉన్న విషయాలన్నీ అప్రమాణాలన్నారు చార్వాకులు. వేదంలో అబద్ధాలున్నాయి అసత్య ప్రగల్భాలున్నాయి వేదం ఏం చెబుతుంది. "స్వర్గకామో యజేత వహ్నౌంః" స్వర్గం కావాలనుకున్నవారు యజ్ఞయాగాది కర్మలు చేయాలి. యజ్ఞయాగాదిలు చేస్తే పుణ్యం వస్తుంది. తద్వారా స్వర్గం లభిస్తుంది. యజ్ఞమంతా హింసతోను, పశుబలితోను కూడిఉన్నది.

యజ్ఞంలో హింసింపబడే యజ్ఞపశువు కూడా స్వర్గానికి పోతుందని వేదం చెబుతుంది. అట్లాంటప్పుడు యజ్ఞాన్ని చేసేవారు వారి తండ్రినో, సోదరునో బావమరిదినో, దగ్గర బంధువునో, ప్రియమిత్రుడినో యజ్ఞంలో ఆహుతి చేసినట్లయితే వారు సరాసరి స్వర్గానికి పోయి సుఖించవచ్చుకదా! ఇది కొంతమంది చార్వాకులు చేసే వాదం. అదేవిధంగా మరణించిన వారి శ్రద్ధాంజలిని గురించి కూడా చార్వాకులు అపహాస్యం చేశారు. పురోహితశ్రేణి పరమ సోమరిపోతులు. వారి జీవనార్థం వారు కల్పించినటువంటి తంతే మరణించినవారికి ఏర్పాటుచేసే శ్రద్ధాంజలి తంతు అంతా. మరణించిన వారి పేరిట చేసే అన్నదానం, "పిండ పితృ యజ్ఞం" ఇవన్నీ మానవ మూర్ఖత్వానికి, సంఘ నయవంచనకు నిదర్శనమన్నారు. ఉదాహరణకు, మన తండ్రో, తల్లో, సోదరుడో గ్రామాంతరం వెళ్ళారనుకొందాం. వారి పోషణార్థంగా ఇక్కడ మనం విందుభోజనం చేస్తే అది వారికి అందుతుందా? అందదంటారు చార్వాకులు. అట్లాగే అటకమీద ఒక మనిషిని కూర్చోబెట్టి కింద నేలమీద పంచభక్ష్య పరమాన్నం పెట్టి ఆయన్ను భుజించవలసిందగా కోరితే ఆయన ఎట్లా భుజించగలడని ప్రశ్నిస్తారు చార్వాకులు. అదేవిధంగా చచ్చి స్వర్గాన ఉన్న మాతాపితరుల పేరిట చేసే శ్రాద్ధ కర్మలు వారిని ఎలా సంతృప్తి పరుస్తాయి?

ఈ విధంగా భగవంతుడు లేడని, ఆత్మ లేదని, వేదం పరమ నయవంచకుల గ్రంథమని, పాప పుణ్యాలు లేవని, స్వర్గ నరకాదులు లేవని, శరీరం కేవలం కామజన్యమని, అది కామంకోసమేనని, దేవ, మానుష, పితృకార్యాల వల్ల ప్రయోజనం లేదని, మంచీ—చెడూ అనేవి ఏమీ లేవని, బతికినంతకాలం మానవుడు కామ ప్రవృత్తితో బతకడమే జీవన ధ్యేయమని చెప్పిన చార్వాక మతం ఎంతోకాలం భారతీయ సంస్కృతీ నాగరికతా ప్రవాహంలో నిలబడి ఉండలేదు. అది కాలగర్భంలో కలసిపోయింది. అయినా అక్కడక్కడా దాని వాసనలు నేటికీ ఉన్నాయి.

# 8

# జైనదర్శనం

నాధ వంశానికి చెంది, నాతపుత్త అనే పేరుతో పిలువబడి 'మహావీర' బిరుదాంకితునిగా స్థిరపడిన వర్థమాన మహావీరునిచే జైనమతం స్థాపితమయింది. ఇతని జన్మస్థలం. వైశాలి క్షత్రియ వంశానికి చెందినవాడు. క్రీ. పూ. 599 వ సంవత్సరంలో సిద్ధార్థుడు, త్రిశల అనే దంపతులకు మహావీరుడు జన్మించాడు. శ్వేతాంబర సంప్రదాయం ప్రకారం యశోద అనే స్త్రీని వివాహమాడి సంసారిక జీవితాన్ని గడిపాడు. వీరిద్దరికి అనోజ్ఞ లేదా 'ప్రియదర్శన' అనే కూతురు పుట్టింది. ఇతనికి 30 సం॥ వయస్సు రాగానే భార్యను, కుమార్తెను వదలి ఆయనకు ముందు దాదాపు 200 సం॥ పూర్వం పార్శ్వనాధునిచే స్థాపితమైన తీర్థంకర దర్శనాన్ని ఆదరించి, దాని సిద్ధాంతాలను గురించి తెలుసుకొన్నాడు. ఆ తరవాత 'పణియభూమి' అనే ప్రదేశంలో ఆరు సంవత్సరాలు తపస్సు చేసి శరీరాన్ని శుష్కింపచేసి రాగ, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాదులను జయించి మహావీరుడయ్యాడు. అంతర్గతంగా ఉండే దుష్ట భావనాశక్తులను జయించిన వారిని జైనమతంలో వీరుడు అంటారు.

మహావీరుడు క్రీ. పూ 527వ సంవత్సరంలో నిర్వాణం చెందాడు. బింబిసారుని కుమారుడైన అభయదేవుడు జైనమతాన్ని ఆదరించి పోషించాడు. రాజగృహ, చాంప, వైశాలి, పావ మొదలయిన మహానగరాల్లో మహావీరుడు తన సిద్ధాంతాన్ని బోధించాడు.

మహావీరుని అనంతరం జైనమతం మూడు తెగలుగా విడిపోయింది. అవి :

1. దిగంబర జైనమతం

2. శ్వేతాంబర జైనమతం
3. స్థావిర జైనమతం

ఈ మూడు తెగల మధ్యనున్న తేడాను చూద్దాం. కేవల జ్ఞానికాగోరిన జినుడు శరీరంమీద ఏవిధమైన మమతను, అభిమానాన్ని ఉంచుకోరాదు. అంటే వస్త్రధారణ నాగరికతా చిహ్నమైనప్పటికీ జినులకు, వీరులకు దానితో నిమిత్తం లేదని నాగపుత్తుని సిద్ధాంతం. వర్థమాన మహావీరునికి పూర్వ సాంప్రదాయంలో దిగంబరత్వం కేవల జ్ఞానానికి ఆవశ్యకంగా ఉండేది. అంతేగాకుండా ఏ ఒక్క ప్రదేశంలోను మూడు రాత్రులకన్నా ఎక్కువ ఉండరాదు. ఒక ప్రదేశం నుంచి మరొక ప్రదేశానికి తిరుగుతూ జినులు పోతూ ఉండాలి. అంతేగాకుండా శరీరం మీద ఏ విధమైన అభిమానం ఉండరాదు. శరీరాన్ని ఎంత త్వరగా వదల్చుకొంటే అంత త్వరగా ముక్తి లభిస్తుంది. ఈ శరీరంలో చిక్కుకొన్న జీవుని బంధాల నుంచి తప్పించడానికి దిగంబర జైనులు రెండే రెండు మార్గాలున్నాయంటారు అవి :

1. అతి భోగం 2. అతి విరాగం. బౌద్ధం విపరీత క్రియలను వదలివేయమని చెప్పి, మధ్యమ మార్గాన్ని సూచించింది. కాని జైనమతం శరీరాన్ని శుష్కింపచేయడాన్ని శరీరాన్ని అనేకమైన బాధలు పెట్టడాన్ని సమర్థిస్తుంది. శరీర త్యాగం చేయడాన్ని, ఆత్మహత్యను జైనమతం అంగీకరిస్తుంది. అయితే దాన్ని ఒక పద్ధతి ప్రకారం ఆచరించాలని హెచ్చరిస్తుంది. ఒకవైపు ప్రాణి హింస పనికిరాదంటూ "అహింసో పరమోధర్మః" అనే ఉపనిషత్సూక్తిని ఆదరిస్తూ, మరొకవైపు ఆత్మాహుతిని జైనం సమ్మతిస్తుంది. శరీరానికి తేనె పూసుకొని కొందరు జైన దిగంబరులు చీమల పుట్టల దగ్గర పండుకొనేవారని జైనగాథలున్నవి.

ఇదంతా అనవసరమని, పంచ మహావ్రతాలను, త్రిరత్నాలను ఆచరించినట్లయితే జినత్వం సిద్ధిస్తుందని మహావీరుడు బోధించాడు. ఆయన కాలంలో ఆ జీవకులు అనే ఒక తెగవారు బోధించే విషయాలు చాలా జుగుప్సాకరంగా

ఉన్నాయని మహావీరుడు గ్రహించాడు. మక్కలి గోశాలి, పూర్ణకాశ్యపుడు, పకుథ కాత్యాయనుడు, అజితకేశకంబళుడు, నిగంధనాథ పుత్రుడు వీరందరూ చిన్న చిన్న రాజులను ఆశ్రయించి అర్థాన్ని, కామాన్ని విరివిగా పొందమని వారికి బోధించేవారు. ఈ రెండు పురుషార్థాల సాధనకు కావలసిన తత్త్వాన్ని వీరు బోధించారు. ఆత్మ లేదన్నారు. పాప పుణ్యాలు లేవన్నారు. దానధర్మాలు నిరర్థకమన్నారు. ఉన్నదంతా భౌతికంగా కనిపించే 'కాయమే' నన్నారు. పుద్గలవాదం, భౌతికవాదం, అనాత్మవాదం, అక్రియావాదం బాగా ప్రబలిన రోజులవి. వీటన్నింటినీ సహేతుకంగా ఖండిస్తూ, జీవ–అజీవ వాదాన్ని స్థాపించాడు మహా వీరుడు. ఆయన బోధనలను, ఆ తరవాత వారి బోధనలను గ్రంథస్తం చేయటం జరిగింది. ఆ గ్రంథాలన్నీ జైనులకు పరమ ప్రామాణిక గ్రంథాలు. వాటిలో ముఖ్యమైన వాటిని కొన్నింటి పేర్లు తెలుసుకొందాం.

## జైనమత పవిత్ర గ్రంథాలు

జైన గ్రంథాలను రెండు రకాలుగా విభజించారు. అవి : 1. అంగ గ్రంథాలు 2. పూర్వజ గ్రంథాలు. ఉత్తరాధ్యయన సూత్ర, సూత్రకృతాంగ సూత్ర, ఆచారాంగసూత్ర, స్థానాంగసూత్ర, సంవయాంగసూత్ర, ఉపాసక అధ్యయనాంగసూత్ర, అనుత్తర ఉపపాదక దశాంగసూత్ర, విపాకసూత్ర, దృష్టిప్రవదసూత్ర, మొదలయిన గ్రంథాలు జైనులందరికీ పరమ పవిత్రమైనవి.

మానవులందరూ అనేకమైన బాధలతో సతమతమవుతూ ఉంటారనేది జైనమతంలోని మౌలికాంశం. మనం పడే బాధలన్నింటినీ వారు వర్గీకరించి చెప్పారు. అవి : జుగుప్స, పిపాస (దప్పిక) వాతాసీత తపాలు, కామం, స్త్రీ సంబంధమైన వేదన, శయ్యావేదన, ఆక్రోశం, వాదం, లోభం, రోగం, వృద్ధాప్యం, అజ్ఞానం మొదలయినవన్నీ మనలను బాధిస్తుంటాయి. అందుకే పంచ మహావ్రతాలను, పంచశీలను, పంచ సచ్చరితను ప్రతివారు ఆచరించాలని మహావీరుడు బోధించాడు. సంయక్ చరిత, ఛేదోపస్థాపనీయ చరిత్ర, పరిహార విశుద్ధ చరిత, సూక్ష్మసౌపర్య చరిత, యథాఖ్యాయక చరిత మొదలయిన వాటిని

స్మృతి పథంలోకి తెచ్చుకోవాలి. వాటిని ఆచరించాలి. అట్లా ఆచరిస్తే మనో క్లేశాలు తగ్గుతాయి. అందుకే పన్నెండు శుభమైన భావాలతో మన మనస్సును ఎల్లప్పుడూ నింపుకొని వాటిని మనస్సులో ఉంచుకోవాలి అని మహావీరుడు బోధించాడు. ఆ పన్నెండు శుభభావాలు :

1. అనిత్యతా భావన 2. శరణతా భావన 3. సంసార భావన 4. ఏకతా భావన 5. అంత్య భావన 6. ఆస్రవ భావన 7. అశౌచ భావన 8. సంవర భావన 9. నిర్జర భావన 10. లోక భావన 11. ధర్మ భావన 12. బోధి బీజ భావన. ఈ పన్నెండు భావాలనూ మనస్సులో ఉంచుకొన్నవారికి ఎటువంటి అశుభంకాని, ప్రమాదంకానీ జరుగదని జైనులు భావిస్తారు.

జైనమతం ముఖ్యంగా మానవుని నీతికి ప్రాముఖ్యాన్నిచ్చింది. ఈ ప్రపంచంలోకి జీవులు కర్మబద్ధులై వస్తాయనే ప్రాతిపదికమైన విషయాన్ని అంగీకరిస్తుంది. ఒకసారి జీవి శరీరంలో ప్రవేశించిన తరవాత ఈ జీవితం దుర్భరమా లేక సంతోషదాయకమా ? అని జైనమతం ప్రశ్నిస్తుంది. ఈ జీవితాన్ని ఆనందదాయకం చేసుకొనే స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు జైనమతంలో మానవుడికి లేవు. కనక ఈ జీవితాన్ని, ఆయుర్దాయాన్ని పొడిగించుకొనే సమస్య జైనమతంలో లేనేలేదు. ఉన్న సమస్య అంతా ఈ జీవితం నుంచి విముక్తిని పొందటమే. ఈ ప్రపంచాన్ని, ఈ సంసారాన్ని భగభగ మండే మంటలతోను, జీవులను ఆ మంటల్లో ఉన్న ఆర్తులుగను జైన బౌద్ధమతాలు భావించాయి. అందుకే వైదికమతంపై తిరుగుబాటు చేసాయి. ఋగ్వేదాన్ని పరిశీలించి చూస్తే అక్కడ జీవితం ఆనంద దాయకంగా ఉంటుంది. భూమిని స్వర్గతుల్యంగా చేయాలని, ప్రతివారు నూరు సంవత్సరాలు ఆయుర్దాయాన్ని కలిగి ఉండి పిల్లా పాపలతో ధన ధాన్య, పశుగ్రాస సమృద్ధితో జీవించాలని వారి ఆశయం. ఆ ఆశయాలను సమకూర్చుకోడానికై వారు దేవతలను సంతృప్తి పరచేవారు. యజ్ఞం అనే ప్రక్రియ ద్వారా తమకు అత్యంత ప్రీతి పాత్రమైన వస్తువునుకాని, పదార్థాన్నిగాని, అగ్నిలో వేల్చినట్లయితే ఆయన

వాటిని దేవతలకు అందించేవాడని, వారు దానితో సంతృప్తి పడి మానవుని ఈప్సితార్థాలను (కోరికలను) తీర్చేవారని వారు భావించారు. అందుకే పశు యజ్ఞం, మానుష యజ్ఞం, జ్ఞానయజ్ఞం, తపోయజ్ఞం, ఆత్మార్పణ యజ్ఞా మొదలయినవాటిని ఎన్నింటినో కనిపెట్టారు. ఇదంతా జీవితాన్ని ఆనందమయం చేసుకోడానికే నన్నారు.

కాని జైన బౌద్ధాలు ఇదంతా అర్థరహితమైన మౌఢ్యంతో కూడిన పని అని నిరసించాయి. మానవుడు నీతిగా బ్రతికితే చాలన్నారు. జైనమతం కర్మ ఆత్మలు ఉన్నవి కాని భగవంతుడు లేడన్నది. బౌద్ధం కర్మ ఉన్నదికాని, ఆత్మలు భగవంతుడు లేవన్నది.

## జైన తార్కికులు

జైనమతంలో ప్రపంచ ప్రఖ్యాతి పొందిన తార్కికులు అనేకమంది ఉన్నారు. వారందరినీ గురించి రాయలేం. కాని అతి ముఖ్యమైన వారిని గురించి తెలుసుకొందాం.

1. ఇంద్రభూతి గౌతముడు : క్రీ. పూ. 607–515 ఇతను మహావీరుని శిష్యుడు.

మహావీరుడు బోధించిన అనేక విషయాలను ఇతను సేకరించాడు. ఇతను కేవల జ్ఞానాన్ని పొందిన జినుడు. బ్రాహ్మణ దంపతులకు జన్మించాడు. తండ్రి పేరు బ్రాహ్మణ వసుభూతి : తల్లిపేరు బ్రాహ్మణీ పృథ్వి. గ్రామంపేరు గోర్బర మగధ దేశంలోని గుణవ అనే గ్రామంలో సిద్ధి పొందాడు.

2. భద్రబాహు. (క్రీ. శ. 475–520) జైనమత చరిత్రను చూసినట్లయితే ఇద్దరు భద్రబాహులున్నట్లు కనిపిస్తున్నది. ఇతనికి 'శ్రుత కేవలిన్' అని బిరుదు ఉన్నది. ఇతను చంద్రగుప్త మౌర్యుని కాలంలో నివసించాడు. జైన తర్కానికి శిరోమాణికమైన 'స్యాద్‌వాదాన్ని' విపులీకరించాడు. అంతేగాకుండా

5. దేశ అవిరత జీవులు
6. ప్రమత్తా విరత జీవులు (ప్రతిజ్ఞను పాటించలేని జీవులు)
7. అప్రమత్తావిరత జీవులు
8. అపూర్వ కారణ జీవులు
9. అనివృత్తి కారణ జీవులు (గొప్ప మేధస్సును కలవారు)
10. సూక్ష్మ సంపరాయ జీవులు
11 ఉపశాంత మోహ జీవులు
12. క్షీణ మోహ జీవులు
13. సంమగో — కేవల జినులు
14. అయోగ కేవల జినులు

జైనుల దృష్టిలో రాగం, ద్వేషం, మోహం అనేవి జీవిని బంధిస్తాయి. సంయక్ చరిత, సంయక్ శ్రద్ధ, సంయక్ జ్ఞానం — (త్రి రత్నాలు అంటారు) ఇవి మోహాన్ని నశింపచేస్తాయి. తద్వారా ఆత్మ ప్రకాశవంతంగా ఉంటుంది.

## జీవుల్లోకి కర్మ ఎట్లా ప్రవేశిస్తుంది ?

జీవుల్లోకి కర్మను ప్రవేశించడాన్ని 'అశ్రవ' అంటారు. కర్మ నాశనాన్ని 'సంవర' అంటారు. జీవుల్లోకి కర్మ 42 మార్గాలద్వారా ప్రవేశిస్తుందని జైనుల విశ్వాసం. పంచ జ్ఞానేంద్రియాలు చేసే పనుల ద్వారాను, నాలుగు రకాలైన ఉద్రేకాల ద్వారాను, (కామం, క్రోధం, లోభం, మోహం) అనేకమైన మనో ప్రవృత్తుల ద్వారానూ కర్మ జీవిలో ప్రవేశిస్తుంది. మన మనస్సు ఎంత సేపయితే ఒక పాపపు విషయంపై రమిస్తుంటుందో, అంత తీవ్రంగా పాపపు కర్మ ఫలితం మన జీవద్రవ్యంలోకి ప్రవేశిస్తుంది. మనోవాక్కాయ కర్మల ఫలితాల ద్వారా కూడా కర్మ జీవంలో ప్రవేశిస్తుంది. అంతేగాకుండా జైన మతంలో అతి ముఖ్యమైనవిగా భావించబడిన పంచ మహావ్రతాలను అచరించ నట్లయితే జీవిలో కర్మ ప్రవేశిస్తుంది. ఆ పంచ మహావ్రతాలు :

శ్వేతాంబర శాఖకు చెందినవాడు. దాదాపు 500 ప్రకరణ గ్రంథాలను సంస్కృతంలో రాసాడు.

4. సిద్ధసేన దివాకరుడు:

(క్షపణకాచార్య) : (క్రీ. శ 480-550) ఇతను వృద్ధవాదిసూరి శిష్యుడు. ఇతని తల్లి దండ్రులను గురించి మనకు తెలియటంలేదు. వైదిక మతానికి ఆదర్శప్రాయమైన శివలింగాన్ని తన స్తోత్ర ప్రతిభచే పగులకొట్టి, దాని స్థానంలో పార్శ్వనాధుని ప్రతిమను స్థాపించినట్లు ఒక కథ ఉన్నది. 'కళ్యాణ మందిర స్తవం' చేసి ఉజ్జయినిలో ఉన్న మహాకాళ ఆలయంలో ఉన్న శివ లింగాన్ని పగులకొట్టినట్లు కొన్ని కథలున్నవి. విక్రమాదిత్యుని జైనమతంలోకి మార్చివేసిన ఘనత ఇతనికే దక్కుతుంది. విక్రమార్కుని ఆస్థానంలో ఉన్న నవరత్నాల్లో ఒకరైన వరాహమిహిరునికి ఇతడు సమకాలీనుడు. ఇతను శ్వేతాంబర శాఖకు చెందినవాడు. ఇతన్ని గురించి ప్రద్యుమ్న సూరి రచించిన విచార సారప్రకరణ గ్రంథంలోను' ఇంకా జినసేనసూరి రాసిన 'ఆదిపురాణ' గ్రంథంలోను అనేకమైన విశేషాలున్నవి.

5. జన భద్ర గణి క్షమాశ్రమణ :

(క్రీ. శ. 484-588) ఇతను "ఆవశ్యక నిర్యుక్తి" అనే గ్రంథాన్ని రాసాడు. ఇతన్ని క్షమాశ్రమణుడని పిలిచేవారు.

6. సమంత భద్రుడు :

(క్రీ శ. 600-660) ఇతను దిగంబర శాఖకు చెందినవాడు. దక్షిణ భారతదేశంలో నివసించాడు. వాచస్పతి మిశ్ర, విద్యానందుడు మొదలయిన వేదాంతులు ఇతని రచనలను పేర్కొని వాటిని తమ గ్రంథాల్లో విమర్శించారు.

7. అకలంక దేవుడు :

(750-820) ఇతను దిగంబర శాఖకు చెందినవాడు. దక్షిణ భారత

దేశంలో నివశించేవాడు. రాష్ట్రకూటుల రాజైన శుభతుంగుని రాజ్యంలో ఉండే వాడు. 'పాండవ పురాణం' అనే గ్రంథంలో ఇతను ఒక బౌద్ధ తార్కికునితో వాదానికి తలపడినట్లు, కాని ఆయనకు ఒక కుండ రూపంలో మాయాదేవి సహాయం చేస్తున్నట్లు గ్రహించి, ఆ కుండను కాలితో తన్ని పగులకొట్టినట్లు ఒక కథ ఉన్నది. కృష్ణరాజ అనే రాజుకు ఇతను సమకాలీనుడు. జైన తర్కాన్ని బాగా అభివృద్ధి చేశాడు.

8. విద్యానందుడు :

(క్రీ. శ. 800—860) ఇతను పాటలీపుత్ర నివాసి. దిగంబర శాఖకు చెందినవాడు. 'ఆప్త మీమాంసాలంకృతి' అనే గ్రంథాన్ని రాశాడు. 'అష్ట సాహస్రి' అనే మరో గ్రంథంలో సాంఖ్య, యోగ, వైశేషిక, అద్వైత, మీమాంసా, సౌగతిక, తథాగత, బౌద్ధ దర్శనాలను విమర్శించాడు. అంతే గాకుండా దిగ్నాగ, ఉద్యోతకార, ధర్మకీర్తి, ప్రజ్ఞాకర, భర్తృహరి, శబర స్వామి, ప్రాభాకర, సురేశ్వర, కుమారిలభట్టు, మొదలయినవారి సిద్ధాంతాలను ఉదహరించి వాటిని విమర్శించాడు.

వీరు కాకుండా జైనమతాన్ని ఉద్ధరించినవారు అనేకమంది ఉన్నారు. వారిలో ప్రముఖులు : మాణిక్యనంది, ప్రభచంద్ర. ఋషభనంద, మల్లవాదిన్, అమృత చంద్రసూరి, దేవసేన భట్టారక, అభయదేవసూరి ప్రద్యుమ్నసూరి, కళ్యాణచంద్ర, అనంతవీర్య, దేవసూరి, హేమచంద్రసూరి, చంద్రప్రభసూరి, నేమిచంద్రకవి, హరిభద్రసూరి, దేవభద్ర, ప్రశ్వదేవగణి, శ్రీచంద్ర, రత్నప్రభ సూరి, చంద్రసేనసూరి, రాజశేఖరసూరి, మల్లిసేనసూరి, తిలకాచార్య, యశో విజయ, మొదలయినవారు జైనమత వ్యాప్తికి కృషి చేసారు.

## జైనుల ఆత్మవాదం

అతి ప్రాచీనమైన వైదిక ధర్మానికి బౌద్ధ ధర్మానికి మధ్య ఒకరకమైన సాంస్కృతిక వారధివంటిది జైనమతం. యజ్ఞ యాగాది క్రతు విధానాన్ని

నిరసిస్తూ, క్షత్రియ వంశాల్లో ఆదరింపబడి, వర్తక వాణిజ్య వ్యాపారస్థులచే అభివృద్ధి చెందింది జైనమతం. జైనమతంలో విశేషంగా కనిపించే సిద్ధాంతం ఆత్మవాదం లేదా జీవవాదం. అనేకమైన జీవులున్నాయని జైనమతం అంగీకరిస్తుంది. సమస్తమైన ప్రపంచం అంతా రెండు పదార్థాలుగా విభజింపబడింది. అవి :

1. జీవం
2. అజీవం లేదా జడపదార్థం, పుద్గల.

అజీవ ద్రవ్యం మళ్లీ అయిదు పదార్థాలుగా విభజింపబడింది. అవి :

1. ధర్మాస్థి కాయం
2. అధర్మాస్థి కాయం
3. ఆకాశాస్థి కాయం
4. పుద్గలాస్థి కాయం
5. అజీవాస్థి కాయం

ఈ అయిదు కాయాలతో జీవునికి కల సంసర్గమే సృష్టి అన్నారు. జీవుని అంగీకరిస్తూ, కర్మను అంగీకరిస్తూ భగవంతుడు లేడని జైనులు భావిస్తారు. కాని జీవుడు లేడంటూ కర్మను అంగీకరిస్తూ, భగవంతుడు లేడంటుంది బౌద్ధమతం. జీవులున్నాయి, కర్మ ఉన్నది. భగవంతుడున్నాడంటుంది హిందూమతం. ఇదే ఈ మతాల మధ్యఉన్న తేడా.

భౌతిక పదార్థమైన శరీరాలతో జీవపదార్థం ఏ విధంగా ప్రవేశించి, సంసర్గాన్ని కలిగి ఉంటుంది ? ఈ ప్రశ్నకు జైనులు చెప్పిన విషయాలు ఆసక్తికరంగా ఉంటాయి. ఒకానొక మనిషి శుభ్రంగా స్నానంచేసి అట్లా వాహ్యాళికి వెళ్ళివస్తే అతనికి తెలియకుండానే అతని శరీరానికి దుమ్ము రేణువులు అంటుకుంటాయో అదే విధంగా మనకు తెలియకుండానే జీవరాసులు శరీరాల్లోకి ప్రవేశిస్తాయి. ఇది అనాదిగా వస్తున్నది. దానికి అంతులేదు. ఎప్పుడైతే శరీరంలో

జీవి ప్రవేశించిందో అదికూడా భౌతికతను పొందుతుంది. కాని దాని శుద్ధ స్వరూపంలో అది జడ పదార్థం కాదు కనక భౌతికతను పూర్తిగా పొందదు. కర్మ ప్రభావంవల్ల శరీరంలో ప్రవేశించిన జీవి కర్మ ఫలితాలను అనుభవిస్తుంది. అందుకే జీవుని దశలు రెండు రకాలుగా ఉంటాయన్నారు జైనులు. అవి :

1. వ్యవహార దశ
2. నిశ్చయ దశ

వ్యవహార దశలో ఆత్మ కర్మలు చేస్తుంది. కర్మ ఫలితాన్ని అనుభవిస్తుంది. కాని దాని నిశ్చయ దశలో అది జ్ఞానాన్ని కలిగి ఉన్నందున దాన్ని ఏదీ అంటదు. జీవునికి అనేకమైన గుణాలున్నాయి. అందులో చైతన్యమనేది జీవుని ముఖ్య లక్షణం. ఇదికాక అనేకమైన లక్షణాలు జీవునికి ఉన్నాయని జైనులు భావించారు. అందులో ముఖ్యమైనవి : అస్థిత్వం, వస్తుత్వం, ద్రవ్యత్వం, అగురులఘుత్వం, ప్రమేయత్వం, ప్రాదేశిత్వం, చేతనత్వం, అమృతత్వం, జ్ఞానం, శక్తి, ఆనందం, ఐశ్వర్యం—మొదలయినవి.

ఈ గుణాలు కాక ఆత్మకు మరో ధర్మం ఉన్నదని జైనులు చెబుతారు. ఈ విషయాన్ని జైనమతం తప్ప ఏ మతం చెప్పలేదు. అంగీకరించలేదు.

ఆత్మలు గుణాత్మకంగా ఉంటాయని చెబుతూ, ఏ శరీరంలో ప్రవేశించిన ఆత్మ, ఆ శరీరం పరిమాణానికి తగినంతగా ఉంటుందని జైనులు భావించారు. అంటే ఏనుగు శరీరంలో ప్రవేశించిన ఆత్మ దాని శరీర పరిమాణమంత ఉంటుందని, చీమ శరీరంలో ప్రవేశించిన ఆత్మ, చీమ శరీర పరిమాణమంత ఉంటుందని జైనులు చెప్పారు. ఈ విషయాన్ని వారు ఒక ఉదాహరణ ద్వారా వివరించారు. వెలుగుతున్న ఒక దీపాన్ని తీసుకొని దాన్ని ఒక గదిలో పెట్టామనుకొందాం. ఆ దీపం వెలుగు ఆ గది అంతా వ్యాపిస్తుంది. కాని గదిలో దీపం ఉన్నచోట కాంతి అధికంగానూ, పోను పోను, గది విశాలాన్ని బట్టి దాని కాంతి తగ్గుతూ ఉంటుంది. అట్లాగే ఒక దీపాన్ని ఒక చిన్న పెట్టెలో పెట్టామను

కొందాం. దాని కాంతి ఆ పెట్టెవరకే పరిమితమవుతుంది. దీపవు కాంతిని జీవుల చైతన్యంతో పోల్చారు జైనులు. అంటే జీవులు గుణాత్మకంగాను, ద్రవ్యాత్మకంగానూ ఉన్నాయన్నారు. అంతేగాకుండా జీవులకు రంగుకూడా ఉంటుందని వీరు భావించారు. వేదాంతంలో జీవికి ఇవన్నీ వర్తిస్తాయి. కాని యథార్థంగా ఆత్మకు ఇవేమీ వర్తించవు.

జైనులు జీవరాశిని వర్గీకరించారు. వారి దృష్టిలో సమస్తమైన జీవులు ఆరు రకాలుగా ఉంటాయి. అవి :

1. ఏకేంద్రియ జీవులు — స్పర్శ ఉన్న జీవులు
2. ద్వి ఇంద్రియ జీవులు — స్పర్శ, రుచి ఉన్న జీవులు
3. త్రి ఇంద్రియ జీవులు — స్పర్శ, రుచి, వాసన, దృష్టి ఉన్న జీవులు
4. చతుర్థ ఇంద్రియ జీవులు — స్పర్శ, రుచి, వాసన, దృష్టి ఉన్న జీవులు.
5. పంచేంద్రియ జీవులు — స్పర్శ, రుచి, వాసన, దృష్టి, శ్రవణం ఉన్న జీవులు.
6. షష్ఠేంద్రియ జీవులు — స్పర్శ, రుచి, వాసన, దృష్టి, శ్రవణం, మనస్సు ఉన్న జీవులు.

## జీవుల్లో ఉన్న తరతమ భేదాలు

అనేకమైన జీవులున్నాయని జైనమతం అంగీకరిస్తుంది. అయితే జీవుల్లో ఉన్న సంయక్ చరిత, సంయక్ శ్రద్ధ, సంయక్ జ్ఞానాన్ని బట్టి వాటిలో తరతమ భేదాలు ఏర్పడతాయి. అవి :

1. మిథ్యాత్వాన్ని కలిగి ఉన్న జీవులు
2. శసదాన జీవులు
3. మిశ్ర జీవులు
4. అవిరత — సంయక్త జీవులు (నిగ్రహం లేని జీవులు)

5. దేశ అవిరత జీవులు
6. ప్రమత్తా విరత జీవులు (ప్రతిజ్ఞను పాటించలేని జీవులు)
7. అప్రమత్తావిరత జీవులు
8. అపూర్వ కారణ జీవులు
9. అనివృత్తి కారణ జీవులు (గొప్ప మేధస్సును కలవారు)
10. సూక్ష్మ సంపరాయ జీవులు
11 ఉపశాంత మోహ జీవులు
12. క్షీణ మోహ జీవులు
13. సంమగో — కేవల జినులు
14. అయోగ కేవల జినులు

జైనుల దృష్టిలో రాగం, ద్వేషం, మోహం అనేవి జీవిని బంధిస్తాయి. సంయక్ చరిత, సంయక్ శ్రద్ధ, సంయక్ జ్ఞానం — (త్రి రత్నాలు అంటారు) ఇవి మోహాన్ని నశింపచేస్తాయి. తద్వారా ఆత్మ ప్రకాశవంతంగా ఉంటుంది.

## జీవుల్లోకి కర్మ ఎట్లా ప్రవేశిస్తుంది ?

జీవుల్లోకి కర్మను ప్రవేశించడాన్ని 'అశ్రవ' అంటారు. కర్మ నాశనాన్ని 'సంవర' అంటారు. జీవుల్లోకి కర్మ 42 మార్గాలద్వారా ప్రవేశిస్తుందని జైనుల విశ్వాసం. పంచ జ్ఞానేంద్రియాలు చేసే పనుల ద్వారాను, నాలుగు రకాలైన ఉద్రేకాల ద్వారాను, (కామం, క్రోధం, లోభం, మోహం) అనేకమైన మనో ప్రవృత్తుల ద్వారానూ కర్మ జీవిలో ప్రవేశిస్తుంది. మన మనస్సు ఎంత సేపయితే ఒక పాపపు విషయంపై రమిస్తుంటుందో, అంత తీవ్రంగా పాపపు కర్మ ఫలితం మన జీవద్రవ్యంలోకి ప్రవేశిస్తుంది. మనోవాక్కాయ కర్మల ఫలితాల ద్వారా కూడా కర్మ జీవంలో ప్రవేశిస్తుంది. అంతేగాకుండా జైన మతంలో అతి ముఖ్యమైనవిగా భావించబడిన పంచ మహావ్రతాలను అచరించనట్లయితే జీవిలో కర్మ ప్రవేశిస్తుంది. ఆ పంచ మహావ్రతాలు :

1. అహింస 2. అస్తేయ 3. అపరిగ్రహ 4. అసత్య 5. బ్రహ్మచర్య. అంతేగాకుండా శుభ, అశుభ భావాలవల్ల కర్మ జీవుల్లో ప్రవేశిస్తుంది.

ఈ విషయాలను కొన్ని ఉదాహరణల ద్వారా నిర్ధారించారు జైనులు. ఒకానొక బాటసారి ఎండలో బాగా అలసిపోయి ఒక చెట్టునీడను చేరాడను కొందాం. మొదట్లో అతని ఉద్దేశం కొంచెంసేపు విశ్రమించి ఆ తరవాత తన గమ్యాన్ని చేరుదామనే ఉంటుంది. కాని చల్లటి నీడ, చల్లటి గాలి శరీరానికి తగలగానే అతనికి హాయి కలిగి, అతనికి తెలియకుండానే నిద్ర పట్టినట్లుగా, దేహేంద్రియ వ్యాపారంవల్ల మనం చేసే అనేకమైన పనులు వాటి ఫలితాన్ని కలిగి ఉంటాయి. అవి మనకు తెలియకుండానే ఆత్మలో ప్రవేశించి జీవులను బంధిస్తాయి.

అయితే ఇక్కడ ముఖ్యంగా మనం గమనించ వలసిన విషయం ఒకటి ఉన్నది. అన్ని దర్శన శాస్త్రాలు ఆత్మ భౌతికమైన వస్తువు కాదంటాయి. జైన మతం కూడా ఆత్మలు వాటి యథార్థ స్వరూపంలో భౌతికం కావని అంగీక రిస్తుంది. కాని మిగతా దర్శనాలన్నీ కర్మకూడా అభౌతికం అని చెబితే, జైనమతం కర్మ భౌతిక పదార్థమని చెబుతుంది. జైనమతంలోని ప్రత్యేకత కాని, విశిష్టతకాని ఇక్కడే కనిపిస్తుంది.

అభౌతికమైన జీవులను, భౌతికమైన కర్మ ఎట్లా బంధిస్తుందనే ప్రశ్నకు జైనమతంలో సరైన సమాధానం దొరకదు. కాని వారిచ్చిన ఉపమానాలను అర్థం చేసుకొంటే వారి వాదన కొంతవరకు సమంజసంగా తోస్తుంది. ఒకానొక ఇనుప గుండును తీసుకొని దాన్ని నిప్పుమీద పెట్టి వేడి చేసినట్లయితే, ఆ ఇనుప గుండు కొంతసేపటికి వేడెక్కుతుంది. నిప్పుమీదనుంచి తీసినప్పటికి కూడా అది వేడిగానే ఉంటుంది. ఇక్కడ ఒక పదార్థం అరూపద్రవ్యాన్ని (వేడిని) గ్రహించినట్లే, అరూపద్రవ్యమైనజీవులు, రూపద్రవ్యమైన కర్మను గ్రహిస్తాయి.

## కర్మస్వరూపం : బంధం : మోక్షం

కర్మ తీవ్రతను బట్టి, కర్మ స్వరూపాన్నిబట్టి బంధస్వరూపం ఉంటుంది. బంధాలనుంచి విముక్తి పొందితేనేగాని మోక్షం లభించదు. ఈ విధంగా ఈ మూడూ పరస్పరాశ్రయాలు. కర్మ స్వరూపాన్ని గురించి, కర్మ ఏ విధంగా ఆ పుణ్ణి బంధితుని చేస్తుందీ, సమస్తమూ కర్మాధీనంగా ఎట్లా ఉండేదీ జైనులు చెప్పినంత వివరంగా మరే దర్శనమూ చెప్పలేదనడంలో అతిశయోక్తి లేదు. జైనులు కర్మ విశ్లేషణను ఏ విధంగా చేసింది చూద్దాం.

1. జ్ఞాన ఆవరణీయ కర్మ :

జ్ఞాన స్వరూపుడైన జీవుని ఆవరించి ఉండేదే జ్ఞానావరణీయ కర్మ. మన ఆలోచనా శక్తిని, సునిశితమైన బుద్ధిని, ఆవరించి మనకు శుభ భావనలను రానీయదు. ఇది మళ్లీ నాలుగు రకాలుగా ఉంటుంది. అవి :

1. ఉత్పాతికి : సునిశితమైన బుద్ధిని మాంద్యపరచే కర్మ.
2. వైనాయకి : మానసిక, శారీరక శక్తులను కోల్పోయేటట్లు చేస్తుంది.
3. పరిణామికి : లాభాలను రాకుండా చేసే కర్మ ఇది.
4. కామికి : పూర్వజన్మలో ఉన్న స్మృతులను ఈ జన్మలోకి రాకుండా అడ్డు పడుతుంది.

2. దర్శన ఆవరణీయ కర్మ :

సరైన శ్రద్ధాసక్తులు కలుగకుండా ఈ కర్మ అడ్డుపడుతుంది. సత్యాన్ని ఆగ్రహించనీయదు. తీర్థంకరులలో విశ్వాసాన్ని కలిగించదు.

3. వేదనీయ కర్మ :

ఒకవైపు తేనె, మరొకవైపు విషం పూసిన పదునైన కత్తితో జీవితాన్ని జైనులు పోలుస్తారు. వేదనంతా రెండు రకాలుగా ఉంటుంది. 1. అనుకూల

వేదన. 2. ప్రతికూల వేదన. ఈ వేదన కర్మ మన అనుకూల జీవితాన్ని, ప్రతికూల జీవితాన్ని నిర్ణయిస్తుంది. అయితే సుకర్మను, దుష్కర్మను రెంటినీ సంపూర్తిగా అనుభవించాలి. అప్పుడే కర్మాభావం చెంది కేవల జ్ఞానానికి అర్హత లభిస్తుంది.

4. మోహనీయ కర్మ :

ఏది మంచో, ఏది చెడో తెలిసినప్పటికినీ మంచిని చేయనీయకుండానూ, చెడును వదలివేయకుండానూ చేస్తుంది మోహనీయ కర్మ.

5. ఆయుః కర్మ :

ఏ జీవి ఎక్కడ ఎంతకాలం జీవిస్తాడో నిర్ణయించేది ఆయుఃకర్మ. మన ఆయుర్దాయం, జీవిత ప్రమాణం, ప్రమాదాలు అన్నీ ఈ కర్మ నిర్ణయిస్తుంది.

6. నామ, గోత్ర కర్మ :

ఎవరు ఏ తల్లి దండ్రులకు పుడతారో, ఎవరు ఏ వంశంలో పుడతారో, ధనవంతులుగాను, బీదవారుగాను, ఆరోగ్యవంతులుగాను, అనారోగ్యవంతులు గాను — ఎవరు ఎట్లా పుట్టాలో నిర్ణయించేది నామగోత్ర కర్మ.

7. అంతరాయ కర్మ :

మానవుడు చేయాలనుకొన్నది చేయలేడు. ఎన్నో అవాంతరాలు, అడ్డంకులు, అంతరాయాలు సంభవిస్తుంటాయి. వీటన్నింటికీ కారణం అంతరాయ కర్మ అని జైనమతం చెబుతుంది.

## సిద్ధి పొందిన జీవస్వరూపం

సమస్తమైన కర్మానుభవాలను తొలగించుకొని, కర్మ శరీరంలోనుంచి బయటకు వచ్చి, భౌతిక శరీరంతో ఏ విధమైన సంసర్గం, సంపర్కం

లేకుండా శుద్ధ జ్ఞాన స్వరూపంతో ఆత్మ ప్రకాశిస్తూ ఉంటుంది. అటువంటి దశలో జీవం సిద్ధలోకానికి పయనిస్తుంది. కేవల జ్ఞానాన్ని పొందిన సిద్ధ జీవిలో 131 పవిత్రమైన గుణాలుంటాయి. వీటిని సిద్ధగుణాలు అంటారు.

జైనమతంలో ఒక విశేషం ఉన్నది. సమస్తమైన ప్రాణులు మోక్షానికి అర్హులు కారు. జీవి పరిణతి చెందుతూ, అనేక జన్మలెత్తుతూ, మానవజన్మ మెత్తి, మానవజన్మలోకూడా పురుష జన్మనెత్తినప్పుడే జీవికి మోక్షం లభిస్తుం దని జైనుల విశ్వాసం. అందుకే వారు దిగంబరత్వాన్నికూడా ప్రోత్సహించరు. ఇక్కడ మోక్షప్రదాత అయిన భగవంతుడు లేడు. బంధాలనుంచి తప్పించు కొని, సిద్ధాత్మగా ప్రకాశం చెందడానికి కానీ, వేదనీయమైన ఈ సంసారంలో పుడుతూ చస్తూ, మళ్ళీ పుడుతూ చస్తూ కర్మ బంధంలో ఇరుక్కొని ప్రాపంచిక జీవితాన్ని అనుభవించడానికి కానీ జీవులన్నింటికీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఉన్నాయి. అయితే అవి అర్హతను మాత్రం సంపాదించుకోవలసి ఉంటుంది.

# 9

# బౌద్ధ మతం

## సిద్ధార్థ గౌతముడు బుద్ధుడు కావటం

బౌద్ధానికి భారతదేశం పుట్టినిల్లు. గంగానదీతీరాన ఉన్న కోసల, మాళవ, మిథిల, అంగ, మగధ రాజ్యాలలో ప్రప్రథంగా బౌద్ధం వర్ధిల్లింది. ప్రస్తుతం ఈ ప్రదేశాలను గోరక్‌పూర్, వారణాసి, చంపారాన్, ముజాఫర్‌పూర్ దర్భాంగ, భాగల్‌పూరు, పాట్నా, గయా మొదలయిన ప్రాంతాలుగా వ్యవహరిస్తున్నారు. నేపాలులో ఉన్న లుంబినీవనం, కపిలవస్తుపురం బుద్ధుని జీవితంతో ముడిపడి ఉన్నాయి. ఇతని తండ్రి పేరు శుద్ధోదనుడు. తల్లి మాయాదేవి భార్యపేరు యశోధర. కుమారుని పేరు రాహులుడు. వంశం శాక్య వంశం.

క్రీ. పూ. 563 వ సంవత్సరంలో వైశాఖ శుద్ధ పూర్ణిమనాడు బుద్ధుడు జన్మించాడు. ఆ రోజుల్లో జాతకాది సంస్కారకర్మలు చేయించే అలవాటు ఉండటం వల్ల శుద్ధోదనుడు జ్యోతిష్కులను రావించి గౌతముని జాతకం పరిశీలించమన్నాడు. గౌతముని జాతకాన్ని పరిశీలించి అతను గొప్ప చక్రవర్తి అయినా కావాలి లేదా పరివ్రాజక శిరోమణి అయినా కావాలిఅని జ్యోతిష్కులు చెప్పారు. ఈ విషయాన్ని తెలుసుకొన్న శుద్ధోదనుడు కలవరంచెందుతాడు. గౌతముడు సన్యసిస్తాడనే భయంతో అతను అంతఃపురం విడచి పోకుండా అనేక కట్టుదిట్టాలు చేశాడు. జీవితమంతా ఆనందమయంగానే ఉంటుందనే భావాన్ని కూడా గౌతమునిలో కలుగచేయడానికై శుద్ధోదనుడు ప్రయత్నించాడు. కాని విధి బలీయం కదా ! ఒక నాడు గౌతముడు వనంలో విహరిస్తుండగా ఒక పావురం బాణంచేత దెబ్బతిని నెత్తురు కారుతూ గౌతముని సమీపంలో

పడిపోతుంది. దాని బాధను చూసి గౌతముని మనస్సు ద్రవిస్తుంది. దాన్ని చేరదీసి బాణాన్ని తీసిపారవేసి దాని గాయానికి కట్టుకడతాడు. ఇదే బుద్ధుని మొదటి విషాదానుభవం. మరికొంత కాలానికి మరొక దృశ్యాన్ని చూస్తాడు. నడుము పూర్తిగా వంగిపోయి, శరీరం ముడుతలు పడిపోయి, చూపు కనిపించక, చెవులు వినిపించక, ఒక కర్ర సహాయంతో నడవలేక నడుస్తూ పోతూన్న ఒక ముదుసలిని చూస్తాడు. ఇది రెండో విషాదానుభవం. మరి కొంత కాలానికి చనిపోయిన మనిషిని కొంతమంది మోసుకొనిపోతూ, మరికొందరు ఆ శవం వెనక రోదిస్తూపోవడం చూస్తాడు. అతని మనస్సు కలవరం చెందింది. వీటన్నింటికన్నా మరొక సంఘటన ఇతని మనస్సును పూర్తిగా మార్చివేసింది. ముండితశిరస్సుకలవాడై కాషాయ వస్త్రధారిఅయి వెళుతున్న ఒక శ్రమణుని చూస్తాడు. ఆ విధంగా ఎందుకున్నావని ఆయన్ను గౌతముడు ప్రశ్నిస్తాడు. ఈ జీవితం దుఃఖమయమనీ దాని నుంచి తప్పించుకోవడానికి ఆ విధంగా భిక్షాటనచేస్తూ జీవితం గడుపుతున్నానని శ్రమణుడు చెబుతాడు. ఆయన మాటలు విన్న గౌతమునిలో పూర్తిగా పరివర్తన వస్తుంది. ఆ రోజు రాత్రే భార్యను, బిడ్డను, రాజ్యాన్ని, సర్వస్వాన్ని వదలి, చెన్నుని సహాయంతో కపిలవస్తునగరం వ[illegible]శ్చిపోతాడు గౌతముడు.

కపిలవస్తు నగరంవదలివెళ్ళిందిమొదలు బుద్ధత్వం పొందేవరకుగౌతముని జీవితాన్ని గురించి అనేక కథలున్నాయి. అవన్నీ చెప్పడానికి ఇక్కడ వీలు పడదు. కాని కొన్ని ముఖ్య విషయాలను గురించి మాత్రం తెలుసుకొందాం. కపిలవస్తు నగరాన్ని వదలి వెళ్ళిన తరవాత వైశాలీ నగరం చేరాడు. వైశాలీ నగరం శ్రమణులకు నిలయం. శ్రమణులు కఠిన నియమాలతో శరీరాన్ని శుష్కింప చేసుకోవటమే ముక్తిమార్గంగా భావించారు. ప్రాయోపవేశం, ఘోర మైన తపస్సు, ఆత్మార్పణ ద్వారా మోక్షాన్ని పొందవచ్చని శ్రమణులు భావించారు. వారితోపాటు కొంతకాలమున్న తరవాత అవన్నీ శరీరాన్ని శుష్కింప చేస్తాయేగాని మోక్షాన్ని ఇవ్వలేవని గ్రహించాడు గౌతముడు. బ్రాహ్మణమతాను గుణమైన ఆచారాలవల్ల సాధించేది ఏదీ లేదని గౌతముడు భావించాడు. ఆ

ఆచారాలను నిరసించాడు. అప్పటిదాకా ఆయనతో ఉన్న అయిదుగురు అనుచరులు ఆయన్ను వదలివేసి వెళ్ళారు.

ఆ తరవాత కొంతకాలానికి మగధదేశపు రాజధాని అయిన 'రాజగృహ' అనే పట్టణానికి వచ్చాడు గౌతముడు. ఆ రోజుల్లో మగధను బింబిసారుడనే రాజు పరిపాలిస్తున్నాడు. బింబిసారుని ఆతిథ్యాన్ని స్వీకరించి ఆయన్ను పశుహింస నుంచి మరల్చాడు. ఆ తరవాత గౌతమునికి ఆలారకాలాముడనే ఒక యోగితో పరిచయం ఏర్పడింది. ఆయనవద్ద గౌతముడు యోగాభ్యాసం నేర్చుకొన్నాడు. యోగం ద్వారా చిత్తవృత్తిని నిరోధించవచ్చని గౌతముడు గ్రహించాడు. ఆ తరవాత ఉద్ధకరామ పుత్రుని కలుసుకొని తపస్సు చేయడం నేర్చుకొన్నాడు. చైతన్యం ఉండీ ఉండని మానసిక అవస్థను రామపుత్రుని వద్ద నేర్చుకొన్నాడు గౌతముడు. యోగం, తపస్సు—ఈ రెండూ బుద్ధుని అనంతరం వచ్చిన బౌద్ధమతంలో ధ్యానానికి బాగా తోడ్పడ్డాయి.

ఆ తరవాత ఆరు సంవత్సరాలు ఉరువేల పర్వత ప్రాంతాల్లో తపస్సు చేశాడు గౌతముడు. తపస్సు వల్ల శరీరం శుష్కించటం తప్ప ఫలితం లేదని గ్రహించాడు. వాదప్రతివాదాల ద్వారా సత్యం గ్రహింపబడదని గుర్తించాడు. ఆధ్యాత్మిక పురోభివృద్ధికి, దుఃఖనిరోధానికి సంపదలు అనవసరమని గ్రహించాడు. నిరాహారదీక్షలవల్ల శరీరం పవిత్రంకాదని, భోగలాలసత్వాన్ని వదలివేయడం వల్లనే శరీరం పవిత్రమవుతుందని గ్రహించాడు గౌతముడు. వినయం, శీలం, కరుణ, మైత్రి, సుశిక్షణ, నమ్రత, ప్రేమ, అనురాగం, అనుకంపం—ఇత్యాది సుగుణాలను అలవరచుకొని వాటిని పెంపొందించుకోవడం వల్ల మనస్సు నిర్మలంగా ఉంటుందని, ఏకాంత నివాసంవల్ల హృదయం పరివర్తనచెందుతుందని బుద్ధుడు గ్రహించాడు.

గాఢ సమాధిలో 'సంబోధి' ని పొందిన తరవాత గౌతముడు బుద్ధుడయ్యాడు. ఆ తరవాత ఆయన బుద్ధ భగవానుడయ్యాడు.

ఆ గాఢసమాధిలో ఆయనకు నాలుగు సత్యాలు గోచరమయ్యాయి. అవి :

1. సర్వం దుఃఖం
2. సర్వం దుఃఖసముదాయం
3. సర్వం దుఃఖ నిరోధం
4. సర్వం దుఃఖ నిరోధమార్గం

వీటిని ఆర్యసత్యాలంటారు బౌద్ధులు. ఈ సత్యాల్లో ఉన్న జ్ఞానాన్నే ఆయన సంబోధిగా గ్రహించాడు. తాను గ్రహించిన సత్యాలను అందరికీ అందించడంకోసం బుద్ధుడు అనేక ప్రదేశాలను సందర్శించాడు. అట్లా అనేక పట్టణాల్లో ఆయన చేసిన ప్రవచనాన్నే "ధర్మచక్రప్రవర్తనం" అన్నారు. దీన్ని ముందుగా స్వీకరించినవారు అయిదుగురు వారు : 1. సారిపుత్రుడు 2. మొగ్గల్లానుడు 3. ఉపాలి 4. కాశ్యపుడు 5. ఆనందుడు. ఆనందుడు బుద్ధుని ప్రియ శిష్యుడు.

## బౌద్ధ ఆర్య సత్యాలు

### అంతా దుఃఖమయం అంటే ఏమిటి ?

బుద్ధుడు ప్రప్రథమంగా గుర్తించిన సత్యాలను ఆర్యసత్యాలన్నారు. అవి నాలుగు 1. ఈ ప్రపంచం అంతా దుఃఖంతోకూడి ఉన్నది. 2. ఈ ప్రపంచంలో ప్రతిదీ దుఃఖమయమే. 3. ఈ ప్రపంచంలో ప్రతిదీ దుఃఖాన్ని నివారించడానికి ఉపయోగించాలి. 4. ఈ ప్రపంచంలోనే దుఃఖ నివారణకు మార్గమున్నది.

అయితే ప్రాథమిక దశలోఉన్న అన్వేషకునికి దుఃఖ స్వభావ స్వరూపాలు అవగాహనంకావు. పంచస్కంధాల స్వరూపాన్ని గుర్తించని వారికి అంతా దుఃఖంగానే ఉంటుంది. పంచస్కంధాల వల్ల ఏర్పడిన ఈ శరీరం దుఃఖానికి కారణభూతమవుతుంది. ఏది ప్రతికూలంగా ఉంటుందో అదంతా దుఃఖమే ఏది అనుకూలంగా ఉంటుందో అది దుఃఖంకాదు. నిర్వాణం మినహా మిగతా వన్నీ దుఃఖకారణాలే. ఈ ప్రపంచంలో మనకు అన్నీ ప్రతికూలాలుకావు ;

అన్నీ అనుకూలాలు కావు. ప్రతికూలాలను నిషేధించాలి. అనుకూలాలను ఆదరించాలి. మనకు త్యాగబుద్ధిలేనంత వరకు, నిర్వాణం పొందాలనే ఆరాటం లేనంతవరకు, సన్యసించాలనే ఆలోచన కలుగనంతవరకు అనుకూలమైన విషయాలను, ప్రతికూలమైన విషయాలను సమంగా తూచడానికై ప్రయత్నిస్తాం. ఈ తూకంలో ఎప్పుడూ మన భావాలు, మన మనస్సు, మన చేష్టలు—అన్నీ అనుకూలాలవైపే ఉంటాయి. కాని ప్రతికూలాలు చాలావరకు అనుకూలమైన విషయాలను మించి ఉంటాయనే విషయాన్ని మనం మరచిపోతాం. రాగ ద్వేష మోహాదులున్నంత వరకు మనకు అనుకూలమైన విషయాలను సాధించడానికే యత్నిస్తాం. ఈ ప్రయత్నమంతా వేదనతో కూడి ఉంటుంది. నిరాశ, నిస్పృహలు మనలను వెంటాడినకొద్దీ మానసికంగా పట్టుదల పెరుగుతుంది. పట్టుదల పెరిగినకొద్దీ ఆవేశానికి లోనవుతాం. ఇదంతా మానసిక సంబంధమైన దుఃఖం.

రెండోదశలో ఈ ప్రపంచం అంతా సుఖాన్నిస్తుందని భావిస్తాం. ఒక సుఖాన్ని అనుభవిస్తే దాన్ని మళ్ళీ మళ్ళీ అనుభవించాలని శరీరంవాఛిస్తుంది. ప్రాపంచిక సుఖాల స్వరూప—స్వభావాలను తెలియక వాటి వ్యామోహంలో పడి పోయి నిర్వాణసుఖాన్ని మరచిపోతాం. ప్రాపంచిక సుఖాలు మిశ్రిత సుఖాలు. నిర్వాణ సుఖం పొందగోరేవారు ప్రాపంచిక సుఖాలకు విముఖులుగా ఉంటారు.

మూడో దశలో ప్రాపంచిక సుఖాలు సుఖాలు కావనీ, నిర్వాణమే పరమ శాశ్వతమైనదనీ 'అర్హంతుడు', గ్రహిస్తాడు. వారి దృక్పథమే వేరుగా ఉంటుంది. దుఃఖమంటే అశాంతి, భయం, వేదన, తృష్ణ, కలవరం మొదలయినవి. వీటి! దూరంగా ఉండటమే—నిర్వాణం.

సర్వమూ దుఃఖమని బుద్ధుడు చెప్పినప్పుడు ఆయన్ను అవహేళన చేసినవారు లేకపోలేదు. జీవితాన్ని ఆనందమయం చేసుకోవడం చేతగాక బుద్ధుడు సర్వం (జన్మ జరా మరణాదులు) దుఃఖమని అన్నాడని చాలా మంది ఆయన్ను అపహాస్యం చేశారు. సర్వం దుఃఖమని బుద్ధుడు చెప్పినప్పుడు ఆయన

ఏ అర్థంలో చెప్పిందీ గ్రహిస్తే ఈ అపార్థాలకు, అవహేళనకు తావుండదు. జన్మదుఃఖమన్నప్పుడు బుద్ధుని భావం వేరు. మాతృగర్భంలో నుంచి శిశువు బయటికి వచ్చేటప్పుడు తల్లీ బిడ్డ పడే ప్రసవ వేదన దుఃఖంకాక మరేమవుతుంది? అదే జన్మ దుఃఖం. వార్థక్యంలో శరీరం తన సౌందర్యాన్ని, పటిష్ఠతను కోల్పోతుంది. వ్యాధిగ్రస్తమవుతుంది. ప్రతిదానికీ ఇతరుల మీద ఆధారపడ వలసి వస్తుంది. ఆలోచనాశక్తి నశిస్తుంది. మరుపు వస్తుంది. ఈ విధంగా శరీరం తన ధర్మాలను శక్తులను కోల్పోతుంది. వీటన్నింటినీ మించింది మరణ భయం. అది కలిగిననాడు అంతా దుఃఖమయంగా గోచరిస్తుంది.

దుఃఖలక్షణాన్ని బౌద్ధులు వర్ణించినంత తీవ్రంగానూ, విపులంగానూ మరెవ్వరూ వర్ణించలేదు. జీవితాన్ని కూడా విషాదపదజాలంతోను, దుర్భరమైన హేయమైన ఉపమానాలతో వర్ణించారు. విషాదం, దుఃఖం బౌద్ధంలో కీలకమైన స్థానాన్ని ఆక్రమించాయి. స్వయంగా కోరివరించిన దారిద్ర్యపు భిక్షాటన వృత్తి సర్వసంగపరిత్యాగం బుద్ధుని మనస్సును దుఃఖంవైపు మళ్ళించాయి. సుదీర్ఘమైన ఈ సంసారసాగరంలోని జీవరాశి వదలిన కన్నీళ్ళు ఇంకి ఉండకపోయినట్లయితే అవి సముద్రజలాలకన్నా అధికంగా ఉండేవనే ఉత్ప్రేక్షతో దుఃఖాన్ని బౌద్ధులు వర్ణించడం ఇక్కడ గమనార్హం.

దుఃఖమయమైన ఈ ప్రపంచ స్వరూపాన్ని బుద్ధుడు విపులీకరించాడు. దుఃఖమనే అగ్ని మనల్నందరినీ దహిస్తుండగా సుఖసంతోషాలతోను, నవ్వులతోను కేరింతలు కొడుతూ భోగ భాగ్యాలను అనుభవించడానికి ఈ లోకంలో అవకాశం ఎక్కడ ఉన్నదని బుద్ధుడు ప్రశ్నించాడు. ఈ లోకమంతా చీకటిలో మునిగి తేలుతూ కొట్టుకొనిపోతూవుంటే జ్ఞానదీపిక అనే ఆధారం కోసం ప్రజలెందుకు వెదుకరని బుద్ధుడు ప్రశ్నించాడు. అయితే ఈ ప్రశ్నలను ముందుగా ఉపనిషద్ద్రష్టలు వేశారు. కాని వారు చెప్పిన సమాధానంకన్నా బుద్ధుడు చెప్పిన సమాధానంలో నూతనత్వం, హేతువు ఎక్కువగా ఉన్నట్లు మనకు కనిపిస్తాయి. బౌద్ధాన్ని నిరాశావాదమని కాని, నిరాశాతత్త్వమని చెప్పినవారు లేకపోలేదు.

కాని అది సరైనవాదంకాదు. జీవితం అంతులేని దుఃఖంతో కూడి ఉన్నదేకాని, దాన్నుంచి నివృత్తిలేదని బౌద్ధం చెప్పదు. బౌద్ధులు చెప్పిన దుఃఖనివృత్తి మార్గాన్ని 'ఆర్య అష్టాంగమార్గం' అన్నారు. దాన్ని గురించిచూద్దాం.

## ఆర్య అష్టాంగమార్గం : లేదా దుఃఖనిరోధమార్గం

నిర్మలమైన నీతిని, ధర్మాన్ని బౌద్ధం ఆదరించింది. ప్రతి పనికీ మూడు దశలు ఉంటాయి. 1. సంకల్పం 2. క్రియ 3. ఆ క్రియద్వారా జనించే ఫలితం. ఈ ఫలితం మళ్ళీ మూడు రకాలుగా ఉంటుంది. 1. సుఖప్రదమైనది. 2. దుఃఖప్రదమైనది 3. మిశ్రమ ఫలితాన్నిచ్చేది. మన సంకల్పం మంచిదైనప్పుడు అది శీలాభివృద్ధికి తోడ్పడుతుంది. మన సంకల్పం చెడుదైనప్పుడు అది దుర్మార్గానికి దారి తీస్తుంది. బుద్ధుడు ఉపదేశించిన నీతి మార్గాన్ని మధ్యమపదమార్గం' అంటారు. మితిలేని రాగాన్ని, మితిలేని వైరాగ్యాన్ని వదలి వేయమని బుద్ధుడు బోధించాడు. 'అతి సర్వత్ర వర్జయేత్'— అనే నానుడి బౌద్ధం నుంచే వచ్చి ఉంటుంది. ఏ విపరీతమైన మార్గాన్ని కూడా మానవుడు ఆచరించరాదని బౌద్ధం చెబుతుంది.

బుద్ధుడు బోధించిన నైతికమార్గంలో 8 అంగాలున్నందువల్ల ఈ సిద్ధాంతాన్ని 'ఆర్య అష్టాంగ మార్గం'' అన్నారు. ఇందులో ఉన్న అంశాలు :

1. మంచి దృష్టి
2. మంచి సంకల్పం
3. మంచి మాట
4. మంచి పని
5. మంచి జీవన విధానం
6. మంచి ప్రయత్నం లేదా మార్గం
7. మంచి మనస్సు
8. మంచి సమాధి నిష్ఠ.

## 1. మంచి దృష్టి

పూజా పునస్కారాదులలో బౌద్ధానికి నమ్మకంలేదు. నూరు సంవత్సరాలు అగ్నిని ఆరాధించటంకన్నా ఒక్కరోజు సక్రమంగా మన జీవితాన్ని నడుపుకొంటే మంచిది. అన్ని జీవులపట్ల సమమైన దృష్టిని కలిగి ఉండటమే మంచి దృష్టి అనిపించుకొంటుంది. ఉపవాసాలు, దిగంబరత్వం, ముండనం, నిరసనదీక్షావ్రతాలు, తపస్సు మొదలయినవి నిరర్థకం. జీవకారుణ్యం ఉండాలి. జీవహింస పనికిరాదు. దేవతలకు హోమంచేయడం, బ్రాహ్మణులకు దానమివ్వడం వల్ల ప్రయోజనంలేదు. మానసిక మాలిన్యాన్ని వదలి వేయాలి. సాంఘిక జీవనంలోను, వ్యక్తి జీవనంలోను సమానమైన దృష్టిని అలవరచు కోవాలి.

## 2. మంచి సంకల్పం :

మంచి సంకల్పం అంటే ఏమిటి? మనకు మంచి దృష్టివుంటే అది మంచి సంకల్పానికి దారి తీస్తుంది. చెడు సంకల్పం చెడు మార్గానికి దారి తీస్తే, మంచి సంకల్పం మంచి మార్గానికి దారి తీస్తుంది. చెడు భావాలు మనలో నుంచి తొలగిపోవాలి. దీనికి మనోనిగ్రహం కావాలి. మనోనిగ్రహం లేనివారి మనస్సు నిశ్చలంగా ఉండలేదు. అది అటూ, ఇటూ వూగిసలాడే బొమ్మలాగా ఉంటుంది. దీన్నే చిత్తచాంచల్యం అంటారు. చిత్తచాంచల్యం ధైర్యాన్ని కోల్పోయేఅట్లు చేస్తుంది. ధైర్యం కోల్పోయినవారు మానసికంగాను, శారీర కంగానూ దుర్బలులవుతారు. అటువంటివారు నైతికజీవనం గడపలేరు. అందుకే ప్రతివారూ మంచి సంకల్పాలను కలిగి ఉండాలి.

## 3. మంచి మాటలు

మనం మాట్లాడే మాటలు సాధారణంగా రెండు రకాలుగా ఉంటాయి. 1 హితవచనాలు 2 అహితవచనాలు లేదా ప్రియ వచనాలు. అప్రియ వచనాలు. లేదా సత్య వచనాలు లేదా అసత్య వచనాలు. లోకకల్యాణం కోసం ప్రతి

వారూ హితాన్ని, ప్రియాన్ని, సత్యాన్ని గురించే మాట్లాడాలి. అహితాన్ని గురించి, అప్రియాన్ని గురించి అసత్యాన్ని గురించి మాట్లాడరాదు. మనం మాట్లాడేది అబద్ధమైనా ఎవ్వరికీ తెలియదు గదా అని మనం సాధారణంగా భావిస్తాం. కాని మనం మాట్లాడింది సత్యమో, అసత్యమో మనకు తెలుస్తుంది కదా ! అందుకే అన్ని జీవులతోను మంచిమాటలనే మాట్లాడుతానని బౌద్ధ సంఘం భిక్షువులచేత ప్రమాణంచేయిస్తుంది. పరుషంగా మాట్లాడరాదు. వాక్కును నిగ్రహించుకోవాలి. నిగ్రహంతో సత్యాన్ని చెప్పాలి. ఆగ్రహం పనికి రాదు.

## 4. మంచి పనులు

ప్రతి పనిని వినయంతోను, శ్రద్ధతోను, అసక్తితోను చేయాలి. అక్రమమైన పనులను చేయరాదు. సక్రమమైన పనులను మాత్రమే చేయాలి. ఇతరులు మనకు ఏమిచేస్తే మనం బాధపడతామో, మనం ఆ పనులు ఇతరులకు చేయకుండా ఉండాలి. ఇదే పరమధర్మం. దీనులకూ, నిస్సహాయులకూ చేసే పనే మంచి పని అవుతుంది. శీలరాహిత్యంగా ఏ మంచి పనిచేయలేం. బాహ్యప్రవర్తన అంతర్గతమైన ప్రవర్తన పవిత్రంగా ఉండాలి. ప్రతి వారిలోను అంతర్గతంగా మార్పు వచ్చి ప్రతి పనినీ పరిశీలించి అది తథాగతుడు చెప్పిన పనులలో ఉన్నదో లేదో తెలుసుకొని దాన్ని ఆచరించాలి.

## 5. మంచి జీవన విధానం

ప్రతివారి ఆర్జన, జీవనాధారం సక్రమంగా ఉండాలి. ఆహారశుద్ధిని ప్రతివారూ పాటించాలి. శరీరం—మనస్సూ రెండూ పవిత్రంగా ఉండాలి. ప్రతివారూ శ్రమపడి వారి వారి ఆహారాన్ని సంపాదించుకోవలెనే కాని, పరాన్న జీవులుగా ఉండరాదు. అయితే ఈ విషయం బౌద్ధసన్యాసులకు వర్తించదన్నాడు బుద్ధుడు. హింసాయుతమైన అన్నం పనికిరాదు. శ్రమతో ఆర్జించి, తాను తిని, తృప్తిగా ఇతరులకు పెట్టేదే గొప్ప విందు. గుప్తదానం చేయాలి.

## 6. మంచి ప్రయత్నం

మన మనస్సులో ఉండే అనేకమైన వికారాలను, అసమంజసమైన భావాలను అణగార్చుకోవడంకోసం చేసే ప్రయత్నమే మంచి ప్రయత్నం కామం, క్రోధం, లోభం, మదం, మోహం, మాత్సర్యం—మొదలయినశత్రువులను జయించడానికై ప్రయత్నించాలి. ఇవి మన మనస్సును ఉత్తేజపరుస్తాయి. ఒక చెడు భావాన్ని కానీ, ఆలోచనను కానీ మనసులోనే అణచివేయాలి. దానికి కొంత ప్రయత్నం అవసరం. దీనికోసం బుద్ధుడు ఉపాయ పంచకాన్ని ఉపదేశించాడు.

I. మంచిభావంతో మన మనస్సును ఎప్పుడూ ఉంచుకోవాలి.

II. ఏ దురాలోచన మనస్సులో వచ్చినప్పటికీ దాన్ని కార్యరూపంలోకి రానీయకూడదు.

III. దురాలోచన మనస్సులో వచ్చినప్పుడు, దాన్ని అణగతొక్కి మంచి భావాన్ని మనస్సులోకి తెచ్చుకోవాలి.

1V. దురాలోచన రావడానికిగల కారణాలను పరిశీలించి వాటి నివారణకోసం ప్రయత్నంచేయాలి.

V. మనోబలాన్ని పెంచుకోవాలి. ఆవేశం మొదలయినవాటికి స్థానం ఇవ్వరాదు.

## 7. మంచి మనస్సు

సక్రమ మైన మనః ప్రవృత్తి కలవారు సత్యాన్ని దర్శిస్తారు. బౌద్ధంలో ధ్యానానికి తగినస్థానమున్నది. ధ్యానం వల్ల మంచి మనస్సు ఏర్పడుతుంది. ధ్యానం నాలుగు దశలు. ఏకాంతనివాసం వల్ల జనించే ఆనందం మొదటిది. ఈ దశలో ఆత్మ విమర్శన, అంతర్ దృష్టి ఏర్పడుతుంది. రెండో దశలో చిత్త శాంతి ఏర్పడుతుంది. మూడో దశలో వాంఛలన్నీ నశించి సంపూర్ణమైన సుఖ

శాంతులతో వుంటాడు. నాలుగో దశ భాపరహిత మైన స్థితి. ఇదే ఉత్తమమైన మనస్సు. ఇదే సమాధి. సమాధి ఆవస్థకు ఇదే పరమ ధ్యేయం.

## 8. మంచి సమాధి

పైనచెప్పిన అంశాలన్నింటినీ కలిగి ఉంటేనేగాని ధ్యానావస్థను చేరుకోలేం. అతీంద్రియ శక్తులను సాధించటంకోసం చేసే యోగాభ్యాసం, కామమోహితులై చేసే మంత్ర తంత్రాలు సరైనవికావు. వింతలు చేయడానికికాని ఇతరులను సంతోషపెట్టడానికికాని యోగశక్తిని వినియోగించరాదు.

నైతిక విలువలకు ఇచ్చినంత ప్రాముఖ్యాన్ని బౌద్ధులు మరొకదానికి దేనికీ ఇవ్వలేదు. నైతిక విలువలను గుర్తించకపోతే ఉపనిషత్తులలో చెప్పిన ఉపాసన, కర్మ, జ్ఞాన మార్గాలు వ్యర్థమన్నాడు. దుఃఖంనుంచీ, జన్మజరా మరణాదుల నుంచి బయటపడాలంటే ఏమి చేయాలి అనే ప్రశ్నకు బౌద్ధంలో ఒక విశేషమైన సమాధానం ఉన్నది. అదే బౌద్ధం ప్రత్యేకత.

## అనాత్మ వాదం

బుద్ధుడు ఆత్మను అంగీకరించాడా ? లేదా ? అనే ప్రశ్నలకు సమాధానాన్ని చెప్పబోయే, ముందుగా కొన్ని విషయాలనుపరిశీలించి తెలుసుకోవలసిన ఆవశ్యకత ఉన్నది. ఏ తాత్త్వికుడుకాని, చింతనాపరుడుకాని, దార్శనికుడుకాని, విజ్ఞానశాస్త్రవేత్తకాని, ఆయనకు పూర్వమున్న భావవికాసంచేత ప్రభావితుడవుతాడు. ఇందులో సందేహంలేదు. అట్లాగే తనకు పూర్వమున్న అనేకమైన వాదోపవాదాలచేత బుద్ధుడు ప్రభావితుడయినాడు. అయితే ఆయనలోని గొప్పతనం వాటినన్నింటిని కూలంకషంగా విమర్శించి తనకు హేతుబద్ధమైనవని తోచిన వాటిని మాత్రమే ఆయన అంగీకరించాడు.

సమస్తమైన ప్రాణులు అనుభవించే సుఖదుఃఖాలకు, కష్టనష్టాలకు, అసమానత్వానికి, రోగాలకు, దారిద్ర్యానికి, కారణమేమిటి ? అనే ప్రశ్న అనాది నుంచీ అనేకమంది అడుగుతూవచ్చారు. వారివారికి తోచిన సమాధానాలుచెబుతూ

వచ్చారు. భారతీయ సంస్కృతీ నాగరికతలకు ఆలవాలమైన వైదిక యుగంలో వారు చెప్పిన సమాధానాన్ని నేటికీ కొందరు అంగీకరిస్తున్నారు. కొందరు నిరాకరిస్తున్నారు. మానవుడు స్వేచ్ఛాజీవి అని వైదిక, బ్రాహ్మణ, ఉపనిషద్దర్శనాలు చెబుతాయి. మానవుడు చేసే ప్రతి పనికీ ఆయనే బాధ్యత వహించవలసి ఉంటుంది. లౌకిక కర్మలుకాని, మతసంబంధమైన కర్మలుకాని వాటి వాటి ఫలితాలను తప్పక ఇస్తాయి. అయితే ఈశరీరం ఇక్కడ నశించి పోతుంది. కాబట్టి ఈ కర్మల ఫలితాలను ఎవరు అనుభవిస్తారు? ఎక్కడ అనుభవిస్తారు? ఎట్లా అనుభవిస్తారు? అనే ప్రశ్నలు వస్తాయి. ఈ ప్రశ్నలను దృష్టిలో ఉంచుకొని వైదికమతం కొన్ని సమాధానాలను చెప్పింది. శరీరానికి భిన్నంగాను, ఆత్మ అనేది ఒకటి ఉంటుందన్నారు. ఆత్మ శరీరంలో ఉన్నప్పుడు మాత్రమే శరీరం ఏదైనా పని చేయకలదు. కాబట్టి ఆ కర్మఫలమంతా ఆత్మకే చెందుతుందన్నారు. ప్రస్తుతమున్న శరీరం నశించి పోయినప్పటికీ, శాశ్వతమైన ఆత్మ పాప పుణ్యాలను మూటకట్టుకొని మరొక శరీరంలో ప్రవేశిస్తుందన్నారు. ఆ విధంచా జీవుల్లో మంచి, చెడూ, భోగభాగ్యాలు, ఆరోగ్యం, అనారోగ్యం, తారతమ్యాలు ఏర్పడుతాయన్నారు. ఇదంతా అనాది ప్రవృత్తి అన్నారు.

ఈ విధమైన సిద్ధాంతాన్ని బుద్ధుడు నిరాకరించాడు, శాశ్వతమయింది ఏదీ లేదన్నాడు. ప్రపంచంలో ప్రతిదీ ఎల్లప్పుడూ మారుతుంటుందన్నాడు. అందుకే శాశ్వతవాదాన్ని ఖండించాడు. అయితే బుద్ధుని బోధనల్లో మనకు స్పష్టంగా కనిపించే విషయాలు రెండున్నాయి 1. ఆత్మ ఉనికిని నిరాకరించటం 2. కర్మ, పునర్జన్మ అంగీకరించటం ఇదే బౌద్ధంలోని నూతనత్వం.

అందుకే బౌద్ధంలో మూడు లక్షణాలు కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి. అవి:

(i) ధర్మదీక్షా పరత్వం

(ii) దైవప్రసక్తి లేకపోవడం

(iii) వాదంకోసం చేసే తత్త్వవిచారణలో ఆసక్తి లేకపోవడం.

బుద్ధునికి పూర్వమే ఆత్మను గురించి ఎన్నోరకాల వాదాలు ఉన్నాయి. పరలోకం ఉన్నదా ? మరణానంతరం జీవుడు తిరిగి జన్మిస్తాడా ? కర్మ ఫలితాన్ని ఎవరనుభవిస్తారు ? స్వర్గనరకాలున్నాయా ? ఆత్మ శాశ్వతమా ? అశాశ్వతమా ?

ఈ రకమైన ప్రశ్నలన్నింటినీ బుద్ధుడు పరిశీలించాడు. ఇందులో కొన్ని రకాలైన ప్రశ్నలకు మానవ మేధస్సు సమాధానం చెప్పలేదన్నాడు. కొన్ని ప్రశ్నలను అవ్యాకృత ప్రశ్నలన్నాడు. ఆత్మ ఉన్నదా ? లేదా అనే ప్రశ్నకు బుద్ధుడు మౌనం వహించాడని కొందరు చెప్పారు. ఒకసారి వచ్ఛగోత్తుడనే భిక్షువు బుద్ధుని సమీపించి ఆత్మ ఉన్నదా అని ప్రశ్నిస్తాడు. ఆ ప్రశ్న విని కూడా బుద్ధుడు అతనికి సమాధానమివ్వకుండా మౌనంగా ఉంటాడు. ఆత్మ లేదా ? అని తిరిగి ప్రశ్నిస్తాడు వచ్ఛగోత్తుడు. అప్పుడు కూడా మౌనం వహిస్తాడు బుద్ధుడు. ఆయన మౌనాన్ని తనకు తోచిన విధంగా అర్థంచేసుకొని వెళ్ళిపోతాడు వచ్ఛగోత్తుడు. వచ్ఛగోత్తుడు వెళ్ళిపోయిన తరవాత కొంత సేపటికి ఆనందుడు బుద్ధుని సమీపించి ఆయన మౌనంగా ఉండటంలో అర్థం ఏమిటని ప్రశ్నిస్తాడు. ఆత్మ ఉన్నదా అని వచ్ఛగోత్తుడు ప్రశ్నించినప్పుడు 'ఆత్మ ఉన్నదని' తాను చెప్పినట్లయితే శాశ్వతవాదుల వాదాన్ని తాను సమర్థిస్తున్నాడని వచ్ఛగోత్తుడు భావించవచ్చు. అంతేగాక ఆత్మలేదా అని ప్రశ్నించినప్పుడు ఆత్మ లేదని చెప్పినట్లయితే ఆ జీవకులు, నాస్తికులు, చార్వాకులు చెప్పిన ఉచ్ఛేద వాదాన్ని తాను సమర్థిస్తున్నట్లు వచ్ఛగోత్తుడు భావించవచ్చు అందుకని ఆయన అడిగిన రెండు ప్రశ్నలకు తాను మౌనం వహించానని బుద్ధుడు ఆనందునికి చెప్పాడు.

మానవుని ప్రస్తుత జన్మను గొలుసులో ఉన్న ఒక లింకుతో పోల్చారు బౌద్ధులు. ఒక గొలుసులో ఉండే ప్రతి లింకుకూ ముందూ వెనక అనేకమైన లింకులు ఉన్నట్లు, మన ప్రస్తుత జన్మకు కూడా ముందు వెనకల జన్మలుంటా యన్నాడు బుద్ధుడు. ఈ జన్మ అంతమొందేటప్పుడు అది మరొక జన్మకు సూక్ష్మరూపంలో బీజాలేర్పచి అంతమవుతుంది. మన ప్రస్తుత జన్మ పూర్వ

జన్మ నుంచి వచ్చినప్పటికీ పూర్వజన్మల నుంచి శాశ్వతంగా వచ్చేది ఏదీ ఉండదు. అట్లాగే ప్రస్తుత జన్మనుంచి రాబోయే జన్మల్లోకి మార్పు లేకుండా, శాశ్వతంగా వెళ్ళేదికూడా ఏమీలేదు. ఈ విషయం చాలా మందికి వింతగానూ లేక విరుద్ధంగానూ గోచరించవచ్చు. కాని ఇక్కడే బౌద్ధ మతం చెప్పిన నూతన విషయం గోచరిస్తుంది. ఎవరి కర్మకు వారే బాధ్యులనే ఆర్యోక్తిని బుద్ధుడు అంగీకరించాడు. పూర్వజన్మనుంచి ప్రస్తుత జన్మలోకి సంస్కారాలు మాత్రమే వస్తాయన్నాడు బుద్ధుడు.

అయితే బుద్ధుడు ఆత్మను నిరాకరించడం వల్ల కొన్ని సమస్యలు ఉత్పన్న మయ్యాయి. ఉదాహరణకు, ఆత్మ లేకపోతే కర్మలు చేసేదెవరు? కర్మఫలం అనుభవించే దెవరు? ధర్మమార్గంలో సంచరించమని మానవుని ప్రబోధించే దెవరు? ధ్యానముద్రలో ఆనందం అనుభవించేదెవరు? నిర్వాణంపొందేదెవరు? అంతేగాకుండా ఆత్మలేకపోయినట్లయితే పాప పుణ్యాల విచక్షణ, కర్త, కర్మల భేదం కూడా నశిస్తుంది. ఈ ప్రశ్నలన్నింటికీ ప్రాచీన బౌద్ధంలో సమాధానం దొరకటం కష్టం. అందుకనే బుద్ధుని తరవాతవచ్చిన బౌద్ధ తార్కికులయిన నాగ సేనుడు, చంద్రకీర్తి, నాగార్జునుడు, ధర్మకీర్తి, మొదలయినవారు హేతువును ఆధారం చేసుకొని పైన చెప్పిన ప్రశ్నలకు సమాధానం చెప్పడానికి ప్రయత్నించారు. ఈశ్వర నిరాకరణ, నైరాత్మ్యవాదం, క్షణికవాదం బౌద్ధమత లక్షణాలుగా మిగిలి పోయాయి.

కాని ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే ఆత్మలేదంటూ, ఈశ్వరుడు (అంటే భగవంతుడు) లేడంటూ మోక్షమున్నదని, నిర్వాణమున్నదని బుద్ధుడు చెప్పాడు. అదెట్లా సాధ్యమో చూద్దాం. బుద్ధుడు, ఆయన అనుయాయులు బోధించిన నిర్వాణ స్వరూపాన్ని గురించి తెలుసుకొందాం.

## నిర్వాణం

నిర్వాణమనే పదానికి బౌద్ధులు నిశ్వసించటమనీ, చల్లారిపోవటమని, ఏమీలేకుండా పోవటమని, ఆర్పివేయడమని—అనేక అర్థాలు ఉన్నాయి. రాగ ద్వేష మోహాలు

లేకుండా యోగ ముద్రలో సంబోధి సమాధి స్థితిలో ఉండటమే నిర్వాణం. నిరంతరమైన కోరికలు, భావాలు, తృష్ణ, వేదన, కామం అన్నీ నిర్వాణంలో నశించిపోతాయి.

శూన్యత, అనిమిత్త, అప్రణిహిత (కోరికలేకుండా ఉండటం) ద్వారా నిర్వాణం సిద్ధిస్తుంది. హీనయాన బౌద్ధులు నిర్వాణాన్ని వర్ణించినంతగా ఎవ్వరూ వర్ణించలేదు. ఆ తరవాత మహాయాన బౌద్ధం కూడా అనేక రకాలుగా వర్ణించింది. లౌకిక ధాతువులనుంచి లోకోత్తర ధాతువులోకి పోవడమే నిర్వాణ మని "సద్ధర్మపుండరీకము" అనే గ్రంథంలో ఉన్నది. శ్రావకులు, ప్రత్యేక బుద్ధులు పొందే లోకోత్తరజ్ఞానమే నిర్వాణమని "లంకావతారసూత్ర" అనే గ్రంథంలో ఉన్నది. క్లేషరహితమై, శాంతితో కూడిన విముక్తే నిర్వాణం.

సర్వధర్మ సమత్వ బోధనే నిర్వాణం. అంటే ధర్మనైరాత్మ్యం, దుఃఖ సముదాయం, ధర్మ సమత, ఇంకా బోధిసత్త్వుడు పొందే జ్ఞానం, అర్హంతుడు పొందే జ్ఞానం రెండూ ఒక్కటే అని తెలుసుకోవడమే నిర్వాణం. నిర్వాణం శూన్యమని, నిర్వాణం శాశ్వతస్థితి అని, నిర్వాణం అవ్యాకృతమని, నిర్వాణం అనంతమైన చైతన్యమని "నికాయ గ్రంథాలు" చెబుతాయి.

బౌద్ధులు రెండు రకాలైన నిర్వాణాన్ని అంగీకరించారు. 1. ఉపాధి శేష నిర్వాణం 2. అనుపాధిశేష నిర్వాణం. ఉపాధిశేష నిర్వాణంలో కామ, క్రోధ, లోభ, మోహ, మదమాత్సర్యాలు నశిస్తాయి. మనస్సులో వాటికి ఎటువంటి స్థానం ఉండదు. అవి పూర్తిగా నశించి పోతాయి. కాని వ్యక్తి ఇంకా జీవించే ఉంటాడు అనుపాధిశేష నిర్వాణంలో అమరత్వం, పరమశాంతి, నిర్భయత్వం, అతి గంభీరత ఉంటాయి. ఇటువంటి దశ అచంచలమైనది. మార్పు లేనిది. అచ్యుతం. అనంతం. నిర్వాణం ఉత్పాదితమైనదికాదు. నిర్వాణం అమృతత్వం.

అన్ని క్లేశాలనుంచి విముక్తుడైన వానిని శ్రమణుడంటారు. ఉపక్లేశాలనూ,

మహాక్లేశాలనూ, సర్వదుఃఖాన్ని నశింపచేసి ముందుకు వెళ్ళువారిని ప్రత్యేక బుద్ధుడు అంటారు. ఆ దశ నుంచి యోగ ముద్రలో ఉండే వారిని 'అర్హంత' అంటారు. వీరినే మహాయానులు 'బోధి సత్త్వుడు' అంటారు.



# 10

# షడ్దర్శనాలు : ప్రత్యేక సిద్ధాంతాలు

1. న్యాయ దర్శనం
2. వైశేషిక దర్శనం
3. సాంఖ్య దర్శనం
4. యోగ దర్శనం
5. మీమాంసా దర్శనం
6. వేదాంత దర్శనం

షడ్దర్శనాలు అంటే ఏవి ? ఆ యాదర్శనాలు సాధించిన దార్శనిక ప్రగతి ఏమిటి ? సాంస్కృతిక, వైజ్ఞానిక, భావ వికాసానికి దర్శనాలు ఏవిధంగా తోడ్పడ్డాయి అనే విషయాన్ని చూద్దాం.

ఋగ్వేదం, సామవేదం, యజుర్వేదం, అధర్వవేదం, బ్రాహ్మణములు, అరణ్యకములు, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, ధర్మశాస్త్రాలు, అర్థశాస్త్రాలు, గృహ్యసూత్రాలు, ఇతిహాస పురాణాలు—మొదలయిన మహా గ్రంథాలన్నీ భారతీయ దార్శనిక చింతనకు పునాదులు. క్రీ. పూ. 3000 సం॥ల్లో ఉన్న ఆర్య సంస్కృతిని ప్రతిబింబిస్తూ రాయబడిన ఈ గ్రంథాల్లో ముఖ్యంగా మనకు 'దేవ' లేక 'దేవత' శబ్దం ఎక్కువగా కనిపిస్తుంది. 'దేవ' శబ్దానికి—ఇచ్చువాడు అని అర్థం చెప్పాడు శాయనాచార్యుడు. 'ఎవరికి ఎవరు ఏమి యిస్తారు ?' అనే ప్రశ్న వస్తుంది. ఏదైనా ఎవరికైనా ఎప్పుడైనా కావాలంటే—(అన్ని కోర్కెలకు ముందు) ముందుగా జన్మ అంటూ ఒకటి ఉండాలి. కనక జన్మనిచ్చిన వారిని దేవతా శబ్దంతో పిలచారు.

"మాతృ దేవోభవ".

అట్లాగే తనకు జన్మనివ్వడానికి కారకుడైన వారిని కూడా దేవుడన్నారు.

"పితృ దేవోభవ".

చదువు చెప్పి, శీలాన్ని నేర్పి, సంస్కారవంతుణ్ణిచేసే గురువును కూడా దేవ శబ్దంతో వ్యవహరించారు

"ఆచార్యా దేవోభవ."

ఆర్యులకు ప్రతిదీ ఒక దేవతా స్వరూపంగా గోచరించింది. పంచమహాభూతాలగు పృథ్వి-సమస్తమైన పంటలకు, రత్నాలకు, మణులకు, ఖనిజాలకు—ఆధారం. కనక పృథ్విని దేవతగా భావించారు. అదే విధంగా నీరు, గాలి, నిప్పు, ఆకాశం అన్నీ కూడా మానవునికి ఏదో ఒకటి ఇస్తుంది కాబట్టి వాటన్నింటినీ దేవతా మూర్తులుగా భావించారు. చనిపోతున్న జీవరాశిని చూశారు. మృత్యుదేవతను భావించారు. ప్రపంచంతో ఉండే శక్తికి అంతా ఇంద్రుణ్ణి అధిపతిగా చేశారు. వ్యాధినివారణకు అశ్వనీ దేవతలను సృజించారు. పంటలు బాగా పండడానికి 'పుషాన్' అనే దేవతను, వర్షాలు బాగా కురియడానికి వరుణుడు, ఉషస్సు, సంధ్య, దివారాత్రాలు— అన్నీ వారికి దేవతాస్వరూపంగా కన్పించాయి.

ఒక్కొక్క మహర్షి ఒక్కొక్క దేవతను వర్ణిస్తూ, ప్రార్థిస్తూ అనేకమైన మంత్రాలను కనుక్కొన్నారు. ఈ మంత్రోచ్చారణ వల్ల ఆ దైవం సంతృప్తిచెంది మానవుని కోర్కెలు తీరుస్తారని ఆశించారు. కాలక్రమేణ మంత్ర విద్య తగ్గిపోయి హేతు విద్య చోటుచేసుకొన్నది. ఈ సృష్టికి కారణమేమిటి? అణువులా? భగవంతుడా? ప్రాణమా? పరిణామమా? మానవుడంటే ఎవరు? మొదలయిన ప్రశ్నలకు సమాధానాలు చెప్పడానికి ప్రయత్నించారు. మంత్రద్రష్టలు దార్శనికులయ్యారు. ఒక్కొక్క దర్శనశాస్త్ర కర్త ఒక్కొక ప్రత్యేకమైన సిద్ధాంతాన్ని చెప్పారు. వాటిని గురించి చూద్దాం.

## న్యాయ దర్శనం

అక్షపాదుడు లేక గౌతముడు లేక గోతముడు అనే మహర్షి స్థాపించిన దర్శనాన్ని న్యాయ దర్శనమంటారు. ఈ దర్శనానికి ఆధార గ్రంథాలు :

| రచయిత పేరు | గ్రంథం పేరు |
|---|---|
| గౌతముడు | న్యాయసూత్రాలు |
| వాత్స్యాయనుడు | న్యాయభాష్యం |
| ఉద్యోతకారుడు | న్యాయవార్తిక |
| వాచస్పతిమిశ్ర | న్యాయ వార్తిక తాత్పర్యటీక |
| ఉదయనాచార్యుడు | కుసుమాంజలి, ఆత్మతత్త్వవివేకం |
| జయంతభట్ట | న్యాయ మంజరి |
| శ్రీ కంఠ | న్యాయాలంకార |

వీరందరూ న్యాయతార్కికులు. దర్శనశాస్త్రం ఆత్మ విద్యగా ఉండాలా ? లేద తర్క విద్య, లేద వాద విద్య లేద హేతు విద్యగా ఉండాలా ?—అని వారు వాదోపవాదాలు చేశారు. మూలధారి రాజశేఖరసూరి చెప్పినట్లుగా వీరందరూ శైవమతాభిమానులు. శివుని నిరంతరమూ ధ్యానిస్తూ, 'ఓం నమః శ్శివాయః' అని జపంచేస్తూ శివసాన్నిధ్యాన్ని కోరారు. ముఖ్యంగా పాశుపత మతాన్ని ఆదరించి, పశుపతి నాధుని ఆరాధించారు. వీరందరూ శివుని స్మరిస్తూ, ఆయన్ను ధ్యానిస్తూ, తమ తమ గ్రంథాలను రాశారు.

ఈ దర్శనంలో ముఖ్యంగా తెలుసుకోవలసింది ఆత్మసిద్ధాంతం, ఇంకా ప్రమాణశాస్త్రం. ముందుగా న్యాయదార్శనికులు చెప్పిన ఆత్మ సిద్ధాంతాన్ని గురించి తెలుసుకొందాం.

ప్రతి జీవిలోను చైతన్యం ఉంటుంది. అయితే ఈ చైతన్యం దేన్ని ఆశ్రయించి ఉంటుంది ? శరీరంకన్నా భిన్నంగానూ ఉండేది మరొకటి శరీరంలో ఉండవలె. దాన్ని ఆశ్రయించి చైతన్యం ఉంటుంది. కనక శరీరం చైతన్యం కాదనీ, శరీరాన్ని ఆశ్రయించి చైతన్యం ఉండదని న్యాయ వైశేషికులు చెబుతారు. ఇంద్రియాత్మవాదాన్ని, భూతచైతన్యవాదాన్ని, శరీరాత్మవాదాన్ని, వీరు నిరాకరిస్తారు. అందువల్ల చైతన్యం అనేది శరీరానికి ఒక విశిష్టమైన లక్షణం కాదు.

చైతన్యం శరీరానికి యాదృచ్ఛకంగా లభ్యమయ్యే లక్షణం. అంటే ఆత్మను అంగీకరిస్తూ, ఆత్మలో అనేకమైన గుణాలున్నాయని చెబుతూ ఆ గుణాల్లో ఆగంతుకమైన ధర్మం ఒకటి ఉన్నదంటారు వీరు. అటువంటి ఆగంతుక ధర్మం (అంటే వస్తూ పోతూ ఉండే ధర్మం అన్నమాట) ఆత్మ ముఖ్య ధర్మాల్లో ఒక ధర్మంగా ఉంటుందన్నారు. ఇచ్ఛ, చైతన్యం ఈ రెంటికీ ఒకే అవస్థ ఉంటుంది. చైతన్యం ఉన్నపుడే ఇచ్ఛ ఉంటుంది. ఇచ్ఛ చైతన్యాన్ని ప్రతిబింబిస్తుంది. ఇచ్ఛ, ద్వేషం, అనురాగం, ఆలోచన, సుఖం, దుఃఖం, అంతర్గతమైన స్వసంవేదన, బుద్ధి ఇత్యాదులన్నీ ఆత్మ ఉనికిని సూచిస్తాయి. అంతేగాకుండా ప్రత్యభిజ్ఞ జ్ఞానం ( అంటే స్మృతిజ్ఞానం ) ఆత్మ ఉనికిని తెలుపుతుంది.

న్యాయ దర్శనంలో ఈశ్వరునికి ప్రాధాన్యత ఉన్నది. ఆయన కర్మాధ్యక్షుడు. ఆత్మశాసనుడు. సర్వం ఆయన అధీనంలో ఉంటాయి. ఆత్మలు చేసే కర్మలను, మంచి చెడు పనులను, వాటి వాటి ఫలితాలను సంధించే సంధాన కర్త. మానవులు చేసే పనుల్లో నుంచి ఉత్పన్నమయ్యేవి రెండు : 1. సంస్కారాలు 2. అదృష్టం. ఈ రెండూ ఆత్మలో నిక్షిప్తంగా ఉంటాయి.

మానవుల శరీరంలో ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి బహిర్గతంగా ఉండే ఆత్మ అంతర్గతంగా ఉంటుంది. సంస్కారాలు, అదృష్టం ఆత్మలో ఉండి మానవుని జీవితగమ్యాన్ని నిర్దేశిస్తాయి. చావుపుట్టుకలంటే ఆత్మలు శరీరాలతో కలయుట, ఇంకా విడిపోవుట. ఈ కలయిక ఎట్లా సాధ్యం ? ఎందుకు విడిపోతాయని అడిగితే, అదంతా 'అదృష్టం' మీద ఆధారపడి ఉంటుందని కొందరు చెబితే, అదంతా ఈశ్వరేచ్ఛ, అని కొందరు చెప్పారు. ఆత్మకు జనన మరణాలు లేవుకాని అది ఒక శరీరాన్ని వదలి మరొక శరీరాన్ని ఆశ్రయిస్తుంది. వీరు అనేకమైన ఉదాహరణలతో చెప్పారు. ఉద్యోతకారుడు, వాత్స్యాయనుడు, ఉదయనాచార్యుడు, జయంతభట్టు మొదలయిన న్యాయదార్శనికులు ఆత్మవాదాన్ని, ఆత్మ—పునర్జన్మ—కర్మ—అదృష్ట సిద్ధాంతాలను వారివారి తార్కిక ప్రతిభతో పటిష్ఠం చేసారు.

# అణు సిద్ధాంతం : వైశేషిక దర్శనం

ఏదైనా ఒక పదార్థాన్ని విభజిస్తూపోతే అది అతి చిన్నదిగానూ, దాన్ని ఇంకా విభజించుకొంటూపోతే మరింత చిన్నదిగానూ, మరీ ఇంకా విభజించుకొంటూ పోతే ఇక విభజించలేనంతదిగా మిగిలిపోతుంది. ఈ విధంగా ఒక పదార్థాన్ని విభజించవచ్చునని, అట్లా విభజించుకొంటూపోతే అతి చిన్నదైనది ఒకటి మిగిలి పోతుందని అది అవిభాజ్యమని మొట్టమొదటిసారిగా చెప్పినఖ్యాతి కణాదమహర్షికి దక్కుతుంది. ఆయన ఈ విషయాన్ని కేవలం భావాత్మకంగా చెప్పాడు. అట్లా అవిభాజ్యమైనదాన్ని 'అణువు' అని అన్నాడు. అనేకమైన అణువుల సముదాయంవల్ల పదార్థాలు ఏర్పడతాయి కనక పదార్థాలు ఛిన్నాభిన్న మైనాయంటే పదార్థాలు ఏర్పడటానికి తోడ్పడిన అణుసముదాయం విడిపోయిందే కాని, అణువులు నాశనమయినాయని అనుకోరాదు. అందుకే కణాదుడు అణు స్వభావాన్ని గురించి ఈ విధంగా చెప్పాడు.

1. అణువులు కంటికి కనిపించవు, దాన్ని తాకలేం, దాన్ని చూడలేం.
2. అణువులు నిత్యం, శాశ్వతమైనవి.
3. అణువులను విచ్ఛిన్నం చేయలేం.
4. అణువులు దిక్కాలాలకు అతీతం
5. అణువులు గుణాత్మకంగా ఉంటాయి.
6. పంచ భూతాలకు సమంగా అయిదురకాలైన అణువులు మాత్రమే ఉంటాయి.

అణుసముదాయం వల్ల పదార్థాలు ఎట్లా ఏర్పడతాయి ? పదార్థాలు నాశనం అవడం అంటే ఏమిటి ? రకరకాల పరిమాణం తోటి, విభిన్న మైన రూపురేఖలతోటి పదార్థాలు ఎట్లా ఏర్పడతాయి ? మానవ శరీరం కూడా అణుసముదాయమేనా ? పదార్థాలు అణుసముదాయంవల్ల ఏర్పడితే ఆ పదార్థాలు మళ్ళీ తిరిగి ఎందుకు మామూలు స్థితికి రావు ? ఇట్లాంటి ప్రశ్నలన్నింటికీ వైశేషికులు "పదార్థతత్త్వ సంగ్రహ" అనే గ్రంథంలో సమాధానం చెప్పారు.

పృథ్వి, నీరు, గాలి, నిప్పు, ఆకాశం—వీటిని పంచభూతాలంటారు. వీటికి కొన్ని గుణాలున్నాయి. ఇవి అణువుల సముదాయంతో నిర్మింపబడ్డాయి. కనక పృథ్వికి సంబంధించిన అణువుకు రూపం, రంగు, రుచి, వాసన, స్పర్శ ఉంటాయి. నీటికి సంబంధించిన అణువుకు నాలుగు గుణాలు, నిప్పుకు సంబంధించిన అణువుకు మూడు గుణాలు, గాలికి సంబంధించిన అణువుకు రెండు గుణాలు ఉంటాయి. ఆకాశానికి సంబంధించిన అణువుకు ఒకే గుణం ఉంటుంది. ఆ విధంగా గుణాల్లో ఉండే తేడాను బట్టి ఆయా అణువుల కలయిక వల్ల ఏర్పడే పదార్థాల్లో కూడా గుణాత్మకమైన తేడా ఉంటుంది.

ఏ ఒక్క అణువూ కూడా కంటికి కనిపించదు. రెండు అణువుల కలయికను 'ద్వ్యణుక' అంటారు. అటువంటి 'ద్వ్యణుక'లు మూడు కలిస్తే 'త్రిణుక' అవుతుంది.అయితే ఈ విషయంలో వైశేషిక దర్శనంలో భిన్నాభిప్రాయం ఉన్నది. మూడు అణువులు కలిసి 'త్రిణుక' అవుతుందని ప్రశస్తపాదాచార్యుడు చెప్పాడు. అట్లాకాదు, మూడు 'ద్వ్యణుక'లు కలిసి 'త్రిణుక' అవుతుందని ఉద్యోతకారుడు చెప్పాడు. ఏది ఎట్లున్నా యోగవీక్షణకు అణువు, ద్వ్యణుక త్రిణుక— అన్నీ కనిపిస్తాయన్నారు. రెండు అణువులు పరస్పర సంసర్గం చెందటం వల్ల 'ద్వ్యణుక' ఏర్పడుతుంది. ఆవిధంగా అనేకమైన అణువులు కలయడం వల్ల పదార్థాలు ఏర్పడతాయి. పదార్థాల్లో ఉండే వ్యత్యాసాన్ని అణుసమూహంలో స్వాభావికంగా ఉన్న గుణాత్మక మైన విభేదం వల్ల వీరు వివరించారు.

అణువులతో పాటు, 'అదృష్టం' అనే అతి భౌతిక సూత్రాన్ని కూడా వీరు అంగీకరించారు. అంతే గాకుండా అనంతమైన ఆత్మలను కూడా వీరు అంగీకరించారు. కర్మాధ్యక్షుడైన భగవంతునికూడా వీరు అంగీకరించారు. సప్త పదార్థాలను కూడా అంగీకరించారు. అవి: (1) ద్రవ్యం 2. గుణం 3. కర్మ 4. సామాన్యం 5. విశేషం 6. సమవాయం 7. అభావ. ఈ సప్త పదార్థాలు, ఆత్మలు, అణువులు, అదృష్ట, భగవంతుడు—ఇవన్నీ కలిసి ఈ ప్రపంచం ఉంటుందన్నారు.

పృధ్వి, నీరు, గాలి, నిప్పు, ఆకాశం—వీటిని పంచభూతాలంటారు. వీటికి కొన్ని గుణాలున్నాయి. ఇవి అణువుల సముదాయంతో నిర్మింపబడ్డాయి. కనక పృధ్వికి సంబంధించిన అణువుకు రూపం, రంగు, రుచి, వాసన, స్పర్శ ఉంటాయి. నీటికి సంబంధించిన అణువుకు నాలుగు గుణాలు, నిప్పుకు సంబంధించిన అణువుకు మూడు గుణాలు, గాలికి సంబంధించిన అణువుకు రెండు గుణాలు ఉంటాయి. ఆకాశానికి సంబంధించిన అణువుకు ఒకే గుణం ఉంటుంది. ఆ విధంగా గుణాల్లో ఉండే తేడాను బట్టి ఆయా అణువుల కలయిక వల్ల ఏర్పడే పదార్థాల్లో కూడా గుణాత్మకమైన తేడా ఉంటుంది.

ఏ ఒక్క అణువూ కూడా కంటికి కనిపించదు. రెండు అణువుల కలయికను 'ద్వ్యణుక' అంటారు. అటువంటి 'ద్వ్యణుక'లు మూడు కలిస్తే 'త్రిణుక' అవుతుంది.అయితే ఈ విషయంలో వైశేషిక దర్శనంలో భిన్నాభిప్రాయం ఉన్నది. మూడు అణువులు కలిసి 'త్రిణుక' అవుతుందని ప్రశస్తపాదాచార్యుడు చెప్పాడు. అట్లాకాదు, మూడు 'ద్వ్యణుక' లు కలిసి 'త్రిణుక' అవుతుందని ఉద్యోతకారుడు చెప్పాడు. ఏది ఎట్లున్నా యోగవీక్షణకు అణువు, ద్వ్యణుక త్రిణుక— అన్నీ కనిపిస్తాయన్నారు. రెండు అణువులు పరస్పర సంసర్గం చెందటం వల్ల 'ద్వ్యణుక' ఏర్పడుతుంది. ఆవిధంగా అనేకమైన అణువులు కలయడం వల్ల పదార్థాలు ఏర్పడతాయి. పదార్థాల్లో ఉండే వ్యత్యాసాన్ని అణుసమూహంలో స్వాభావికంగా ఉన్న గుణాత్మక మైన విభేదం వల్ల వీరు వివరించారు.

అణువులతో పాటు, 'అదృష్టం' అనే అతి భౌతిక సూత్రాన్ని కూడా వీరు అంగీకరించారు. అంతే గాకుండా అనంతమైన ఆత్మలను కూడా వీరు అంగీకరించారు. కర్మాధ్యక్షుడైన భగవంతునికూడా వీరు అంగీకరించారు. సప్త పదార్థాలను కూడా అంగీకరించారు. అవి: (1) ద్రవ్యం 2. గుణం 3. కర్మ 4. సామాన్యం 5. విశేషం 6. సమవాయం 7. అభావ. ఈ సప్త పదార్థాలు, ఆత్మలు, అణువులు, అదృష్ట, భగవంతుడు—ఇవన్నీ కలిసి ఈ ప్రపంచం ఉంటుందన్నారు.

ఆ దర్శన వ్యాఖ్యాతలను "ముఖ్య మల్లులుగా" పేర్కొనడం గమనించ దగ్గ విషయం. సాంఖ్య దర్శనం లోని సిద్ధాంతాలు ముఖ్యంగా మూడు. అవి:

1) ప్రకృతి పరిణామవాదం
2) గుణాలు—సత్త్వం, రజస్సు, తమస్సు.
3) పురుషుడు — పురుష బహుత్వం — ప్రకృతి — పురుషుల సంయోగ — వియోగాలు.

సాంఖ్య దర్శనం అంగీకరించిన పరిణామవాదాన్ని ప్రకృతి పరిణామ వాద మంటారు. రామానుజుడు బ్రహ్మ పరిణామ వాదాన్ని అంగీకరించాడు. శ్రీ శంకరుడు బ్రహ్మ వివర్తవాదాన్ని అంగీకరించాడు. బుద్ధుడు క్షణికవాదాన్ని అంగీకరించాడు. జైనులు పౌద్గల పరిహార వాదాన్ని అంగీకరించారు. న్యాయ వైశేషికులు అణుకారణతావాదాన్ని అంగీకరించారు వైష్ణవులు విష్ణు అంతర్యామి వాదాన్ని అంగీకరించారు. భగవద్గీత విష్ణువు సర్వాంతర్యతను చెబుతుంది. శైవులు శివతత్వాన్ని సర్వత్రా అంగీకరిస్తారు.

## ప్రకృతి పరిణామవాదం

ప్రకృతి అంటే ఏమిటి? ప్రకృతి ఏవిధంగా పరిణతి చెందుతుంది? ప్రకృతికి — పురుషునికి గల సంబంధం ఏమిటి? ప్రకృతి పరిణామం చెందటం వల్ల ఎవరికి లాభం? మొదలయిన ప్రశ్నలకు సమాధానాన్ని సాంఖ్యదర్శనం ఎంతో మెళుకువతో చెప్పింది.

పురుషుడంటే ఎవరు? ఆయన ఉన్నట్లు మనకు ఎట్లా తెలుస్తుంది? పురుషుడు ఒకరా? లేక అనేకులా? పురుషునికి మన దేహానికి ఎటువంటి సంబంధం ఉన్నది? మానవుని బుద్ధికి, అహంకారానికి, మనస్సుకు— పురుషునికి ఎటువంటి సంబంధం, సంపర్కం ఉన్నది? ప్రకృతి పరిణామం చెందటంలో పురుషుని

పాత్ర ఎంతవరకు ఉన్నది ? ఈ ప్రశ్నలకు సాంఖ్య దర్శనంలో సమగ్రమయిన సమాధానం కొంతవరకే లభ్యమవుతుంది.

సత్వ, రజస్సు, తమస్సు — అనే మూడు గుణాలు సమస్థితిలో ఉన్నప్పుడు ప్రకృతి సామ్యస్థితిలో ఉంటుంది. ఒక గుణం మరొక గుణాన్ని అధిగమించాలని ప్రకృతి లోపల్లోపల ఉబుకుతుంటుంది. కాని రజోగుణం ఆధిక్యత వల్ల ప్రకృతి సామ్యస్థితి చెదిరిపోతుంది. అట్లా ఎందుకు చెదిరిపోతుంది అని ప్రశ్నిస్తే "పురుష సన్నిధి మాత్రేన ప్రకృతి ప్రవర్తితే" అని సాంఖ్య దర్శన భాష్యకారుడయిన విజ్ఞాన భిక్షువు చెప్పాడు. ప్రకృతి జడ పదార్థం కదా ? దానంతట అది ఎట్లా పరిణతి చెందగలదని ప్రశ్నిస్తే పురుషుని దర్శనార్థం ప్రకృతి ప్రవర్తిస్తుందని, పురుషుడు కేవలం కైవల్యం కోసం ప్రయత్నిస్తాడని సాంఖ్య దర్శనం చెబుతుంది.

ప్రకృతి పురుషుల సంయోగ వియోగాలను గురించి విజ్ఞానభిక్షువు ఒక ఉపమానాన్ని ఆధారం చేసుకుని చెప్పాడు. ఈ ప్రపంచం ఒక మహారణ్యం వంటిది. ఈ ప్రపంచంలో పురుషుడు ఏదోవిధంగా చిక్కుపడిపోయాడు. ఆ చిక్కులోనుంచి విడిపడి పోవాలి. అదే వివేకజ్ఞానం. ఒకానొక కీకారణ్యంలో ఒక కుంటివాడు ఉంటుంటాడు. అదే కీకారణ్యంలో మరొక గుడ్డివాడుంటుంటాడు. అతన్ని ఇతను కాని, ఇతన్ని అతను కాని ఎరుగరు. కాని కాలప్రవాహంలో ఆ కీకారణ్యం అంటుకుంటుంది. ఇద్దరూ భయభ్రాంతులై కేకలు పెడతారు. ఎవరు ఎక్కడున్నది, ఎవరు ఎటువంటివారయినదీ ఆ ఇద్దరికీ తెలియదు. కాని ఒకరి సహాయం మరొకరికి కావాలి. ఆ సహాయాన్ని కాంక్షిస్తారు. కాని వారిని సంధానపరచే వారెవ్వరూ లేరు. ఒకరి ఆక్రందనమరొకరు విని, తమ్ము ముట్టవచ్చే ప్రమాద ప్రేరితులై ఏదోవిధంగా ఒకర్ని మరొకరు కలుసుకోవడం సంభవిస్తుంది. వారిరువురు కలుసుకోగానే 'కణకణా మండుతున్న దావాగ్నిలోనుంచి కుంటివాడు పోవాలని, గుడ్డివాడు పోవాలని హెచ్చరించుకొంటారు. అయితే ఇదెట్లా సాధ్యం. కుంటివాడు నడువలేడు. గుడ్డివాడు చూడలేడు. అందుకే కుంటి

వాడు గుడ్డివాడిపై ఎక్కి దారి చూపుతూ ఆ దావానలంలోనుంచి క్షేమంగా బయట పడవచ్చు అనే భావం తడుతుంది. ఆ విధంగా వారు ఆ ఆపదలోనుంచి బయట పడతారు.

ఈ విధంగానే ప్రకృతి – పురుషులు పరస్పర సహకార, సహాయంతో ఉన్నప్పుడు, ఈ ప్రపంచానికి ఒక సార్ధకత ఏర్పడుతుందని సాంఖ్య దర్శనం లోని ముఖ్య సిద్ధాంతం. ప్రకృతి గుడ్డిది. అది అచైతన్యవంతమయినది. పురుషుడు కుంటివాడు కాని చైతన్యవంతుడు. ప్రకృతి మీదికి ఎక్కి కూర్చొని. గుడ్డిదైన ప్రకృతికి మార్గదర్శకుడుగా ఉండి దుఃఖభూయిష్టమయిన ఈ సంసారంలోనుంచి బయటపడవచ్చు. సాంఖ్యదర్శనం మూడు రకాలయిన దుఃఖాలను అంగీకరించింది. అవి :

1. ఆధ్యాత్మిక దుఃఖం.
2. అధి దైవిక దుఃఖం.
3. అధి భౌతిక దుఃఖం.

ఈ విధంగా ప్రకృతి – పురుషులు, సంసార సాగర దు:ఖపీడితులై ఈ సంసారంలోనుంచి బయటపడాలనే తలంపుతో ఒకరి నొకరు ఆకర్షించు కొంటారు. ఈ ఆకర్షణ ప్రకృతిలో ఒక స్పందనను కలిగిస్తుంది. ఆ స్పందనకు ప్రతిస్పందనే ప్రకృతి పరిణామం. ఒకతడవ పురుషునిచే ప్రతిస్పందనను పొందిన ప్రకృతిలోనుంచి అనేకమార్పులు రావడానికి త్రిగుణాలు తోడ్పడుతాయి. అయితే పురుషుడు ఈ గుణాలకు అతీతుడు అవటంవల్ల ఆయన్ను ఈ గుణాలు ఏమీ చేయలేవు, కాని, ప్రకృతి పరిణామం చెందుతూ వచ్చిన బుద్ధి, మనస్సు, అహంకారాదులతో పురుషుడు ఏకమైనప్పుడు ఆయన్ను అవి ప్రలోభపెడతాయి ఆ ప్రలోభంనుంచి బయటపడటమే వివేక జ్ఞానమని సాంఖ్య దర్శనం చెబుతుంది.

"ప్రకృతి ప్రవర్తతే దర్శనార్థం"
"పురుష ప్రవర్తతే కైవల్యార్థం" ॥

"తన సోయగాలను, సౌందర్యాన్ని, హావభావాలను, సౌష్టవాన్ని, పుష్టిని, రూపలావణ్యాదులను ప్రదర్శించడానికై ప్రకృతి ప్రవర్తిస్తుంది. మోహనీయమైన ఈ దృశ్యానుంచి తప్పించుకోడానికై పురుషుడు ప్రయత్నిస్తాడు." ఇదే సాంఖ్య దర్శనంలోని ప్రముఖ విషయం.

పురుషుని సన్నిధిమాత్రంచేత పులకితమైన ప్రకృతి స్పందన వల్ల మొట్ట మొదటిసారిగా ఆవిర్భవించేది "మహత్తు." మహత్తులోనుంచి "అహంకారం" వస్తుంది. ఈ 'అహంకారం' మూడు రకాలుగా ఉంటుంది. గుణ ప్రాధాన్యతను బట్టి అహంకారం — సత్వ అహంకారం, రజో అహంకారం, తమో అహంకారం అని మూడురకాలుగా ఉంటుంది. సాత్వికాహంకారంలోనుంచి మనస్సు, అయిదు జ్ఞానేంద్రియాలు, అయిదు కర్మేంద్రియాలు వస్తాయి. అన్ని ప్రాణుల్లోను ఇవి తరతమభేదాల్లో ఉంటాయి. తమో అహంకారాన్ని ప్రాధాన్యంగా తీసుకొని పంచ మహాభూతాలైన పృథ్వి, నీరు, గాలి, నిప్పు, ఆకాశం, వీటి 'తన్మాత్రలైన' రూప, రస, గంధ స్పర్శ శబ్దాదులు వస్తాయి. వీటన్నింటికీ అతీతుడుగా పురుషుడుంటాడు. ఇవన్నీ కలిపితే 25 సంఖ్య అవుతాయి. వీటినే తత్త్వాలు అంటారు. వీటి తత్త్వాన్ని తెలుసుకోవడమే వివేకజ్ఞానం అవుతుంది.

## పతంజలి యోగశాస్త్రం

క్రీస్తు పూర్వం దాదాపు 10 శతాబ్దాలనుంచీ భారతదేశంలో యోగాన్ని అభ్యసించేవారని మనకు తెలుస్తున్నది. బుద్ధునికి పూర్వం కూడా అనేకమంది యోగాన్ని అభ్యసించారు. ఆలారకాలాముడు, ఉద్ధకరామపుత్రుడు అనే వారివద్ద బుద్ధుడు యోగాభ్యాసాన్ని నేర్చుకొన్నట్లు అనేకమైన బౌద్ధగ్రంథాలు చెబుతున్నాయి. మహాభారతం, రామాయణం, పురాణాలు యోగాన్ని గురించి, తపస్సును గురించి చెప్పాయి. యోగవాసిష్టమనే గ్రంథంలో యోగ మహాత్మ్యాన్ని గురించి బాగా చెప్పాయి. ముందుగానే ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే పతంజలి మహర్షికి ముందే యోగాన్ని అనేకమంది అభ్యసించారు అనే విషయాన్ని నిరూపించడానికి మాత్రమే.

"యోగ సూత్రములు" అనే గ్రంథాన్ని పతంజలి మహర్షి రాశాడు. "యోగభాష్యాన్ని" వేదవ్యాసుడు రాశాడు. ఈ భాష్యంమీద "తత్త్వవైశారదీ" అనే గ్రంథాన్ని వాచస్పతి మిశ్ర రాశాడు. "యోగవార్తిక" అనే గ్రంథాన్ని విజ్ఞాన భిక్షువు రాశాడు. ఇవికాక కింద తెలుపబడిన గ్రంథాల్లో యోగ శాస్త్రాన్ని గురించి బాగా చర్చింపబడింది.

1. అహిర్బుధన్య సంహిత
2. షష్టి తంత్ర
3. పంచదశి
4. తత్త్వత్రయ
5. సాంఖ్యకారిక
6. తత్త్వ వైశారది
7. సాంఖ్య సూత్ర
8. సాంఖ్య ప్రవచన భాష్య
9. సిద్ధాంత చంద్రిక
10. సూత్రార్థ బోధిని
11. రాజమార్తాండ
12. మణిప్రభ
13. రాజ మృగాంగ
14. సద్ధర్మ పుండరీక
15. హఠయోగ ప్రదీపక
16. యోగవాసిష్టము
17. రసాయనతంత్ర
18. సాంఖ్య తత్త్వ కౌముది
19. సిద్ధాంత చంద్రిక : భోజవృత్తి.

పతంజలి బోధించిన యోగాన్ని 'రాజయోగం' అంటారు. ఇదికాకుండా హఠయోగం లేదా మంత్రయోగం అనేవి కూడా ఉన్నాయి. హఠయోగంలో ఎక్కువగా శారీరక సంబంధమైన ఆసనాలు, వ్యాయామం ఉంటాయి. మంత్ర యోగంలో ఏదో ఒక మంత్రాన్నో, లేదా ఏదో ఒక బీజాక్షరాన్నో స్మరిస్తూ దాన్ని ధ్యానం చేయడం మంత్రయోగం అవుతుంది.

## యోగం అంటే ఏమిటి?

ప్రతివారి మనస్సు కొన్ని వృత్తులకు లోనవుతుంది. అవి : 1. క్షిప్త = విశ్రాంతి లేకుండటం; 2. మూఢ = మోహం; 3. విక్షిప్త = అలజడితో కూడుకొని ఉండటం; 4. ఏకాగ్రత; 5. నిరుద్ధ. ఈ అయిదురకాలైన చిత్త వృత్తులను నిరోధించటమే యోగం అని పతంజలి యోగసూత్రాల్లో చెప్పాడు.

యోగం అంటే రెండు అర్థాలు చెప్పారు భాష్యకారులు. కొందరి దృష్టిలో యోగం అంటే రెండు పదార్థాలు కలియటం. మరికొందరి దృష్టిలో యోగం అంటే ఏకాగ్రతను కలిగిఉండటం.

## ఏకాగ్రత ఎట్లా కలుగుతుంది? అదెట్లా సాధ్యమవుతుంది? దాని స్వరూపం ఏమిటి?

చిత్త స్వరూపం : ఈ ప్రశ్నలకు సమాధానం తెలుసుకొనే ముందు చిత్తస్వరూపాన్ని గురించి తెలుసుకొందాం, 'చిత్తం' రెండు రకాలు. 1. కార్య చిత్త, 2. కారణ చిత్త, కారణ చిత్తం మళ్ళీ అయిదు రకాలుగా ఉంటుంది.

1. క్షిప్త చిత్తం : మన దేహంలో ఉండే రజోగుణంచేత ప్రేరేపింపబడినదై ఎప్పుడూ ఏదో ఒకరకమైన భావాలతో కూడి ఉండి ఎల్లప్పుడూ ఏదో ఒకటి ఆలోచిస్తు విరామం లేకుండా ఉంటుంది.

2 మూఢచిత్తం : తపస్సుచేత ఆవరింపబడి ఉండి, కోపాన్ని, చికాకును, మాంద్యాన్ని కలిగిస్తుంది.

3. విక్షిప్త చిత్తం : ఇది సర్వసాధారణంగా అందరి మానవుల్లోఉండే చిత్తం. హేతు ప్రవృత్తిని కలిగి ఉండి, ఏది మంచిదో, ఏది చెడ్డదో తెలుసుకొనే విచక్షతను కలిగి ఉంటుంది. కాని అప్పుడప్పుడు మంచినివదలివేసి చెడును చెడును వదలివేసి మంచిని ఎంచుకొంటుంది. సుఖాన్ని కాంక్షిస్తుంది. దుఃఖాన్ని వదలివేస్తుంది.

4. ఏకాగ్ర చిత్తం : సమస్తమైన భౌతిక బంధాలను, భావ బంధాలను అణచివేసి, పదార్థాల అసలురూపాన్ని తెలుసుకొని యోగమార్గంలో ప్రయాణం చేయడానికి కావలసిన అర్హతను కలిగి ఉంటుంది.

5. నిరోధ చిత్తం : విభిన్నమైన మానసిక ప్రవృత్తులన్నింటిని నిరోధించి, మనస్సును సంయమంలో ఉంచుకొని, తదేకధ్యానంలో ఉండటమే నిరోధ చిత్తం. ఇటువంటి చిత్తం ఉన్నవారికి ఏకాగ్రత కుదురుతుంది. దాని ద్వారా సమాధిని పొందవచ్చు.

## మన చిత్తం ఎందుకు ఏకాగ్రతను త్వరగా పొందలేదు?

భౌతిక ప్రపంచంలో మనం నిత్యం చేసే పనులు మన చిత్తాన్ని బంధిస్తాయి. గుణాత్మకంగా ఇవి చిత్తంలో ప్రవేశించి దాన్ని అంటిపెట్టుకొని ఉంటాయి.




ఈ విధమైనటువంటి కర్మలన్నీ చిత్తాన్నిపట్టుకొని ఉన్నప్పుడు ఏకాగ్రత కుదరటం కష్టమని యోగశాస్త్రం చెబుతుంది.

ఏకాగ్రత రెండు విధాలుగా కలుగుతుంది. 1. ఆధ్యాత్మిక పద్ధతిద్వారా కలుగుతుంది. 2. లౌకిక ప్రక్రియలద్వారా కూడా ఏకాగ్రత కలుగుతుంది. సమాధితో కూడిన ఏకాగ్రతను సాధించిన వారిని యోగులు అంటారు. ఈ సమాధి స్థితిని పొందటమే యోగ లక్ష్యం ఏకాగ్రతతో కూడిన సమాధి స్థితి పొందడానికై చెప్పిన మార్గాన్నే యోగ మార్గం అన్నారు. అందులో ఎనిమిది అంగాలున్నందువల్ల దాన్ని అష్టాంగ యోగం అన్నారు. పతంజలి చెప్పినందువల్ల 'పతంజలి అష్టాంగ యోగం' అన్నారు.

## పతంజలి అష్టాంగ యోగం

పతంజలి యోగశాస్త్రంలో ఎనిమిది అంగాలు యోగానికి అనుబంధంగా ఉన్నాయి. అవి :

1. యమం
2. నియమం
3. ఆసనం
4. ప్రాణాయామం
5. ప్రత్యాహారం
6. ధ్యానం
7. ధారణ
8. సమాధి.

వీటిని గురించి పతంజలి, యోగ సూత్ర భాష్యకారులు చెప్పిన విషయాలను తెలుసుకొందాం.

## 'యమ' అంటే ఏమిటి?

ప్రతివారు తమకు తామై పాటిద్దామనుకొని అంతర్గతంగానూ, బాహ్య ప్రవృత్తిలోను ఆచరించదగిన విషయాలు అనేకం ఉన్నప్పటికినీ, యోగాభ్యాసపరుడు ఆచరించదగిన విషయాలు అయిదు. అవి :

1. బ్రహ్మచర్యం
2. అహింస
3. అసత్యం
4. అస్తేయం
5. అపరిగ్రహం

## బ్రహ్మ చర్యం అంటే ఏమిటి ?

రతి భావం రకరకాలుగా ఉంటుంది. బాహ్యరతి, అంతర్గతమైన రతి, నేత్ర రతి మొదలయినవి. శారీరకంగాకానీ, మానసికంగాకానీ, వాచకంగాకానీ, రతి భావాన్ని, రతి క్రియను, రతి సంభాషణను రానీయకుండా ఎవరు చూసు కొంటారో వారు బ్రహ్మచర్యాన్ని అవలంభిస్తున్నట్లే. బ్రహ్మచర్యానికి వేదాం తంలో అర్థం వేరు. కాని యోగశాస్త్రంలో మట్టుకు జననేంద్రియంపై పూర్తిగా విరక్తిభావాన్ని, క్రియను కలిగిఉండాలి. ఎందుకంటే కామం ప్రకోపించినప్పుడు సాధన చేయటం సాధ్యం కాదు. ఎంత సాధన చేసినప్పటికీ కామాన్ని జయించక పోతే ఏకాగ్రత, సమాధి సిద్ధించవు. ఉదాహరణకు, విశ్వామిత్రుడు అనేకవందల సంవత్సరాలు తపస్సు చేసినప్పటికీ కామాన్ని జయించలేకపోయినందువల్ల, మేనకతో రమించడం జరిగింది. అందువల్లనే యోగ సిద్ధిని పొందలేకపోతాడు. ఆ తరవాత మేనకను వదలివేసి (అంటే కామాన్ని పూర్తిగా వదలివేసి) బ్రహ్మ వేత్త అవుతాడు.

## అహింస అంతే ఏమిటి?

'ఆత్మ వత్సర్వ భూతాని' అని ఉపనిషత్తులు చెప్పాయి. సమస్తమైన జీవరాసులలోఉండే ఆత్మస్వరూపం తనలో ఉండే ఆత్మ స్వరూపం ఒక్కటే అని యోగి గ్రహిస్తాడు. అందువల్ల అన్ని జీవులతో మైత్రిని కాంక్షిస్తాడు. సర్వ జీవులలో ప్రేమను, కరుణను, ప్రసాద దృష్టిని, వినయాన్ని, సంప్రీతిని ప్రదర్శిస్తాడు యోగి. వైరభావానికి తావుండదు. యోగి దృష్టిలో ప్రపంచంలో ఏ ప్రాణికైనా ఆపద సంభవిస్తే, అది తనకు సంభవించినట్లే భావిస్తాడు. తన ఆనందాన్ని, తన సుఖాన్ని అన్ని జీవుల అనందంగానూ, సుఖంగానూ భావి స్తాడు యోగి. మైత్రి, కరుణ, ప్రేమ, హితం, అనురాగం. వినయం, శీలం, నమ్రత, అనుకంపన ఇత్యాది గుణాలు యోగిలో ఉన్నప్పుడు హింసాయుత ప్రవృత్తి ఆయనలో ఉండదు.

హింస స్వరూపాన్ని గురించి, అహింస స్వరూపాన్ని గురించి మహా భారతంలో చక్కని చర్చ ఉన్నది. అదంతా ఇక్కడ రాయలేం. ధర్మవ్యాధ–నితంబినీ సంవాదంలో ఏది హింస? ఏది అహింస అనే చర్చ ఉన్నది. అంతే గాకుండా మహాభారత యుద్ధానంతరం భీష్ముడు అంపశయ్యపై ఉన్నప్పుడు ధర్మరాజు వ్యాకులమైన చిత్తంతో ఉంటాడు. "ఎవరికోసం తాతలను, మామలను, గురువులను, బంధువులను, పుత్రులను, మిత్రులను, తోటి రాజులను, సైన్యాన్ని వధించాను" అని ఆయన ఆత్మ, మనస్సు, చిత్తం క్షోభిస్తుంటుంది. ఆత్మక్షాళన చేసుకొనే మార్గం కనిపించదు. రక్తాన్ని ఎట్లా భుజించడమా? అని ఆందోళన చెందుతాడు ధర్మరాజు. అప్పుడు అనేకమంది మహర్షులు, ఆయన సోదరులు, నారదుడు, శ్రీకృష్ణుడు హింస – అహింసల స్థూలరూపాన్ని సూక్ష్మరూపాన్ని గురించి ఆయనకు బోధిస్తారు. భీష్ముడు కూడా హింసా అహింసల స్వరూపాన్ని గురించి చెబుతాడు. ఇదంతా విన్న తరవాత అనాసక్తి యోగంతో రాజ్యాభిషిక్తుడవుతాడు ధర్మరాజు.

దర్శనాలన్నింటిలోను అహింసా సిద్ధాంతాన్ని పరాకాష్ఠకు జైనమతం తీసుకొని వెళ్ళింది. ఈ ప్రపంచంలో అనేకమైన సూక్ష్మజీవులుంటాయని, భూమిలో అనేక జీవరాసులుంటాయని వాటిని హింసించరాదని జైనమతం చెబుతుంది. వీరిలో రెండుతెగలవారున్నారు. శ్వేతాంబరులు, దిగంబరులు. దీపాలు పెట్టినట్లయితే పురుగులు చేరి చచ్చిపోతాయని, ఆ పాపం అనవసరంగా తమకు అంటుకొంటుందని వీరు దీపాలు కూడా పెట్టరు.

అహింసో పరమో ధర్మః అని బౌద్ధం చెప్పింది. వైదిక యజ్ఞయాగాది క్రతువుల్లో అనవసరంగా పశుబలి జరుగుతున్నరోజుల్లో, అవి నిరర్ధకమనిచెప్పి పశువధను నిరోధించిన ప్రథమ వ్యక్తి బుద్ధుడు.

ఆధునిక కాలంలో అహింసా సిద్ధాంతాన్ని రాజకీయ రంగంలో ప్రవేశ

పెట్టి, శాంతిశాముకునిగా, శాంతి దూతగా, శాంతియుత మార్గంలో భారతదేశానికి స్వాతంత్ర్యం తెచ్చింది మహాత్మగాంధి.

నేడు అభివృద్ధిచెందిన వైజ్ఞానిక రంగం అంతా అతి భీభత్సంగా తయారయింది. అహింసా సిద్ధాంతాన్ని విస్మరించిన దేశాలా వైజ్ఞానిక ప్రగతిపేరిట సమస్తమైన భూమండలాన్ని ముక్కలు—చెక్కలు చేయగలిగిన అణు బాంబులను తయారుచేసుకొని సర్వనాశనం చేయడానికై కావలసిన శక్తి సామర్థ్యాలను పెంపొందించుకొంటున్నాయి. ఆ దేశాలవారిప్పుడు సైద్ధాంతికంగా శాంతి, అహింసల పాఠాలు వల్లె వేస్తున్నారు. ప్రయోజనం వేచి చూడాలి.

## అసత్యమంటే ఏమిటి ?

ప్రతి మానవుడిలోను అంతర్గతంగా ఉండే ఆత్మ చైతన్యం ప్రతి నిముషం మనముందు నిలబడి ఇది తప్పు ఇది సరయినది అని మనలను హెచ్చరిస్తుంది. ఆ హెచ్చరికను లక్ష్య పెడితే అబద్దంచెప్పటం సాధ్యంకాదు. అహెచ్చరికను అలక్ష్యం చేసినప్పుడు మనం చెప్పేదంతా అసత్యమే. అసత్యం చెప్పినప్పుడు దాని పర్యవసానానికి కూడా బాధ్యులం అవుతాం. అసత్యం మనకు మనోక్లేశాన్ని కలిగిస్తే అది ఇతరులకు ఇబ్బందిని కలిగిస్తుంది. ఆ తరవాత సత్యం చెప్పిఉంటే బాగుండేదే అని అనుకొంటాం. కాని కాలాతీత మవుతుంది. ఈ విధమైన మానసిక స్పర్థ ఏర్పడి అది తట్టుకోలేని పరిస్థితి ఏర్పడుతుంది. చిన్నచిన్న విషయాలకు కూడా అబద్ధం చెప్పటం ఒక అలవాటుగా కొందరిలో ఉంటుంది. ఇవన్నీ కలసి మానసిక పీడనకు దారితీస్తాయి. అందుకే అబద్ధం చెబితే పాపం వస్తుందన్నారు.

## అపరిగ్రహం అంటే ఏమిటి?

ఎవరైనా ఏదైనా ఇవ్వకుండానే, ఆ వస్తువు మనది కాదని తెలిసికూడా

కొన్ని తడవలు, కొంతమంది తీసుకొంటారు. మనది కాదని తెలిసి, ఎవ్వరూ చూడటం లేదుకదా అని భావించి సంగ్రహించటం పాపమని యోగం చెబుతుంది. అందుకే దొంగతనం అనేది పాపమంటుంది యోగం.

## అస్తేయమంటే ఏమిటి ?

చీటికి మాటికి పొరుగు వారిపై అధారపడి వారినుంచి ఏదో కాంక్షిస్తు, వారితో మైత్రి సలపటం మన సంకుచిత మనస్తత్వాన్ని చాటుతుంది. ఏదైనా అవసరమున్నప్పుడు, మన దగ్గరలేనప్పుడు, అది ఇతరులదగ్గర తీసుకొన్నప్పుడు అది పరిగ్రహమవుతుంది. అట్లా కాకుండా మనకు అవసరమున్న లేక పోయినా ఇతరుల దగ్గర ఉన్నది కదా అని, అది తీసుకొంటే ఏమీ ఆయిపోదని భావించి, వారిని దేవురించి (కాని పైకి గంభీరంగా అడిగి) తెచ్చు కొంటారు కొందరు. ఇదంతా మానసికంగా ఒక విధమైన బంధాన్ని ఏర్పరుస్తుందని యోగం చెపుతుంది. ఆ బంధాన్నుంచి విముక్తులు కావాలంటే, అవసరమున్నా, లేకున్నా, మనం అడగక పోయినా ఎదుటి వారిచ్చినప్పుడు మనం పుచ్చుకోక పోవడమే అపరిగ్రహం అంటాడు పతంజలి. స్వయం సమృద్ధి, స్వయం సంతృప్తి దీని ఉద్దేశాలు,

## నియమం అంటే ఏమిటి ?

మానవుల ప్రవర్తన అంతా రెండు రకాలుగా ఉంటుంది. అవి; 1. బాహ్య ప్రవర్తన 2. ఆంతర్గత ప్రవర్తన. మన ప్రవర్తన ఒక రకమైన నియమావళికి లోబడి ఉండాలి. అట్లా లేక పోయినట్లయితే మానవ జీవితానికి అర్థం లేదు. సర్వ సాధారణంగా సుఖప్రదమైన జీవితాన్ని గడపాలంటే అయిదు రకాలైన నియమాలను ప్రతివారు పాటించ వలసి ఉంటుంది. ఇవేమంత కష్ట మైనవి కావు. వీటినే పంచ నియమాలు అంటారు. అవి;

1. శుభ్రత లేదా శుచిత్వం
2. సంతృప్తి
3. ఆత్మార్పణ
4. స్వాధ్యాయనం
5. భగవంతుని యందు భక్తి.

శరీరం పవిత్రమైనదా? అపవిత్రమైనదా? పవిత్రమని చెప్పడానికి ఎవ్వరూ సాహసించలేదు. జైనమతం, బౌద్ధమతం, వేదాంతం, యోగశాస్త్రం అన్నీ కూడా ఈ శరీరం మలమూత్ర, శుక్ల, శోణిత, రక్త మాంస, మజ్జ, ధాతువులతో నిండి ఉన్నదని చెబుతాయి. అంతే కాకుండా శరీరంలో నుంచి ఏ పదార్థం బహిర్గత మైనా అది దుర్గంధంతో కూడి ఉంటుంది. వెగటును పుట్టిస్తుంది. కనక శారీరక పరిశుభ్రత అనేది చాలా ముఖ్యమని యోగశాస్త్రం చెబుతుంది.

అట్లాగే సంతృప్తి అనేది కేవలం మానసికం కాబట్టి ప్రతివారు సంతృప్తిని అలవరుచుకొంటే మనస్సులో అలజడి లేకుండా ఉంటుంది. శరీరం తేలిగ్గా ఉంటుంది. సంతృప్తి వల్ల తుష్టి, పుష్టి, ఏర్పడతాయి. అందుకే సంతోషమే సగం బలం అనే నానుడి వచ్చింది. తృప్త కాముడు యోగాభ్యాసానికి అర్హుడు.

## ఆసనం:

యోగాభ్యాసానికి సుఖప్రదమైన ఆసనం చాలా అవసరం. ఏకాగ్రత కుదరాలంటే శరీరం సుఖంగా ఉండాలి. మనస్సు మీద నిగ్రహం, శరీరం మీద ఆధిపత్యం చాలా అవసరం. శరీరంలో ముఖ్యంగా మూడు రకాలైన పదార్థాలుంటాయి. అవి:

1. ప్రసాదం
2. కిత్తం
3. మలం

యోగాసనాల ద్వారా మనం భుజించే ఆహారం బాగా జీర్ణమయి ప్రసాదాన్ని (శక్తిని) శరీరానికి ఇస్తాయి. ఎప్పుడైతే ఆహారం జీర్ణమయిపోతుందో అప్పుడు శరీరంతో ఉండే మలీనాలు కూడా విసర్జింపబడతాయి. శరీర సౌష్టవం, శరీర అందం, శరీర పుష్టి ఆసనాల ద్వారా కలుగుతుంది. అయితే ప్రత్యేకమైన ఆసనాల ద్వారా ప్రత్యేకమైన ఫలితాలను పొందవచ్చు. కొన్ని ముఖ్యాసనాల పేర్లు

1. పద్మాసనం
2. శీర్షాసనం
3. మయూరాసనం
4. సర్వాంగాసనం
5. శవాసనం

వీటిని అందరూ అభ్యసించ వచ్చు.

## ప్రాణాయామం అంటే ఏమిటి?

"ప్రాణోవై బ్రహ్మ" అని ఉపనిషత్తులు చెబుతాయి. మన శరీరంలో దశమహా ప్రాణవాయువులు ఉంటాయి. అందులో ప్రాణవాయువు, అపానవాయువు ఉదానవాయువు, సమానవాయువు, వ్యానవాయువు చాలా ముఖ్యమైనవి.

ప్రాణాయామము మూడు దశలుగా చేయవలె. అవి:

1. పూరక
2. కుంభక
3. రేచక

పూరక అంటే— రెండు ముక్కు రంధ్రాల ద్వారా గాలిని బాగా పీల్చుకొనటం. అట్లా పీలుస్తున్నప్పుడు మన శరీరంలో ఉండే గాలిని బయటకు వదలకూడదు. కుంభక అంటే— అట్లా పీల్చిన గాలిని కుంభించి మన శరీరంలో ఉంచటం. రేచక అంటే— అట్లా నిల్వ ఉంచిన గాలిని పొత్తి కడుపు నుంచి బయటికి పంపి వేయటం. అట్లా చేస్తున్నప్పుడు లోపలికి గాలిని పీల్చరాదు.

ఈ విధంగా క్రమం తప్పకుండా ప్రాణాయామం చేసినట్లయితే శరీరంలో ఉండే మలినాలు తగ్గిపోతాయని యోగం చెబుతుంది. అయితే కాల క్రమాన ఈ ప్రాణాయామం ఎన్నో రకాలుగా మారిపోతుంది. అందుకే ప్రాణాయామంలో ఉన్న క్రియలు చేయాలంటే ఒక గురువు వద్ద అభ్యసించి నప్పుడు మాత్రమే వాటిని చేయాలనే నియమం పెట్టారు.

## ప్రత్యాహార మంటే ఏమిటి?

సమస్త మైన చిత్త వృత్తులను అరికట్టలేక పోయిన అవసర మైన మానసిక ప్రవృత్తు లన్నింటినీ యోగాభ్యాస పరుడు అరికట్ట కలుగుతాడు. యమ, నియమ, ఆసన, ప్రాణాయామాదులను పాటించే యోగాభ్యాస పరుడు తన మనస్సును స్వాధీనంలో ఉంచుకోగలుగుతాడు. ఎప్పుడైతే మనస్సు స్వాధీనంలోకి వస్తుందో అప్పుడు ఇంద్రియాలు తమ శక్తిని కోల్పోతాయి. ఇంద్రియాలకు స్వయం శక్తి లేదు. వీటి శక్తి పరాధీనం. అందుకని మనస్సుకు స్వస్థత చిక్కితే, మనస్సు స్వాధీనంలో ఉండే ఇంద్రియాలు కట్టు బడ్డట్లే. మన మనో ప్రవృత్తులను బట్టి మన ఇంద్రియాల ప్రవృత్తి ఉంటుంది. కనక యోగాభ్యాస పరుడు ఈ దశలో ఇంద్రియాలపై పూర్తి ఆధిపత్యాన్ని కలిగి ఉంటాడు.

ఈ విషయాన్ని యోగ సూత్రకారుడయిన పతంజలి ఒక ఉపమానం సహాయంతో వివరించాడు. ఏవిధంగా అయితే రాణి తేనెటీగ ఒక చోట స్థిరపడ నంత కాలం తేనె టీగలన్నీ దాని చుట్టూ తిరుగుతూ ఉంటాయో, అది ఒక చోట స్థిరపడ్డప్పుడు అవి కూడా అక్కడే స్థిరపడతాయో, అదే విధంగా మనస్సు చాంచల్యంగా ఉన్నంత కాలం ఇంద్రియాలు చంచలంగానే ఉంటాయి. మనస్సు కుదట బడ్డప్పుడు, ఇంద్రియాల ప్రవృత్తి అణగి పోతుంది. ఇదే ప్రత్యాహార అవస్థ. దీన్నే తితీక్షావస్థ అని భగవద్గీత చెవుతుంది.

# ధ్యానం అంటే ఏమిటి ?

యోగాభ్యాస పరుడైన యోగి తన సాధనలో ఒక మెట్టు తరవాత మరొక మెట్టును ఎక్కుతూ ఉన్నతశిఖరాలను చేరుతున్నప్పుడు చాలా జాగ్రత్తగా ఉండాలని పతంజలి హెచ్చరించాడు. యోగ సాధనమతా రెండు రకాలుగా ఉంటుంది. అవి:

1. బాహ్యసాధన
2. అంతరంగసాధన.

బాహ్యసాధన ప్రతి వారు తప్పక చేయవచ్చు. చేసినందు వల్ల నష్టం ఏమీలేదు. శరీరం— మనస్సు— ఈ రెండూ కుశలంగా ఉంటాయి. వీటిని సక్రమంగా నిర్వర్తించిన యోగి అంతరంగ సాధనలో ప్రవేశిస్తాడు. ఇక్కడ కొంత సంయమంతో వ్యవహరించ వలసి ఉంటుంది.

మానసిక ప్రవృత్తు లన్నింటిని అరికట్టి, మనస్సును బొడ్డు రంధ్రం మీదనో, హృదయ పద్మం మీదనో, శిరస్సు నందుడే జ్యోతి మీదనో, నాసికాగ్రం మీదనో, నాలుక చివరి భాగానో, లేదా మరొక పదార్థం మీదనో, ఏకాగ్రతతో ఉంచటమే ధ్యానం— అని పతంజలి చెప్పాడు. భాష్య కారులు మరొక రకంగా దీన్ని విశదీకరించారు. ఏకాగ్రతతో మనస్సును నిల్పాలంటే ఏదైనా ఒక పదార్థం అవసరమా అనవసరమా?— అని ప్రశ్నించారు. ధ్యానం చేయాలంటే ధ్యానింప బడేది అంటూ ఒకటి ఉండాలని భాష్యకారులు చెప్పారు. నిరాలంబన మైన ధ్యానం కుదరదన్నారు. అందుకే శ్రీమహా విష్ణువు ప్రతిమను కాని, హిరణ్య గర్భుని ప్రతిమను కాని, బసవేశ్వరుని ప్రతిమను గాని, సాలగ్రామాన్ని కాని, విష్ణు పాదాలను కాని, లేదా తమ తమ అభీష్ట దేవతా రూపాలను కూడా ధ్యానం చేయవచ్చు. ఈ ధ్యాన తత్పరతలో ఉన్న యోగికి బాహ్య ప్రపంచంతో నిమిత్తం ముండదు.

## ధారణ అనగా నేమి?

యమ. నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార ధ్యాన అవస్థలను దాటి, ఏ అభీష్ట దేవతా మూర్తి మీద తన మనస్సును లగ్నం చేస్తాడో, ఆ యోగి ధారణ వ్యవస్థకు వచ్చినట్లు . తాను ధ్యానించే వస్తువు కాని, దేవత కాని, ప్రతిమ కాని, ఆయన మనస్సులో నిరంతరమూ ఉంటుంది. అది తప్ప మరొకటి ఉండదు. ఒక నూనె డబ్బాలోనుంచి నూనెను మనం వంచుతూ ఉంటే దానికి మొదలు, చివర అనేది ఎట్లా అయితే ఉండదో, అట్లా గే అదే విధంగా ధారణా వస్థలో కల్పనావస్థ కూడా ఉండదు. అంటే ధ్యానించే వ్యక్తి, ధ్యానింప బడే వస్తువు అనే కల్పనా భేదం ఉండదు. అంత మాత్రాన తాదాత్మ్య భావం కూడా ఉండదు. ఐక్యతా భావం ఉంటుంది. ఏ అభీష్ట దేవతను యోగి ఉపాసిస్తాడో, ఆ దేవతా మూర్తి స్వరూప స్వభావాలతో యోగి మనస్సు నిండి పోతుంది. ఆ దేవతా భావం తప్ప మరొకటి ఆయన మనస్సులో ఉండదు. సమస్తమైన సంశయాలు, ఆలోచనలు, క్రియలు, సమసి పోతవి. ఆ యోగి శరీరం కాంతి వంత మవుతుంది. అనేక మైన దివ్య శక్తులు ఆయనలో ప్రవేశిస్తాయి. ఈ దశలో ఉన్న యోగికి అష్ట సిద్ధు లు లభ్య మవుతాయని యోగం చెవుతుంది.

## అష్ట సిద్ధు లు:

1. అణిమ
2. మహిమ
3. గరిమ
4. లఘిమ
5. ప్రాప్తి
6. ప్రాకామ్యం
7. ఈశత్వం
8. వశిత్వం

ఈ అష్టసిద్ధులను పొందినప్పుడు యోగి అతిజాగరూకతతో వర్తించాలి. ఈ మహిమలను ప్రదర్శించరాదని యోగం చెబుతుంది. ప్రదర్శిస్తే యోగ భ్రష్టుడు అవుతాడని కూడా హెచ్చరిస్తుంది. ఈ దశలో నుంచి క్రమంగా సమాధి స్థితికి వెళుతాడు యోగి.

## సమాధి అనగా నేమి.

సమాధి రెండు రకాలు. అవి:

(1) సంప్రజ్ఞ సమాధి

(2) అసంప్రజ్ఞతా సమాధి.

తాను సమాధి స్థితిలో ఉన్నాననే స్పృహ, లేక ప్రజ్ఞయోగిలో ఉంటుంది. అదే సంప్రజ్ఞతా సమాధి. ఈ దశలో ఈశ్వర ప్రణిధ్యానం చాలా ముఖ్యం. నిరీశ్వరయోగం, ఈశ్వర యోగంగా భాష్యకారుల చేతుల్లో మారింది. జగద్రక్షకుడైన పరమేశ్వరుడు తనకు మోక్షాన్ని ప్రసాదిస్తాడని ప్రసాదించమని యోగి ప్రార్థిస్తాడు. ఈ భావన తప్ప మరొక భావన యోగి మనస్సులో ఉండదు.

ఈ భావాన్ని కూడా అప్పుడప్పుడూ కోల్పోతాడు. కోల్పోయి నట్లు ఆయనకు తెలియదు. ఉన్నట్లు కూడా ఆయనకు తెలియదు. కేవలం ప్రారబ్ధ కర్మను మాత్రం అనుభవిస్తూ ఉంటాడు. సమస్తమైన కర్మ బంధాల నుంచి విముక్తి చేయగలిగినశక్తి ఒక్క పరమేశ్వరునికే ఉన్నది. ఆయన కర్మాధ్యక్షుడు కర్మ నియంత. కర్మ ఫలప్రదాత. అయన అనుగ్రహంకోసం యోగి తహతహ లాడుతాడు. కరుణాకరుడైన పరమేశ్వరుని అను గ్రహం వల్ల యోగి నిర్వికల్ప సమాధిలో కైవల్యంపొందుతాడు. ఇదే పతంజలియోగంలోని సారాంశం.

## మీమాంసా దర్శనం

భారత దేశంలో భౌతిక వాదం బాగా ప్రబలి పోయి, నాస్తికత పరవళ్ళు

తొక్కుతున్న సమయంలో మీమాంసా దర్శన శాస్త్ర కారులైన కుమారిల భట్టు, ప్రాభాకర మిశ్ర అనే వారు వైదిక మతాన్ని సముద్ధరిస్తే కాని, భౌతిక వాదం నాస్తిక వాదం, సమసి పోవని భావించారు. మీమాంసా దర్శనాన్నే 'పూర్వ మీమాంస' అని కూడా అంటారు. జైమిని మహర్షి రచించిన "పూర్వమీమాంస సూత్రాలు" ఈ దర్శనానికి అధారం. ఈ సూత్రాలకు శబర స్వామి భాష్యం రాసాడు. "వాటిని శబర భాష్యం" అంటారు. కుమారిల భట్టు శబరభాష్యాన్ని అధారంగా తీసుకొని మూడు గ్రంథాలను రాసాడు. అవి ; 1. శ్లోక వార్తిక 2, తంత్ర వార్తిక 3. టీక. ఈ గ్రంథాలన్నింటిలోను వీరు చెప్పిన విషయాలు అనేక మున్నాయి. కాని ముఖ్యంగా వీరు అందరూ అంగీకరించి చెప్పిన విషయాలు మూడు. అవి; 1. ఆత్మ వాదం 2 కర్మ వాదం 3. అదృష్ట లేదా అపూర్వ వాదం. వీటిని గురించి సంక్షిప్తంగా తెలుసు కొందాం.

## ఆత్మవాదం

లోకాయతులు, చార్వాకులు, బౌద్ధులు నిత్యమై, శాశ్వతంగా ఉండే ఆత్మ అంటూ ఏమీ లేదన్నారు. "తం శరీరం, తంజీవం" అనేది ఆ రోజుల్లో ప్రచారంలో ఉన్న సూక్తి. అంటే శరీరమే జీవం. జీవమే శరీరం. అటువంటప్పుడు యజ్ఞయాగాది క్రతువులు, దాన ధర్మాలు, జపహోమాది తర్పణాలు, పూజలు పునస్కారాలు, నమస్కారాలు వీటివల్ల ఏమాత్రం ప్రయోజన మున్నదనే ప్రశ్నకు సమాధానంగా, వీటి వల్ల ఏమీ ప్రయోజనం లేదని చార్వాక మతం చెప్పింది. అంతే గాకుండా వీటి అన్నింటినీ అవహేళన చేసింది. అయితే బౌద్ధ మతం ఆత్మను నిరాకరిస్తూ, నీతి ప్రాముఖ్యమైన జీవితాన్ని మానవుడు గడపాలని చెప్పింది. ఆత్మ లేదు. భగవంతుడు లేదు కాని నిర్వాణ మున్నది. అది నైతిక జీవనం వల్ల సాధ్య మన్నారు బౌద్ధులు.

ఈ రెండు వాదాలనుంచి సామాన్య జనాన్ని రక్షించి, ఆస్థికతను, అంటే వేదంలో చెప్పబడిన సిద్ధాంతాలను తిరిగి స్థాపించటమే మీమాంసా దార్శనికులు

చేసిన కృషి. అందుకే బౌద్ధమతం, చార్వాక దర్శనం— రెండూ కూడా కాల గర్భంలో ప్రజాదరణ లేకుండా పోయినాయి. చార్వాక దర్శనం పూర్తిగా రూపు మాసి పోయింది. బౌద్ధమతం భారత దేశాన్ని వదలి పెట్టి సుదూర ప్రాంతాల్లో వర్ధిల్లింది.

"స్వర్గకామో యజేత వహ్నిః"— అని వేదం చెబుతుంది. యజ్ఞం చేసిన వారు స్వర్గానికి పోతారు అని అర్థం. అయితే యజ్ఞం చేసిన సోమయాజి కాని, యజ్ఞం చేయని వారు కాని చనిపోవడం ఖాయం. వారిని దహించివేయడమో లేదా పూడ్చివేయడమో చనిపోయిన తరవాత ఇద్దరూ పిడికెడుబూడిదైనా లేదా గుప్పెడు మట్టయినా అవుతారు. అట్లాంటప్పుడు స్వర్గానికి పోయేదెవరు? యజ్ఞఫలితాన్ని అనుభవించేదెవరు? ఎవ్వరూ లేరని చార్వాకమతం ఇదంతా పవిత్రమైన భ్రమతో కూడిఉన్న అవివేకమని చార్వాకులు చెబుతారు.

ఆత్మ ఉన్నదనే విషయాన్ని న్యాయ—వైశేషిక దర్శనాలు తర్కాన్ని ఆధారం చేసుకొని నిరూపించడానికి యత్నించాయి. మీమాంస దర్శనం తర్కాన్ని, శృతిప్రమాణాన్ని ఆధారంచేసుకొని ఆత్మ ఉన్నదని నిరూపించడానికి యత్నించింది. ఎందుకంటే ఆత్మ ఉన్నదని అంగీకరించి బయలు దేరితేనేకాని వేదాల్లో చెప్పిన విషయాలకు అర్థం ఉండదు. మరొకరకంగా చెప్పాలంటే వేదవిషయాలను అర్థవంతంచేయడానికి నిత్యమై, శాశ్వతమైన ఆత్మ ఒకటి ఉండాలి. కనక శరీరానికి భిన్నంగా ఉండే ఆత్మ ఉనికిని మీమాంసకులు అంగీకరించారు. వారివాదంలోని సారాంశం :

1. శరీరం, బుద్ధి, ఇంద్రియాలు, మనస్సు, అంతఃకరణం, మొదలయిన వాటికి భిన్నంగా ఉండేదే ఆత్మ.
2. మనం చూసే విషయాలు, వినేవిషయాలు మొదలయినవన్నీ శరీరానికి వర్తించవు. ఇవి వర్తించడానికి శరీరంకన్నా భిన్నమయింది మరొకటి

ఉన్నది. అదే ఆత్మ.

3. 'నేను', 'నాది' అనే శబ్దాలు లౌకికార్థంలో శరీరానికి వర్తించినా, అలౌకికార్థంలో అవి శరీరానికి వర్తించవు.

4. వైదిక కర్మకాండ సుసంగతంగా ఉండాలంటే అనశ్వరమైన ఆత్మ ఉండాలి.

5. స్మృతిజ్ఞానం ఆత్మను సూచిస్తుంది.

6. ఈ శరీరం తన్నుతాను రక్షించుకోలేదు. దీన్ని పరిరక్షిస్తూ ఉండేదే ఆత్మ.

ఈ విధంగా వారు ఆత్మ సిద్ధాంతాన్ని సమర్థించారు.

## కర్మ వాదం

వేదంలో చెప్పిన ప్రతి కర్మకూ ఒక ఫలితం ఉంటుందని మీమాంసకులు విశ్వసిస్తారు. అయితే వేదంలో చెప్పిన కర్మల్లో కొన్ని లౌకిక కర్మలు ఉన్నాయి. కొన్ని వైదిక కర్మలున్నాయి. వైదిక కర్మలు మాత్రమే అపూర్వను కాని అదృష్టాన్ని కాని ఇస్తాయి. 'అపూర్వ' అంటే అంతకు ముందు లేకపోవడం అని అర్థం చెప్పారు. ఉదాహరణకు ఒకానొక వ్యక్తి సంతానాన్ని కోరి పుత్రకామేష్ఠి యజ్ఞాన్ని చేశాడనుకొందాం. లేదా ఒకానొక రాజు చక్రవర్తి కాగోరి అశ్వమేధయాగం చేశాడనుకొందాం. ఈ ఇద్దరు వ్యక్తులు వారి వారి కోరికలు తీరక ముందే చనిపోయారనుకొందాం. అప్పుడు వారు చేసిన కర్మల ఫలితం ఏమవుతుంది అనే ప్రశ్న వస్తుంది. అందుకే మీమాంసదార్శనికులు నిత్యశాశ్వతమైన ఆత్మ ఉనికిని అంగీకరిస్తారు. ఈ యాగాలు రెండూ చేయక ముందు ఆయా వ్యక్తుల్లో ఏ శక్తి అయితే లేదో, ఆ శక్తి వారి ఆత్మస్వరూపంలో సూక్ష్మదశలో ఉంటుంది. ఆయా కర్మల ఫలితాలను వారి వారి ఆత్మలు అనుభవించడానికి మరో జన్మ ఎత్తుతారు. అప్పుడు వారికి ఇతర ఫలితాలతో

బాటు పూర్వజన్మలో చేసిన కర్మల ఫలితం వారి ఆత్మలో అపూర్వ రూపం లోనో, లేక అదృష్టరూపంలోనో ఉన్నందువల్ల వారి కోరిక నెరవేరుతుంది. ఒకరు పుత్రవంతుడవుతాడు. మరొకరు చక్రవర్తి అవుతాడు. కాని ఈ రెండు కర్మల ఫలితాలను వారు అనుభవించకుండా బలవత్తరమైన మరే కర్మ అడ్డు పడరాదని మీమాంసకులు హెచ్చరిస్తారు.

కర్మలు సాధారణంగా రెండు రకాలుగా ఉంటాయి. అవి :

1. పురుషార్థ కర్మ
2. క్రత్వార్థ కర్మ

పురుషుడు తనకు తానై వాంఛించి, ఒక ఫలితాన్ని సాధించడానికై చేసే కర్మను పురుషార్థకర్మ అంటారు. దాన్ని సాధించడానికి చేసే కర్మలో ఒక భాగంగా ఉండే కర్మకాండనంతా క్రత్వార్థకర్మ అంటారు అంటే క్రతువు నిర్విఘ్నంగా కొనసాగడానికి చేసే కర్మ అని అర్థం. అందుకే మళ్ళీ కర్మలు రెండు రకాలన్నారు. అవి :

1. ప్రధాన కర్మ
2. గుణ కర్మ

ఈ కర్మల్లో దేనికి అదృష్టం లభిస్తుంది ? అంటే ఏ కర్మను అంటిపెట్టుకొని అదృష్టం ఉంటుంది ? ప్రధాన కర్మను అంటిపెట్టుకొని ఉంటుందే కాని, గుణ కర్మను అంటిపెట్టుకొని అపూర్వంగాని, అదృష్టంగాని ఉండదు. అట్లాగే మరోరకమైన విభజనను కూడా సూచించారు. అది :

1. అంగి కర్మ
2. అంగ కర్మ

ఈ కర్మలన్నింటిలోనూ పురుషార్థకర్మకు ఎక్కువ ప్రాతినిధ్యం ఇచ్చారు.

దాన్ని అంటిపెట్టుకొని మిగతావి అన్నీ ఉంటాయన్నారు. ఇదంతా ఒక యెత్తు. మరొక విభజన ఆసక్తికరంగా ఉంటుంది. అది :

1. నిత్య కర్మ
2. నైమిత్తిక కర్మ
3. కామ్య కర్మ
4. నిషిద్ధ కర్మ

ప్రతిరోజూ ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం (త్రికాలాల్లో) చేసేదే నిత్య కర్మ. సంధ్యావందనం, అగ్నిని ఆరాధించడం, వేదాధ్యయనం చేయడం మొదలయినవి నిత్య కర్మలు. ఇవి చేయడం ద్వారా ప్రతిఫలం ఏమీరాదు కాని చిత్తశుద్ధి ఏర్పడుతుంది. ఇవి చేయకపోతే వేదంలో చెప్పిన కర్మలను చేయక పోవడంవల్ల సంభవించే పాపం వస్తుందన్నారు మీమాంసకులు.

పౌర్ణిమనాడు, అమావాస్యనాడు, ఏకాదశమినాడు, తదితర పుణ్య దినాల్లో చేసే కర్మలు నైమిత్తిక కర్మలు. ఒక నిమిత్తాన్ని (కారణాన్ని లేదా ఫలితాన్ని) దృష్టిలో ఉంచుకొని చేసే కర్మలు నైమిత్తిక కర్మలు. ఉదాహరణకు సత్య నారాయణ వ్రతం, వెంకటేశ్వరస్వామి వారికి చేసే మొక్కుబడులు, ఏకాదశి వ్రతం మొదలయినవి. ఇవి చేయనందువల్ల పాపంరాదు. చేసినట్లయితే కాంక్షించిన ఫలితం వస్తుందని శాస్త్రం చెబుతుంది.

కామ్య కర్మలంటే ఒకానొక ఫలితాన్ని ఆశించి ఆ ఫలితానికి కావలసిన కర్మను వేదవిహితంగా చేయడం. ఇవి చేస్తే పుణ్యంరావచ్చు. దాన్ని అనుభ వించడానికి తగిన జన్మలు ఎత్తవలసి ఉంటుంది. మోక్షంకోరే వారికి కామ్య కర్మలతో నిమిత్తంలేదు.

నిషిద్ధకర్మలంటే వేదంలోను, ధర్మశాస్త్రాల్లోను కొన్ని కర్మలను

చేయకూడదని నిషేధించడమయింది. అవిచేసినట్లయితే పాపం వస్తుందని శాస్త్రం చెబుతుంది. అవి చేయకుండా ఉంటే పుణ్యం మాత్రంరాదు.

మానవుడు చేసే కర్మలను—వాటి ఫలితాలను ఆశ్రయించి అదృష్టంకాని, అపూర్వకాని ఉంటుంది. అది నాలుగు రకాలుగా ఉంటుంది. అవి :

1. ఫలాపూర్వం (ఫల అదృష్టం)
2. సముదాయాపూర్వం (సముదాయ అదృష్టం)
3. ఉత్పత్త్యాపూర్వం (ఉత్పత్తి అదృష్టం)
4. అంగాపూర్వం (అంగ అదృష్టం)

ప్రకృతిలో ఒక మానవుణ్ణి అదృష్టం వరిస్తుంది. మరొకరిని దురదృష్టం వరిస్తుంది. దీనికంతకూ కారణం మానవుల సుకృత—దుష్కృత కర్మఫలితాలను బట్టి ఉంటుందని మీమాంసాదర్శనం చెబుతుంది. ఈ దర్శనంలో భగవంతునికి తావులేదు. అంతా కర్మమయం. ఈ కర్మ అంతా యజ్ఞమయం. యజ్ఞం, యజ్ఞ అధిపతులైన దేవతలు, దేవతామూర్తులు, అధిదేవతలు, ప్రత్యధి దేవతలు-అంతా మంత్రబద్ధులై ఉంటారు. దేవత అంటే అపూర్వమైన శక్తి అని నిర్వచించారు. ఈ మంత్రోపాసన ద్వారా దేవతలను లోబరచుకోవచ్చునని వీరు విశ్వసించారు.

"జగత్తు దైవాధీనం
దైవం మంత్రాధీనం
మంత్రం బ్రాహ్మణాధీనం
బ్రాహ్మణులే (మంత్రద్రష్టలే) భూలోక దేవతలు"

ఈ విధంగా యజ్ఞకాండను, యజ్ఞవిద్యను తిరిగి భారతదేశంలో స్థాపించిన కీర్తి మీమాంసకులకు దక్కుతుంది.

# తత్వశాస్త్ర వికాసానికి ఆంధ్రుల కృషి

క్రీస్తుపూర్వకాలం నుంచి అనేక మంది ఆంధ్రులు తత్వశాస్త్ర వికాసానికై ఎంతో కృషిచేసారు. దాన్ని ఇక్కడ సంక్షిప్తంగా సమీక్షించడమయింది. ఈ అధ్యాయంలో ఆంధ్రులు లలితకళలకు, సాహిత్యానికి, మతానికి, తత్త్వశాస్త్రానికి, తర్కానికి ఎటువంటి దోహదం చేసిందీ రాయడం జరిగింది. అందరినీ గురించి రాయడానికి స్థలంలేదు. అందుకే తత్త్వశాస్త్రంలోను, దానికి అనుబంధ సాహిత్యంలోను కృషిచేసిన వారిని గురించే ఇక్కడ చెప్పడం జరిగింది. అంత మాత్రాన ఇతరులను విస్మరించినట్లుకాదు.

## తత్వశాస్త్ర వికాసం : ఆంధ్రుల కృషి

ఆంధ్రశబ్ద ఉత్పత్తి, దాని ప్రయోగం అనేక రకాలుగా ఉన్నది. ప్రాచీనాంధ్రులు నివసించిన ప్రాంతాన్ని గురించిన వర్ణనలు అనేకం ఉన్నాయి. దండకారణ్యప్రాంతంలో ఆంధ్రులు ఉండేవారని రామాయణంలో ఉన్నది. ఆంధ్రులను ఒక విశిష్టమైన జాతివారుగా ఐతరేయ బ్రాహ్మణం, మహాభారతం, స్కాందపురాణం వర్ణించాయి. సూత్రానుక్రమణిక అనే గ్రంథంలో రెండు రకాలైన ఆంధ్రులు ఉన్నట్లు తెలుస్తున్నది. భాగవతం కూడా ఈ అభిప్రాయాన్నే వ్యక్తంచేస్తున్నది. ఆంధ్రులనే పదం ప్రప్రథమంగా ఆంధ్రుడనే ఒకానొక వ్యక్తి పేరైనట్లు. తరవాత అది ఒక జాతికి అన్వయించినట్లు, ఆ తరవాత ఒక దేశానికి వర్తించినట్లు, ఆ తరవాత ఆ భాషను మాట్లాడేవారికి చెందినట్లు తెలుస్తున్నది.

ఆంధ్రదేశాన్ని వేంగిదేశమని, త్రిలింగదేశమని, వ్యవహరించడం జరిగింది. శ్రీశైలం, ద్రాక్షారామం, కాళేశ్వరం, మొదలయిన ప్రాంతాలలో ఉండే జ్యోతిర్లింగాల మధ్యగల ప్రదేశాన్ని త్రిలింగదేశమన్నారు. కాలక్రమేణ పరిపాలనా సౌలభ్యంకోసం ఈ దేశాన్నే వేంగినాడనీ, ములికినాడనీ, పొత్తినాడనీ, రేనాడనీ, పలనాడనీ, పాకనాడనీ, త్రినాడనీ, తెలుగునాడనీ, తెలంగాణా అనీ, కమ్మనాడనీ, వెలినాడనీ, వ్యవహరించడం జరిగింది.

అతిప్రాచీనకాలంనుంచీ గృహ్యశాస్త్రకర్తలు, ధర్మశాస్త్రకర్తలు, నీతిశాస్త్రకారులు, శ్రౌతశాస్త్రకర్తలు నిర్ణయించిన సాంఘిక ఆచారాలు, కట్టుబాట్లు, కులమత సంప్రదాయం ఆంధ్రదేశంలో బాగా కనిపిస్తుంది. ఋగ్వేద మంత్రాల్లో చెప్పబడిన సామాజిక వర్ణ వ్యవస్థ ఇక్కడ బాగా కనిపిస్తుంది. సమాజం నాలుగు వర్ణాలుగా విభజింపబడినప్పటికీ, ప్రతివర్ణంలోను అనేకమైనశాఖలున్నవి. ఉదాహరణకు బ్రాహ్మణజాతిలో అనేకమైన శాఖలున్నవి. ముఖ్యంగా వైదికులు, నియోగులు అనే శాఖలు ప్రబలమైనవి. వైదికుల్లో మళ్ళీ స్మార్తులు, పురోహితులు, తెలగాణ్యులు, వెలనాడులు, మురికినాడులు, కోసలనాడులు, అనే తెగలు కలవు. ద్రావిడులు, ఆర్వేల నియోగులు, లింగాయతులు, శైవులు, వైష్ణవులు, అని అనేకమైన మతసంబంధమైన శాఖలు ఉపశాఖల వారున్నారు. బ్రిటిషువారు భారతదేశాన్ని పరిపాలిస్తున్న రోజుల్లో రాజకీయరంగంలోను, పరిపాలన యంత్రాంగంలోను మొట్టమొదట చేరిన వారు వీరే.

విద్యావ్యాసంగంలో కులమత విచక్షణకు తావులేకుండా సర్వధర్మ సమాదరణం గావించడంలో ఆంధ్రులు అనాదిగా ప్రసిద్ధులు. యజ్ఞంచేసి సోమయాజిగా మారిన తిక్కన కవి నియోగి బ్రాహ్మణుడు. మహాభారతాన్ని అనువదించి తెలుగులోకి రాయడానికై తన లేఖకునిగా కుమ్మరి గుర్రప్పను ఆయన నియమించాడు. కులమత సహనానికి ఇంతకన్న దృష్టాంతం ఏమి కావాలి. రెడ్డి ప్రభువులు, క్షత్రియులు, వెలమవారు ఆంధ్రదేశాన్ని పరిపాలించి దేశాన్ని ఎంతో అభివృద్ధి చేశారు. ఆ రోజుల్లో బ్రాహ్మణులు మంత్రివర్యులుగా

ఉండి వారి నిశితబుద్ధితో రాజ్యతంత్రాన్ని నడిపేవారు. పౌరుల హితాన్ని కోరి పురోహితులు, లేదా పౌరోహితులయ్యేవారు. వైదికకర్మకాండను, మానవునికి కావలసిన సంస్కారకర్మలను వీరు సజీవంగాఉంచారు. అయితే అంధవిశ్వాసం, మతోన్మాదం, మూర్ఖమైన నమ్మకాలు, కట్టు కథలు, అన్ని జాతులవారిలో ఉన్నట్లే ఆంధ్రుల్లో కూడా ఉన్నాయి. కాని మత విషయానికి వచ్చినట్లయితే ఆంధ్రులు చాలా వరకు ఉదారులు. సనాతన ధర్మంగా వస్తున్న హిందూధర్మం అద్వైతంగాను, విశిష్టాద్వైతంగాను, ద్వైతంగాను, శైవంగాను, అనేకమైన రూపాంతరాలతో ఆంధ్రలో స్థిరంగా ఉన్నది. అంతేగాక హైదరాబాదును ముస్లిములు పరిపాలిస్తున్న రోజుల్లో మతసహనం ఎంతగానో అక్కడ ఉండేది.

దార్శనిక ప్రగతికి ఆంధ్రులుచేసిన కృషి ప్రశంసనీయం. అతిప్రాచీన కాలంనుంచీ, ఆధ్యాత్మిక చింతనకు, నైతిక విలువలను పెంపొందించటానికి, ప్రజల్లో భక్తిభావాన్ని కలుగచేయటాకి, ఆంధ్రులు చేసిన కృషిని గురించి తెలుసుకొందాం. మన పరిశీలనంతా చారిత్రాత్మకంగానూ, దర్శన సాహిత్య పరంగానూ ఉంటుంది. ఆంధ్రులు తాత్త్వికరంగంలోను, మతసాహిత్యంలోను, సంగీతరంగంలోను, లలితకళాభివృద్ధిలోను ముందంజవేసినారు. వారుచేసిన సాహితీకృషి చాలాగొప్పది. ఈ కృషిని అయిదు దశల్లో చూడవచ్చు.

1. అతిప్రాచీనకాలంలో ఆంధ్రుల తాత్త్వికచింతన
2. అనువాదకులు
3. ప్రబంధ యుగకర్తలు
4. భక్తి శతక కర్తలు
5. ఆధునిక యుగంలో ఆంధ్రులు : భక్తి తత్పరత.

## మతసామరస్యానికై ఆంధ్రులు చేసిన కృషి

భారతీయ దర్శన శాస్త్రాభివృద్ధికై ఆంధ్రులు చేసిన సేవను గురించి తెలుసుకొనేముందు, ఆంధ్రదేశంలో ఉన్న చారిత్రక, మతసంబంధమైన విష

యాలను కొన్నింటిని తెలుసుకోవలసిన ఆవశ్యకత ఎంతేని ఉన్నది. ఒకజాతి సాధించిన ప్రగతి, విలువలు, తత్త్వము ఆ జాతికి సంబంధించిన కథల్లోను, గాథల్లోను, పురాణాల్లోను, ఇతిహాసాల్లోను, వారు నిర్మించుకొన్న సాహితీరంగం లోను, లలితకళల్లోను ప్రతిబింబిస్తుంది.

క్రీ. శ. 2వ శతాబ్దంలో పల్లవులు ఆంధ్రరాజులను జయించి పల్లవ సామ్రాజ్యాన్ని దక్షిణాపథంలో స్థాపించారు. పల్లవుల్లో మొదటితరం రాజులు జైనమతాభిమానులు. అందువల్ల కాంచీపురంనుంచి వేంగినాటివరకు పల్లవుల ఆదరణలో జైనమతం ఆంధ్రదేశంలో బాగా వ్యాపించింది. క్రీ. శ. 2వ శతాబ్దినుంచి 5వ శతాబ్దం వరకు దక్షిణ భారతదేశంలో జైనమతవ్యాప్తి బాగా జరిగింది. పల్లవుల అనంతరం చాళుక్యులు దక్కను పీఠభూమి వరకు వారి రాజ్యాన్ని విస్తరింపచేశారు. చాళుక్యుల్లో రెండు శాఖలవారున్నారు. 1) తూర్పు చాళుక్యులు, 2) పశ్చిమ చాళుక్యులు తూర్పు చాళుక్యులు జైన మతాభిమానులు. కాని, చోళరాజులు, మరియు పల్లవ చాళుక్యరాజులమధ్య ఏర్పడిన సంబంధ బాంధవ్యాలద్వారా తరవాత వచ్చిన చాళుక్యులు హిందూమతాభిమానులయ్యారు. అంతమాత్రాన వారిని అన్యమతద్వేషులుగా భావించరాదు. మతవిషయంలో వీరు అపారమైన సహనశక్తిని, సమతాభావాన్ని ప్రదర్శించారు. ఆ కారణంగానే వైష్ణవమతాన్ని, నారాయణమతాన్ని జైనమతాన్ని, హిందూమతాన్ని సమాన మైన గౌరవంతో ఆదరించారు చాళుక్యులు. అయితే ఇటువంటి ఆదరణను కొంత మంది వారిమతాన్ని ఉద్ధరించుకొనడానికి, ఇతరుల మతాన్ని ఖండించడానికి వినియోగించుకొన్నారు. రాజరాజనరేంద్రుడు రాజ్యాధిపత్యాన్ని పొందేటప్పటికి ఆంధ్రదేశంలో జైనమతం నశించి హిందూధర్మం ఉచ్ఛస్థితికి వచ్చింది. భార తాన్ని తెలుగులోకి అనువదిస్తూ తిక్కనసోమయాజి "శ్రీయనగౌరినాబరగు చెల్వకు.......హరిహరంబగు రూపము దాల్చి—" అని మొదలు పెడతాడు. అంటే శైవాన్ని, వైష్ణవాన్ని సమదృష్టితో చూడటం 13వ శతాబ్దం నాటికే ఆంధ్రలో ఉన్నది. అంతేగాకుండా, క్రీ. శ. 7–8 శతాబ్దాలమధ్య కాలంలో యావద్భారతదేశాన్ని పర్యటించి అద్వైతాన్ని స్థాపించిన శ్రీ శంకరాచార్యులు వారుకూడా మతసామరస్యానికి ఎంతో కృషిచేశారు.

తూర్పుచాళుక్య సామంతరాజులు కొందరు చోళరాజుల అధీనంలో ఉన్న ఆంధ్రభూభాగాన్ని కొంతవరకు జయించిన తరవాత వారు కాకతీయులుగా ప్రసిద్ధిచెందారు. వీరిలో కాకతీయ ప్రతాపరుద్రుడు చాలా గొప్పవాడు. ఈ ప్రతాపరుద్రుడు గొప్ప పండితుడు, నీతిశాస్త్రపారంగతుడు. కౌటిల్యుడు రాసిన అర్థశాస్త్రాన్ని అనుకరిస్తూ రాజకీయపరంగా ఒక నీతి శాస్త్రాన్ని రాశాడీయన. కాకతీయయుగంలో దార్శనిక సిద్ధాంతాలనూ, మతసంబంధమైన విషయాలను తెలిపే అనేకమైన పౌరాణిక గ్రంథాలు వెలుపడ్డాయి. ఇది ఒక మహా రచయితల యుగం అని చెప్పవచ్చు. పాల్కురికి సోమనాథుడు, రంగనాథుడు బుద్ధరాజు, తిక్కన, బద్దెన, అథర్వణుడు, మారన, విద్యానాథుడు, హుళక్కి భాస్కరుడు మొదలయిన ప్రతిభావంతులు వెలసిన కాలమిది. క్రీ.శ. 1140 వ సంవత్సరంనుంచి క్రీ. శ. 1325 వ సంవత్సరం వరకు తెలుగు సాహిత్యం, కళలు, మతోద్ధరణ, తత్త్వశాస్త్రంమొదలయిన రంగాల్లో అనేకమైన గ్రంథాలను రచించడం జరిగింది.

కాకతీయుల అనంతరం రెడ్డిరాజులు, పద్మనాయకులు, విజయనగర రాజులు ఆంధ్రదేశాన్ని పరిపాలించారు. ఈ కాలంలోనే హిందూసామ్రాజ్యమే కాకుండా, హిందూమతంకూడా టర్కులు, మహమ్మదీయులు, గోరీలు, గజనీలు, ఖిల్జీలు, తురుష్కులు,పఠానులు మొదలయిన అన్యజాతులవారిదాడికి లోనయింది, ఇస్లాంయుగం భారతదేశంలో ఈ కాలంలోనే ప్రారంభమయింది. అల్లాఉద్దీన్ ఖిల్జీదాడుల వల్ల ఓరుగల్లు పతనమయింది. ప్రతాపరుద్రుడు బందీ అయ్యాడు. ఆంధ్రులలో నూతన చైతన్యం ఏర్పడాల్సిన తరుణమది. దక్షిణాపథంలో ఉన్న చిన్న చిన్న సామంతరాజ్యాలన్నింటినీ ఒకే జండా కింద తెచ్చే ప్రయత్నాన్ని, బాధ్యతను విజయనగరరాజులు చేపట్టారు. శ్రీ కృష్ణదేవరాయల ఆధ్వర్యంలో విజయనగరసామ్రాజ్యం స్థాపన జరిగింది. తిమ్మరుసు మంత్రిత్వం లో అది క్షేమంగా ఉన్నది. విజయనగరసామ్రాజ్యంలో ఆంధ్రవాఙ్మయం, తత్త్వశాస్త్రం, లలితకళలు ఒక నూతన రూపాన్ని ఏర్పరచుకొన్నాయి.

శ్రీకృష్ణదేవరాయలు వైష్ణవమతాభిమాని కావడంతో వైష్ణవమతానికి ఎక్కువగా ఆదరణ లభించింది. సాహితీరంగంలో అనేకమైన ప్రబంధ గ్రంథాలను రాశారు. దీన్ని ప్రబంధయుగం అన్నారు. వైష్ణవమునులలో అగ్రగణ్యుడైన రామానుజాచార్యులు వైష్ణవ సంప్రదాయాన్ని, వైష్ణవ సాహిత్యాన్ని వైష్ణవమతాన్ని పునరుద్ధరించాడు. అట్లాగే కాకతీయులకాలంలో వీరశైవం బాగా అభివృద్ధిచెందింది విజయనగరరాజుల ఆదరణలో మళ్ళీ వైష్ణవం బాగా అభి వృద్ధి చెందింది. అయితే ఇక్కడ మనం గమనించవలసిన ముఖ్యమైన విషయం ఒకటి ఉన్నది. ఈ రెండు మతాలకూ సమానమైన ఆదరణ ఆంధ్ర దేశంలోనే జరిగింది. నేడు కూడా అట్లాగే ఉన్నది. ఉదాహరణ కు శ్రీశైలంలోని భ్రమరాంబా మల్లికార్జున దేవాలయం, తిరుపతిలోని శ్రీవెంక టేశ్వర దేవాలయం మత సామరస్యాన్ని చాటుతాయి. విజయనగర సామ్రా జ్యంలో ఉన్న అష్ట దిగ్గజాలని పిలవ బడే కవులందరూ వైష్ణవాన్ని ప్రశంసిస్తు అనేక మైన గ్రంథాలను రాశారు. శైవాన్ని ప్రశంసిస్తు కూడా గ్రంథాలు రాసినవారు లేక పోలేదు. శ్రీకృష్ణదేవరాయలు "విష్ణు చిత్తీయము" అనే గ్రంథాన్ని రాశాడు. కళల ద్వారాను, సాహిత్యం ద్వారాను మతాన్ని పోషించి సంస్కరించడం ఈ యుగంలో జరిగింది.

బహమనీ సుల్తానులు ఓడి పోవటంతో మధురై, తంజావూరు, పుదుకోట స్వతంత్రాన్ని ప్రకటించాయి. ఈ మూడు రాజ్యాలను ఆంధ్రులు పరిపాలించారు. కాని విజయనగర సామ్రాజ్య పతనంతో ఈ మూడు సామంత రాజ్యాలు కూడా స్వతంత్ర ప్రతిపత్తిని కోల్పోయాయి. బ్రిటిషు వారి దాడులకు తట్టుకో లేక పడి పోయిన హిందూ సామ్రాజ్యాల చరిత్రను, ఆంధ్రులు పరిపాలించిన ప్రాంతాల్లో క్రైస్తవ మతం ఎట్లా ప్రవేశించింది తెలుగు సాహిత్యంలో మనం చూడవచ్చు. నూజివీడు రాజులు, వెంకటగిరి రాజులు, బొబ్బిలిరాజులు, పిఠా పుర రాజులు, విజయనగరం రాజులు సాహిత్యాభిమానులు. మతాభి మానులు. తత్త్వశాస్త్రాభిమానులు. దైవభక్తులు.

ఆంధ్రులు పెంపొందించిన సాహిత్యంలో మత విశ్వాసాలకు, తాత్త్వికాలో

చనలకు, దార్శనిక విలువలకు తావున్నది. వీరు రూపొందించిన తాత్త్విక చింతన కాలాను గుణంగా మారుతూ వచ్చింది. వైష్ణవ మతం కానీ, శైవ మతం కానీ, శాక్తేయం కానీ, వీరశైవం కానీ, ఈ ప్రపంచం సృష్టి స్థితి లయలకు ఒక కారణమున్నదని అంగీకరిస్తాయి. అద్వైత వేదాంతం ఆకారణస్వరూపం నిర్వికారమని, నిరంజనమని, నిర్గుణమని భావిస్తుంది. అయితే మిగతా మతాలు ఆ కారణాన్ని విష్ణువుగానో, శివుడుగానో, శక్తిగానో భావించాయి సర్వసాధారణంగా అంగీకరింప బడిన హిందూ మత సిద్ధాంతాల్లో ఇదొకటి. ఈ సిద్ధాంతాన్ని ఆంధ్రులు ఒక జాతిగా, ఒక ఆదర్శమైన మానవాళిగా అంగీకరించారు. అట్లాగే శివ, కేశవుల సమన్వయానికి కూడా ఆంధ్రులు కృషి చేశారు. అనేక గ్రామాల్లోఉన్న శివ కేశవాలయాలే దానికి సాక్ష్యం నిదర్శనంకూడా. ఈ సమన్వయ దృష్టికి వెనక అద్వైత తాత్త్విక చింతన ఎంతో అండగా నిలిచి ఉన్నది. శంకరుని అద్వైతం, రామానుజుని విశిష్టాద్వైతం, బసవుని వీరశైవం, మాధ్వుని ద్వైత వేదాంతం, నింబార్కాచార్యులు, వల్లభా చార్యులు, భాస్కరా చార్యులు బోధించిన వేదాంతం ఆంధ్రలో ఒక నూతన రూపాన్ని ఏర్పరుచు కొన్నది. ఉదాహరణకు, శివాలయంలోను, విష్ణ్వాలయంలోను చెప్పబడే "మంత్రపుష్పం" ఈ సమన్వయాన్ని చాటుతుంది. ఆంధ్ర కవులు. గాయకులు, దార్శనికులు, భాగవతులు మొదలయిన వారందరూ ఈ విధమైన మతసామరస్యానికి దోహదం చేసారు. కాని కొందరికి ఈ సమన్వయ దృష్టి నచ్చనందున వైష్ణవ ఉద్యమాన్ని లింగాయతుల ఉద్యమాన్ని, శైవమత ఉద్యమాన్ని లేపదీసి మత కల్లోలాలకు కారకులయ్యారు. ఈ విధమైన మత పరిణామాలను, దార్శనిక విలువలను, మత బోధనలను ఒక తరం వారు మరొక తరం వారికి ఏవిధంగా అందించిందోచూద్దాం.

## తత్వశాస్త్రం-ఆంధ్రసాహిత్యం

ఆంధ్ర దేశంలో తత్వశాస్త్ర వికాసానికీ, మత విలువల వ్యాప్తికీ ఆంధ్రులు చేసిన సాహితీ సేవ చాలా గొప్పది. కొంత మంది మహానుభావులు ఆంధ్ర దేశంలో పుట్టి. చాలా కాలం వరకు ఇక్కడే ఉండి, ఆ తరవాత యావద్భారత దేశం పర్యటించి అనేక మైన తాత్త్విక చింతనా ధోరణులను

సమన్వయింప చేసారు. వారందరూ ఆంధ్రులు. వారు సంస్కృత భాషలోను, ఆంధ్ర భాషలోను అనేక మైన గ్రంథాలను రాసారు. ఉదాహరణకు, ఆపస్తం బుడు, ఆచార్య నాగార్జునుడు, కుమారిల భట్టు, చిత్సుకా చార్యుడు మొదలయిన వారందరూ ఆంధ్రులే. వీరు సంస్కృతంలో రాశారు. మల్లినాథుడు, పాల్కు రికి సోమనాథుడు, కాటయ వేమరెడ్డి, విద్యానాథుడు, పండితరాయ జగన్నా థుడు ఇత్యాదు లందరూ ఆంధ్ర సంస్కృతి నాగరకతలను, తాత్త్విక విషయా లను ఆంధ్ర భాషలోను, సంస్కృత భాషలోను అనేక గ్రంథాలు రాసి పున దర్శన శాస్త్ర విషయాలను విపులీకరించారు.

జగద్విఖ్యాతి పొందిన ద్వంద్వతార్కికులను, దర్శన శాస్త్రాచార్యులను, ఆధ్యాత్మిక సోపాన పరంపరను అధిగమించిన అనేక మంది మహర్షులను, ద్రష్టలను కన్న ఆంధ్రమాత గర్వించ దగ్గది. ఆచార్య నాగార్జునుడు, శాయనా చార్యుడు, విద్యారణ్యుడు, శాయన మాధవా చార్యుడు, ఆపస్తంబుడు, కుమారిల భట్టు, మొదలయిన వారందరూ ఆంధ్రులే. వీరందరూ విశాలదృక్పథం కల వారు కనుకనే భాషాతత్త్వం, ప్రాంతీయ తత్త్వం వారిని ఆకర్షించ లేక పోయాయి. అందుకే వారి రచనా రంగాన్ని ఆంధ్ర భూమికి మాత్రమే పరిమితం చేయ కుండా, యావద్భారత దేశానికి, యావత్ మానవాళికి ఉపయోగంగా వుండే సందేశాలను తాత్త్విక ధోరణిలో రాశారు. అన్నం భట్టు రాసిన 'తర్కసం గ్రహం' అనే గ్రంథం అమూల్య మైనది. నింబార్కా చార్యులు, వల్లభాచార్యులు రాసిన 'బ్రహ్మసూత్ర భాష్యాలు' మిక్కిలి విలువైన దార్శనిక గ్రంథాలు. శ్రీపతి రాసిన 'శ్రీకర భాష్యం' వీరశైవ సిద్ధాంతాన్ని చాటుతుంది.

ప్రాచీనాంధ్ర సాహితీ వేత్తలందరూ సంస్కృత భాషాభిమానులు. ఉదా హరణకు కాళిదాసు కవితలకు భాష్యం రాసిన మల్లినాథుడు, కాళిదాసు నాటకా లను విపులీకరించిన కాటయ వేమన సంస్కృత భాషాభిమానులు. వీరు ఆంధ్ర భాషను బాగా ఆదరించారు. సింగ భూపాల రాజు సంస్కృతాంధ్ర భాషలను ఆదరించాడు. ఈయన కాలంలోనే భక్తి, శృంగారరస చక్రవర్తు లనదగిన

పోతన, శ్రీనాధుడు అనేకమైన కావ్యాలను రాశారు. సింగ భూపాలుని "రసార్ణవసుధాకరం" విద్యానాధుని "ప్రతాపరుద్రీయం", జగన్నాధ పండితుని "రసగంగాధరం" సంస్కృత లక్షణ గ్రంథాలు. భవభూతి కూడా ఆంధ్రుడే. శాతవాహన చక్రవర్తులకు మంత్రిగా ఉన్న గుణాఢ్యుని "బృహత్కథా మంజరి'' లోని తాత్త్వీక విలువలు, రాజనీతి, సంఘనీతి ఆయన ప్రజ్ఞకు నిదర్శనం. వామన భట్ట బాణుడు, శివలింగ భూపతి, లొల్ల లక్ష్మీధరుడు మొదలయిన వారు రాజనీతిని, తత్త్వాన్ని, సాంఘిక ఆచారాలను అన్నింటిని చెప్పారు

వీరశైవ కర్తఅయిన బసవేశ్వరుడు ఆంధ్రదేశంలో పుట్టినప్పటికీ ఆయన కన్నడ దేశంలో వీరశైవమతాన్ని వ్యాపింపచేసాడు. ప్రస్తుతం ఆంధ్రదేశంలో ఆరాధ్య బ్రాహ్మణులు వీరశైవమతాన్ని ఆదరిస్తారు ఆరాధ్య బ్రాహ్మణులచే ఆదరించబడిన శైవమత గ్రంథాలు తెలుగులో అనేకం ఉన్నాయి. రామానుజుని మతానుయాయుల గ్రంథాలు తమిళంలో ఉన్నాయి. ఇటీవలి కాలంలోనే శ్రీ రామానుజుడు రాసిన శ్రీ భాష్యాన్ని కందాళై శ్రీనివాసాచార్యులవారు తెలుగులోకి అనువదించారు. సమ్రాట్టులు, చక్రవర్తులు సంస్కృతాన్ని ఆదరిస్తే సామంత ప్రభువులు ప్రాంతీయ భాషలను ఆదరించారు. రాజరాజనరేంద్రుడు, రావు సింగన్న భూపాలుడు, కొండవీటి రాజులు మొదలయినవారంతా ఆంధ్ర భాషకు, తత్త్వానికి, దార్శనిక విలువలకు ఇతోధికమైన సేవచేశారు.

ఆంధ్రదేశంలో పుట్టిన తాత్త్వికులు, కవులు చేసిన రచనలను ముఖ్యంగా రెండు రకాలుగా విభజించి చూడవచ్చు. (1) ప్రాచీనరచనలు (2) ఆధునిక రచనలు. ప్రాచీనరచనలకింద పురాణాలు రాయడం, సంస్కృతంలోఉన్న గ్రంథాలను తెలుగులోకి అనువదించడం లేదా కావ్యాలను రచించడం మొదలయినవి. అట్లాగే నీతి శతకాలు, శృంగార శతకాలు, భక్తిని ప్రబోధించే శతకాలు రెండోభాగంలో చూడవచ్చు. ఇవి అనేకరకాలుగా ఉన్నవి. మత బోధనలను, ఆధ్యాత్మిక విలువలను చాటుతూ అనేకమైన తత్త్వాలను, పద్యాలను

గేయాలను, స్తోత్రాలను రాయడం జరిగింది. వీటివిలువ పామరజనంలో ఉన్నంతగా విద్యాధికుల్లో లేనందువల్ల ఇవన్నీ సాహిత్య స్థాయిని చేరుకోలేక పోయాయి. క్షేత్రయ్య పదాలు, అన్నమాచార్య కీర్తనలు, త్యాగరాజు కీర్తనలు, బ్రహ్మంగారి సుద్దులు, భక్తరామదాసుగారి కీర్తనలు అన్నీ ఏదోఒక తత్త్వాన్ని గురించి చెబుతాయి. ముఖ్యంగా ఇవన్ని భక్తిని గురించి చెబుతాయి. కనక ఆంధ్రులు రూపొందెంచిన భక్తితత్వాన్ని గురించి తెలుసుకొందాం.

జైన, బౌద్ధమతాలు బాగా ఆంధ్రదేశంలో వ్యాపించి ఉన్నప్పుడు నాస్తిక మతాన్ని పారదోలి, ఆస్తిక భావాలను సంఘంలో స్థాపించాలని కుమారిలుడు కంకణం కట్టుకొన్నాడు. శంకరాచార్యుడు ఒకవైపు, కుమారిలభట్టు మరొక వైపు ప్రతిఘటించడంవల్ల జైన బౌద్ధాలు ఆంధ్రదేశంలో రూపులేకుండా పోయాయి. అయితే ఇదంతా రాజపోషణవల్లనూ, ప్రజాదరణవల్లనూ జరిగిందే కాని రక్తపాతంవల్లకాదు. కాని ఒరిస్సాదేశంలో ఖారవేలుడు అనేరాజు జైన మతస్థులను అనేకమందిని చంపించాడని చారిత్రకులు చెబుతారు. కర్ణాటక, తమిళ, ఆంధ్రదేశాల్లో ప్రబలంగాఉన్న జైనమతం నశించిపోయి శైవమతానికి వైదిక మతానికీ తావిచ్చింది. పరాజయం పొందిన మతాలు ఎక్కడ తిరిగి విజృంభిస్తాయో అనే సంశయం కవుల్లోను, భావుకుల్లోను, దార్శనికుల్లోను లేక పోలేదు. అందువల్ల లభించిన విజయాన్ని నిలదొక్కుకోవడానికై వీరుచేసిన కృషి అపూర్వం. అందువల్ల సంస్కృతభాషలో ఉన్న సాహిత్యాన్ని తెలుగులోకి అనువదించాలనే సంకల్పం వీరిలో బాగా నాటుకపోయింది. వెంటనే ఆ సంకల్పాన్ని కార్యరూపంగా మార్చివేశారు. అందుకే నీతినీ, ధర్మాన్ని, మోక్షాన్ని, మత విలువలను తెలిపే గ్రంథాలను ముందుగా తెలుగులోకి అనువదించడం జరిగింది.

ఈ అనువాద కాలంలో శ్రీమదాంధ్ర మహాభారతాన్ని నన్నయ, తిక్కన ఎర్రాప్రగడ అనే మహాకవులు తెలుగులో రాశారు. వీరిని కవిత్రయం అంటారు. భాగవతాన్ని పోతన తెలుగులో రాశాడు. ఈ విధంగా ఐతిహాసిక,

పురాణ సంస్కృతీ నాగరికతలు తిరిగి ఆంధ్రభూమిలో ప్రవేశపెట్టటం జరిగింది.

క్రీ. శ. 12వ శతాబ్దంలో ఆంధ్ర సాహితీ రంగంలో ఒక నూతన అధ్యాయం ఏర్పడింది. వైదిక మతచైతన్యాన్ని ప్రజల్లో కలుగచేసి, దాని సముద్ధరణకై రాజాశ్రయాన్ని, కవులు, గాయకులు, తాత్త్వికులు కోరారు. వీరశైవం, వీరవైష్ణవం, లింగాయత ఉద్యమం ఈ రోజుల్లోనే బాగా అభివృద్ధి చెందాయి. ప్రతాపరుద్రుడు, పాల్కురికి సోమనాధుడు, నన్నెచోడు లింగాయత మతాన్ని, శైవమతాన్ని ఆదరించి పోషించారు. ప్రతాపరుద్రుడు 'నీతిసారం' అనే గ్రంథాన్ని రాశాడు. రాజనీతిని వివరిస్తూ సంస్కృత భాషలో "శుక్రనీతి", పంచతంత్రం అనే గ్రంథాలున్నవి. వీటిని తెలుగులోకి అనువదించటం జరిగింది. పాల్కురికి సోమనాధుడు "బసవపురాణం" "అనుభవసారం" అనే గ్రంథాలను శైవమతాభిమానంతో రాశాడు నన్నెచోడుని "కుమార సంభవం"కూడా శైవమతాభిమాన గ్రంథమే.

క్రీ.శ. 13వ శతాబ్దాన్ని రామాయణయుగం అనవచ్చు. రామాయణాన్ని అనేకమంది అనేక భాషల్లోకి అనువదించారు. వాల్మీకి రామాయణాన్ని ఆధారం చేసుకొని "రంగనాథ రామాయణం", "భాస్కర రామాయణం" తెలుగులోకి అనువదించారు. ఆర్యుల సంస్కృతికి ఆధార భూతమైన ఆదికావ్యాన్ని ఆంధ్రులు సగౌరవంగా ఆదరించారు. అంటే వైష్ణవమతాన్ని ఆహ్వానించి నట్లే అంటే వైష్ణవ మతంలో ఉన్న అవతార సిద్ధాంతాన్ని ఆంధ్రులు అంగీకరించ నట్లే. తిక్కన సోమయాజి నిర్వచనోత్తర రామాయాణాన్ని, కాచ విభుడు ద్విపద రామాయణాన్ని ఈ కాలంలోనే రాసారు. "వాసిష్టరామాయణం", ఆధ్యాత్మ రామాయణం ఈ కాలానికి చెందినవే. అంటే పామర జనానికి కావలసిన భగవత్ చింతన అంతా భగవంతుని గురించి చెప్పే కథల ద్వారా అందించడం జరిగింది. రంగనాధుడు, భాస్కరుడు, మొల్ల, కూచిమంచి లక్ష్మణ కవి రామాయణాన్ని తెలుగులోకి అనువదించారు. అయ్యలరాజు రామభద్రకవి

"రామాభ్యుదయం" అనే కావ్యాన్ని తెలుగులో రాశాడు. వీరందరినీ ఉత్తే జితులను చేసిన రామాయణం నాటికీ, నేటికీ తెలుగు జాతిని ప్రభావితం చేస్తూ నే ఉన్నది.

ఇదే కాలంలో దండి "దశకుమార చరిత్రను" రాశాడు. యాజ్ఞవల్క్య స్మృతిని విజ్ఞానేశ్వరుని భాష్యంతో సహా తెలుగులోకి అనువాదం చేయటం జరిగింది. ఈ గ్రంథాన్ని "మితాక్షరి" అంటారు. నేటి 'హిందూలా' అంతా ఈగ్రంథం మీదనే ఆధారపడి రూపొందించడమయింది. బద్దెన సుమతిశతకాన్ని రాసి లౌకిక పరమైన నీతిని బోధించాడు. వేమన శతకం కూడా ఈ కోవకు చెందిందే. మారన మార్కండేయ పురాణాన్ని, హుళక్కి భాస్కరుడు వాల్మీకి రామాయణాన్ని చంపూ కావ్యంగా రాసాడు.

క్రీ.శ. 14 వ శతాబ్దంలో అయిదుగురు మహా కవులు తమ కవితలతోను, సందేశాలతోను, తాత్త్వికి సమాలోచనతోను ఆంధ్రులను ముగ్ధులను చేశారు. వారు : 1) వేములవాడ భీమకవి 2) నాచనసోముడు 3) అమరేశ్వరుడు 4) ఎర్రాప్రగడ 5) శ్రీనాధుడు 6) వేములవాడ భీమకవి—రాఘవ పాండవీయం కవిజనాశ్రయం, శతకంఠరామాయణం, నృసింహపురాణం, వాసవపురాణం, మొదలయిన గ్రంథాలను రాశాడు. నాచన సోముడు ఉత్తర హరివంశాన్ని; ఎర్రాప్రగడ భారతంలో కొంతభాగాన్ని, వినుకొండ పెద్దన అంబికా శతకాన్ని రాసారు. శ్రీనాధుడు శృంగార నైషధం మరుత్తరాట్ చరిత్ర, శాలివాహన సప్తశతి, భీమేశ్వర పురాణం, కాశీఖండం, పండితారాధ్య చరిత్ర, శివరాత్రి మాహాత్మ్యం, వల్లభాభ్యుదయం, హరవిలాసం, శృంగారదీపిక—మొదలయిన గ్రంథాలు రాశాడు. ఈ గ్రంథాలన్ని ఏదోఒక మతాన్ని అందులోని అంశాలను సమర్థిస్తాయి.

## పురాణతత్వం : పురాణవేత్తలు

సంస్కృతభాషలో ఉన్న 18 పురాణాలను, ఉప పురాణాలను క్రీ.శ. 15వ శతాబ్దంలో తెలుగులోకి అనువాదం చేయడం జరిగింది. ఈ పురాణాల్లోని

తత్వం సరళంగా ఉన్నందువల్ల అవి జనాదరణను పొందాయి. వైదికధర్మాన్ని, ఆర్యనాగరికతను, హిందూ ధర్మాన్ని అర్థం చేసుకోవడానికి పురాణాల్లోని విషయాలు బాగా తోడ్పడుతాయి. అందుకే పురాణాలను వేదాలకు ఉపాంగాల వంటివిఅన్నారు. పౌరాణికులను జాతి సంస్కృతికి వైతాళికులు అన్నారు. వేదాల్లోఉన్న విషయాలను మాత్రమే పురాణాలువివరించవు. అవి ఆ రోజుల్లో ఉండే రాజ వంశాలను, వారు చేసిన యుద్ధాలను, వారు నిర్మించిన కట్టడాలు, ఆలయాలు, తవ్వించిన వాపీకూప తటాకాదుల వర్ణనలనుకూడా కలిగి ఉంటాయి. అంతే గాకుండా కవులూ, గాయకులూ, తాత్వికులు రూపొందించిన ఆధ్యాత్మిక విషయాలుకూడా పురాణాల్లో కనిపిస్తాయి.

పాశ్చాత్య రచయితలు కొందరు పురాణాలను గురించి ప్రస్తావిస్తూ అవి సాహూజిక విలువలను చాటుతాయన్నారు. కనక అవి లౌకిక గ్రంథాలేకాని, అలౌకిక విషయాలనుగురించి చెప్పేగ్రంథాలు కావన్నారు. ఈ అభిప్రాయంతో మనం ఏకీభవించనక్కరలేదు. పురాణాల్లో అనేకమైన అలౌకక విషయాలను గురించిన చర్చలు ఉన్నాయి. సామాన్య ప్రజల్లోకూడా ఈ అభిప్రాయమే ఉన్నది. పర్వదినాల్లోను, పండుగరోజుల్లోను పురాణపఠనం జరుగుతుంది. భాగవత సప్తాహం, సుందరకాండ పారాయణ, భగవద్గీతపారాయణం మొదలయినవి మనం సంఘంలో చూస్తుంటాం.

పోతన రాసిన భాగవతం ఆంధ్రుల పౌరాణిక తత్వాన్ని, భక్తి తత్పరతను, ఆధ్యాత్మిక చింతనను సూచిస్తుంది. అన్ని తెగలవారు ఈ గ్రంథాన్ని ఆదరిస్తారు. చదువుతారు. విష్ణుతత్వం భాగవతంలో ఉన్నది. దానిగురించి తెలుసుకొని తరించాలని అనేకమంది ఆసక్తి చూవుతారు. వైష్ణవమతం పట్ల ఉండే అభిమానం అనేకమైన పురాణాలను అనువాదం చేయడానికి తోడ్పడింది. అట్లాగే శైవపురాణాలనుకూడా అనువాదం చేయడం జరిగింది. లింగపురాణం బసవపురాణం. శివపురాణం, కార్తీకపురాణం, మార్కండేయపురాణం మొదలయినవి శైవతత్వాన్ని తెలియచేస్తాయి. విష్ణుపురాణం. భాగవతపురాణం, విష్ణు

తత్వాన్ని తెలియ చేస్తాయి. అగ్ని పురాణం, వాయు పురాణం, విశ్వాన్ని గురించి తెలుపుతాయి. మారన 'మార్కండేయ పురాణాన్ని', ఎర్రాప్రగడ 'నృసింహపురాణాన్ని', శ్రీనాధుడు 'భీమేశ్వర పురాణాన్ని', సింగన్న 'పద్మపురాణాన్ని' 'వాసిష్ఠ రామాయణాన్ని' దొమ్మనదార 'దేవీ భాగవతాన్ని' కోనేరు కవి బాలభాగవతాన్ని అనువదించారు. నిశ్శంక కొమ్మన్న 'శివలీలా విలాసం' రాసాడు. గౌరనమంత్రి 'హరిశ్చంద్రో పాఖ్యానాన్ని' 'నవనాధ చరిత్రను', సాళువ నరసింహరాజు అస్థానకవి అయిన పిల్లలమర్రి పినవీరభద్రకవి జైమినీ భారతాన్ని' 'అవతార దర్పణాన్ని 'మాఘమాహాత్మ్యాన్ని', 'పురుషార్థ శుద్ధనిధిని', మానసోల్లాససారాన్ని 'శృంగార శాకుంతలాన్ని', 'నారదీత్యాన్ని' రాసాడు. పిల్లలమర్రి పినవీరభద్రుని సమకాలీనుడగు వెన్నెలకంటి సూరన ''విష్ణుపురాణాన్ని'' ప్రౌఢకవి మల్లన ''ఏకాదశి మాహాత్మ్యాన్ని'' రాసాడు. దూబగుంట నారాయణ పంచతంత్రాన్ని అనువదించాడు. నంది మల్లయ్య, ఘంట సింగయ్యలు ప్రబోధ చంద్రోదయం అనే నాటకాన్ని షడ్దర్శనాల్లోని సిద్ధాలతాలను విమర్శిస్తూ రాశారు. వీరు వరాహ పురాణాన్ని అనువదించారు. దగ్గుపల్లి దుగ్గయ్య 'నాచికేతో పాఖ్యానాన్ని' రాసాడు దీనికి తైత్తిరీయ ఉపనిషత్తులో నాచికేతుడు — యముడు చేసిన సంవాదం ఆధారం. ఇతను కాంచీపుర మహాత్మ్యం అనే గ్రంథాన్నికూడా రాసాడు.

అనువాద యుగంలోంచి బయటికివచ్చి ప్రబంధయుగంలో ప్రవేశిద్దాం. శ్రీకృష్ణదేవరాయల ఆధ్వర్యంలో ఒకనూతన అధ్యాయం ఏర్పడింది. సాహిత్యం లోను, తత్త్వశాస్త్రంలోను, మత సంబంధమైన విషయాల్లోను ఒక నూతనశకం ఆరంభమయింది. ఈ యుగంలో భావప్రకటన స్వేచ్ఛగాజరిగింది. త్రిభాషాభిమాని అయిన శ్రీకృష్ణదేవరాయలు (సంస్కృతం, కన్నడం, తెలుగు) కాలంలోని కవులు, తాత్త్వికులు తమ భావాలను సంస్కృత భాషలో ఉన్న సాహిత్యంనుంచి స్వీకరించారు. అనువాదాలను మానివేసి స్వతంత్ర్య భావప్రకటన చేశారు. రచనారంగంలో వ్యక్తిగత అభిప్రాయాలకు, భావాలకు ప్రాముఖ్యం లభించింది. పురాణకథలను, పురాణాల్లోఉన్న తాత్విక చింతనను కథాంశంగా తీసుకొని అనేకమైన గ్రంథాలు రాసారు.

వైష్ణవమత ప్రభావం మన తెలుగు సాహిత్యంపై బాగా ఉన్నది. శ్రీకృష్ణ దేవరాయలు రచించిన విష్ణుచిత్తీయం అనే గ్రంథం వైష్ణవమత వ్యాప్తికి కావల సిన కథాంశాలనిచ్చింది. ప్రబంధయుగంలో మొట్టమొదట శైవమతాభిమానం కన్పిస్తుంది. కాని - తాచార్యులు, అప్పయ దీక్షితులు, తదితర ప్రబంధ కవులు, తాత్త్వికులు వైష్ణవ మతాన్ని ఆదరించారు. అందుకే వైష్ణవమతాభి వృద్ధి ఈ కాలంలో ఎక్కువగా జరిగింది.

## శతకాలు : నీతిశాస్త్రం : భక్తితత్వం

కావ్య సాహిత్యానికి అనుబంధంగా కానీ, దానికి సమానమైన సాహితీ ప్రక్రియగా కానీ శతక సాహిత్యం బయలుదేరింది. దాదాపు 500 శతకాలు ఉన్నట్లు తెలుస్తున్నది శతకాలన్నింటిలోను ఉన్న తత్వం మూడు రకాలు. అవి

1) శృంగార తత్వం
2) భక్తి తత్వం
3) లౌకిక నీతి తత్వం

ఇందులో కొన్ని అనువాదాలు. కొన్ని స్వంతగారాసినవి. ముఖ్యంగా భక్తిరసం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది శతకాల్లో. సాంఘిక నీతిని, రాజనీతిని, లౌకిక నీతిని, వైరాగ్యాన్ని సామాన్యప్రజలకు తెలియ చేశాయి. అంతేగాకుండా, మత ప్రచారానికికూడా ఈ శతకాలు తోడ్పడ్డాయి.

భక్తిరస ప్రధానమైన శతకాల్లో అన్నయ్య సర్వేశ్వర శతకం, ధూర్జటి కాళహస్తీశ్వర శతకం మొ లయినవి ప్రాముఖ్యాన్ని పొందాయి.

శతకాలతోపాటు భగవంతుని గురించి చేసే అనేకమైన దండకాలు వెలువడ్డాయి. ఆంజనేయ దండకం అందరూ ఎరిగిందే. భగవంతుని పట్ల ఉండే భయాన్ని, సంభ్రమాన్ని, భక్తిని, సంపత్తిని దండకాలద్వారా వ్యక్తం చేసారు. భక్తిపారవశ్యంతో రూపొందించిన సాహిత్యం ఎక్కువగా సంగీత రూపంలో ఉన్నది. స్తవాలు, స్తుతులు, కీర్తనలు, చాలీసాలు, దండకాలు,

ప్రార్థనలు, భజనలు, కృతులు, పదాలు, సంకీర్తనలు, హరికథలు, భాగవత మేళాలు—ఈ విధంగా ఎన్నోరకాలైన సాహిత్యం వచ్చింది. ఇదంతా పామర జనంలో భక్తి చైతన్యాన్ని కలుగ చేసింది. అట్టడుగు ప్రజానీకంలో సాంఘిక విలువలు, సమాజనీతి, భక్తితత్త్వము, ఆస్తికత, భగవంతునియందు అనన్యమైన భక్తి, ప్రేమ, అనురాగం, శ్రద్ధ ఏర్పడటానికి ఈ సాహిత్యం ఎంతో మేలు చేసింది.

శ్రీ రామాత్యుడు, శ్రీసోమనాథ పండితుడు, శ్రీ నారాయణ తీర్థులు, భద్రాచల రామదాసు, శ్రీ క్షేత్రయ్య, శ్రీ అన్నమాచార్యుడు, శ్రీ త్యాగరాజు, శ్రీ సుబ్బరాయశాస్త్రి మొదలయిన వారు ఆంధ్రదేశంలో ప్రజల్లో భక్తితత్త్వాన్ని పెంచారు. ముఖ్యంగా స్త్రీలల్లో ఎనలేని భక్తిపారవశ్యతను కలిగించడానికి కావలసిన సాహిత్యంకూడా మనకు ఆరోజుల్లో ఏర్పడింది. జావళి పాటలు, మంగళ హారతి, లాలిపాటలు, తత్త్వాలు, మేలుకొలుపులు, యక్షగానాలు, జక్కుల పాటలు, వీధిభాగవతాలు మొదలయినవి ఎన్నో సామాన్య ప్రజాజీవితాన్ని ఉత్తేజపరచి వారిని నీతిమార్గంనుంచి తప్పకుండా ఉంచాయి. వీటన్నింటికి దర్శనాల్లో చెప్పబడిన విషయాలే ఆధారం. మత సంబంధమైన విలువలను, ఆధ్యాత్మిక విషయాలను, భక్తి, ప్రపత్తి, శరణాగతులను సరళంగా చెప్పడమే ఈ సాహిత్య ఆశయం. అంతేగాకుండా పామరజనాల్లో ఉండే భక్త్యావేశం ఈ విధంగా వారు ప్రదర్శించుకోవడానికి కూడా అవకాశం ఏర్పడింది.

ఈ విధంగా పౌరాణిక కథలూ, ఐతిహాసిక కథలూ ప్రజల్లో అనేక విధాలుగా ప్రచారం పొందాయి. అందువల్ల మనమంతా భారతీయులం అనే దేశ సమైక్య దృష్టి ఏర్పడింది. మతం మత్తులాంటిదని కొందరు భావించవచ్చు. కాని వారిబోధనలు చాలా గమ్మత్తులు చేస్తాయనే విషయాన్ని వారు గుర్తుంచుకోవాలి. సమస్తమైన భారత ప్రజల్ని ఒకే తాటిమీద నడిపించేది సాంఘిక, రాజకీయ, మత, వ్యక్తిగత ఆదర్శాలనే విషయాన్ని మనం మరువరాదు. భారతీయులందరూ ఆరాధించే దేవతామూర్తులు వారిభావావేశాన్ని, భావ తాదాత్మ్యాన్ని

వారి ఆశయాల ఐక్యతను చాటుతాయి. అదేవిధంగా దేవాలయాల సందర్శన, తీర్థయాత్రలు చేయటం, ఉపాసాలు ఉండటం, దానధర్మాలు చేయటం, భజనలు చేయటం, భక్తితో ప్రసాదాన్ని స్వీకరించటం ఇత్యాది విషయాలు అన్ని మతాల్లోను ఉన్నాయి. కాని భారతీయుల దృక్పథంలో ఈ కార్యక్రమాల్లో ఒక విధమైన పవిత్రత ఉన్నది. ఆ పవిత్రతలో పాల్గొనాలని అందరూ ఆరాట పడతారు. ఇక్కడ తర తమ భేదాలను విస్మరిస్తారు. అందరూ భగవంతుని సమక్షంలో ఒక్కటే అని భావిస్తారు. అదే జాతి ఐక్యత. అదే మానవ సమానత్వం. అదే భక్తి భావానికి పరాకాష్ట. అంతే కాని, కొందరు భావించి నట్లు మత మౌఢ్యానికి మాత్రం ఉద్దేశించ లేదు.

ఇంత వరకు భారతజాతీయ జీవన స్రవంతిలోను, దర్శనశాస్త్ర రంగంలోను, మత విషయంలోను, నైతిక బోధనలలోను సమన్వయాన్ని సాధించడానికై సాహిత్య సంగీత పరంగా ఆంధ్రులు చేసిన అపారమైన కృషిని గురించి సంక్షిప్తంగా తెలుసుకొన్నాం. అయితే ఈ తాత్త్విక సమన్వయాన్ని, మత సామరస్యాన్ని ఏ ఏవ్యక్తులు ఏ ఏవిధంగా సాధించిందీ చూద్దాం.

జగద్విఖ్యాతి పొందిన ఆంధ్ర తాత్వికులను గురించి మాత్రమే ఇక్కడ రాయడం జరిగింది. ఆంధ్రదేశంలో పుట్టిన వారు, ఇక్కడ స్థిరనివాసం ఏర్పరుచుకొన్నవారు, ఇక్కడ దివంగతులైన వారు ఆంధ్రులని భావించి వీరిని గురించి సంక్షిప్తంగా మాత్రమే రాయడం జరిగింది. వారిలో అతి ముఖ్యులైన వారు:

1. ఆపస్తంబుడు : ధర్మశాస్త్ర కర్త
2. ఆచార్య నాగార్జునుడు : బౌద్ధమత ప్రవక్త
3. ఆర్య దేవుడు : బౌద్ధ తార్కికుడు
4. దిఙ్నాగుడు : బౌద్ధ దార్శనికుడు
5. ధర్మకీర్తి : బౌద్ధ తార్కికుడు
6. శాయనాచార్యుడు : వేదాలకు భాష్యం రాసినాడు

7. కుమారిల భట్టు : కర్మవాద
8. విద్యారణ్యుడు : అద్వైత వేదాంతి
9. అప్పయ దీక్షితులు : అద్వైత వేదాంతి
10. వల్లభాచార్యులు : భక్తి వేదాంతి (మధుర భక్తి)
11. కుంద కుందాచార్య : వేదాంతి
12. చిత్సుకాచార్య : అద్వైత వేదాంతి (విజయనగర నివాసి)
13. నింబార్కాచార్య : వేదాంతి
14. అన్నం భట్టు : తార్కికుడు
15. రాధాకృష్ణ పండితుడు : అద్వైత వేదాంతి
16. జిడ్డు కృష్ణమూర్తి : చైతన్య వాది
17. ఆచార్య పి. టి. రాజు : పాశ్చాత్య దేశాల్లో భారతీయ చింతన బోధకుడు
18. ఆచార్య సచ్చిదానంద మూర్తి : దార్శనిక సమన్వయ దృష్టి కలవాడు

వీరందరూ ఆంధ్రులే. వీరందరూ తత్త్వశాస్త్రాభివృద్ధికి, వికాసానికి తోడ్పడిన వారే. కనక వీరిని గురించి, వీరు బోధించిన తాత్వికాంశాలను గురించి సంక్షిప్తంగా తెలుసుకొందాం.

## ఆచార్య నాగార్జునుడు

మహా పురుషుల జీవితాలను గురించి, వారు చేసిన మహత్కార్యాలను గురించి, వారు సాధించిన విషయాలను గురించి, మానవుని అభ్యుదయం కోసం వారు చేసిన కృషినిగురించి అనేకమైన అభిప్రాయాలుండటం సహజం. అందుకే ఆచార్య నాగార్జునుని గురించి రాయాలంటే అంతతేలికైన పనికాదు. భారత దేశంలో, అందులో ముఖ్యంగా ఆంధ్రదేశంలో పుట్టి, మొత్తం ప్రపంచంచేత కొనియాడబడుతున్న తాత్త్వికుల్లో బుద్ధుని తరవాత నాగార్జునుని, శంకరుని

పేర్కొనవచ్చు. వారి ప్రతిభ, పాండిత్యం, తాత్విక ఆలోచన, వారి దర్శనాలు వారిని అంత గొప్పవారిగా చేశాయి.

ఆచార్య నాగార్జునుని జీవితాన్ని గురించి ముందుగా తెలుసుకొందాం. ఆ తరవాత ఆయన బోధించిన తత్వాన్ని గురించి తెలుసుకొందాం. నాగార్జునుని జీవితాన్ని గురించి మనకు ముఖ్యంగా మూడు రకాలైన వాటినుంచి తెలుస్తుంది. 1) సిద్ధుల చరిత్ర, 2) బౌద్ధ మతచరిత్ర, 3) బౌద్ధుల చరిత్ర గ్రంథాలు. ఇందులో కొన్ని టిబెటన్ భాషలోను, కొన్ని సంస్కృతభాషలోను, కొన్ని సింహళ భాష లోను ఉన్నాయి. ఈ ఆధార గ్రంథాలన్నీ చెప్పిన విషయాలను 'నేషనల్ బుక్ ట్రస్ట్' వారిచే ప్రచురింపబడిన "నాగార్జున" అనే గ్రంథంలో ఆచార్య సచ్చిదా నందమూర్తిగారు సంక్షిప్తంగా పొందుపరిచారు. ఆసక్తి పరులు ఆ గ్రంథాన్ని చదివినట్లయితే విషయాలు చాలా విపులంగా తెలుస్తాయి.

క్రీస్తుశకం 2వ శతాబ్దంలో శాతవాహనులు దక్షిణాపథాన్ని పరి పాలించారు. వీరు పాలించినదేశం నేటి మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా, కర్ణాటక రాష్ట్రాలు. వీరు అనేకమైన యుద్ధాలుచేసి తమ సామ్రాజ్యాన్ని విస్తరింపచేసారు. కొన్ని యుద్ధాల్లో ఓడిపోయి తమ రాజ్యంలో కొంతభాగాన్ని కోల్పోయారు. ఆ కాలంలో ద్రవిడ దేశంలో చేర, చోళ, పాండ్య రాజులు సుస్థిరమైన ప్రభుత్వాన్ని స్థాపించారు. దక్షిణాపథం, ద్రవిడదేశాలు ఆ రోజుల్లో ఎంతో అభివృద్ధిని సాధించి ఖండాంతరాలతో సముద్రంపై వర్తక వాణిజ్యాలను నిర్వహించేవి. అంతేగాకుండా గ్రీకుదేశంతోటి, రోమనులతోటి, చైనాతోటి వర్తక వ్యాపారాలు కలిగివుండేవి. వణిక్ ప్రభువులచే ఆదరింపబడి బౌద్ధ మతం బాగా అభివృద్ధిచెందింది.

శాతవాహనుల్లో గొప్పవాడైన గౌతమీపుత్ర శాతకర్ణి బౌద్ధమతాన్ని ఆద రించాడు. కుమారజీవుడు, హ్యూయన్‌సాంగ్ అనే వాళ్ళు నాగార్జునుని జీవిత చరిత్రను గురించి రాశారు. శ్రీ పర్వత ప్రాంతాల్లో ఒక బ్రాహ్మణ దంపతు లకు నాగార్జునుడు పుట్టాడు. అల్పాయుష్మంతుడు కనుక తల్లిదండ్రులఆదరణకు

నోచుకోలేదు. కాని "అపరిమితాయుర్ ధారిణి" మంత్రాన్ని ఒకసిద్ధుని వద్ద అభ్యసించి, దాదాపు 70 సం॥ జీవించాడు. బౌద్ధమతాన్ని స్వీకరించి ప్రజ్ఞా పారమిత గ్రంథాలనేకం రాశాడు.

హ్యూయన్‌సాంగ్ రచనలనుబట్టి, "బుద్ధచరిత"ను రాసిన అశ్వఘోషుడు, శాతవాహనుల్లో మరొక గొప్పరాజైన కనిష్కునికి సమకాలీనుడని తెలుస్తున్నది. అదేవిధంగా కనిష్కుడు–మరియు నాగార్జునుడుకూడా సమకాలీనులని తెలుస్తున్నది. అంతేగాకుండా కల్హణుని "రాజతరంగిణి" అనే గ్రంథంలో కూడా నాగార్జునుడు కనిష్కుని సమకాలీనుడని చెప్పటంజరిగింది. పరమార్థుడు అనే మరొక చరిత్రకారుని ప్రకారం నాగార్జునుడు గౌతమీపుత్రశాతకర్ణి, మరియు కనిష్కుని సమకాలీనుడు. ఈ ఆధారాలనుబట్టి నాగార్జునుని జీవితం క్రీ. శ. 50 నుంచి 120 సంవత్సర ప్రాంతాల్లో ఉండవచ్చునని అనేక మంది నిర్ధరించారు.

అనేకమైన సూత్రాలు, ముఖ్యంగా 'ప్రజ్ఞా పారమిత సూత్రాలు' 'విమలకీర్తి నిర్దేశసూత్రాలు', 'సదర్మ పుండరీక సూత్రం', 'అక్షయ మతి పరిపుచ్ఛసూత్రం, సూరంగమ సమాధిసూత్రం', 'దశభూమిక సూత్రం' 'కాశ్యప పరివర్త సూత్రం'–మొదలయిన మహాయాన సూత్ర గ్రంథాలు నాగార్జునుణ్ణి ప్రభావితం చేశాయి.

బౌద్ధ సంఘంలోను, బౌద్ధ ఆరామాల్లోను, బౌద్ధశాసనంలోను కొంత మార్పుతేవాల్సిన అవసరమున్నట్లు నాగార్జునుడు గ్రహించాడు. (అందుకే మహా బౌద్ధ శాసనంలోను కొంత మార్పుతేవాల్సిన అవసరమున్నట్లు నాగార్జునుడు గ్రహించారు.) అందుకే మహాయాన బౌద్ధంలో మాధ్యమిక దర్శనాన్ని ప్రవేశపెట్టి దానికి ఒక పటిష్ఠమైన రూపకల్పన చేశాడు, ఈ రూప కల్పన అంతా కొన్ని స్వతంత్రమైన రచనలద్వారానూ, కొన్ని సిద్ధాంతాలను విమర్శిస్తూనూ ఆయన సాధించాడు.

## నాగార్జునుడు రాసిన గ్రంథాలు

1. ఉపదేశం. ఇందులో 1,00,000 గాథలున్నవి.
2) బుద్ధమార్గాలంకారశాస్త్రం. ఇందులో ౬,000 గాథలున్నవి.
3) మహా కరుణోపాయశాస్త్రం. ఇందులో 5,000 గాథలున్నవి.
4) మాధ్యమికశాస్త్రం. ఇందులో 5,000 గాథలున్నవి.
5) అకుతోభయశాస్త్రం. ఇందులో 100000 గాథలున్నవి.
6) విగ్రహ వ్యావర్తిని
7) మహా ప్రజ్ఞాపారమిత శాస్త్రం
8) సుహృల్లేఖ
9) రత్నావళి
10) ప్రతీత్య సముత్పాద హృదయశాస్త్రం
11) ద్వాదశ ముఖశాస్త్రం
12) మహాయాన భవభేదశాస్త్రం
13) యుక్తిషష్ఠిక
14) బోధి సంభారశాస్త్రం
15) ధర్మధాతుస్తవం
16) సూత్ర సముచ్చయ

పైన చెప్పిన గ్రంథాల్లో కొన్ని టిబెట్ భాషలోను, కొన్ని చైనాభాష లోను, కొన్ని సంస్కృత భాషలోను ఉన్నాయి. కొన్ని గ్రంథాలు ఇతర దర్శనాలను విమర్శిస్తూ రాసినవి. కొన్ని ఆయన సిద్ధాంతాలను వివరించే గ్రంథాలు. కొన్ని భాష్యగ్రంథాలు. కొన్ని సూత్రాలు, ఉపదేశాలను సూచిస్తాయి. కొన్ని భక్తిని తెలుపుతాయి. కొన్ని ఆ రోజుల్లో ఉండే రాజులకు రాజనీతి, ధర్మ నీతిని, మానవధర్మాన్ని సూచిస్తూ రాసినవి.

## నాగార్జునుడు : బుద్ధుడు

బుద్ధుని అనంతరం బౌద్ధమతం ముఖ్యంగా రెండు శాఖలుగా చీలి పోయింది. అవి

1. హీనయానం (థేరవాదం)
2. మహాయానం

బుద్ధుడు బోధించిన విషయాలను మూలంలో మార్పులేకుండా అనేకమంది వ్యాఖ్యానించారు. ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన బౌద్ధశాస్త్రవేత్తల్లో ఆచార్య నాగార్జునుడు అత్యంత ప్రముఖుడు. అతిభౌతికశాస్త్ర విశ్లేషణలోను, తార్కికపటిమలోను, ఆధ్యాత్మికచింతనలోను, జగద్గురు శంకరాచార్యుల వారిని మినహాయిస్తే నాగార్జునునికి, బుద్ధునికి సాటి ఎవ్వరూలేరని చెప్పవచ్చు. మానవాళిని పట్టిపీడుస్తున్న సమస్యలకు పరిష్కారాన్ని కనుగొందామనే ఆలోచనతో వీరిద్దరూ తమ జీవితాన్ని గడిపారు. ధ్యానం ద్వారాను, అంతర్బుద్ధి ద్వారాను, జీవన విధానం ద్వారాను జటిలమైన సమస్యలకు సమాధానాన్ని కనుక్కొన్నారు. బుద్ధుని బోధనలను మార్గదర్శకంగా గ్రహించి వాటికి చక్కని తార్కిక రూపురేఖలను నాగార్జునుడు దిద్దినాడు.

మహాయాన బౌద్ధమత స్థాపనాచార్యుడుగా నాగార్జునుడు జగద్విఖ్యాతి పొందాడు. ఆయన కాలంలో లభ్యమైన వైదికవాఙ్మయం ఆయన జ్ఞానతృష్ణను తీర్చలేక పోయింది. ప్రపంచంలో ఉన్న దుఃఖం అనంతం. దారిద్ర్యం అనంతం. అసమానత్వం అనంతం. హైందవమత గ్రంథాలు స్థవిరవాద బౌద్ధ గ్రంథాలు వీటికి ఏవోకొన్ని పరిష్కార మార్గాలు చెప్పాయి. కాని బౌద్ధ వైపుల్య సూత్రాలను నాగార్జునుడు చదవడం తటస్థించింది. ఆ సూత్రాలు ఆయనకు ఒక జ్ఞాన జ్యోతిని ప్రసాదించాయి.

నాగార్జునుని దర్శనాన్ని 'మాధ్యమిక బౌద్ధ దర్శనం' అంటారు. అది భౌతిక వాదం కాదు, విజ్ఞాన వాదం కాదు. శూన్య వాదమూ కాదు. "భవః

స్వతంత్రోనాస్తి'' అన్నాడు నాగార్జునుడు. ప్రతిదీ పరస్పరాధారయుతంగా ఉంటుందనీ, ప్రత్యవేక్షణద్వారా పదార్థాల యథార్థ స్వరూపాన్ని తెలుసుకోవచ్చని అదే 'ప్రజ్ఞ' అని తెలిపాడు. అటువంటి ప్రజ్ఞాయుత జ్ఞానము పదార్థాలు నిత్య మనికానీ, అనిత్యమనికానీ, ద్రవ్యభూతమనికానీ, అద్రవ్యభూతమనికానీ తెలుపు తుంది. అటువంటి ప్రజ్ఞనే 'అద్వయం' అంటారు. ఈ అద్వయావస్థలో ప్రాజ్ఞుడు అస్తి–నాస్తి, సత్త–అసత్త, ఆత్మ–నైరాత్మల భావాలకు అతీతంగా ఉంటాడు.

బుద్ధీంద్రియాలకు గోచరంకాని పరమార్థ ధర్మం ఒకటి ఉన్నదని, అది అహేతుకని, అనిర్వచనీయమనీ, పరమశాంతియుతమనీ, చెప్పాడు నాగార్జునుడు. సర్వ భౌతిక ధర్మాలకు, మూలకాలకు అది అధారమని అది అచ్యుతమనీ, అనంతమనీ, స్వభావ, స్వరూప రహితమనీ ఆయన చెప్పాడు.

''పరమార్థ సర్వధర్మాణాం నిస్స్వభావతః ॥

కాని లౌకిక ప్రపంచంలోను, వైజ్ఞానిక ప్రపంచంలోను కనిపించేదంతా లోక సంవృత్తి అన్నాడు. సత్తకూడ ద్రవ్య, ధర్మగుణ, సంబంధ రహితంగా ఉంటుంది. కాబట్టి అదికూడా శూన్యమే అని చెప్పి శూన్యవాదాన్ని స్థాపించాడు.

అందువల్ల వ్యావహారికం–పారమార్థికం లేదా సంసారం, మోక్షం అనే సత్తలు లేవన్నాడు. ''సంసారమే మోక్షం''–''మోక్షమే సంసారం''. ఏది బుద్ధత్వమో అదే పునర్జన్మించేది అన్నాడు. ఏదయితే ఇంద్రియాలకు గోచరం కాదో అదే అనుభవేద్యం అవుతుందన్నాడు. సర్వ సంకల్పక్షయమే నిర్వాణ మన్నాడు. ఈ విధమైన సిద్ధాంతం ఇంతకుముందున్న సిద్ధాంతాలలాగ మరొక సిద్ధాంతం కాదన్నాడు. లేదా వాటి మాదరిగానూ లేదన్నాడు. వాటికి భిన్నం గానూ లేదన్నాడు.

''ముక్తిషః శూన్యతాదృష్టేః తదర్థ శేషభావనః ॥''

శూన్యమే సత్యములలోకెల్ల పరమసత్యం. అందులోకి ప్రజ్ఞద్వారా ప్రవేశించి అందులో ఉండటమే నిర్వాణం అన్నాడు.

## ఆచార్య ఆర్యదేవుడు (క్రీ.శ. 2-3వ శతాబ్దం)

నాగార్జునాచార్యుని శిష్యులలో ఆచార్య ఆర్యదేవుడు ప్రముఖుడు. ఇతని జీవితాన్ని గురించి అనేకమైన కథలున్నవి. కుమార జీవుని రచనల ద్వారా చైనాలో భద్రపరచబడిన గ్రంథాలద్వారా ఇతని జీవితాన్నిగురించిన విషయాలు మనకు తెలుస్తున్నవి. దక్షిణ భారతదేశంలో ఒక బ్రాహ్మణ కుటుంబానికి చెందిన వాడని కుమారజీవుడు తెలిపి ఉన్నాడు. కాని చైనా యాత్రికుడయిన హ్యూ యన్ సాంగ్ మరొక రకంగా చెప్పాడు. ఆర్యదేవుడు సింహళదేశపు యువరాజని హ్యూ యన్ సాంగ్ భావించాడు. ఇతని జీవితంలో ఆఖరి గడియలు గుంటూరు ప్రాంతంలో గడిపినందున, అక్కడ ఆయన అస్థికలు లభించినందువల్ల ఆయన ఆంధ్రుడని కొందరు అభిప్రాయపడ్డారు. అన్ని సంప్రదాయాలు ఇతన్ని ఆచార్య నాగార్జునుని శిష్యుడుగా అంగీకరిస్తాయి. దీనికి విరుద్ధంగా మరే సాక్ష్యాధారాలు లభించలేదు. కనక ఆర్యదేవునికాలం క్రీ.శ. 2-3 శతాబ్దాలుగా మనం నిర్ణయించవచ్చు. ఆంధ్రదేశంలో పుట్టి సింహళం వెళ్ళాడని కొందరు, సింహళంలో పుట్టి ఆంధ్రదేశంలో నివసించాడని కొందరు భావించారు.

ఒకానొక బౌద్ధ ఆరామంలో అశోకవృక్షం క్రింద ఆచార్య నాగార్జునుడు శిష్యులకు దర్శనశాస్త్ర విషయాలను బోధిస్తున్నప్పుడు ఆయన్ను చూడటానికి ఆర్యదేవుడు రావటం తటస్థించింది. అప్పుడు ఒక శిష్యుడు నాగార్జునుని వద్దకు వచ్చి ఆయన్ను చూడడానికి ఎవరోవచ్చారని చెబుతాడు. అప్పుడు నాగార్జునుడు ఒక గ్లాసునిండా నీరునింపి ఆర్యదేవునికి చూపమనిచెప్పి ఆ శిష్యుని పంపుతాడు. ఆ శిష్యుడు అట్లాగే చేస్తాడు. అప్పుడు ఆర్యదేవుడు అతి సుస్మితంగా ఒక సూదిని ఆ నీళ్ళగ్లాసులోవేసి దాన్ని ఆచార్య నాగార్జునునికి ఇవ్వమంటాడు. ఆ నీళ్ళపాత్రను చూసినవెంటనే నాగార్జునుడు సంతోషించి ఆర్యదేవుని తన శిష్యునిగా అంగీకరిస్తాడు. ఈ కథలోని ముఖ్యాంశం నాగార్జునుడు పంపిన నీళ్ళ పాత్రను జ్ఞానంతో పోల్చినట్లయితే అజ్ఞానపు లోతులకు తొణకకుండా చొచ్చుకొని పోగల మేధాశక్తి తనకున్నదని ఆర్యదేవుడు నిరూపిస్తాడు. నాగార్జునుడు

వృద్ధాప్యంలో ఉన్నందువల్ల అతను స్థాపించిన మాధ్యమిక బౌద్ధధర్మాన్ని వ్యాప్తి చేయవలసిందిగా ఆర్యదేవుని కోరుతాడు.

ఆర్యదేవుడు ఒక గొప్ప విజ్ఞానవేత్త. తార్కికుడు. ఆధ్యాత్మిక చింతనా సంపన్నుడు. ఇతను చతుశ్శతకము అనే గ్రంథాన్ని రాసాడు. ఈ గ్రంథంలో వైదిక కర్మకాండ నిరసన ముఖ్యంగా కనిపిస్తుంది. ఇదికాక "చిత్తవిశుద్ధి ప్రకరణం", ద్వాదశనికాయ శాస్త్రం" "హస్తతాక ప్రకరణం'' అనే గ్రంథాలనుకూడా రాశాడు.

ఆర్యదేవుడు బోధించిన తత్త్వస్వరూపం. బుద్ధత్వాన్ని పొందినవారు తమ సర్వజ్ఞత్వం చేత సమస్తజీవుల స్వభావాన్ని గుర్తించి వారివారి యోగ్యతలను బట్టి జీవులకు బహువిధాలుగా బౌద్ధధర్మాన్ని బోధిస్తారు. ఒకప్పుడు ఆత్మ లేదనీ, మరొకప్పుడు ఆత్మ ఉన్నదనీ బోధిస్తారు. మానవుని బుద్ధి లేదా మానవుని ప్రజ్ఞ పూర్తిగా వికాసం చెందనంతవరకు ఎవరూ నిర్వాణం పొందలేరు. తన గ్రంథాల్లో 'మధ్యమ మార్గాన్ని' సమర్థిస్తూ సాంఖ్య, వైశేషిక, జైన లోకాయత దర్శనాలను ఖండించాడు ఆచార్య ఆర్యదేవుడు.

## ఆచార్య ధర్మకీర్తి (క్రీ. శ. 600–700)

రాహుల్‌సాంకృత్యాయన్, ఇంకా రష్యాదేశపు తత్త్వవేత్త ష్చెర్బాట్స్కీ (STCHERBATSKY) ధర్మకీర్తిని గురించిరాస్తూ, ఇతన్ని భారతదేశపు 'కాంటు' (KANT) అని ప్రశంసించారు. ధర్మకీర్తి క్రీ. శ. 600–679 ప సంవత్సరాల్లో ఉన్నట్లు తెలుస్తున్నది. ఇతను తిరుపతిలో ఒక బ్రాహ్మణ కుటుంబాన పుట్టాడు. వేదవేదాంగాలను అభ్యసించిన తరవాత అతని కాలంలో ప్రచారంలో ఉన్న బౌద్ధమత ప్రభావానికి లోనయ్యాడు. నలందా విశ్వవిద్యాలయం వెళ్ళి అక్కడ ఆచార్య ధర్మపాలునివద్ద బౌద్ధదర్శనాన్ని బౌద్ధతర్కాన్ని అధ్యయనం చేశాడు. ఆ తరవాత బౌద్ధభిక్షువయ్యాడు. దిజ్ఞాగుని తర్కం,

బౌద్ధుల విజ్ఞానవాదం ఇతన్ని ప్రభావితం చేశాయి. ఆయన సిద్ధాంతాలుకూడా దిఙ్నాగునిపట్ల ప్రభావితమయ్యాయి.

## ధర్మకీర్తి రచనలు : తత్వం

ప్రమాణ శాస్త్రంలో ధర్మకీర్తి నిష్ణాతుడు. బౌద్ధ తర్కానికి ఒకరకమైన కీర్తిని తెచ్చినవాడు ధర్మకీర్తి. బౌద్ధధర్మానికి కీర్తిని తెచ్చినవాడు ధర్మకీర్తి, ఇతని రచనలు

1. ప్రమాణవార్తిక
2. ప్రమాణ నిశ్చయ
3. న్యాయబిందు
4. హేతుబిందు
5. సంబంధ పరీక్ష
6. వాదన్యాయం
7. సంతానాంతరసిద్ధి
8. ప్రమాణ వార్తిక
9. సంబంధ పరీక్ష వృత్తి

కార్యకారణ సంబంధవాదాన్ని గురించి, క్షణికవాదాన్ని గురించి, విజ్ఞానవాదాన్ని గురించి ఇతను ఏమిచెప్పింది తెలుసుకొందాం.

## క్షణికవాదం అంటే ఏమిటి ?

సర్వమూ అనిత్యం అనేది బౌద్ధమత లక్షణం. ఈ అనిత్యవాదాన్నే బుద్ధుని తరవాత వచ్చిన బౌద్ధతాత్వికులు క్షణికవాదంగా చెప్పారు. "ఏది భావ రూపమో అదంతా క్షణికం." ఇది బుద్ధ ప్రవచనం. ఈ విషయాన్నే ధ్రువ పరుస్తూ ధర్మకీర్తి ఈ విధంగాచెప్పాడు. దేనికి [illegible]త్తి స్వభావం (పదార్థం) మొదటఉండి తరవాత ఉండదో అది అనిత్యమన్నారు బౌద్ధులు. ఈ ప్రపంచంలో ఉండే పదార్థాలన్నీ ఈ అనిత్యతా ధర్మాని కలిగి ఉంటాయి.

## పరమార్థ సత్త అంటే ఏమిటి?

మానవబుద్ధికి ఇంద్రియాలకు అతీతమైన తత్త్వాన్ని గురించి విచారించటం అనవసరమని బౌద్ధులు భావిస్తారు. దీన్ని పురస్కరించుకొని పరమార్థ స్వరూపాన్ని గురించి ధర్మకీర్తి ఈ విధంగా చెప్పాడు. అర్థపంతమైన క్రియకు ఏది దోహదం చేస్తుందో అది పరమార్థసత్త. దానికి విరుద్ధంగా అర్థక్రియాకారిత్వానికి ఏది దోహదం చేయదో అది సంవృత సత్త లేదా కల్పితమైనసత్త. ఘటము, పటము మొదలైనవి సత్యాలు, ఎందుకంటే అవి అర్థక్రియాకారిత్వాన్ని కలిగి ఉన్నాయి. అట్లాకాకుండా సామాన్యాలు, జాతి సత్యాలు కావు. అంటే ఒకానొక ఆవుసత్యం. అంతేకాని ఆవుజాతి అనేది లేదు. అవన్నీ కాల్పనికాలు. జాతికీ, వ్యక్తికి తేడాఉన్నది. కానీ కల్పనచేత (సంవృతి సత్తచేత) వాటి నానాత్వం మరుగున పడిందో అప్పుడు అవన్నీ ఒకజాతిగా భావింపబడతాయి. అదేవిధంగా నాశనంకూడా అహేతుకం. క్షణికత్వం సర్వభావం (ధర్మం, పదార్థం)లలో స్వభావంగానే ఉన్నది. అందువల్ల నాశనంకూడా పదార్థాలకు స్వాభావికమే. అందువల్ల పదార్థాల నాశనానికి ఏదోఒక ప్రత్యేకమైన కారణం అవసరం లేదు.

## కారణ సమూహ వాదం

ప్రతి పనికి ఒకే కారణం ఉంటదు. అనేక కారణాల కలయిక వల్ల ప్రతి పని జరగుతుంటుంది. ప్రమాణ వార్తికలో కారణ సమూహ వాదాన్ని ధర్మకీర్తి ఈ విధంగా చెప్పాడు. "ఏవస్తువైనను ఒకే కారణం వల్ల ఉత్పత్తి కాదు. అనేక కారణాల సముదాయం వల్ల ఏర్పడుతుంది. కార్యాల స్వరూప స్వభావాల్లోఉన్న వైవిధ్యము ఆకస్మికంగా రాదు. కారణ సామగ్రి నుంచే ఆ వైవిధ్యం ఏర్పడు తుంది.

## మనస్సు-శరీరం: వాటి మధ్య సంబంధం

మనస్సు—శరీరం ఈ రెండూ పరస్పరాశ్రితాలా? లేదా వేరు వేరు

తత్త్వాలా? లేదా ఒకటేనా? అనే ప్రశ్నలు చాలా ముఖ్యమైనవి, బౌద్ధులు ఆత్మను అంగీకరించరు. దాని స్థానంలో మనస్సును, చిత్తాన్ని, విజ్ఞానాన్ని ప్రతిపాదించి వాటి ఉనికిని అంగీకరిస్తారు. ఈ మూడు పర్యాయ పదాలు మనస్సు శరీరం కాదు. అది శరీరాన్ని ఆశ్రయించుకొని ఉంటుంది. ఇంద్రియాలు మనస్సు కాదు. అవి కూడా శరీరాన్ని ఆశ్రయించుకొని ఉంటాయి. ఇంద్రియాలు లేనిది మనస్సుకు పని లేదు. ఈ ప్రకారంగా చూస్తే బుద్ధి, ఇంద్రియాలు అన్యోన్య హేతుకాలు. అట్లాగే మనస్సు—శరీరం కూడా అన్యోన్య హేతుకాలని తేలుతున్నది. అందు వల్ల మనస్సు—శరీరం పరస్పరాశ్రితాలై అవినాభావ సంబంధాన్ని కలిగి ఉంటాయి. మనస్సు ఎప్పుడూ శరీరం కంటే భిన్నం కాదు. అది శరీరం అంశమో (భాగమో) లేదా మనస్సు—శరీరం రెండూ భౌతిక తత్త్వాల వికాసాలు. అందు వల్ల ఆరెండిటి తత్త్వంలో మౌలిక మైన భేదమేదీ లేదనీ (శరీరంలో నుంచి మనస్సు) అంటే పంచ భూతాల నుంచి చైతన్యం, చైతన్యమే భూత మనే పర్యవసానాన్ని ధర్మకీర్తి అంగీకరించాడు.

మరియు ప్రాణం, అపానం, ఇంద్రియాలు, బుద్ధి ఎట్లా ఉత్పన్నమవుతాయి? ఈ ప్రశ్నకు ధర్మకీర్తి ఈ విధంగా సమాధానం చెప్పాడు. తమతో సజాతీయ మైన పూర్వకారణమున్నప్పుడే ఇవి ఉత్పన్నమవుతాయి. కేవలం శరీరమున్న ప్పుడే ఇవి ఉత్పన్నం కావు. ప్రాణం, అపానం, బుద్ధి, ఇంద్రియాలు ఉన్న శరీరంనుంచే ప్రాణాపాన బుద్ధీంద్రియాలున్న శరీరం ఉత్పన్న మవుతుంది కాని, ఇవి లేని శరీరంనుంచి, శరీరం ఉన్నప్పటికినీ, మరొకశరీరం ఉత్పన్నం కాదు. ఈ నియమాన్ని అంగీకరించకపోతే అనేకమైన చిక్కులువస్తాయి. చని పోయిన శరీరంకూడా ఉత్పాదనశక్తినీ కలిగి ఉండాలి. కాని అట్లాలేదు. కనక ఏ భూతంలోనుంచైనా మరొక భూతం ఉత్పన్నంకాదు.

## ఆత్మవాద ఖండన : భగవన్నిరాకరణ

చార్వాక, బౌద్ధ దర్శనాలు తప్ప మిగతా దర్శనాలన్నీ ఆత్మను అంగీక రించాయి. అది ఒక నిత్యసత్యమైన పదార్థమని అందరూ అంగీకరిస్తారు.

అటువంటి నిత్యసత్యమైన ఆత్మను బౌద్ధులు అంగీకరించక పోయినప్పటికినీ క్షణక్షణం కాలప్రవాహంలో మార్పుచెందుతూఉండే చైతన్యాన్ని బౌద్ధులు అంగీకరిస్తారు. దీన్నే 'సంతానాంతరసిద్ధి', 'స్కంధ సంతానమని', ప్రవాహశీల చైతన్యంఆని బౌద్ధులు వ్యవహరించారు. ఈ విజ్ఞాన సంతతి ఒక శరీరంనుంచి మరొక శరీరానికి పోతూఉంటుంది. ఈ విధంగా అది నిత్యం, క్షణికంకూడా. విద్యుత్‌కన్నా, కాంతికిరణం కన్నా ఎక్కువ వేగంగా ప్రవహించి మార్పుచెందే చిత్త ప్రవాహాన్ని బౌద్ధులు అంగీకరించారు.

అదేవిధంగా భగవంతుడున్నాడని, ఆయన నిత్యుడని, శాశ్వతుడని చెప్పే వాదాన్ని బౌద్ధులు అంగీకరించరు. ఆత్మవాద ఖండన, ఈశ్వరనిరాకరణ బౌద్ధుల దర్శన లక్షణం. వారి ధ్యేయంకూడా అదే. కార్యకారణ సంబంధ వాదాన్ని ఆధారం చేసుకొని ఆత్మనిరాకరణ, ఈశ్వరవాద ఖండన చేశాడు ధర్మకీర్తి.

## శాయనాచార్యుడు (క్రీ.శ. 1282–1386)

విజయనగర సామ్రాజ్యానికి ప్రధానమంత్రి అయిన మాధవవిద్యారణ్యుని సోదరుడు శాయనాచార్యుడు. మాధవ విద్యారణ్యుడు, శాయనాచార్యుడు కలసి స్మార్తంలోను, వేదాంతంలోను, ధర్మశాస్త్రంలోను, మీమాంసా దర్శనంలోను, జ్యోతిష, వ్యాకరణశాస్త్రల్లోను అనేకమైన గ్రంథాలను రాశారు.

శాయనాచార్యుడు రాసిన ఋగ్వేద భాష్యం ఒక అమూల్యమైన గ్రంథం. వేద మంత్రాల అర్థాలను నిర్ణయించడంలోను, వేద సూక్తులను వివరించడంలోను ఇతని భాష్యానికి సరితూగే గ్రంథంలేదు. ఇతని తరవాతవచ్చిన భాష్యకారులు, వ్యాఖ్యాతలు ఇతను చెప్పిన విషయాలను, అర్థాలను అంగీకరించడమే గాక, ఏఏ సందర్భాల్లో ఏ పదాన్ని ఏ విధంగా ప్రయోగించాల్సిందీ, ఏ పదం ఏ విధమైన అంగీకృతమైన అర్థాన్ని కలిగిఉన్నదీ తెలుపడానికై శాయనభాష్యం మీద ఆధారపడ్డారు

ఋగ్వేద భాష్యం రాయడానికి శాయనాచార్యులవారికి ఉన్న అర్హతను ప్రశ్నించిన వారు లేకపోలేదు. భారతీయ దర్శనశాస్త్రంతో ఆసక్తిని కనపరచిన పాశ్చాత్యులు కొందరు ఈ సమస్యను లేవనెత్తారు. ఋగ్వేదాన్ని అనువాదం చేసిన జర్మనులు, బ్రిటిషువారు భిన్నమైన రెండు అభిప్రాయాలను వ్యక్తం చేసారు. ఉదాహరణకు ప్రొఫెసర్ విల్సన్ అభిప్రాయాన్ని చూద్దాం. గురుశిష్య సంప్రదాయపద్ధతులు, శాయనాచార్యుని కాలంలో ఆయనకు లభ్యమైన భాష్యాలు, భాష మరొకరికి ఎవ్వరికీ లభ్యంకానందువల్ల, ముఖ్యంగా పాశ్చాత్య అనువాదకులకు అందుబాటులో లేనందువల్ల, శాయనాచార్యుడు రాసిన ఋగ్వేదభాష్యం పరమ ప్రామాణిక గ్రంథమని విల్సన్ భావించాడు.

కాని జె. మ్యూర్ **(J MUIR)** దృష్టిలో శాయన భాష్యంలో కొన్ని క్లిష్టమైన విషయాలున్నవి. కొన్ని విషయాలను శాయనుడు స్పష్టంచేయలేదు. వాటిని దాటవేసాడు. ప్రొఫెసర్ రాత్ **(ROTH)** సెయింట్ పీటర్స్‌బర్గ్ నిఘంటువుకు పీఠికరాస్తూ అందులో ఈ విధంగా రాసాడు. ''వైదిక వాఙ్మయాన్ని గురించి తెలుసుకోవాలంటే భాష్యకారులు తప్ప మరొక మార్గదర్శకులు లేరు. అదే మార్గంలో పయనించి అన్వేషించే వారికికూడా కొన్ని నూతన సత్యాలు లభిస్తాయని భావించవచ్చు. కనక శాయనాచార్యుడు ఋగ్వేదాన్ని ఎట్లా అర్థం చేసుకొని రాసాడో అట్లాగే పాశ్చాత్య భాషాశాస్త్రజ్ఞులుకూడా శాయనాచార్యుని మార్గ దర్శిగా పెట్టుకొని సరైన పంథాలో పోయినట్లయితే ఆయన కన్న కొన్ని విషయాలను అధికంగా చెప్పినవారే అవుతారు''.

మాక్స్‌ముల్లర్ దృష్టిలో శాయన భాష్యం చాలా హేతుబద్ధంగా ఉన్నది. స్వతంత్ర భావాలకు శాయనభాష్యంలో తావులేదు. చిరకాలంగా మార్పులేకుండా వస్తున్న భారతీయ సంప్రదాయపు విలువలకు, కాలక్రమేణా మారుతూ వస్తున్నటువంటి విలువలకు శాయనాచార్యుడు సజీవమైన ఒక వారధి వంటివాడు. ఈ అభిప్రాయాన్ని ప్రొఫెసర్ బెన్ఫీ తెలిపాడు. ప్రొఫెసర్ గోల్డ్‌స్టికర్ **(GOLD STICKER)** మరొకరకమైన అభిప్రాయాన్ని తెలిపాడు. శాయనా

చార్యులు రాసిన భాష్యం సహాయం లేకుండా, అందులో ఉన్న విపులార్థాల సహాయం లేకుండా వేదాన్ని అర్థం చేసుకోవడం సాధ్యంకాదు. శాయనాచార్యుని కన్నా పాశ్చాత్య తత్త్వవేత్తలు వేదాన్ని బాగా అర్థంచేసుకోగలరనే భావాన్ని ఆయన తోసిపుచ్చాడు. శాయన భాష్యాన్ని వదలి వేదానికి మరొక నూతనార్థాన్ని చెప్పలేమన్నాడు గోల్డు స్టికర్.

ఇ. బి. కోవల్ (E B COWELL) దృష్టిలో మధ్యయుగంలో ఉన్న మహర్షుల్లో శాయనా చార్యులు అగ్రగణ్యుడు. అతి ప్రాచీనమైన దార్శనిక విలువలను మధ్యయుగం ప్రతిబింబించినట్లయితే ఆ ప్రతిబింబానికి శాయనాచార్యుని కృషే నిదర్శనం. గ్రిఫ్త్స్ (GRIFFTHS) ఋగ్వేదాన్ని ఇంగ్లీషు భాషలోకి అనువాదంచేస్తు ఈ విధంగా చెప్పాడు. శాయనా చార్యులు చిరస్మరణీయుడు. వేదాన్ని అర్థంచేసుకోడానికి ప్రథమ మార్గదర్శి. ఈయన భాష్యం అత్యంతమైన విలువకలది. అది ఆంధ్రులకు గర్వకారణం.

## అప్పయ్య దీక్షితులు (క్రీ. శ. 1553–1625)

ఈ మహా విద్వాంసుడు క్రీ.శ. 1553 వ సం॥లో వేలూరిజిల్లా అడయపాలెంలో జన్మించాడు. తండ్రి రంగరాజమణి. వేలూరురాజగు చినబొమ్మరాజు కొలువులో ఆస్థానవిద్వాంసుని పదవిని అలంకరించాడు. ఆ రాజు ఈయన విద్వత్తుకు మెచ్చి కనకాభిషేకం చేసినట్లు శాసనం లభించింది. సిద్ధాంత కౌముదిని వ్రాసిన భటోజీ దీక్షితులు ఇతని శిష్యుడు. శైవ—వైష్ణవ మతాల వివాదాలను పరిష్కరించటానికి పాండ్యరాజైన తిరుమల నాయకునిచే పిలువబడినవాడై ఆయా మతాల మధ్యనున్న వివాదాలను పరిష్కరించాడు. ఇదే ఇతని ప్రతిభకు నిదర్శనం. అంతేగాకుండా ఆ రోజుల్లో శైవ-వైష్ణవ మతాల సామరస్యానికి ఎంతో కృషిచేసాడు అప్పయదీక్షితులు.

నీలకంఠాచార్యుడు రాసిన బ్రహ్మసూత్ర భాష్యంపై "శివార్క మణి దీపికా వ్యాఖ్య" అనే గ్రంథాన్ని, శంకరులు రాసిన భాష్యానికి టీక అయిన

"బామతి" అనే గ్రంథంపై "పరిమళవాఖ్య" అనే గ్రంథాన్ని అప్పయదీక్షితులు రాసారు. అంతేగాక శంకరుని అనంతరం అద్వైతమత వ్యాప్తికి ఈయన చేసినకృషి అమోఘం. "సిద్ధాంతలేశ సంగ్రహ" అనే గ్రంథాన్ని, న్యాయ శాస్త్రం. అలంకారశాస్త్రం, మీమాంసా శాస్త్రాలపై అనేక గ్రంథాలను రాశాడు.

## ముకుందా చార్యులు

ద్రావిడాంధ్రదేశంలో (అంటే కర్ణాటక ప్రాంతంలో) విక్రమశకం ప్రథమ శతాబ్దంలో ఈయన జన్మించాడు. ఇతను జైనమత దిగంబరుడు. దక్షిణ భారతదేశంలో జైన మతాన్ని సముద్ధరించిన వారిలో ఈయన ప్రముఖుడు. 'నియమసారం', 'సంచాస్తికాయ సమయసారం', 'ప్రవచన సారం' అనే గ్రంథాలను రాశాడు. ఆంధ్ర కర్ణాటకల్లో జైనమతోద్యమాన్ని స్థాపించి, దాన్ని విస్తృతి చేసినకీర్తి ఈయనకు దక్కుతుంది.

## నింబార్కాచార్యులు

నింబార్కాచార్యుడు తెలుగునాడులో దేవనది అనే నామాంతరంగల గోదావరి నదీతీరంలో సుదర్శన గృహస్థాశ్రమంలో పుట్టినట్లు తెలుస్తున్నది. ఇతని గ్రంథాల్లోని అంతరంగికమైన విషయాలనుబట్టి ఇతను మధ్వాచార్యుల తరవాత జన్మించినట్లు తెలుస్తున్నది. ఇతను రచించిన బ్రహ్మసూత్ర వ్యాఖ్యానానికి "వేదాంత పారిజాత సౌరభము" అనిపేరు. తన సిద్ధాంతాన్ని 'దశశ్లోకి' అనే పదిశ్లోకాల పరిమితి గల గ్రంథంలో అతి నైపుణ్యంతో రాశాడు. 'మాధ్వముఖ మర్ధనము', "సర్వశేష నిర్విశేష శ్రీకృష్ణ రాజ స్తవము" అనే స్తోత్ర గ్రంథాలనుకూడా రాశాడు.

నింబార్కుని దర్శనంలో శ్రీకృష్ణుడే పరమతత్త్వం. భగవంతునికి సమానులయిన వారుకాని, అధికులుకాని ఎవ్వరూలేరు. ప్రపంచానికి నిమిత్తకారణం, ప్రధాన కారణం అన్నీ భగవంతుడే. అందువల్ల భగవంతుడు సర్వాతీతుడుగాను, సర్వాంతర్యామిగాను ఉంటాడు. భగవంతుని పరిణామమే ప్రపంచం.

ఈ ప్రపంచం మాయకాదు. ఇది పరమేశ్వరుని శక్తినుంచి బయల్పడుతుంది. ఇతని దర్శనంలో ప్రపంచం—భగవంతుడు పరస్పరాధారాలు. అంటే, భగవంతుడు లేకుండా కేవలం భౌతిక ప్రపంచం లేదు. భౌతిక ప్రపంచం లేకుండా కేవలం భగవంతుడు లేడు. ప్రపంచ స్వరూపం మూడు విధాలుగా ఉంటుంది. అవి

(1) ప్రాకృతం
(2) అప్రాకృతం
(3) కాలం

ఇవికాక జీవుడు, భగవంతుడూ యథార్థాలు. వీటిసంయోగ వియోగాలు నిరంతరం జరుగుతూనే ఉంటాయి.

## శ్రీ జిడ్డు కృష్ణమూర్తి (క్రీ. శ - 1895)

శ్రీ జిడ్డు కృష్ణ మూర్తి క్రీ.శ. 1895 లో మదన పల్లిలో జన్మించాడు. బాల్యంలోనే అనిబిసెంట్ బోధనలచే ప్రభావితుడయ్యాడు. అంతే గాకుండా అనిబిసెంట్ ఇతనిని దత్తత తీసుకొనెను. కృష్ణమూర్తి సోర్‌బోరన్ విశ్వవిద్యాలయంలో ఫ్రెంచి, సంస్కృత భాషలను అభ్యసించాడు. అనిబిసెంట్ స్థాపించిన థియొసాఫికల్ సొసైటీ (దివ్యజ్ఞాన సమాజము) కి శ్రీ కృష్ణమూర్తిని 1911లో అధ్యక్షుడుగా నియమించెను. ఆనాటి నుంచి శ్రీ కృష్ణమూర్తిని ఒక ప్రబోధకునిగా ప్రజలు గుర్తించారు. అనేక దేశాలు పర్యటించి, అనేక ప్రసంగాల ద్వారాను, పుస్తక రచనల ద్వారాను, తాను విశ్వసించిన జ్ఞానాన్ని ఇతరులకు బోధిస్తూ ఉండెను. కాని అనిబిసెంటు స్థాపించిన సమాజాన్ని 1929 లో రద్దు చేస్తున్నట్లు ప్రకటించి, దివ్యజ్ఞాన సమాజంతో తనకున్న సంబంధాలను వదలుకొన్నాడు. సత్యాన్ని గ్రహించాలంటే మానవునికి పూర్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అవసరమన్నాడు. ఒకే మార్గాన్ని కాని, ఒకే సిద్ధాంతాన్ని కాని అంటి పెట్టుకొని ఉండక పోవడమే స్వేచ్ఛ అన్నాడు.

ప్రపంచంలోని దుఃఖం, అసమానత్వం బాధలకు మానవ మనస్సే కారణమని చెప్పాడు. వీటి నివారణకు జ్ఞానం అవసరమన్నాడు. వేదాంత దర్శనం, స్థవిరవాద బౌద్ధమతం చేత ప్రభావితుడయ్యాడు. మన మనస్సు చాలా విచిత్ర మైన దంటాడు కృష్ణమూర్తి. అది చేసే ఆలోచనా పరిధినుంచి, అది వాంఛించే కోరికల నుంచి, మనం బాహ్యంగా ఉంటే సుఖం, దుఃఖం అనే విరుద్ధ విషయాలు మనలను పీడించవంటాడు. ఈ విముక్తే మానవులు కోరదగిన విషయం. దీన్ని ఏపేరుతో పిలిచినా పర్వాలేదు.

ఈ మనో నిగ్రహాన్ని సాధించేది ఎట్లా? మన మనః ప్రవృత్తిని పూర్తిగా సమర్థింపనూ రాదు, పూర్తిగా నిరాకరింపనూ రాదు, మన మనస్సులో జరిగే మానసిక ప్రక్రియలను అర్థం చేసుకొని, ఆయా భావాలతో మనం తాదాత్మ్యం చెందక, వాటిని నిందించి, నిరాదరింపకుండా, వాటి ప్రభావానికి బాహ్యంగా ఉండటం వల్ల మనో నిగ్రహం లభిస్తుందంటాడు కృష్ణమూర్తి. ఇక్కడ సాధనం, లక్ష్యం రెండూ ఏకమవుతాయి.

మన మనస్సు లోనే విరుద్ధ భావాలు ఏర్పడుతాయి. సత్యం, స్వేచ్ఛ, మన మనస్సు ఆధీనంలో లేవు. అసత్యం, బంధం మన మనస్సు ఆధీనాలు. మన మనస్సు విభిన్న మైన దృక్పథాలను సృజిస్తుంది. అక్కడే భావవైరుధ్యం ఏర్పడుతుంది. అప్పుడు వేదనకు, దుఃఖానికి తావున్నది, వాంఛా ప్రవృత్తి ఏర్ప డుతుంది. మన మనో పరిధిలో అనేక మైన సంకల్ప, వికల్పాలు ఏర్పడుతాయి. ఇవన్నీ ఉన్నప్పుడు ద్వైతానికి తావుంటుంది ఇవి లేనప్పుడు అద్వైతానికి తావుంటుంది. అప్పుడు మనస్సు శూన్య స్థితిలో ఉంటుంది. ఆ శూన్యస్థితిలో వేదనలు పోయి నిరాశ వైరాగ్యం ఉదయిస్తాయి. అదే మానవ జీవితం లక్ష్యం. మనశ్శాంతి అత్యున్నత మైన దశ అంటాడు శ్రీ కృష్ణమూర్తి.

# ఇస్లాం దర్శనం

భారతీయ దర్శనశాస్త్ర చరిత్రలో ఇస్లాం మత ప్రభావాన్ని తక్కువ అంచనా వేయరాదు. దాదాపు 7 లేక 8 శతాబ్దాల పాటు భారతదేశాన్ని పరిపాలించింది, మహమ్మదీయులనే విషయాన్ని విస్మరించరాదు. ఈ కాలంలో జరిగిన మత సమ్మేళనం, భావమిశ్రమం, సాంస్కృతిక మార్పిడి భారత జాతి జీవన విధానాన్ని ప్రబావితం చేసిందని చెప్పవచ్చు, మతసామరస్యత, విశాలదృక్పథం, జాతి సమైక్యతా భావాలను పాఠకుల్లో పెంపొందించాలనే ఆశయంతో ఇస్లాం దర్శనాన్ని పరిచయం చేయడమయింది.

## ఇస్లాంమతం : చారిత్రక-సాంస్కృతిక-మత సంఘటనలు

ఏవిధమైన సంఘటనల ద్వారా ఇస్లాం తన ప్రభావాన్ని భారత జాతీయ స్రవంతిపై చూపిందో కింది పట్టిక తెలుపుతుంది.

| కాలం | సంఘటన |
|---|---|
| క్రీ. శ. 570–632 | ప్రవక్త మహమ్మదు జీవితం |
| 711–715 | మహమ్మద్ ఇబిన్ కాశిం నాయకత్వంలో సింధు దేశంపై అరబ్బుల దండయాత్ర. |
| 962 | గజనీ మహమ్మదు చేత తురుష్క–టర్కిష్ సామ్రాజ్య స్థాపన భారతదేశంలో |
| 963 | కాబూలు గజనీకి వశంకావటం. |
| 999–1026 | గజనీ మహమ్మదు భారత దేశంపై దండెత్తటం. |

| | |
|---|---|
| 1021 | లాహోరులో గజనీ రాజ్య స్థాపన |
| 1040 | సల్జూకుల రాజ్యాన్ని గజనీ కోల్పోవటం |
| 1151 | ఘోరీల సామ్రాజ్యం ఆరంభం |
| 1186 | ఘోరీలు లాహోరును ఆక్రమించటం గజనీ సామ్రాజ్య పతనం |
| 1192 | పృథ్వీరాజ్ ఓడిపోవటం. ఢిల్లీ ఘోరీల వశంకావటం |

## ఢిల్లీ సుల్తానుల పరిపాలన

| | |
|---|---|
| 1211—1136 | ఢిల్లీలో ప్రథమంగా ఈల్‌తుట్‌ముష్ పరిపాలన |
| 1266—1287 | ఢిల్లీలో బాల్బన్ రాజ్యం స్థాపించటం |
| 1296—1316 | అల్లాఉద్దీన్ ఖిల్జీ రాజ్యం ప్రారంభం |
| 1306—1310 | దక్షిణ భారత దేశాన్ని ఢిల్లీ సుల్తానులు జయించటం దక్కనుపీఠభూమిలో బహమనీ సుల్తానులు రాజ్యం స్థాపించటం |
| 1325—1351 | సుల్తాన్ మహమ్మద్ బీన్ తుగ్లక్ సామ్రాజ్య స్థాపన |
| 1351—1388 | ఫిరోజ్‌షా తుగ్లక్, ఢిల్లీసుల్తానుల పతనం |
| 1398—1399 | భారత దేశంపై తైమూరు దండెత్తటం, ఇస్లాం చిన్న చిన్న రాజ్యాలుగా విడిపోవటం |
| 1451—1526 | ఢిల్లీని లోడీలు ఆక్రమించటం |
| 1469 | గురునానక్ జన్మించటం |
| 1504 | కాబూలును బాబర్ జయించి ఆక్రమించటం |

# మొగలాయీ సామ్రాజ్యస్థాపన

| | |
|---|---|
| 1526 | పానిపట్ యుద్ధం, లోడీల పతనం ఢిల్లీ సింహాసనము మొగలాయీల వశంకావటం |
| 1556 | అక్బరు పరిపాలన |
| 1569—1586 | గుజరాత్, చిత్తూర్, బెంగాల్, కాశ్మీర్ దేశాలు మొగలాయీల వశంకావటం |
| 1600 | ఈస్టిండియా కంపెనీ ప్రవేశానికి అనుమతి లభించటం |
| 1605—1627 | జహంగీరు పరిపాలన |
| 1627—1658 | షాజహాన్ పరిపాలన |
| 1651 | హుగ్లీలో ఈస్టిండియా స్థావరం ఏర్పరచుకొనటం |
| 1667—1668 | దారాషికో—ఔరంగజీబుల మధ్య అంతర్యుద్ధం ఔరంగజీబు సింహాసనాన్ని ఆక్రమించటం ఆయన పరిపాలన |
| 1707 | ఔరంగజీబు మరణం |
| 1739 | నాదిర్‌షా ఢిల్లీని ఆక్రమించటం |
| 1757 | ప్లాసీయుద్ధం మొగలాయీ సామ్రాజ్య పతనం |

ఇస్లామీయులు, మహమ్మదీయులు, అరబ్బులు, గజనీలు, ఘోరీలు, తురుష్కులు, మొగలాయీలు దాదాపు 7 లేక 8 శతాబ్దాల పాటు భారతదేశాన్ని పరిపాలించారు. వారి పరిపాలన కాలంలో భారత జాతీయ జీవన విధాన స్రవంతిలో సృజనాత్మక మైన మార్పులను వారు ఏమి చేశారు? వారి ప్రభావం భారతదేశం మీద ఏవిధంగా ఉన్నది? ఈ ప్రశ్నలకు సమాధానం కావాలంటే మొగలాయిలు రూపొందించిన దేశసంస్కృతి, నాగరికతను, మత తత్త్వాన్ని గురించి తెలుసు కోవాలి. పరిపాలనా యంత్రాంగంలో వారు ఎట్లాంటి మార్పులను ప్రవేశ పెట్టినారు? రాజకీయ, ఆర్థిక, సాంఘిక, నైతిక, మత, సాంస్కృతిక, కళలు

వైజ్ఞానిక రంగాలు, దైనందిన వ్యవహారాలు మొదలయిన వాటిల్లో వారు చేసిన కృషి ఏమిటి? భారతదేశం వీటన్నిటికి ఏవిధంగా స్పందించింది? వారు సాధించిన ప్రగతి ఏమిటి? అసలు అన్ని వందల సంవత్సరాలు భారతదేశాన్ని వారు ఎట్లా పరిపాలించ గలిగారు ?

మతాన్ని, మత భావాలను, మతావేశాన్ని ఆధారం చేసుకొని భారత దేశంలో ఇస్లాంను స్థాపించడం జరిగింది. మానివుని కన్నా అతీత మైన మరొక మహత్తరమైన శక్తి ఉన్నదని ఇస్లాం అంగీకరిస్తుంది, ఆశక్తి అధీనంలో మానవుడు ఉంటాడు. ఆశక్తికి విధేయతగా సర్వమానవులు ఉండాలని ఇస్లాం శాసిస్తుంది మానవుడు భూమి మీద ఉండటానికి కారణం, మానవ జీవిత ధ్యేయం అంతా కూడా భగవంతుని శరణుజొచ్చి ఆయన సర్వశక్తి వంతుడని గ్రహించి ఆయన్ను ఆరాధించి తరించడమేనని ఇస్లాం చెబుతుంది. ప్రపంచ ప్రయోజనం కూడా అంతే. భగవంతుని ఆరాధించి మోక్షాన్ని పొందడానికే ప్రపంచం పనికి వస్తుంది. ఈ ప్రపంచాన్ని ఎంతగా జయిస్తే అంతగా భగవంతుని సంతృప్తి పరచవచ్చు, అది లేనప్పుడు మానవసంఘానికి, మానవ జీవితానికి విలువే లేదని ఇస్లాం చెబుతుంది. ధర్మయుద్ధాన్ని, మత యుద్ధాన్ని చేయమని ఇస్లాం శాసిస్తుంది. మానవ జీవితానికి భగవంతుడు ఏర్పరచిన ఆశయాల్లో ఇదొకటి. ఈ ప్రపంచం మిథ్యాకాదు. మాయకాదు. ఈ ప్రపంచాన్ని స్వర్గతుల్యంగా కానీ, నరక తుల్యంగా కానీ చేయవచ్చు. మానవ జీవితం పాపభూయిష్టం కాదు. పాపం చేసినందు వల్ల మానవులు భూమి మీద పుట్టలేదు. భగవంతుని ఆరాధించడానికి, ఆయన్ను సేవించి తరించడానికి మానవ జన్మ ఒక పెద్ద అవకాశమని ఇస్లాం భావిస్తుంది.

అందువల్ల ఈ ప్రపంచంలోని విలువలన్నీ మానవుల చేతనే కల్పింప బడ్డాయని ఇస్లాం భావించదు. కేవలం తన అవసరాలను తీర్చుకొనేందుకే మానవుడు భూమిమీద ఉండడు. మానవుడు తన అవసరాలను తన ఇష్టమొచ్చినట్లు తీర్చుకోవచ్చునని ఇస్లాం బోధించదు. మానవుని పరమ ధ్యేయం అంతా భగవంతుని అధీనంలో ఉంటుంది. మానవుని విశ్వాసాలు, నమ్మకాలు, అతని జీవన విధానం, మానవుడు ఏవిధంగా జీవించాలి, ఆయన నడవడి, మొదలయిన

విషయాలన్నింటినీ భగవంతుడే నిర్ణయిస్తాడు. భగవంతుని యందు సేవాసక్తిని కలిగి ఉండటమే ముస్లిముల జీవితాశయం. సమస్తమైన శాస్త్రాలు భగవంతుని గురించి చెబుతాయని మధ్య యుగంలోని ఇస్లాం వేత్తలందరూ భావించారు. భగవంతునిచే పరిపాలింప బడుతున్న ప్రపంచంలో తాముంటున్నామనీ, ఆయన నామస్మరణ చేయనిదే ఏవిధమైనపని చేయకూడదని ఇస్లాం వేత్తలందరూ అంగీకరించారు.

# ఇస్లాం సంప్రదాయం

## కోరాను అవిర్భావం

ఇస్లాం మతస్థులకు కొరాను పరమ ప్రామాణిక గ్రంథం. దీన్ని అల్లా తగిన రీతిలో అర్హులైన వారికి అరబిక్ భాషలో దేవదూత యగు గేబ్రిల్ ద్వారా ప్రవక్త యగు మహమ్మదుకు క్రీ.శ. 610వ సంవత్సరంలో శృతి ప్రమాణంగా అందిచ్చాడు. దీని మాతృక స్వర్గంలో సురక్షితంగా ఉన్నది.

ప్రవక్త చేసిన బోధనలను, ఆయన చెప్పిన విషయాలను గుర్తుంచుకోవడం జరిగింది. రాతి మీద చెక్కడం జరిగింది. తాటి ఆకుల మీద రాయడం జరిగింది. ప్రవక్తమరణాంతరం మూడోవ ఖలీఫా ఉథ్మాన్(644–655) క్రీ.శ. ఆధ్వర్యంలో ప్రవక్త బోధనలను 144 సురల కింద సమకూర్చి ప్రమాణ గ్రంథంగా రూపొందించడం జరిగింది. ముస్లింలతాత్త్విక చింతన అనేక రకాలుగా చీలి పోయినప్పటికినీ ప్రతిశాఖ వారు 'కొరాన్ను' ప్రమాణ గ్రంథంగా అంగీకరించారు. అన్ని శాఖల వారు వారి వారి సిద్ధాంతాలకు కొరానే ప్రమాణమన్నారు. అనంత మైన కాల ప్రవాహంలో ఇస్లాం మతస్థు లందరికీ కొరాను పరమ పవిత్ర మైన గ్రంథంగానూ, వారి జీవిత విధానానికి పరమ ప్రామాణికమైన గ్రంథంగానూ నిలిచి పోయింది.

కొరాను భగపంతుని వాక్కు. మహమ్మదు ప్రవక్తల్లో ఆఖరి వాడు. అందువల్ల ఆయన మరణంతో దివ్యమార్గం అంతమొందింది. విభిన్నమైన

జీవన దృక్పథాల్లో ఉన్న నేటి మానవాళిలో శ్రద్ధా భక్తులుండి సరైన మార్గాన్ని కనుక్కొని దాన్ని ఆచరించ వలసిందని ఆదేశించ కలవారు ఎవరు? కొరాను అని ఇస్లాం చెబుతుంది. అరబ్బులు దండయాత్రల ఫలితంగా విభిన్నమైన సంస్కృతీ నాగరికతలను కలిగి ఉన్న ప్రజానీకంలో వారికి సంబంధం ఏర్పడింది. అందుకని దివ్య మార్గాన్ని గురించి తెల్సుకోవాల్సిన అవసరం ఏర్పడింది. ఈ విషయంలో కొరాను చెప్పిందే అంతిమ వాక్యం. అయితే వ్యాఖ్యానం లేకుండా, వివరణ లేకుండా కొరానులో చెప్పిన విషయాలను తెల్సుకోవడం కష్టం. ప్రవక్త చెప్పిన దివ్య సందేశాలను విన్నవారు అనేక మంది ఉన్నారు. అందువల్ల ప్రవక్త మహమ్మదు ఏమి చెప్పారు? ఆయన ఏమి చేసారు? అనే విషయాలను నిర్ణయించి తెల్సుకోవలసిన ఆవశ్యకత ఉన్నది. ఎందుకంటే, అనంత మైన మానవుల్లో భగవంతుడు ప్రవక్త మహమ్మదునే ఎన్నుకొన్నాడు కాబట్టి, ఆయనకే దివ్య సందేశాన్నిచ్చినాడు కాబట్టి, ఆయన ఆదేశాన్ని అను సరిస్తే భగవంతుని ఆదేశాన్ని అనుసరించినట్లే అవుతుంది.

అయితే ఉత్తర భారతదేశాన్ని ముస్లిములు ఆక్రమించుకొనేకాలం నాటికి కొరాను కాక ప్రవక్త మహమ్మదు బోధనలు/హదీధ్/ మహమ్మదులను గురించి సేకరించిన ప్రమాణ గ్రంథంలో చెప్పబడ్డ విధంగా ఆచారాలరూపంలో /సున్న/ ప్రామాణికతను పొందాయి. తమ సమకాలీనులపై ప్రవక్త మహమ్మదు ప్రభా వము, అరబ్బుల ఆచారానికి/సున్నకు/ చూపిన ఆదరాభిమానాలు ఇస్లాం ప్రామాణికతకు రెండో ఆధారం. అంటే ఇస్లాంమతానికి ఆధారాలు మూడు అవి:

1. కొరాను
2. సంప్రదాయపు ఆచారాలు/సున్న/
3. హదీత్ (న్యాయశాస్త్రం).

కాలక్రమేణ హదీత్‌ను కూడా ఇస్లాం మతస్థులు రూపొందించు కొన్నారు. హదీత్ అంటే న్యాయశాస్త్రం. ఇస్లాం న్యాయశాస్త్రాన్ని రూపొందించడంలో అల్‌షాఫీ అత్యంత మైన ప్రతిభను చూపాడు. ఇస్లాం సంఘమంతా ఆదర్శవంత

మైన ప్రవర్తనను కలిగిఉండాలని ఆయన ఆదేశించాడు. అందుకే ఇస్లాం మతంలో ఉన్న ఆచార వ్యవహారా లన్నింటిని పరీక్షించడం జరిగింది. న్యాయ వ్యవస్థకు సంబంధించిన విషయాలను దృష్టిలో ఉంచుకొని అల్ బుఖారి హదీత్‌లో భాగంగా దైవశాస్త్రానికి సంబంధించిన విషయాలను సేకరించాడు. కొరాను తరవాత వీటికి ప్రాముఖ్యమిచ్చారు. తురుష్కులు భారత దేశాన్ని జయించడానికి మూడు శతాబ్దాలు ముందుగానే ముస్లిం సాంప్రదాయాన్ని గురించి పరమప్రామాణికమైన విషయసేకరణ జరిగి గ్రంథరూపంలో దీన్ని రూపొందించడం జరిగింది.

ముస్లిముల నమ్మకాలు, ఆచారాలు దైవికంగా ఏర్పరుపబడ్డ మతాధిపతుల సొత్తుకాదు. ముస్లిం జాతిలో ప్రతిభావంతులెవరైనా ఉంటే వారు కొరాను చదివి, అర్థం చేసుకొని ఇస్లాం మతోద్ధరణ చేయవచ్చు. ఇస్లాం మతాధిపతి /కలీఫ్/ కి ప్రత్యేక మైన ఆధ్యాత్మిక శక్తులు ఏవీలేవు. ఇస్లాంలో ప్రతివారు వారి వారి అర్హతలను బట్టి భగవంతుని అన్వేషణ చేయవచ్చు. ఆరాధించవచ్చు. అయితే ముస్లిం సమాజంలో సాధారణంగా అంగీకరింపబడిన విషయాలకు ప్రతివారు బద్ధులై ఉండాలి. ఈ విషయాలను షియాశాఖ వారు అంగీకరించరు

## షియామతోద్యమం: మొహర్రం పండగ ప్రాశస్త్యం

ఆలీ లేవదీసిన ఉద్యమం కారణంగా ఇస్లాంలో చీలికలు ఏర్పడ్డాయి. మహమ్మదు మరణానంతరం ముస్లిం సంఘానికి ఆలీ నాయకుడుగా ఉండాలని మహమ్మదుపై భక్తి విశ్వాసాలున్న వారు తీర్మానించారు. కాని దాన్ని చాలా మంది వ్యతిరేకించారు. ఆ తరవాత ఆలీ కలీఫ్‌గా నియమించినప్పుడు ఉమయ్యదీయులు తిరుగుబాటు చేసి అలీని వధించారు. ఆవిధంగా ఆలీ సిరియా, ఈజిప్టు దేశాలను కోల్పోయి మరణించాడు. ఆలీ కొడుకు హసన్ తన రాజ్యాధికారాన్ని ముఆలీయులకు ఆయనే అమ్ముకొన్నాడు. హుసేన్ ఆలీ తమ్ముడు. ముఆలీయులు రాజ్యాన్ని పరిపాలిస్తున్న రోజుల్లో మదీనాలో హుసేన్ ప్రశాంత జీవితం గడిపాడు. కాని ఆతరవాత ముఆలీయుని కొడుకు యజీద్ రాజ్యం చేస్తున్నప్పుడు ఆయనపై యుద్ధం ప్రకటించాడు. ఆయుద్ధంలో హుసేన్ మరణించాడు. ఇదే

మొహర్రం పండగగా ప్రకటించడమయింది. ఈరోజున హుసేన్ మరణించి నందువల్ల ఆయన మరణ సంతాప సూచనగా షియా లందరూ పది రోజులు రోదిస్తారు. షియా శాఖ ప్రథమంగా అరబ్బు దేశాల్లో ప్రారంభ మైనప్పటికినీ అది మౌలీబు ఆదరించారు.

## ఇమాం: షియాలకు దైవాంశ సంభూతుడు

రాజకీయంగా ఓడిపోయిన షియాలకు తమ సిద్ధాంతాలను సవరించు కొని సమర్థించు కోవలసిన అవసరం ఏర్పడింది. హుసేన్ మరణాన్ని దేశం కోసం ప్రాణం త్యాగం చేసిన త్యాగమూర్తిగా చిత్రించడం జరిగింది. దేశం కోసం ప్రాణాలర్పించే వారికి స్వర్గం లభిస్తుందని ఇస్లాం చెబుతుంది. భగవద్గీత కూడా ఇదేవిషయాన్ని చెబుతుందని మరువరాదు. అంతేగాకుండా ఇమాందైవాంశ సంభూతుడని ఆయన్ను నమ్మిన వారిని ఆయన రక్షిస్తాడని, ఆయన యందు శ్రద్ధా భక్తులతో ఉండాలని షియా మతం చెబుతుంద. ఇమాం పామరహితుడు. ఆయన సర్వజ్ఞుడు. దైవతేజో సంపన్నుడు. భగవంతుని నుంచి ప్రవక్త మహమ్మదు, ఆయన నుంచి ఆలీ, ఆయన నుంచి అతని వారసులు దైవశక్తిని, దైవసంపదమ పొందుతారు. కొరానులో చెప్పబడిన వికోయాలకు భాష్యం చెప్ప గలిగిన శక్తి ఆయన ఒక్కరికే ఉంటుంది. ఆయన చెప్పిన విషయాలు పరమ ప్రామాణికాలు. భగవంతుడే నియమిస్తాడు. ఆయన భగవంతునికే బాధ్యుడు. ఆయన సంఘానికి బాధ్యుడు కాడు.

కాల క్రమేణ షియా మతం అనేక శాఖలుగా చీలి పోయింది. చివరకు 12 శాఖలుగా అది మిగిలి ఉన్నది. కొన్ని శాఖల దృష్టిలో ఇమాం మానవ మాత్రుడే అయినా అయనలో దైవాంశం ఉంటుంది.ఇస్మాయిల్ స్థాపించిన శాఖ షియా శాఖలో చాలా ప్రముఖమైనది. ఈ శాఖతో కార్మతీయనులు దగ్గర సంబంధాన్ని కలిగి ఉంటారు. ఇస్మాయిల్ శాఖీయులు 7వ సంఖ్యకు కొంత అద్భుత శక్తి ఉన్నట్లు భావిస్తారు.

## ఇస్లాంమతం ఒక రాజకీయశక్తిగా రూపొందిన విధానం

క్రీ.శ. 930వ సంవత్సర ప్రాంతాల్లో ప్రజల్లో ఉన్న సాంఘిక, రాజకీయ అసంతృప్తి ఇస్మాయిలీలకు కొంత బలాన్నిచ్చింది. పేదలకూ, భాగ్యవంతులకూ మధ్య ఉన్న తేడాలు తదితర సాంఘిక కారణాలు కలిసి సామాన్య ప్రజల్లో సున్నీ మతంపై ఉండే ఆదరణ తగ్గిపోయేటట్లు చేశాయి. సాంఘిక మతాచారాలను, దురాచారాలను సున్నీలు ఖండించ లేదని షియాలు భావిస్తారు. అందుకే వీరు పేదరైతులను, కార్మికులను, కళాకారులను దగ్గరికి చేరతీశారు. అందరూ సంయుక్తంగా జీవించాలన్నారు. పర్షియన్ గల్ఫ్‌లో 'అల్ అహస' అనే చిన్న రాజ్యాన్ని స్థాపించారు. దీన్ని స్థావరంగా తీసుకొని చుట్టు పక్కల ఉన్న సిరియా, ఇరాక్ దేశాలపై దండెత్తారు. క్రీ.శ. 930లో మక్కాను వశపరచుకొని దైవదత్తమైన నల్లరాయిని కూడా తీసుకొని పోయారు. వీరిని క్రీ.శ. 1256లో మంగోలి జాతి వారైన హులాగు ఓడించాడు.

షియా మతస్థుల్లో చాలామంది ఇస్లాంకు పునాదులైన ఆయిదు వ్రతాలను, ఆచారాలను అంగీకరిస్తారు. అవి:

1. కర్మల ద్వారా పవిత్రంకావటం.
2. ప్రార్థన
3. దానమీయటం
4. నిరాహార దీక్ష
5. తీర్థ యాత్రలు

ఈ విషయాల్లోనే సాంస్కృతిక సమ్మేళన, మత సామరస్యం జరుగుతుందని పాఠకులు గ్రహించగలరు.

దక్షిణ ఆసియాలో ఇస్లాం ఒక మతంగా ప్రవేశించి కాల క్రమేణ ఒక రాజకీయ శక్తిగా రూపొందింది. సింధు దేశాన్ని అరబ్బులు జయించడంతో పశ్చిమకోస్తా ప్రాంతాలయిన పంజాబ్ మొదలైనవి ముస్లిం స్థావరాలుగా మారాయి.

ఉత్తర భారతదేశాన్ని ముస్లిములు దండెత్తిన విధానం భారతదేశంలోని ముస్లిముల ఆలోచనాధోరణిని అర్థం చేసుకోడానికి తోడ్పడుతుంది. మహమ్మద్ ఇబన్ కాశిం ఆధ్వర్యంలో సింధు దేశంపై అరబ్బులు దండెత్తారు. అప్పటికి ప్రవక్త మహమ్మదు చనిపోయి దాదాపు ఒక శతాబ్దం అవుతుంది. క్రీ.శ. 711వ సంవత్సరం నాటికి ఇస్లాం దర్శనం అంతగా అభివృద్ధి చెందలేదు. ఏజాతి వారి నైతే అరబ్బులు జయించారో వారి నుంచి అరబ్బులు నేర్చుకోవాల్సిన విషయాలు అనేకం ఉన్నాయి. సాంస్కృతిక, వైజ్ఞానిక కళారంగాలలో అరబ్బులు అప్పటికి ప్రతిభావంతులు కాలేదు. అప్పుడే వారి వ్యాకరణం రూపొందించు కొంటున్నది. మహమ్మదు ప్రవక్త ఆలోచనలు అప్పుడే బాగా ప్రచారంలోకి వస్తున్నాయి. వాసిల్ ఇబన్ అంతా దైవశాస్త్ర సంబంధమైన విషయాలను బోధించే వాడు. సింధునాగరికత, బైజాంటిన్ నాగరికత, పర్షియా నాగరికతలను చూసి కొంత నేర్చుకోవల్సిన అవసరం ఇస్లాం మతానికి ఉన్నదని కొందరు చారిత్రకులు భావించారు. అయితే ఈ దేశాలను, ఈ నాగరికతను అరబ్బులు జయించారనే సత్యాన్ని మనం మరపరాదు. భగవంతుని అదేశాలను నిర్వర్తించ డానికి ఇస్లాం మతస్థులు సర్వతంత్ర స్వతంత్రులు. ఈ దాడులన్నీ అల్లా ఆదేశాను సారం చేసినవనే వాద నమ్ముతారు.

ఈ విధంగా అరబ్బులు సింధు దేశాన్ని ఆక్రమించి ఆదేశంలో ప్రవేశించే కాలం నాటికి ఎవరు ఎవరికి ఏమి ఇచ్చారనేది సాంస్కృతిక రంగానికి ఆర్థిక రంగానికి, విద్యా వైజ్ఞానిక, వర్తక వాణిజ్య, వ్యాపార రంగాలకు సంబంధించిన ప్రశ్న. అరబ్బుల దండ యాత్రలకూ, ఖగోళ శాస్త్రానికి దగ్గర సంబంధ మున్నది. క్రీ.శ. 711వ సంవత్సరంలో "సిద్ధాంతం" అనే గ్రంథాన్ని బాగ్దాదుకు తీసుకొని వెళ్ళి దాన్ని అనువాదం చేయడం జరిగింది. హిందువుల సంఖ్యాగణితం ముస్లిం ప్రపంచంలోకి ఈ కాలంలోనే ప్రవేశించింది. ఆతరవాత దశాంక గణితాన్ని కూడా భారతీయుల నుంచే అరబ్బులు నేర్చు కొన్నారు.

క్రీ.శ. 1175వ సంవత్సరంలో తురుష్కులు భారత దేశంపై దండెత్తి

నప్పుడున్న పరిస్థితులు వేరు. నిషాపుర్ సమర్ ఖండ్, బుఖారా, ఘజనీ మొద లయిన ప్రాంతాలన్నీ తూర్పు దేశపు రాజకీయ కేంద్రాలుగా ఉండేవి. ఈవిధంగా ఘోరీల చేతను, ఆఫ్ఘనుల చేతను, తురుష్కుల వల్లను జయింప బడిన పర్వత ప్రాంత వాసులే ముస్లిం సంస్కృతిని సజీవంగా ఉంచారు. భారత దేశాన్ని జయిద్దామనే కాంక్షతో వారు భారతదేశంపై దండెత్తి వచ్చారు. జయించారు. ఇస్లాం సామ్రాజ్యాన్ని స్థాపించారు. మనలను పరిపాలించారు. వారు తమ అదృష్టాన్ని వెతుక్కుంటూ సైనికులుగా భారత దేశంలో ప్రవేశించారు సుసిక్షణతో మెలగటానికి వారి మతా దేశాలు ఉపయోగ పడ్డాయి. తమ్మి తాము రక్షించు కోడానికి అందరూ కలిసి ఒక మత వర్గంగా ఏర్పడ్డారు. ఘోరీలు, తురుష్కులు, ఆఫ్ఘనులు ఎంత క్రూరంగా భారత దేశాన్ని కబళించా లని ప్రయత్నించి నప్పటికినీ, వలస వచ్చిన ప్రజానీకంలో ఒక సుసంపన్నమైన సంస్కృతీ నాగరికతలను ప్రవేశపెట్టి దీన్ని రక్షించారు.

కాని క్రీ.శ. 1200 సంవత్సరంలో ముస్లిం రాజ్యాలపై మంగోలీయులు దాడి జరిపి నప్పుడు అనేక మైన ముస్లిం పట్టణాలు ధ్వంసమయ్యాయి. తూర్పు ముస్లిం దేశాల్లో ఉండే ప్రభావితులైన వారిని అనేక మందిని వధించారు. అనేక గ్రంథాలను తగల పెట్టారు. ఉదాహరణకు, బుఖారా, సమర్ ఖండ్, గూర్ గంజ్, మార్ఫ్ మొదలయిన పట్టణాలను నేలమట్టంచేశారు. చంఘిజ్ ఖాన్ మనుమడయిన హులాగూ తన దండ యాత్రల్లో బాగ్దాదు పట్టణాన్ని నేలమట్టం చేసి, అబ్బాసిద్ కలీఫ్‌ను హతంచేశాడు. క్రీ.శ. 12వ శతాబ్దాంతానికి పర్షియా, ఇరాక్ మొదలయిన దేశాల్లో ఇస్లాం తన ప్రభావాన్ని కోల్పోయింది. మంగోలీయుల దాడికి భారత దేశం అంతగా గురికాలేదు. సింధునదికి ఎడమ వైపు చంఘిజ్ ఖాన్ మకాం వేసినాడే కాని భారత దేశంపై దండెత్త లేదు. ఘోరీలు, గజనీలు భారత దేశం నుంచి కాల క్రమేణ వెళ్ళి పోయినారే కాని, ఢిల్లీని ఆక్రమించి వారి సామ్రాజ్యాన్ని భారత దేశంలో స్థాపించ లేదు. బహుశా పరిస్థితులు వారికి అనుకూలించి ఉండవు.

మంగోలుల దాడి నుంచి పారిపోయి వచ్చిన ప్రతిభావంతులకు ఢిల్లీ

సుల్తానుల రక్షణ ఇచ్చినట్లు మిన్హాజ్ ఉజ్ జాజాని ఇంకా జియా ఉద్దీన్ అనే చారిత్రకులు రాసిన విషయాలను బట్టి తెలుస్తున్నది. ముస్లిం ప్రపంచానికి 13వ శతాబ్దంలో భారత దేశం ఒక సాంస్కృతిక కేంద్రంగా కన్పించింది. అదే కాలంలో వారి కీలక స్థావరాలన్నీ వారి శత్రువుల చేతుల్లో ఉన్నాయి. ఉత్తర భారత దేశంలోకి పారిపోయి వచ్చిన ముస్లింలు రెండు ఉపద్రవాలను ఎదుర్కో వలసి వచ్చింది. అవి: 1. మంగోలీయుల దాడి 2. భారతీయుల దాడి, అంటే వారి చుట్టూ శత్రువులున్నారన్న మాట. ఈ విధమైన రాజకీయ యుద్ధ భీతావహ వాతావరణం వారి చుట్టుముట్టి ఉన్నప్పుడు, వారిలో వారు కలహించుకొనే అల్ప మైన కార్యక్రమానికి స్వస్తి చెప్పి, అఖండ మైన సాంస్కృతిక, రాజకీయ మత సంబంధమైన రంగస్థలిని ఏర్పచుకో వలసిన ఆవశ్యకతను వీరు గుర్తించారు. దాన్ని సాధించారు కూడా

మత విశ్వాసం హదీత్ ద్వారా, పవిత్ర మైన ఆచారాల ద్వారా, ఏకీకృత మైన దీక్షతోను, వ్యక్తి గతమైన క్రమశిక్షణతోను తమ్ము తాము రక్షించుకో గలమని భావించారు. ముస్లిముల న్యాయ శాస్త్రాన్ని రూపొందించు కొన్నారు. స్త్రీపురుషుల సంబంధ బాంధవ్యాలు, ఆస్తికి సంబంధించిన విషయాలు, సంఘ నియమాలు, వాణిజ్య పరమైన విషయాలు న్యాయశాస్త్రం ద్వారా పరిష్కరించు కోవాలన్నారు. ఇతర దేశాల నుంచి భారత దేశానికి వలస వచ్చినవారి నుంచి కూడా కొంత వరకు న్యాయశాస్త్రాన్ని స్వీకరించారు.

కాని దైవశాస్త్రంలో కలాం ఇస్లాం దర్శనం గ్రీకు దర్శనంతో కొంత వరకు రాజీపడవలసి వచ్చింది. గ్రీకుల అతి భౌతిక వాదాన్ని ఆధారంగా తీసు కొని ఇస్లాం దర్శనాన్ని ముతాజిలైతులు వివరించారు. భగవంతుడు, కొరాను, న్యాయము అంతా హేతు బద్ధంగా ఉండి మానవ నిర్మితమైన తర్కానికి అను గుణంగా ఉండాలని ముతాజిలైతులు చెప్పారు. క్రీ.శ. 12వ శతాబ్దంలో మార్మిక వాదం ఇస్లాంలో చోటుచేసుకొన్నది. భగవంతునికీ, మానవునికీ మధ్య నేరుగా సంబంధం ఉంటుందని, మధ్య వర్తిగా ప్రవక్తగాని, కలీఫ్ గాని ఉండనవసరం లేదనీ, నీతి నియమావళిని గౌరవించలేదనీ సూఫీ మతస్థులు చెప్పారు.

అనుభవం ద్వారా భగవంతుని తెలుసుకోవచ్చునని దైవశాస్త్రాన్ని మరొక రకంగా చెప్పి ఇస్లాం మతంలో కలవరం సృష్టించారు సూఫీ మతస్థులు. రాజకీయంగా ఇది చాలా ముఖ్యమైన విషయం. భారత దేశంలో ఉన్న ఇస్లాంకు ఇది చాలా అవసరం. ప్రాచీన ఇస్లాంలో సూఫీల మార్మిక వాదానికీ స్థానం ఏర్పడింది. ఆసమయంలోనే ఇస్లాం రాజ్యాలన్నీ సంఘటితమై ఒకే మతం, ఒకే విశ్వాసం, ఒకే దేవుడు, ఒకే ఆచారం ఉంటేగాని వారు రాజకీయంగా మనజాలరని గ్రహించారు. అంతేగాక దైవశాస్త్రంలో ప్రవేశ పెట్టిన మార్పులు అనేక మంది హిందువులు ముస్లిములుగా మారడానికి దోహదమిచ్చాయి. వారి న్యాయశాస్త్రం అవకాశ వాదులకు తోడ్పడింది. ఇది ఇట్లా ఉంటే క్రీ.శ. 15వ శతాబ్దంలో మొగలాయీల కాలంలో ఇస్లాం ప్రాచీన న్యాయ శాస్త్రాన్ని, దైవశాస్త్రాన్ని నమ్మిన వారు ఇస్లాంకు బాహ్యంగా సూఫీలుంటారనే భ్రమతోను. భయం తోను, ఇస్లాంలో ఉన్న మత సామరస్యాన్ని తుంచి వేశారు.

ఘోరీలు, తురుష్కులు, భారతదేశంపై దండెత్తేకాలంనాటికి ముస్లిములు వారి చరిత్రను వారే రాసుకొన్నారు. దాన్ని 'తారీకా' అంటారు. ఇస్లాంకు ముందున్న ఆరబ్బులచే మౌఖికంగా అందించిన సంప్రదాయం, గిరిజన, ఆటవికుల వంశవృక్షాలు, ప్రాచీన పర్షియా సంప్రదాయం, ప్రవక్త జీవిత సంగ్రహం రాయాలనే కోరిక, పర్షియనుల కథలను, గాధలను రాయాలనే కోరిక—ఇవన్నీ కలసి భారతదేశాన్ని పరిపాలిస్తున్న ఇస్లాం రాజులకు వారి ప్రాచీన గొప్పదనాన్ని, ఔన్నత్యాన్ని మతోద్ధతిని సంస్కృతిని గుర్తుకు తెచ్చాయి. పర్షియా భాషకు ఉన్నతస్థానం లభించింది. కళలు, రాజనీతి, పద్యకావ్యాలు, నీతిశాస్త్రం, ప్రభుత్వరంగంలోని ఉత్తరప్రత్యుత్తరాలు—అన్నీ పర్షియా భాషలో జరిగేవి. తురుష్క సుల్తానులు దీన్ని ప్రోత్సహించారు. ఆరబ్ భాషకన్నా పర్షియా భాష నేర్చుకోవడం సులభం. పర్షియా భాషలో ఉన్న పద్య గద్య కావ్యాల్లోని రాజవంశపు వీరుల చరిత్ర, వారు సాధించిన నీతి కథలు, అతి మర్యాదతో కూడిన విద్యావిధానం, తురుష్క సైనికులను ప్రభావితం చేసింది.

ఇస్లాం సంస్కృతీ నాగరికతలు పటిష్టమైన ఒక రూపాన్ని ఏర్పరచు కొంటున్న దశలో భారతదేశంపై ముస్లిములు దాడిచేయడం గమనించదగ్గ విషయం. అట్లా ప్రవేశించినవారు 19 వ శతాబ్దం వరకు భారతదేశంపై వారి ప్రభావాన్ని కలిగి ఉన్నారు. ఆ విధంగా భారతదేశంలో ప్రవేశించిన ఇస్లాంను నిరోధించడానికి గానీ, తొలగించడానికికానీ గట్టి ప్రయత్నం ఏదీ జరగలేదు. ముస్లిముల సాంఘిక, రాజకీయ మత లక్షణమే దానికి కారణంగా భావించవచ్చు. సుశిక్షితులైన సైనికుల బలంతో, సంఘటితమైన ఒక రాజకీయ మతశక్తిగా భారతదేశంపై మొగలాయీలు దండెత్తారు. అంతేగాని, తల దాచుకోడానికై చేసే ప్రయత్నంలో ఒక భాగంగా వారు భారతదేశంపై దండెత్తి రాలేదు. పశుగ్రాసం కోసమై వెదుక్కుంటూవచ్చే పశువుల కాపరులలాగ వారు భారతదేశంపై దండెత్తిరాలేదు. రెవెన్యూ, సైనిక అధికారులుగ ఉంటున్న భారతీయుల స్థానంలో తురుష్కులను, మొగలాయీలను, ఇస్లాంమతం స్వీకరించిన భారతీయులను నియమించారు. భారత దేశంలో పిరమిడ్ స్వరూపంలోఉన్న సంఘవ్యవస్థను మార్చకుండా, సంఘమనే పిరమిడ్ శిఖరాన్ని మాత్రమే వీరు మార్చివేశారు.

## భారతదేశంలో ఇస్లాం మతవిస్తరణ

భారతదేశాన్ని ముస్లిములు జయించినప్పటికీ, మొగలాయీ సామ్రాజ్యాన్ని భారత దేశంలో వారు స్థాపించి ఢిల్లీ సుల్తానులు పరిపాలిస్తున్న రోజులనుంచి నేటి వరకు వారు అల్పసంఖ్యాకులుగానే ఉన్నారు. హైందవుల్లో ప్రముఖులందరూ ప్రాంతీయ పదవుల్లో అధికారంలో ఉండేవారు. రాజకీయ శక్తి, సైనికబలం మొగలాయీల చేతుల్లో ఉండేది.

భారతదేశాన్ని ఘోరీలు జయించకముందు ఇస్లాందైవశాస్త్రంలో జరుగుతున్న వాదోపవాదాలను అల్-ఘజాలి ఉపశమింపచేశాడు. మార్మికవాదులైన సూఫీలుకూడా తీర్థయాత్రలు చేయాలని, మక్కాను దర్శించి రావాలని అల్-ఘజాలి చెప్పాడు. గ్రీకుల ప్రభావాన్ని ఇస్లాంమతంపై తగ్గించాడు.

పవిత్రమైన కొరాను గ్రంథాన్ని అందరు పఠించాలని ఆదేశించాడు. సంప్రదాయ వాదులైన 'ఉలమా', ముస్లిం ఆచారాలను, నమ్మకాలను సంఘంలో పటిష్ఠం చేస్తున్న రోజులవి. ఉలామా ప్రభావాన్ని రాజకీయాల్లో చూడవచ్చు. ఖాదీలు, ముఫ్తీలు, ఉలమాలు మసీదుల్లోను, పాఠశాలల్లోను, కళాశాలల్లోను ప్రతివారు సుల్తానుకు విధేయులుగా ఉండాలని బోధించేవారు. తమ అభిరుచులను ఇతరులపై రుద్దకపోయినప్పటికిని మతాధిపతులు చెప్పే సంప్రదాయబద్ధమైన విషయాలకు ప్రోత్సాహమిచ్చేవారు. మతసంబంధమైన విషయాల్లో న్యాయాన్ని నిర్ణయించడానికి హనపతీ న్యాయశాఖకు చెందిన సున్ని ఉలేమాను ఢిల్లీ సుల్తానులు నియమించేవారు.

సున్ని మతస్థులైన ఉలేమాలు, సూఫీ మార్మికవాదులు ఇస్లాంలో కొంత ఉద్రిక్తమైన భావ వాతావరణాన్ని సృజించారు. వీరిద్దరి మధ్య కొంత స్పర్థ ఉండేది. ఖ్వాజా మొయుద్దీన్ చిష్టి అజ్మీరులో నివాసమేర్పరచుకొని చిష్టి మత శాఖను భారతదేశంలో ప్రవేశ పెట్టాడు. సూఫీ మత ప్రభావం బాగా పెరుగుతూ వచ్చింది, భక్తి మార్గాన్ని ఇస్లాం ఆదరించింది. భక్తి మార్గాన్ని ఇస్లాంలో ప్రవేశ పెట్టడం ద్వారా సూఫీ మతస్థులు హిందువులకు సన్నిహితులయ్యారు. ఇస్లాంను భారత దేశంలో సుస్థిరంగా స్థాపించిన వారు సూఫీలనే చెప్పవచ్చు.

అయితే వీరిని ఉలేమాలు ఎప్పుడూ విమర్శిస్తుండేవారు. ఇస్లాం మతం పేరుతో ఇస్లాంనే వదలి వేస్తారేమోననే భీతితో సూఫీలను పర్యవేక్షించే బాధ్యతను ఉలేమాలు స్వీకరించారు. అక్బరు, దారాషికో మొదలయినవారు ఇస్లామేతరభావాలను ఇస్లాంలోకి ప్రవేశ పెట్టడంతో ఇస్లాంకు అనాదరం కలుగుతుందా అనే భీతి సంప్రదాయ వాదుల్లో కలిగింది. అంత మాత్రాన ఉలేమాలకు సూఫీ మార్మిక వాదులకు మధ్య శత్రుత్వం ఏర్పడిందను కోరాదు. వారు శత్రువులు కాదు. కొంచెం మనస్పర్థలు ఏర్పడ్డాయి. ఇద్దరూ మతం పేరిట భగవంతుని అన్వేషణలోనే ఉన్నారు. మార్గాలు వేరుగాని, ధ్యేయం ఒక్కటే. ఒకరు షరీయ మార్గాన్ని అనుసరిస్తే మరొకరు తరీకాను అనుసరించారు.

## కొరాను: ఇస్లాంమతంలో భగవంతుని గురించిన వర్ణనలు

అల్లా తప్ప మరొక దేవుడు లేడు. ఆయన ఒక్కరే. ఆయన స్వర్గంలో ఉంటాడు. ఆయన సర్వసమగ్రరూపి. ఆయన సర్వజ్ఞుడు. ఆయన సర్వశక్తిమంతుడు. ఆయన స్వయంసమృద్ధుడు. ఆయన నిత్యుడు. ఆయన శాశ్వతుడు. అతి గంభీరమైన వాక్కు కలవాడు. సృష్టిస్థితిలయాలకు అల్లాయే కారణం. అంతిమరోజున అయన అందరినీ సమావేశపరుస్తాడు. మానవులంటే ఆయనకు అపారమైన ప్రేమ ఉన్నది. దోషులను శిక్షిస్తాడు. మనంచేసే ప్రార్ధనలన్నింటినీ వింటాడు. మన ప్రార్థనలన్నింటినీ తగినరీతిని ఆదరించి వాటికి తగిన విధంగా ప్రతిఫలాన్నిస్తాడు. ఆయన శక్తులు అమోఘం. ఆయన జ్ఞానంకూడా అనంతం. ఆయనతో తుల్యమైన వారెవ్వరూలేరు. ఆయన సర్వాతీతుడు. మానవుల న్యాయశాస్త్రానికి ఆయన బద్ధుడు కాకపోయి నప్పటికీ, అన్యాయాన్ని, అక్రమాన్ని ఆయన సహించడు. ఆయన్ను శరణుకోరుతూ ఎల్లప్పుడూ మానవుడు ఆయనకు విధేయుడై ఉండాలి.

కొరానులో రెండు రకాలైన భావాలున్నాయి. అవి: (1) అల్లాను అనుసరించి ఎవరైతే ఉంటారో వారికి అల్లా రక్షణ లభిస్తుంది. (2) అల్లాను ఎవరైతే నమ్మరో వారికిఅల్లా రక్షణ కలిగించడు. మహమ్మదు తరవాత వచ్చిన ఇస్లాం సంప్రదాయంలో అల్లాను గురించి ఆయనకు ప్రపంచానికి ఉన్న సంబంధాన్ని గురించి, ఆయన గుణాలకు, ఆయన స్వస్వభావానికి ఉన్న సంబంధాన్ని గురించి, ఆయన వాక్కులకూ—మానవుల బాధ్యతకూ ఉన్న సంబంధాన్ని గురించి అనేకమైన వివాదాలు ఏర్పడ్డాయి. కొరానులో ఉన్న కొన్ని విషయాలను ఆధారంచేసుకొని అల్లా సర్వాతీతుడని చెప్పవచ్చు. లేదా నిరూపించవచ్చు. అట్లాగే కొరానులోనుంచి మరికొన్ని విషయాలను ఆధారం చేసుకొని అల్లా సర్వాంతర్యామి అని నిరూపించవచ్చు. సృష్టికి అల్లా అతీతుడని, అల్లా సృష్టిలో లయమయి ఉన్నాడనే పరస్పర విరుద్ధమైన భావాలను మనం కొరానులో చూడవచ్చు. మొదటి భావాలను మధ్యయుగంలోని ఇస్లాం దైవజ్ఞులు ప్రచారంచేస్తే, రెండో భావాన్ని సూఫీమతస్థులు ప్రచారంచేశారు.

మహమ్మదు మరణానంతరం మక్కాలోను మదీనాలోను ఉన్న ముస్లిములు భగవంతుడు ఒక్కడే అనే సిద్ధాంతంలో తమకు నమ్మకమున్నట్లు ప్రకటించారు. భగవంతుడు ఒక్కడే. ఆయన్ను ప్రవక్తద్వారాను, పవిత్ర గ్రంథం ద్వారాను, దేవదూతలద్వారాను, అంతిమరోజున, మక్కామదీనా మొదలగు పవిత్రస్థలాలకు తీర్థయాత్రలకు వెళ్ళడంద్వారాను, దానమివ్వడం ద్వారాను, అనశనవ్రతం ద్వారాను—భగవంతుని చేరవచ్చు. ఇవన్నీ ఇస్లాం మతం యొక్క ప్రాథమిక విశ్వాసాలు లేదా నమ్మకాలు.

కాని ఖాదరీయుల దృష్టిలో ఇది సరైనవాదంకాదు. వీరి దృష్టిలో ఇద్దరు దేవుళ్ళు ఉన్నారు. అందులో ప్రథముడు ( /ఇమాం/ అంటే నాయకుడు. లేదా విశ్వపాలకుడు అని అర్థం) స్వర్గంలో ఉంటాడు. రెండో వారు ఇమాం/అలీ ఆయన వంశీయులు. వీరు భూమిమీద ఉంటారు. క్రైస్తవులకూ, ముస్లిములకు సిరియాదేశంలో ఏర్పడిన సాహచర్యంవల్ల భగవంతుని గురించిన వర్ణనలు కొంత నూతన వికాసాన్ని పొందాయి. అందువల్ల భగవంతునికి మానవునికి మధ్య ఎట్లాంటి సంబంధముంటుంది, ఆయనకూ—కొరానుకు ఎటువంటి సంబంధముంటుంది, ఆయనకు - సృష్టికి ఎటువంటి సంబంధముంటుందనే ప్రశ్నలకు నూతనంగా కొన్ని సమాధానాలు చెప్పడం జరిగింది. చాలామంది ముస్లిముల దృష్టిలో అల్లా విశ్వపాలకుడు, విశ్వాధినేత, విశ్వాధ్యక్షుడు, విశ్వ నియంత. కాని, క్రైస్తవమతంలో మానవుడు తన చర్యలకు తానే బాధ్యుడని చెప్పే విషయాలు ముస్లిముల్లో కొందరిని ప్రభావితంచేశాయి.

ఈ భావాలచే ప్రభావితులైనవారికి ఖాదరీయులు అంటారు. వీరి దృష్టిలో మానవునికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలున్నాయి. మానవుడు భావుకుడు. మానవునికి ఆలోచనాశక్తి ఉన్నది. ఈ ఆలోచన అంతా స్వేచ్ఛగానూ, స్వచ్ఛందగానూ ఉంటుంది. 'లోగోస్' అనే క్రైస్తవుల సిద్ధాంతం వీరిని ప్రభావితులనుచేసి ఉండవచ్చు. కొరాను శాశ్వతమని, అది అపౌరుషేయమని దాన్ని రచించిన వ్యక్తిలేడని, దాన్ని ఎవ్వరూ కల్పించి రాయలేరని కాదరీయులు చెప్పారు. అది భగవంతుని వాక్కు. శబ్దం లేకుండా శబ్దోచ్చారణ లేకుండా భగవంతుని

గురించి ఆలోచించలేం. అందుకని భగవంతునితో సహచరిగా కొరాను ఉంటుంది. ఈ రెంటికీ సృష్టి ఉండదు. ఇవి నిర్మింప బడ్డవి కావు. శబ్దం అల్లా ప్రముఖ లక్షణం. అది లేకుండా ఆయన్ను చూడలేం. కొరాను ద్వారానే ఆయన్ను చూస్తాం. అయన మిగతా లక్షణాలన్నీ కూడా శాశ్వతాలే. వీటిని కూడా ఎవరూ నిర్మించలేదు. కల్పించనూ లేమ.

అయితే ఈ విధమైన వర్ణనలు అల్లా సమగ్ర స్వరూపాన్ని. ఏకతా రూపాన్ని, ఆయన అఖండత్వాన్ని ఏకత్వాన్ని ఖండించినందు వల్ల "అల్లా ఒక్కడే" అనే ఇస్లాం ప్రాథమిక విశ్వాసానికి దెబ్బతగుల వచ్చునని కొందరు గ్రహించారు. అంతేగాక గ్రీకు దర్శనాన్నుంచి కూడా ఇస్లాం మరొక ప్రమాదాన్ని ఎదుర్కో వలసి వచ్చింది. గ్రీకు దర్శనంలో తర్కానికి, హేతువుకు, వాదానికి మానవతా దృక్పథానికి ప్రాధాన్యమున్నది. గుణరహిత మైన ద్రవ్యాన్ని చూడ లేమని, తెలుసుకోలేమని గ్రీకులు భావించారు. ద్రవ్యము గుణాశ్రయమని గ్రీకులు భావించారు. భగవంతుని స్వరూపాన్ని నిర్ణయించడంలో ముస్లింలు కూడా తర్కాన్ని ఆశ్రయించారు. అల్లా సగుణాత్మకుడు కాడని తర్కం ద్వారానే నిర్ణయించారు. అల్లా గుణసహితుడని వర్ణిస్తే అనేక మైన చిక్కులు వస్తాయని గ్రహించినందు వల్ల అల్లా నిర్గుణుడని ముస్లింలు సిద్ధాంతీకరించారు.

కాని సున్నీలు తర్కానికి ఎక్కువ ప్రాముఖ్య మివ్వలేదు. కొరానులో చెప్పిన విషయాలన్నింటినీ నమ్మాలని, సాంప్రదాయాను బద్ధంగా జీవితం గడపాలనీ, ముస్లిం సంఘం ఏకగ్రీవంగా అంగీకరించిన దాన్ని ప్రతి వారు ఆచరణలో ఉంచాలని సున్నీలు భావించారు. ఇస్లాం మతాన్ని కాని; ఇస్లాం సిద్ధాంతాలను కాని, రూపొందించడానికి కాని అభివృద్ధి చేయడానికి కాని తర్కాన్ని ఉపయోగించ కూడ దన్నారు. శ్రద్ధ ద్వారా, భక్తి ద్వారా పవిత్ర గ్రంథంలో చెప్పిన విషయాలను గ్రహించాలి. ఉదాహరణకు, "అల్లా స్వర్గంలో ఆయన సింహాసనంలో కూర్చొన్నాడు" అని కొరాను చెబితే దాన్ని విశ్వసించి అంగీకరించాలే గాని, ఎట్లా కూర్చొన్నాడు, ఎందుకు కూర్చొన్నాడు అని ప్రశ్నించరాదు. మనలాగా కూర్చుంటాడా లేక మరొక రకంగా కూర్చుంటాడా

అనే ప్రశ్నలకు తావులేదు. అంటే మత సంబంధ మైన విషయాల్లో తర్కానికి తావులేదని సంప్రదాయ వాదులందరూ అంగీకరించారు. సున్నీలు ఈ విషయాన్ని బలపరిచారు.

అల్లా ఏకతా స్వరూపాన్ని, ఆయన సమగ్ర న్యాయ దృష్టిని, ఆయన ఆధ్యాత్మికతను సమర్థించ డానికై ముతాజి లైట్లు కంకణం కట్టుకొన్నారు. శాశ్వతమైన గుణాలుకాని, స్వరూప గుణాలుకాని, ఆయనలో ఉంటాయని చెప్పడానికి వీలు లేదన్నారు. ఆయన పరమ దయాళువు, సర్వాధ్యక్షుడు. ఆవిధంగా ఆయన్ను వర్ణించ వచ్చున్నారు. ఆయన స్వరూప ధర్మంలో ఇవి కలిసి ఉంటాయి. అంతేగాని ఇవి ఆయనకు ఉపలక్షణాలు కావు. అల్లా మాత్రమే స్వయంభువు. కొరాను అట్లా స్వతంత్ర సృష్టి కలిగి లేదు. కాబట్టి కొరాను కూడా అల్లా చేతనే సృజించడమయింది. అల్లా అపారమై న్యాయనిర్ణేత, న్యాయాధ్యక్షుడు, న్యాయమూర్తి, ప్రపంచ ప్రయోజనాన్ని దృష్టిలో ఉంచుకొని అల్లా ప్రతిదాన్ని సృష్టిస్తాడు. దుఃఖాన్ని అసమగ్రతను, అసమానతను, పాపాన్ని ఆయన సృజించాడు. వాటిని నియమించాడు. మానవులు చేసే పనుల వల్ల అవి ఒక రూపాన్ని, స్థిరత్వాన్ని పొందుతాయి. మానవుడు చేసే మంచి పనులకు ఫలితం లభిస్తుంది. చెడు పనులకు ఫలితం దారుణంగా ఉంటుంది. మానవుణ్ణి పోలిన ఆకారం భగవంతునికి ఉంటుందనే వాదాన్ని ముతాజలైట్లశాఖవారు నిరాకరించారు. భగవంతునికి ఒక సింహాసనం ఉన్నదని, అయనకు, కాళ్ళు, చేతులు, కళ్ళు ఉన్నవని చెప్పే వర్ణనలన్నింటినీ వారు నిరాకరించారు. భగవంతుడు అనంతుడు. ఆద్యంతములు లేనివాడు. కనక ఆయన ఒకే చోటగాని, ఒకే స్థావరంలో కాని ఉండటానికి వీల్లేదన్నారు. అట్లా భావించడం ఆయన స్వరూపాన్ని గురించి సంకుచితంగాచేసే ఆలోచన అన్నారు. ముతాజలైట్లుల ప్రత్యర్థులకు ఇదంతా విరుద్ధంగా గోచరించింది. అందుకే వారి సిద్ధాంతం అంతా అసమంజసంగాను, అసమ్మతిగాను ఉన్నదన్నారు. కొరానులో వర్ణింపబడిన అల్లా స్వరూపం పామరజనాదరణను పొందినందువల్ల వీరి సిద్ధాంతాలు విద్యావేత్తలకు మాత్రమే పరిమితమై ఉన్నాయి. కాని వీరి సిద్ధాంతాలకు రాజకీయ ప్రోత్సాహం

లభించినప్పుడు. వీరి ప్రత్యర్థులను వీరు దారుణంగా వధించారు.

ఇస్లాంమతం తర్కాన్ని ఆశ్రయించి అల్లాను నిరూపించడానికై ప్రయత్నించినప్పటినుంచీ అందులో అనేకమైన చీలికలు ఏర్పడ్డాయి. తర్కాన్ని ఉపయోగించి అల్లాను నిరూపించవచ్చని అల్–అషరీ చెప్పాడు. ఇతని అనుయాయులను అల్–అషరీలు అంటారు. వీరు అల్లాను గురించి చెప్పిన విషయాలను గురించి తెలుసుకొందాం.

భగవంతుడు శాశ్వతుడు. ఆయన ఆదిమధ్యాంతరహితుడు. ఆయన్ను పోలింది మరొకటిలేదు. ఆయనకు సమానమైనదెకూడా ఏదీ లేదు. ఆయన జ్ఞానస్వరూపుడు. ఇచ్ఛచేత ఆయన సమస్తమూ చేస్తాడు. ఆయనలో ఇచ్ఛ, జ్ఞానం, సమదృష్టి మొదలయిన శుభప్రదమైన గుణాలున్నాయి. ఆయనలో గుణాలు ఉన్నంతమాత్రాన అవి ఆయన ఐక్యస్వరూపానికి భంగాన్ని కలిగించవు. కొరాను భగవంతుని వాక్కు. దీన్ని స్మృతిపథంలో భద్రపరచారు. దాన్ని ఒకరు పఠించి మరొకరికి అందించారు. అది మహ్మదుకు శృతి ప్రమాణంగా అందించడమయింది. భగవంతునివాక్కు అసృజ్యం, అమోఘం. కాని ప్రవక్తలు చెప్పినవిషయాలు సృజ్యాలు. అంటే మానవుడు కొరాను పఠించటం, వల్లించటం, రాయటం సృజ్యాలు. కాని కొరాను మాత్రం కాదు.

నమ్మకాలు, అపనమ్మకాలనుంచి స్వేచ్ఛగా జీవించే విధంగా మానవులను అల్లా సృజించాడు. ఆయన అప్పుడు వారికి కొన్ని విధులను. ఆజ్ఞలను జారీ చేసాడు. వాటిని కొందరు నమ్మారు. కొందరు నమ్మలేదు. అల్లా వారిని వదలివేసినందున వారు ఆయన ఆజ్ఞలను నమ్మలేదు. తాను సృజించిన వారిలో ఎవరినీ నమ్మకస్తులుగాకానీ, అపనమ్మకస్తులుగాకానీ ఆయన ఉండమని చెప్ప లేదు. దోషం, అపనమ్మకం—మొదలయినవి మానవచర్యల వల్ల ఏర్పడినవే. కాని అవి అల్లా ఇచ్చినవి కావు. మానవుల చర్యలన్నింటికీ మానవుడే బాధ్యుడు. కాని అల్లా సంకల్పంవల్ల సమస్తమూ జరుగుతుంది. ఆయన సర్వశాసనకర్త ఆయన సర్వనిర్ణేత. ఆయన నిర్ణయాలకు తిరుగులేదు. భగవంతుని స్వరూప సాకారవర్ణలను గురించి చెబుతూ ఆయన సర్వలక్షణశోభితుడని, ఆయనకు

ముఖం, చేతులు, కాళ్ళు పవిత్రాత్మ ఉన్నాయన్నారు. కాని ఇవి ఎట్లా ఉన్నాయి? ఎందుకున్నాయని విచారణ చేయడం మాత్రం సమంజసం కాదన్నారు. ఇస్లాం దైవశాస్త్రాన్ని అషరీయులు బాగా రూపొందించారు.

ప్రవక్త మహ్మదు తరవాత అంతే ప్రతిభను కలిగి ఉన్న వారిలో అల్—ఘజాలీని మొదటి వానిగా చెప్పవచ్చు. సూఫీ మార్మిక వాదం బాగా అభివృద్ధి చెందుతున్న రోజుల్లో ఆయన పుట్టాడు. 20 సంవత్సరాల్లోనే ఇస్లాం దైవశాస్త్రాన్ని, న్యాయశాస్త్రాన్ని బాగా అధ్యయనం చేసాడు. సూఫీ మతాన్ని అవలంభించాడు. శ్రద్ధ, భక్తి, త్యాగము మొదలయిన వాని ద్వారా భగవంతుని తెలుసుకోవచ్చన్నారు. భగవంతుడంటే మానవునికి భయభక్తు లుండాలని, చివరి రోజున చెప్పే తీర్పుకు ప్రతివారు బద్ధులై ఉంటారని బోధించాడు. సిరియా దేశంలో ఏకాంత వాసం గడిపేవాడు.

అల్ ఘజాలి (1059—1111) అనంతరం దైవశాస్త్రం అంతా కోరాను లోని సిద్ధాంతాలను వివరించడానికీ, దాన్ని సమర్ధించడానికి తోడ్పడింది. అందుకే భారతదేశంలోని ముస్లిములు కొరాను మీద తమ దృష్టిని కేంద్రీకరించారు ఈయన సిద్ధాంతాలను భారతదేశంలో ఉన్న సున్నీ ఉలేమాకు ఆమోద యోగ్యంగా ఉన్నవి. అందువల్ల వాటికి భారతదేశంలో ఆదరణ లభించింది. భారతదేశాన్ని ముస్లిములు పరిపాలిస్తున్న రోజుల్లో ఇస్లాం మతాన్ని పుచ్చుకొన్న భారతీయులకు బోధించే విషయాలకు అల్—ఘజాలి చెప్పిన విషయాలకు చాలా పోలికలు ఉన్నాయి. అందు వల్ల వీటిని గురించి తెలుసు కొందాం.

1. భగవంతుడు ఒక్కడే. ఆయన అల్లా.
2. భగవంతుడు సంపూర్తిగా సర్వాతీతుడు. ఆయనకు రూపంలేదు.
3. ఆయన్ను నిర్వచించలేం. ఏవిధమైన నిర్వచనమూ, వర్ణన ఆయనకు వర్తించదు. ఆయన సర్వశక్తి సంపన్నమైన కర్త.
4. ప్రకృతిలో ఉన్న ప్రతిదీ ఆయన అధీనంలో ఉంటుంది. వాటిని అల్లా శాసిస్తాడు.

5. అల్లా సర్వశక్తి సంపన్నుడు. ఆయన ఏమి శాసించినా అన్యాయంగా ఉండదు. ఆయన అన్యాయమైన దాన్ని దేనినీ శాసించడు.
6. కొరాను పవిత్ర గ్రంథం. మరియు అది శాశ్వతమైన గ్రంథం.
7. అల్లాకు ప్రతివారూ అణిగి మణిగి ఉండాలి. ఇది ఆయన శాసనం. దీన్ని ప్రవక్తల ద్వారా ఆయన అందిచ్చాడు.
8. ప్రవక్త దైవకార్యం నెరవేర్చడానికై వచ్చిన దేవదూత అని అందరూ భావించాలి.
9. ప్రవక్త చెప్పినట్లుగా ప్రతివారూ అంతిమ నిర్ణయంపై విశ్వాసాన్ని కలిగి ఉండాలి.
10. ప్రవక్త అనుయాయులు కూడా సద్గుణరాసులే.

ఇస్లాం ప్రజానరణ పొందాలంటే అల్లాకు మానవునికి మధ్య ఆవేశంతో కూడిన భక్తియుతమైన సంబంధం ఉంశాలి. భగవంతుని గుణగణాలను అనుకరించిడం వల్ల మానవునిలో పరిపూర్ణత వస్తుందన్నాడు. అల్లా ఆదేశాలను నిర్వర్తించడం వల్ల మానవునిలో వికాసం వస్తుంది. దైవశాస్త్రాన్ని, కొరాను అధ్యయనం చేయడం వల్ల అల్లాను గురించిన విషయాలు తెలుస్తాయి. అల్లా గుణగణాలను తెలుసుకొని ఆవిధంగా ఉంచటానికై యత్నించాలి. అందరూ ఆవిధంగా ఉండలేరు. ఇస్లాం దర్శనంలో అల్లా-మానవుడికి మధ్య తేడా ఉంటుంది. మానవుడు ఎంత గొప్పవాడైనా అల్లాలో కలిసిపోడు.

## మంచి ముస్లిం ఎవరు? కొరాను చెప్పిన విషయాలు:

భారతదేశంలో ఇస్లాంను ఉలేమాలు పర్యవేక్షించే వారు. తర్కాన్ని అభ్యసించడం, కొరాన్ను పఠించటం, ఇస్లాం మతంలోని బోధనలన్నింటినీ ఆచరించడం ద్వారా ఇస్లాం మతోద్ధరణ జరుగుతుందని ఉలేమాలు బోధించారు.

పవిత్రంగా ఉండటం అంటే ఏమిటి? మంచి ముస్లిం ఎవరు? ముస్లిములు తమ పవిత్రమైన జీవితాన్ని ఏవిధంగా గడపాలి?

అల్లా తప్ప మరొక భగవంతుడు ఎవరూ లేరని గుర్తించాలి. ఈ విశ్వాసం స్వర్గధామానికి దారితీస్తుంది. కొరాను పఠించటం, ప్రార్థనలు చేయటం,

దాన మీయటం, ఉపవాసపేక్ష, సత్య ప్రవర్తన, నమ్మకం అన్నీ స్వర్గానికి దారి తీస్తాయి.

భక్తులకు అల్లా ఏడు సత్ఫలితాలను ఇస్తాడు. అవి ; 1 ఇస్లాంమత రహస్యాలన్నీ అల్లా భక్తులకు తెలియచేస్తాడు. 2. మరణ బాధను భగవంతుడు ఉపశమింపచేస్తాడు. 3. భక్తుల సమాధిని కాంతివంతం చేస్తాడు. 4. చని పోయిన వారిని పరీక్షించి, వారిని శిక్షిచండానికై వచ్చే దూతలగు /ముంకర్/ ఇంకా /నకీర్/లకు భక్తులా చేసిన మంచి పనులనే భగవంతుడు ముందుగా చూపుతాడు. 5. భక్తులు చేసిన మంచి పనుల జాబితాను కుడిచేతితో ఇస్తాడు. 6. భక్తుల కర్మ ఫలితాన్ని వారికి అనుగుణంగా ఉండేటట్లు అల్లా చేయగలడు. 7. నరకద్వారంలో కణకణమండుతూ ఉండే మంటలనుంచి భక్తులను కాపాడి స్వర్గ ధామానికి చేరుస్తాడు. ఆయన నామోచ్చారణ చేయడం వల్ల ముక్తి లభిస్తుంది. కొరాను పఠించడం వల్ల ఆఖరి రోజున కొరాను ముందుండి వారికి స్వర్గానికి దారి చూపుతుంది.

## ఇస్లాం సంప్రదాయం: సృష్టిక్రమం

ఇంతవరకూ ఇస్లాందర్శనంలో అల్లా తత్వాన్ని గురించి తెలుసుకొన్నాం. ఇప్పుడు ఇస్లాం సంప్రదాయం అంగీకరించిన సృష్టిక్రమాన్ని గురించి తెలుసు కొందాం. ఆ తరవాత వారి నీతిశాస్త్రం, వారి న్యాయశాస్త్రం గురించి తెలుసు కొందాం.

జహంగీర్ కాలంలో ఇబన్ ఉమార్ మిహిబిరా రాసిన 'హుజ్జల్ ఉల్ హింద్' అనే గ్రంథంలో సృష్టిక్రమాన్ని గురించి చక్కని వర్ణనలున్నాయి. గ్రామీణ ప్రాంతాల్లో ఉండే భారతీయ-ముస్లింలు ఇస్లాం సిద్ధాంతాలకు దూరమై పోతున్నారనే దృష్టితో వారిని ఇస్లాంలోకి మళ్ళించడంకోసం ఈ గ్రంథం రాయడమయింది.

తైత్తిరీయ ఉపనిషత్తును తిత్తిరి పక్షులు చెప్పాయని హిందువులు భావిస్తారు. అట్లాగే ఈ గ్రంథాన్ని చిలకా—గోరంకా ఒకరికొకరు చెప్ప

కొంటుంటే పక్షులభాష తెలిసిన మరథ్వాడా రాజయిన కరణ్ రాజావిని ఆయన ఇస్లాంమతంలోకి మారినట్లు ఈ గ్రంథంలో ఉన్నది. అంటే ఇస్లాం రచయితలు హిందువుల రచనా సంప్రదాయాలను అనుసరించారనే విషయం నిర్ధారితమవుతున్నది.

సమస్తమైన జీవరాసుల సృష్టిక్రమాన్ని గురించి మానవుడు ఎట్లా ఉద్భవించింది, రాక్షసులు, చెట్లు, చేమలు, పొదలు గుహలు, పక్షులు జీవాత్మలు, మానవుల్లో ఉండే నీచమైన ఆత్మ, పర్వతాలు, కొండలు, నదులు, భూమి, అగ్ని, గాలి, నక్షత్రమండలం భగవంతుని సింహాసనం, పవిత్రమైన స్వర్గం, నరకం, కాలం, దిక్కులు మొదలయినవన్నీ ఎట్లా ఉత్పన్నమయినాయో స్పష్టంగా చెప్పమని చిలుక గోరంకను అడుగుతుంది. అప్పుడు గోరువంక చెప్పిన సమాధానం 'మర్సాద్ అల్ ఉల్ అబ్ద్' /సుస్థిరమార్గం/ లో ఈ విషయాలను గురించిన చర్చ ఉన్నదని గోరువంక చెబుతుంది. అల్లా అనుమతితో తానీ విషయాలను గురించి చెబుతున్నదని గోరువంక చిలుకకు చెబుతుంది. ఆ విషయాలను గురించి తెలుసుకొందాం.

ప్రవక్త మహమ్మదు పవిత్రాత్మకు సాధారణ మానవుల ఆత్మలకు మధ్య చాలా తేడా ఉంది. ప్రవక్తలను అందరికన్నా ముందుగా సృజించాడు. ఆయన కాంతిమంతుడు. ఆత్మవంతుడు. జ్యోతి. ఆత్మ ఆయన రూపాలు. సమస్త మైన వాటికి ఆయన ముందుగా ఉంటాడు. జీవరాసు లన్నింటికీ ఆయనే విత్తనం మరియు చెట్టు కూడా. ఆయన కోసమే స్వర్గం నిర్మించడం జరిగింది. సృష్టి క్రమమంతా ఈ రీతిలోనే సాగింది. మరొక రకంగా సాగలేదు. ప్రవక్తల సంప్రదాయాల్లో చెప్పినట్లుగా మిగతా జీవరాసులను అల్లా సృజింప దలచినప్పుడు తనలో ఉన్న కాంతి పుంజాన్ని మహమ్మదులోని కాంతి కిరణంగా ప్రవేశ పెడతాడు. ఇదంతా జీవ ప్రతిబింబ వాదం లాగా అనిపిస్తుంది. అందుకే తాను భగవంతుని వద్దనుంచి వచ్చానని, తన్ను విశ్వసించిన వారందరూ తన వారేనని, తన నుంచే వారందరూ వచ్చారని ప్రవక్త చెప్పాడు.

ఇంకో సంప్రదాయపు కథ సృష్టి క్రమాన్ని గురించి మరో రకంగా చెబుతుంది. ప్రేమ పూరిత మైన కళ్ళతో కాంతిని, అల్లాను, మహమ్మదు చూశాడు. అప్పుడు ఆయన కళ్ళ నుంచి రెండు ఆనందాశ్రువులు రాలాయి. ఈ బాష్పాల నుంచి ఆయన ప్రవక్తల జీవాత్మలను సృజించాడు. వాటి కాంతి నుంచి ఇస్లాం ఋషుల ఆత్మలను, వాటి నుంచి ఆస్తికుల ఆత్మలను, వాటి నుంచి అవిశ్వాస పరుల ఆత్మలను సృజించాడు. అవిశ్వాస పరుల ఆత్మల నుంచి నమ్మక ద్రోహుల ఆత్మలను, వారినుంచి జారుల ఆత్మలను అల్లా సృజించాడు. మానవుల ఆత్మల నుంచి దేవతల ఆత్మలను దేవతల ఆత్మల కాంతి కిరణాల నుంచి రాక్షసులను దయ్యాలను; భూతాలను, సైతానులను, పిశాచాలను సృజించాడు. రకరకా లైన జంతువుల ఆత్మలను కూడా సృజించాడు. ఆ తరవాత వృక్షాలను, ఖనిజాలను సృజించాడు.

మిగతా సృష్టి క్రమమంతా మరొక కన్నీటి ముత్యం నుంచి వచ్చింది. కన్నీటి ముత్యం నుంచి ఒక అందమైన ఆభరణాన్ని సృజించి దాన్ని అతి గంభీరంగాను, అతి నిశితంగానూ అల్లా దీన్ని చూశాడు. అద్భుతమైన ఆ చూపుతో ఆ నగ కరిగి పోయి అందులో సగభాగం నీళ్ళుగాను, మిగతా భాగం నిప్పుగాను తయారయింది. అప్పుడు ఆ నిప్పులో నుంచి పొగ లేచి గాలిలో నిలిచి పోయింది. అందులోంచే స్వర్గాలు ఉత్పన్న మయినాయి. ఆ నిప్పురవ్వల్లో నుంచే మిణుకు మిణుకు మంటూ మెరిసే నక్షత్ర మండలం ఉద్భవించింది. కణకణ మండే అగ్నిలో నుంచే సూర్య చంద్రులను అల్లా సృజించాడు. నీళ్ళ మీద ఉండే నురగను, 7 పొలిని ఆయన విసిరి వేయడంలో 7 లోకాలు ఏర్పడ్డాయి. సముద్రతరంగాలు పర్వతాలు కూడా అట్లాగే ఏర్పడ్డాయి. ఈ ప్రపంచాన్నంతా ఆరు రోజుల్లో అల్లా సృజించాడు.

## సూఫీ మతస్థుల నైతిక సిద్ధాంతం

సూఫీ మతస్థులు చెప్పిన నైతిక సిద్ధాంతంలోని అంశాలు :

1. పశ్చాత్తాపం

2. నియమం
3. త్యాగం
4. పేదరికం
5, ఓర్పు, సహనం
6. భగవంతునిపై అచంచలమైన విశ్వాసం
7. సంతృప్తి

సూఫీ మతం ద్వారా అల్లాను, స్వర్గధామాన్ని చేరదలచినవారు ముఖ్యంగా ఈ ఆరు నైతిక సూత్రాలను ఆచరణలో ఉంచాలి. వీటిని ఆచరించ గలిగిన వారు అల్లాను సమీపించ డానికి అర్హతను పొందుతారు. ఈ దశలో వారికి అంతా ఏకరూపంలో కన్పిస్తుంది.

పశ్చాత్తాపం అంటే ఏమిటి? పాపం అనే నిద్రలో నుంచి మేల్కొనటమే పశ్చాత్తాపం.
నియమం, త్యాగం అంటే ఏమిటి? కేవలం భౌతిక మైన సుఖసంతోషాలను వదలుకొంటే అది నియమం అని పించుకోదు. త్యాగమనీ అనిపించు కోదు. సమస్తమైన సుఖాలను వదలు కొన్నప్పుడే అల్లా మార్గం చూపిస్తాడు.
పేదరికం అంటే ఏమిటి? అల్లాను చేరుకోవడానికి ప్రతిబంధకంగా ఉండే వాటిని తొలగించు కోవడమే పేదరికం.
ఓర్పు అంటే ఏమిటి? శీతోష్ణములతోను, కష్టనష్టాల్లోను, సుఖదుఃఖాల్లోను సమ దృష్టిని కలిగి ఉండటమే ఓర్పు.
భగవంతుని యందు నమ్మకం అంటే ఏమిటి? పాపులను కూడా కరుణా సముద్రుడై అల్లా రక్షిస్తాడనే అచంచల మైన నమ్మకం అల్లా యందుంచాలి.
సంతృప్తి అంటే ఏమిటి? తీర్థయాత్రలు చేస్తూ, భగవంతుని ఆదేశాన్ని నెర వేర్చడమే సంతృప్తి.

ఇవన్నీ ఇస్లాం మతంలో నైతిక స్థితిని సూచిస్తాయి. వీటిని /మఖానత్/ అంటారు. ఈ దశలన్నీ దాటి వచ్చిన యాత్రికుడు భగవంతుని అను గ్రహం కోసం వేచి ఉండాలి. ఏ దివ్య తేజస్సు ద్వారా అంతర్లీనంగా తనలో ఉన్న

తేజస్సును చూస్తాడో అది అల్లా కాంతి పుంజంలో ఒక కిరణం ప్రభావమేనని సూఫీ మతం చెబుతుంది.

అల్లాను చేరడానికి రెండు దశలను దాటిపోవాలి. అవి :

1) సమసి పోవటం /ఫనా/ 2) స్థితిలో ఉండటం /బఖా/. ఈ దశకు చేరిన వారిని అల్లా కరుణిస్తాడు. సమస్తమైన రాగ ద్వేషాదులు ఉడిగిపోయి, అల్లా శుభగుణగణాదులను నిరంతరం ధ్యానం చేస్తూ, చైతన్య వంత మైన ఆలోచనా స్రవంతిని అరికట్టడాన్నే /ఫనా/ అంటారు. అంటే ఇక్కడ మనిషిలో పూర్తిగా మార్పు వచ్చి, పూర్వపు పద్ధతి అంతా మారిపోతుంది. ఈ దశలో వ్యక్తిత్వము పూర్తిగా నశించి పోతుందని చాలా మంది సూఫీలు అంగీకరించారు. ఈ దశలో సముద్రంలో ఉన్న నీటి బొట్టులాగా, విశ్వంలో ఉన్న అల్లాలో సూఫి ఉంటాడు. ఇక్కడి నుంచి /బఖా/ ప్రారంభమవుతుంది. అంటే నిరంతరం అల్లాతోనే ఉండటం. ఇది మూడు రూపాల్లో ఉంటుంది.

1. అల్లా నామాంతరాలుగా గుర్తింపబడిన వాటితో ఐక్యమైపోయి ఉండటం.
2. అల్లా సద్గుణాలలో దేనిలోనైన ఐక్యమైపోయి ఉండటం.
3. అల్లా శుభ రూపంలో ఐక్యమైపోయి ఉండటం.

ఈ విధంగా /ఫనా, మరియు /బఖా/ లను ఇస్లాం మతస్థులగు సూఫీలు పొందినప్పుడు వారి దేహ బంధాలు విచ్ఛిన్న మవుతాయి. ఇచ్ఛ, ప్రేరకాలు మొదలయినవాటినుంచి విముక్తుడవుతాడు. ఆయన్ను ఏదీ ఏమీ చేయలేదు. అటు వంటి సూఫీమార్మికులకు సత్యం గోచరిస్తుంది. అల్లాలో ఐక్యమవుతాడు. ఇటు వంటి ఐక్యతను మాటల్లో వర్ణించలేం కాని కొంత మంది భాషకు హద్దులున్నాయనే విషయాన్ని మర్చిపోయి తమ అనుభూతులను అస్పష్టంగా వివరించారు.

## /షరీయ/ పవిత్రమైన ఇస్లాం సాంఘిక న్యాయశాస్త్రం

ఇస్లాం మతం బాగా అభివృద్ధి చెందుతున్న మధ్య యుగంలో ముస్లిం లందరూ భగవంతుని ఆజ్ఞను నెరవేర్చి ఆయన్ను సంతోష పెట్టాలని ఆరాట పడ్డారు. భగవంతుని గురించి తెలిసిన జ్ఞానం కొంచమైనా, దాన్నే తెలుసు కోవాలని వారు ఆరాట పడ్డారు. అంతేగాని ప్రపంచాన్ని జయించడానికి కాని, ప్రపంచంపై అధిపత్యం సంపాదించడానికై మానవుణ్ణి భగవంతుడు సృష్టించా డని వారు నమ్మలేదు. అల్లాను ఆరాధించడానికి, ఆయనకు అణిగిమణిగి పడి

ఉండటానికి మానవుడు సృజించ బడ్డాడని ఇస్లాం భావిస్తుంది. మానవుడు తన మనోవాక్కాయ కర్మల ద్వారా అల్లాకు జవాబు చెప్పవలసి ఉంటాడు. భగవంతుని ఇచ్ఛను కనుక్కొని దాన్ని ఆచరణలో ఉంచడమే ఇస్లాం సంఘం పరమ ధ్యేయం.

పరస్పర సహ సంబధాలను కలిగి ఉండి, ఒకరికొకరు తోడ్పడుతూ, సంఘాభ్యుదయానికి పాల్పడుదామనే భావంకాక, నిర్బంధంగా తామా పరిస్థితుల్లో పారవేసిన అసహాయుల వంటి వారమనే భావాన్ని ఇస్లాంలో చూడవచ్చు. వ్యక్తులకు గానీ, ఏవ్యక్తికి గానీ సంఘంలో ప్రాముఖ్యం లేదు. భగవంతుని ఉనికిని గుర్తించి, ఆయనతో సంబంధాన్ని కలిగి ఉన్నామనే భావంతో జీవిస్తే మానవ జీవితానికి ఒక అర్థం పరమార్థం ఉంటుంది.

అయితే సంఘాన్ని, సమాజాన్ని నిరాకరించి కాని, నిరాదరించి కాని ఉండ మని ఇస్లాం చెప్పదు. అల్లాకు—మానవునికి మధ్య ఉండే సంబంధం అంతా సామాజిక వ్యవస్థను దృష్టిలో పెట్టుకొనే వర్ణించింది ఇస్లాం. అల్లా యందు నమ్మకం, కొరాను యందు నమ్మకం ఉంటే పరోక్షంగా కొరానులో చెప్పబడిన పవిత్రమైన ఇస్లాం న్యాయశాస్త్రాన్ని అంగీకరించి నట్లే. ఇస్లాం ఆచారాలు, సిద్ధాంతాలు పవిత్రమైన న్యాయశాస్త్రం పరిధిలోకి వస్తాయి. ఇందులో అనేక విషయాలుంటాయి. భగవంతుని ఏకతా రూపం, ఆయన శక్తి, జ్ఞానం, భక్తిని గురించిన విశేషాలు, ప్రార్థనలు, తీర్థయాత్రలు, దానం, ఇస్లాంలో నమ్మకం లేని వారిపట్ల ఎవరు ఎట్లా ప్రవర్తించాల్సింది—మొదలయిన విషయాలన్నీ పవిత్రమైన న్యాయశాస్త్ర పరిధిలోకి వస్తాయి. ఇస్లాం సంఘమంతా ఒక సుసంఘటిత మైన శక్తిగా రూపొందించడానికి ఈ న్యాయ శాస్త్రం తోడ్పడింది. ఇస్లాం న్యాయ శాస్త్రాన్ని ఉల్లా వారికి అందించ్చాడు. వారి ప్రజాజీవనం అంతా దానికి అను గుణంగా తీర్చి దిద్దుకోవాలి.

అనేక మైన దాడులు చేసి, అనేక మైన రాజ్యాలను ముస్లిములు జయించి నందువల్ల అక్కడ ఏర్పడ్డ సంఘ వ్యవస్థలను రెండు రకాలుగా విభజించ చూసారు. 1. అల్లా ఆదేశాను సారం నడచే సంఘాలు; 2. భగవంతుని ఆదేశాను సారం కాక తమ ఇష్టమొచ్చి నట్లు నడిచే సంఘాలు.

కొరాను, ప్రవక్త, సున్ని షరీయా—ఇవన్నీ ముస్లిముల సామాజిక జీవన విధానానికి ఆధారంగా ఉన్నాయి. ఇవన్నీ వారికి మార్గదర్శకాలు. ఉత్తర

భారతదేశాన్ని ఇస్లాం పరిపాలించే నాటికి ఈ ఆచారాలకు ఆధారంఏమిటి? లేదా వీటన్నింటికీ ప్రమాణం ఏమిటి? లేదా మూలం ఏమిటి? అని ప్రశ్నించే అధికారం ఏవ్యక్తికీ లేదు. ఆతరవాత ఇస్లాం న్యాయశాస్త్రాన్ని ఒక పద్ధతిలో రూపొందించడం జరిగింది. మతాచారాలు, కుటుంబ నియమాలు, వారసత్వపు హక్కులు, ఆస్తి హక్కులు, క్రిమినల్ చట్టం, యుద్ధనీతి మొదలయిన విషయాలనేకం ఇస్లాం న్యాయ శాస్త్రంలో ఉన్నాయి. 

షరీయాలో ఏ అంశాన్ని అంగీకరించినా అది మత సంబంధ మైన విషయంగా పరిగణించటం జరిగింది. ఇస్లాం న్యాయ వేత్తల ప్రకారం మానవుల చేసే ప్రతిపనీ కింది నాలుగు రకాల్లో ఏదో ఒక దాని కిందికి వస్తుంది. అవి:



1. అల్లా ఆదేశాలు: దైవాజ్ఞలు
2. అల్లా నిర్దేశించినవి: అల్లా నిర్దేశాలు
3 న్యాయం లేక చట్టరీత్యా ఉదాసీన మైనవి
4. అల్లా నిషేధించినవి



ఇస్లాం సమాజం అంగీకరించినదంతా అల్లా ఇచ్చిందనే భావించారు. ముస్లిం సంఘంలో అందరూ అంగీకరించింది తిరుగు లేని న్యాయంగా పరిగణించారు. కొత్త సిద్ధాంతాలను చెప్పడం కాని, ఆచరించడం కాని, వాటిని ప్రచారం చేయడం కాని ప్రమాదకరమని ఇస్లాం చెబుతుంది. మిత్రత్వం, శత్రుత్వం మతాచారాలను అనుసరించడం ద్వారా లేదా నిరాకరించడం ద్వారా ఏర్పడతాయి. ఇస్లాం న్యాయశాస్త్రం అంగీకరించిన విషయాలు పది. అవి:

1. ప్రతివారూ కొంత వరకైన కొరాను, షరీయాలో ఉన్న విషయాలను గురించి తెలుసుకోవాలి. కనీసం 500 లేక 600 పద్యాలైనా తెలుసుకోవాలి.
2. ప్రవక్తల సంప్రదాయాన్ని గురించి తెలుసుకోవాలి.
3. న్యాయశాస్త్ర దృష్ట్యా కొరానును సరిగ్గా వ్యాఖ్యానించే శక్తి ఉండాలి.
4. ఒక సంప్రదాయం ఎందుకు సరైనది, మరొకటి ఎందుకు సరైనది కాదు అనే వివేచన ఉండాలి
5. పరిష్కార మైన సమస్యలను అందరూ తెలుసుకొని ఆచరణలో పెట్టాలి.
6. షరీయాలో ఉన్న సాక్ష్యాన్ని సరిగ్గా అమల్లో ఉంచాలి,
7. ఇస్లాం మత ఆచారాలను, నమ్మకాలను, ఆదర్శాలను ప్రతివారూ తెలుసుకొని ఆచరణలో పెట్టాలి.

8. న్యాయ శాస్త్రాన్ని అందరూ ఆచరణలో పెట్టాలి.
9. న్యాయ శాస్త్రాన్ని అందరూ అధ్యయనం చేయాలి.
10. కొరాను, ప్రవక్తల మాటలను ఎవ్వరూ జవదాటరాదు.

## ఇస్లాంలో మతసామరస్యం

ఇస్లాంలోని దైవశాస్త్ర సంబంధమైన విషయాలను గురించి చాలా మంది పామర జనులకు ఏమీ తెలియదు. వారి జీవితమంతా మసీదుకు వెళ్ళి రావడంతోను, తీర్థయాత్రలు చేయడంతోను, మక్కాను, మదీనాను సందర్శించి రావడంతోను, దానాలు చేయడంతోను, ప్రార్థనలు చేయడంతోను సరిపోతుంది. ఈ విషయాలన్నింటినీ ఆచరణలో ఉంచడానికి వారికి షరియా సరిపోతుంది. అందుకే కొంత మందికి ఇది అసంతృప్తి నిచ్చింది. వారి దృష్టిలో మతం ఒక ఆవేశాన్ని, ఉద్వేగాన్ని ప్రేరేపించేదిగా ఉండాలి. భగవంతుడు ఒక చెలికాడు గనో, రక్షకుడు గానో ఉండాలి నిత్యం బాధలకును, కష్టనష్టాలతోను సతమత మవుతున్న ప్రజానీకానికి ఆదరణ కావాలి. అటువంటి సౌలభ్యం అల్లాతో ఏర్పరుచుకోడానికి వీల్లేదు. అంతేగాక ఇస్లాం ఒక మహోన్నతమైన రాజకీయ శక్తిగా పెరిగినప్పుడు రాజకీయ జీవితంలో ఏర్పడిన సర్దుబాటులకు పవిత్ర మైన ముస్లిములను నిందించడం జరిగింది. న్యాయ వేత్తల, దైవజ్ఞులను ఈ రాజుల కింద పనిచేయడానికి అంగీకరించడంతో వారి పవిత్రతను ప్రజలు శంకించారు. అందుకే చాలా మంది ముస్లిములు మార్మిక వాదాన్ని ఆదరించారు. ముఖ్యంగా టర్కులు, మంగోలులు పాలించిన ప్రాంతాల్లో మార్మిక వాదం చోటు చేసుకొన్నది. హిందూ మార్మిక వాదం క్రైస్తవ మార్మిక వాదం చేత ఇస్లాం మార్మిక వాదం కొంత వరకు ప్రభావితమయింది. హిందువులు—ముస్లిముల మధ్య మత సామరస్యాన్ని ఏర్పరచడానికి ఎంతో కృషి జరిగింది. ఇస్లాం మార్మిక వేత్త తన సిద్ధాంతాల ద్వారా హిందూ—ముస్లిముల ఐక్యతకు కృషి చేస్తే, వర్ణ వ్యవస్థను, హిందూ ఆచారాలను సమన్వయిస్తూ మహాభక్త కబీర్, గురునానక్, శ్రీకృష్ణ చైతన్య వంటి మహానుభావులు జాతి ఐక్యతా చైతన్యాన్ని, మానవు లందరూ ఒకటే అనే మానతా వాదాన్ని బోధించి మత సామరస్యానికి దోహదం చేసారు. సాంఘిక, సామాజిక దృష్ట్యా చూస్తే ఇదొక మహత్తర విషయాలని భావించవలిసి ఉంటుంది.

